# HASTA SAMUDRIKAM

*"Sri Sarvari"*

Gen. Editor : Dr. VAASILI

Revised Edition : August, 2007

**Price : Rs. 150/-**

Published by :
**MASTER YOGA ASHRAM**
Plot 89, Krishna Enclave,
Military Dairy Farm Road, Tirumalagiri,
SECUNDERABAD - 500 015.
Phone : (040) 27790094
E-mail : drvaasili@yahoo.co.in
www. masteryogashram.com

Printed by :
**YOGAALAYA**
Plot No. 90, Krishna Enclave,
Tirumalagiri, SECUNDERABAD - 500 015.
Phone : (040) 27796676

# హస్త సాముద్రికం

## అనుక్రమణిక

# గీతలు రాతలు

ఎవడి రాత ఎలా రాసి ఉంటే అలానే జరుగుతుంది.

ఎవరి తల రాతను ఎవరు తప్పించగలరు?

ఈ గీతలు, రాతలు నిజంగా భగవంతుని రాతలా? విధి లిఖితాలా? అసలు జ్యోతిషాలు, సాముద్రికాలు శాస్త్రాలేనా? ప్రామాణికాలేనా? జ్యోతిషం యొక్క శాస్త్రీయతపైన కొంత కాలం పెద్ద చర్చసాగింది. నమ్మే వారి కోసం విశ్వ విద్యాలయాల్లో బోధించడమూ జరుగుతోంది. కనుక జ్యోతిషం శాస్త్రమా కాదా అన్న చర్చ అనవసరం.

మనిషికి రెండు కళ్లు, నమ్మకానికి రెండు కళ్లు. ఒకటి గుడ్డికన్ను.

జ్యోతిషానికి జాతకచక్రం, హస్త సాముద్రికం రెండుకళ్లు.

మనిషి పైన గ్రహాల ప్రభావం ఉండి తీరుతుంది. నమ్మినా, నమ్మకపోయినా పుట్టిన సమయంలో గ్రహాల స్థితిగతుల్ని బట్టి మనిషి జీవితం నడుస్తుంది. గ్రహాల బలాలు మారుతూ ఉంటాయి. మనిషిలో మంచి, చెడు రెండూ ఉంటాయి. గ్రహాలలో శుభ గ్రహాలు, పాప గ్రహాలు ఉంటాయి. శుభాశుభ ఫలితాలను అంచనా వేయడమే జ్యోతిషం చేసేపని. అరచేతి గీతలు గుర్తులు, గ్రహబలాలకు. ప్రతిబింబాలు పుట్టినప్పుడే విధి నుదుటి పైన కనిపించని రాతలు, అరచేతుల్లో కనిపించే గీతలు రాస్తుంది. కనుక జ్యోతిషం, సాముద్రికం వేరు వేరు కాదు, కవలలు.

'భగవంతుడు రాసిపెట్టినట్లే జరిగి తీరుతుంది అనుకుంటే జ్యోతిషాలు, సాముద్రికాలు అవసరం లేదు. తెలుసుకునీ ప్రయోజనం లేదు. తెలుసుకుని, చెడును పరిహరించే వీలుంది కనుక తెలుసుకోవడం. అంటే భగవంతుడు రాసి పెట్టిన 'రాత'ను, 'గీత'ను మనం మార్చుకోవచ్చు. మార్చుకోగల విల్‌పవర్ మనిషికి ఉంది. దైవానుగ్రహంతో విధినిసైతం మార్చుకోవచ్చు. కాస్త మార్చగలిగే వీలుంటే మొత్తం మార్చేశక్తి మనకున్నట్లే, ప్రయత్నిస్తే. అంటే బ్రహ్మరాతల్ని తుడిచి, కొత్త రాతలు మనం రాసుకోవచ్చు.

విధిని నమ్మేవారు ఒక రకం, విధిని ధిక్కరించి ఎదిరించేవారు రెండవ రకం. విధిపైన అచంచల విశ్వాసం, నమ్మకం ఉన్నవారు విధి శాసించినట్లు బ్రతుకుతుంటారు. రెండవ రకం వారు విధిని శాసిస్తూ బ్రతుకు బాటల్ని మార్చుకుంటారు. విధిని మించింది విల్‌పవర్.

విధిని ఎదిరించడానికి, భగవంతుడు రాసిన రాతల్ని చెరపడానికి, గ్రహాలబలాన్ని తమకు అనుకూలంగా త్రిప్పడానికి గుండెబలం, ఆత్మశక్తి, యోగం కావాలి. మనోబలంతో, ఆత్మవిశ్వాసంతో, యోగశక్తితో గ్రహాలను మదుపు చేయవచ్చు నన్న సత్యం ఏ మహర్షి, మహాయోగి జీవితం చదివినా తెలుస్తుంది.



నాది చాలా కాలం వరకు నష్ట జాతకం. అంటే నా జాతకం నాకు తెలియదు. పుట్టిన తేదీ, వివరాలు ఏవీ నాకు తెలియవు. జనన వివరాలు లేనివాణ్ణి నష్ట జాతకు డంటారు. తెలియనంత మాత్రాన గ్రహాలు పెత్తనం చెలాయించకుండా ఉంటాయా? దుష్టగ్రహాలు కట్టి కుడిసాయి. ఆ తర్వాత కష్టజాతకం మొదలైంది. కష్టాలు కాటు వేసిన కాలంలోనే ఒకాయన నాచేయి చూచి రానున్న మరిన్ని కష్టాలు చెప్పి కన్నీరు తెప్పించాడు. కష్టాలు క్లైమాక్సుకి వచ్చినపుడు నా జాతకం బయట కొచ్చింది. ఆయనే నా జాతకచక్రం గుణించి ఇంకా చాలా విషయాలు చెప్పాడు. నమ్మలేని నిజాలు నమ్మబలికాడు.

నేను 'టీచింగ్ లైను'లో ఉండనని, జర్నలిజంలోకి పోతానని, ఆపైన సినిమాల్లో ఉంటానని. మరీ తోసి వేయదగ్గ పాయింట్స్ కావు. అప్పటికే రచనా వ్యసనం ఉన్న వాడిని కనుక, జర్నలిజానికి పనికొస్తాను. కథలు

నవలలు రాస్తున్న 'చేయి' కనుక 'సినిమారచన' స్వాగతించవచ్చు. రెండింటిలో ఛాన్సు సంగతి ప్రక్కన పెడితే అంత ఖచ్చితంగా ఎట్లా ఊహించగలిగాడన్నది ప్రశ్న. మరొక విశేషం : నా చేతి రేఖల్ని బట్టి నాకు 'హస్తసాముద్రికం' చెప్పే యోగం ఉందని, ఎప్పుడో ఫిలాసఫర్‌నో, యోగినో, సన్యాసినో అవగలనని చెప్పడం మరొక పాయింట్. అప్పటి పరిస్థితుల్లో అవి నమ్మే ఓపిక నాకు లేదు.

చిత్రం! ఆయన నోటిమాట బలమో, నా జాతక ప్రభావమో గాని సరిగ్గా వారం రోజుల్లో సాముద్రికం నేర్చుకున్నాను. మద్రాసు నుండి సబ్ ఎడిటర్ ఉద్యోగం ఇస్తాం రమ్మని పిలుపువచ్చింది. అప్పుడే 'ఆంధ్రప్రభ'లో సాముద్రికం సీరియల్‌గా ప్రచురణ జరిగింది (1964).

నేను పామిస్టుని కాను, అస్ట్రాలజర్‌ని కాను. కనీసం పంచాంగం చూడడం నాచేత కాదు. జ్యోతిషం చెప్పడం నావృత్తి కాదు. పామిస్ట్రీని ప్రొఫెషనల్‌గా ఎప్పుడూ భావించలేదు. నావృత్తి జర్నలిజం. రచన నాకిష్టమైన హాబీ. ప్రపంచ ప్రఖ్యాతి చెందిన పామిస్టు 'షీరో' కూడా వృత్తి రీత్యా జర్నలిస్టు. ప్రవృత్తి రీత్యా పామిస్టు. మద్రాసులో ఉన్నంతకాలం పామ్ రీడింగ్ ఒక హాబీ. పామిస్ట్రీ కారణంగా సినిమా రంగంలో చాలామందితో పరిచయాలు ఏర్పడ్డాయి. ఆ పరిచయాలేవీ నన్ను సినిమా రచయితను చేయలేకపోయాయి. అది సినీమాయా ప్రపంచం కదా!

కవి గారికి శాలువా ఆకర్షణ. కొందరికి పామిస్ట్రీ ఒక ఆకర్షణ. పెద్ద పెద్ద వారితో పరిచయాలకు పామిస్ట్రీ పనికొస్తుంది. మనకు పామిస్ట్రీ వచ్చు అనగానే చేయిచాపని వారుండరు. ఎంత ఉన్న వాడైనా చేయి చాస్తాడు ఇంకొంత ఆశగా. అప్పుడు జ్యోతిషం చెప్పాను. ఇప్పుడు చెప్పను. ఇష్టం లేక కాదు అవసరం లేక. కొన్నాళ్లు జర్నలిజం అంటే ఇష్టం. రిటైర్మెంటు తర్వాత ఆ మోజు పోయింది. ఒకప్పుడు సాహిత్యం అంటే వల్లమాలిన ప్రేమ. ఇప్పుడు ఆ ప్రేమ పోయింది. సభలు, సన్మానాలు నా ఒంటికి పడవు. సాహిత్యం వదలి యోగాన్ని వరించిన వాడిని. యోగం నా స్వయంవరం. యోగం నాకు వరప్రసాదం. గత నలభై సంవత్సరాలుగా యోగమే ఊపిరిగా, శ్వాసగా జీవిస్తున్న వాడిని.

ఉత్తరార్థంలో రాస్తున్నవన్నీ యోగరచనలే లేదా మహాత్ముల, జీవితచరిత్రలు. ఇన్నేళ్ల అనుభవాన్ని అరగదీసి ఈ పుస్తకం మళ్లీ రాయవలసిన అవసరం కలిగింది. అర్థ శతాబ్ది కాలంలో నా రుచులు, అభిరుచులు మారాయి. సమాజం మారింది. సమాజం యొక్క స్వరూప స్వభావాలు మారాయి. ఎలెక్ట్రానిక్ యుగం ఇది. జనం అభిరుచులకు, అవకాశాలకు తగినట్లు ఉద్యోగ వ్యాపార రంగాలు కొత్త వన్నెలు చిన్నెలు సంతరించుకోసాగాయి. జాతకాలపైన నవగ్రహాల ప్రభావం కన్న నెప్ట్యూన్, ప్లూటో, యూరానస్ గ్రహాల ప్రభావం బాగా పనిచేస్తోంది. ఈ పుస్తకం ఆ ప్రభావాన్ని వెలికి తీస్తుంది. సాఫ్ట్‌వేర్, హార్డ్‌వేర్, ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీ రంగాలకు ఈ 'హస్తసాముద్రికం' పెద్దపీట వేసింది. నెప్ట్యూన్ ప్రభావంతో ఆధునిక పోకడలు, జీవన విలాసాలు, వైవిధ్యాలు సంతరించుకున్న పుస్తకం ఇది.

హస్తసాముద్రికం నేటి కాలపు యువతకోసం.

ఈ పుస్తకం జ్యోతిషం వృత్తిగా చేసుకునే వారికి బాగా పనికొస్తుంది. సాముద్రికం నేర్చుకోదలచిన వారికిది సాముద్రిక సర్వస్వం. ఈ ఒక్కటి చాలు వృత్తి పరంగా బంగారు బాటలు వేసుకోడానికి. అన్ని అనుమానాలు నివృత్తి చేస్తుంది. సరదాగా సాముద్రికం నేర్వదలచిన వారికి, స్నేహ వికాసానికి, వ్యక్తిత్వ వికాసానికి ఎంతగానో ఉపకరిస్తుంది. మీ చుట్టూ వారితో పరిచయం స్నేహంగా మారడానికి పనికొస్తుంది. ఇంకా అనేకానేక అవసరాలకు చక్కని చిట్కా పామిస్ట్రీ. మంచి వారనిపించుకోడానికి, మంచిని పెంచడానికి, ఇన్ని మాటలెందుకు. మీరూ పామిస్టు అవండి. ఎన్ని లాభాలో మీకే తెలుస్తాయి.

విష్ యూ బెస్ట్ ఆఫ్ లక్!

**– శార్వరి**

# హస్త సాముద్రికం

## 1. జ్యోతిషం : ప్రభావం

**జ్యో**తిషం, సాముద్రికం, వాస్తు శాస్త్రాలను ఆమోదించేవారున్నారు. అవి శాస్త్రాలు కాదని కొట్టిపారేసేవారూ ఉన్నారు. వీటిని నమ్మనివారికంటే నమ్మేవారి సంఖ్య ఎక్కువ. కొత్త సంవత్సరం రాగానే గ్రహఫలాలు ఎలా ఉన్నాయో చూడడం మన దేశంలోకన్న విదేశాలలో ఎక్కువగా ఉంది. అయితే మన గణితం వేరు, వారి గుణింతం వేరు, సిద్ధాంతాలు వేరు. వేరైనా, ఒక్కటైనా ఫలితాలు ప్రధానం కదా! మొత్తం మీద గ్రహాల ప్రభావం మనిషిపైన ఉన్నట్లే జ్యోతిష ప్రభావం మనిషి పైన ఉంటున్నది. నమ్మటం, నమ్మకపోవటం వ్యక్తిగతం.

మనం విజ్ఞానశాస్త్రాలను అధ్యయనం చేస్తున్నాం. 'అకల్ట్ సైన్సెస్' అనేవి అతీంద్రియ విజ్ఞానశాస్త్రాలు. వీటికి భౌతిక ప్రమాణాలు ఉండవు. కనుకనే అతీంద్రియ విజ్ఞానం అయింది. ప్రపంచంలో అన్ని దేశాలలోనూ, అతి ప్రాచీన కాలం నుండి అతీంద్రియ విజ్ఞానం ఉంది. నిజానికి ఇంద్రియ జ్ఞానం కంటే అతీంద్రియ జ్ఞానానికే ఎక్కువ గౌరవం, విలువ ఉంటూ వచ్చింది. యోగం వల్ల, తపస్సు వల్ల అతీంద్రియ జ్ఞానం అలవడుతుందన్నది యావత్ ప్రపంచం అంగీకరించిన విషయం. మోడరన్ శాస్త్రజ్ఞులు కొందరు ఖగోళశాస్త్రం (యాస్ట్రానమీ) అసలైన శాస్త్రమని, జ్యోతిషం (యాస్ట్రాలజీ) దానికి నకలని వివరించారు. మనిషికి భవిష్యత్తుపైన ఆశ, విశ్వాసం ఉన్నంత కాలం ఈ అతీంద్రియ విజ్ఞానం మొక్కపోదు. కరెక్టు కాదనే వారున్నారు. షీరో లాంటి పండితులు సాముద్రికం, సంఖ్యా శాస్త్రం గొప్పవని నిరూపించారు.

ఏమైనా, అతీంద్రియ విజ్ఞానం అందుకోవాలంటే సాధారణ జ్ఞానం చాలదు. అతీంద్రియ ప్రజ్ఞ కావాలి. కేవలం పుస్తకాలు చదివి, లెక్కలు వేసి జ్యోతిషం చెప్పటం వేరు, అతీంద్రియ ప్రజ్ఞతో చెప్పటం వేరు.

ఈ పుస్తకం రాసి నలభై సంవత్సరాలైంది. 1965లో రాసిన జ్ఞాపకం. ఇప్పటికి తెలుగులో, ఇంగ్లీషులో ఆరు సార్లు అచ్చయింది. ఇంకా పాఠకాదరణ పొందుతూనే ఉంది. ఈ పుస్తకం చదివి సాముద్రికవేత్తలై జీవిస్తున్నవారు, బాగా గడిస్తున్నవారు వందలమంది ఉన్నారు. కనుక పుస్తకం విలువ వినియోగాన్ని బట్టి పెరుగుతుందనిపిస్తుంది. 21వ శతాబ్దంలో అడుగుపెట్టాం. కలియుగం నశిస్తుందో లేదో గాని 'ఎలెక్ట్రానిక్ యుగం' ప్రారంభమైంది. 20వ శతాబ్దం చివరలోనే ఎలెక్ట్రానిక్ విప్లవం వచ్చింది. 21వ శతాబ్దంతో ఆరంభమైన కొత్త యుగానికి ఇవి కొత్త వాకిళ్లు. ఎలెక్ట్రానిక్ యుగంలోనూ ఈ మన అతీంద్రియ విజ్ఞానం ఉంటుందా? జనం ఆమోదిస్తారా? అంటే చెప్పలేం! కాని అసలు 'ఎలెక్ట్రానిక్' ప్రభావానికి కారణం 'నెప్ట్యూన్' అనే గ్రహం. జ్యోతిషంలో నవగ్రహాల ప్రభావం కాక, ప్లూటో, నెప్ట్యూన్, యురానస్ అనే మూడు గ్రహాల ప్రభావం ఉంది. ఎలెక్ట్రానిక్ విప్లవానికి కారణం నెప్ట్యూన్ ప్రభావం. అతీంద్రియ విజ్ఞానం నెప్ట్యూన్ ప్రభావం క్రిందికి వస్తుంది. వేయి రేకలుగా విచ్చుకునే అవకాశం ఉంది గాని వాడి, రాలిపోయే అవసరం లేదు.

'హస్త సాముద్రిక సర్వస్వం' మొదట రాసినప్పుడు నాకున్న విషయ పరిజ్ఞానం పరిమితం. అనుభవం కొంతవరకే. ఈ నలభై యాభై సంవత్సరాలలో ఆర్జించిన అనుభవంతో ఈ పుస్తకాన్ని సంస్కరించాలని బుద్ధి పుట్టింది. మౌలిక సిద్ధాంతం వరకు మార్పు లేదు. అన్వయంలో నవ్యతను పాటించాలని దీనిని సంస్కరించటం జరిగింది. 21వ శతాబ్దంలో ఈనాటి సాముద్రి కాభిమాను లకు ఇది బాగా ఉపయోగిస్తుందని ఆశిస్తున్నాను.

మనిషి పుట్టక ముందే జీవన రేఖలు నుదుటిపై భగవంతుడు రాస్తాడని మన నమ్మకం. అదే లలాట లిఖితం. నొసట రాసిన రాత తప్పదనటం అందుకే. బ్రహ్మ రాసిన రాతను, గీతల్లో ప్రక్షిప్తంచేసిన జీవిత రహస్యాలను, 'డికోడ్' చేయడమే సాముద్రికం చేసే పని. ఇది బ్రహ్మవిద్యకు భాష్యం చెప్పటం లాంటిది. ఇంతో అంతో బ్రహ్మజ్ఞానం కలవారైతే ఆ పని చక్కగా చేయగలరు. జ్యోతిషం చెప్పేవారంతా తాము బ్రహ్మవేత్తల మనుకుంటారు. 'దైవజ్ఞ' బిరుదులు తగిలించుకుంటారు. అంటే దివ్యజ్ఞానం కలవారని అర్థం. దివ్యజ్ఞానం అనేది కొందరికి జన్మతః అబ్బుతుంది. కొందరికి ఒక వయస్సులో అలవడుతుంది. కొందరు తపస్సు, యోగం చేసి సాధిస్తారు. వీటినిగూడ చేతిగీతలనుబట్టి విశ్లేషించ వీలుంది.

సాముద్రికం అంటే అరచేతులు, వాటి స్వరూప స్వభావాలు, వాటిలోని రేఖలు మాత్రమే కాదు. మనిషిలో నఖశిఖ పర్యంతం అనేక ముద్రలు, గుర్తులు, మచ్చలు ఉన్నాయి. అరికాలిలో కొన్ని గుర్తులున్నాయి. ఒక్క తలవెంట్రుక ఆధారంగా జ్యోతిషం చెప్పగలవారున్నారు. చైనా, జపాన్ దేశాలలో అరచేతిని కాక, పైభాగం చూచి ఫలితాలు చెబుతారు. ఇది అరచేతి రేఖలను బట్టి ఫలితాలు చెప్పడానికి వీలైన శాస్త్రం కనుక 'హస్త సాముద్రికం' అన్నాం. 'సాముద్రికం' కనుక ఈ శాస్త్రాన్ని మొదట సముద్రుడు రచించాడంటారు. సముద్రుడు అంటే సముద్రమో, ఆ పేరు గల వ్యక్తో తెలియదు. హఠయోగం లాగానే ఇదీ సముద్రుడనే వ్యక్తి పేర ప్రచారం పొంది ఉంటుందని  నా నమ్మకం.

ఈ మధ్య నాడీ గ్రంథాల హోరు ఎక్కువైంది. మన జాతకాలు పూర్వం ఎన్నడో మహర్షులు రాసిపెట్టారంటారు. నేను భృగునాడి, గణేష్‌నాడి, కుమారనాడి, పరాశరనాడి, నారదనాడి, బ్రహ్మనాడి గ్రంథాలను చదివించాను. వాటిలో జరిగిన విషయాలు మాత్రం స్పష్టంగా తెలుస్తున్నాయి. భవిష్యత్ అంతా తప్పుతోంది. కారణం తెలియదు. వైదీశ్వరన్ కోయిల్ (తమిళనాడు) కూడా వెళ్లి చూచాను. వారి తాళపత్ర గ్రంథాలను పరిశీలించాను. హస్తసాముద్రికం పైన కొన్ని తాళపత్ర గ్రంథాలు నాకు లభించాయి. అరచేతి రేఖలను బట్టి పుట్టినతేది, నెల, సంవత్సరం, తిథి, వార నక్షత్రాలు చెప్పవచ్చు. ఇదివరకు నేనూ చెప్పాను. అరచేతి రేఖల్ని చూచి జాతక చక్రాలు వేశాను. ఇప్పుడు ఆసక్తిపోయింది.

వీలైనంత వరకు మన భారతీయ సాముద్రికం, పాశ్చాత్య సాముద్రిక పద్ధతులు కలబోసి ఒక ప్రామాణిక గ్రంథం తయారు చేయడమే నా ఉద్దేశ్యం. ఇందులో నా 'అనుభవం' పాలు ఎక్కువ. నాది కొత్త సిద్ధాంతం అని చెప్పను. కాని సాముద్రికం నేర్వాలనుకునే వారికి, సాముద్రికంతో జీవించాలనుకునే వారికి ఎక్కువ ఉపయోగకరంగా ఉండాలన్న ఉద్దేశంతో ఎక్కువ వివరంగా చర్చించడం జరిగింది. పుస్తకం ఎన్ని సార్లు చదివినా కొందరు జ్యోతిషం చెప్పలేరు. కారణం ముందు చెప్పినట్లు అతీంద్రియ ప్రజ్ఞ ఇంతో అంతో అలవడనిదే ఎవరూ జ్యోతిషం సరిగా చెప్పలేరు. జన్మతః కొందరిలో ఆ ప్రజ్ఞ ఉంటుంది. కొందరికి ఒక దశలో గ్రహబలం వల్ల చేకూరుతుంది. కొందరు తమ తపస్సుతో సాధించుకోవలసి ఉంటుంది. ఎవరికైనా దివ్యభావన, వాక్శుద్ధి అవసరం. జ్యోతిషం చెప్పడంలో మన తెలివితేటలు సగమే పనిచేస్తాయి. మిగిలిన సగం పర ప్రజ్ఞ. ఇది గమనించి అతీంద్రియ ప్రజ్ఞ కలవారు మాత్రమే జ్యోతిష ఫలాలు చెప్పేందుకు సాహసించాలని మనవి చేస్తున్నాను.

# 2. ప్రాథమిక పరిశీలన

**అ**రచేతిరేఖల్ని పరిశీలించే ముందు మనిషిని నఖశిక పర్యంతం గమనించాలి. ప్రథమ వీక్షణంలోనే ఆ వ్యక్తి వయస్సు, మనస్సు, స్వభావం, నైజం కొంతవరకు తెలుస్తాయి. బాహ్యపరిశీలన, తర్వాతి అంతర్ పరిశీలనకు చాలా దోహద పడుతుంది. ఫలితాలు అరచేతి రేఖల్ని బట్టి చెప్పినా పర్సనాలిటీ రూపురేఖా విలాసాలను బట్టి కొంత అంచనా వేయవీలుంది. హస్త పరీక్షలో ముందుగా గమనించవలసిన విషయాలు: అవతలి వ్యక్తి అరచేతిని వెంటనే మన చేతితో స్పృశించకూడదు. దూరం నుండి ముందు వెనుక భాగాలు పరిశీలించాలి. సహజ స్వరూపం ముందుగా పరిశీలకుని మనస్సులో ముద్ర పడాలి. చేతుల స్వభావాన్ని బట్టి మనిషి స్వభావం ఉంటుంది. ఎలాంటి ప్రశ్నలు వేయకుండా, కళ్లలోకి చూస్తూ మధ్యలో అవతలి వ్యక్తి ముఖంలోకి చూస్తూ అతని సహనాన్ని పరీక్షిస్తున్నట్లు కాక, ఆసక్తిని, మానసిక స్థితిని అంచనా వేసుకోవాలి. అరచేతి స్వభావం ప్రాథమికంగా ఉండే ఏడు వర్గాలలో ఏ వర్గానికి చెందిందీ గుర్తుంచు కోవాలి. ఏ ఫలితాలు చెప్పినా ఆ వర్గ లక్షణాలలో ఇమిడిపోవాలి. ప్రాథమికంగా, దిగువస్థాయిలో ఉన్న చేతిని బట్టి మహారాజ యోగాలున్నాయని చెప్పడం, వారిని మోసం చేయడమే అవుతుంది. దానినే నైసర్గికం అంటారు. తర్వాత అరచేయి రంగు, ఆకారం, సరళత ప్రధానంగా పరిశీలించాలి. వీటిని బట్టి మనిషి ప్రవర్తన, మనస్తత్వం, నైజం ఉంటాయి. అరచేయి బొద్దుగా, కళావిహీనంగా, మొరటుగా ఉన్న వ్యక్తిని కళాకారుడనో, సంపన్నుడనో, మహావిద్యావంతుడనో చెప్పడం మోసం. ఈ స్థూల పరిశీలన తర్వాత, ఆ వ్యక్తి అరచేతిని సున్నితంగా స్పృశించి వేడి, వాడి అంచనా వేయాలి. వేడిని బట్టి వ్యక్తి ఎమోషన్స్ తెలుస్తాయి. స్వభావం తెలుస్తుంది. ఆ పైన వేళ్లు, గ్రహస్థానాల బలాలు, రేఖలు .... వరుసగా పరిశీలించాలి. ఈ స్థూల, సూక్ష్మ పరిశీలనతో, అవగాహనతో అవతల వ్యక్తికి

మార్కులు వేయగలగాలి. ఇది ఇన్ని మార్కుల జాతకం, వీని అదృష్టానికి ఇన్ని మార్కుల కంటే ఎక్కువ పడవు ... అని నిర్ధారణ జరిగాక, రంగంలోకి దిగాలి.

ఒకే పరిమాణం గల అదృష్ట రేఖ బిచ్చగాని చేతిలోనూ, కోటీశ్వరుని చేతిలోనూ ఉండవచ్చు. చేతి స్వభావాన్ని బట్టి, శ్రేణిని బట్టి మార్కులు వేయగలగాలి. కనుక రేఖల పరిశీలన కన్న ఎక్కువగా చేతి స్థూల పరిశీలన జరపడం మంచిది. మనిషి రూపాన్ని బట్టి, గుణగణాలను బట్టి, చూపును బట్టి వారి అభిరుచులు, జీవన విధానం, అదృష్టం మారుతుంది. ఏ ఇద్దరు వ్యక్తులకు పోలిక ఉండనట్లే, ఏ రెండు చేతులలో ఒకే రకం రేఖలు ఉండవు. అన్ని రకాల చేతుల్ని పరిశీలించి సౌలభ్యం కోసం ఏడు శ్రేణులుగా విభజించారు. 1. సామాన్య హస్తం (ఎలిమెంటరీ హాండ్), 2. చతుష్కోణ హస్తం (స్క్వేర్ హాండ్), 3. శ్రామిక హస్తం (స్పాట్యులేట్ హాండ్), 4. దార్శనిక హస్తం (ఫిలసాఫికల్ హాండ్), 5. కళాకారుని హస్తం (ఆర్టిస్టిక్ హాండ్), 6. ఆదర్శ హస్తం (ఐడియల్ హాండ్), 7. మిశ్రమ హస్తం (మిక్సెడ్ హాండ్) – ఇవీ రకాలు.

## సామాన్యహస్తం

ఇది చాలా అనాగరికంగా, మొరటుగా ఉంటుంది. అరచేతిలో రేఖలు చాలా తక్కువగా కనిపిస్తాయి. ఉన్న మూడు నాలుగు ప్రధాన రేఖలు మొరటుగా ఉంటాయి. ఇలాంటి చేతులలో అదృష్ట రేఖ అసలుండదు. కూలీ, నాలీ పనులు చేస్తూ బ్రతికేవారి చేతులు ఈ శ్రేణిలో ఉంటాయి.

## చతురస్ర హస్తం

ఇది మధ్యతరగతి మనుషులలో బాగా కనిపిస్తుంది. అరచేయి పొడవు, వెడల్పులు దాదాపు సమంగా ఉంటాయి. వీటిలో తేడా వేళ్ల పొడవును బట్టి, వేళ్ల బలాన్ని నిర్ణయించవలసి ఉంటుంది. సున్నితమైన అదృష్టరేఖ ఉన్నా, గ్రహ మండలాలు ఎత్తుగా, బలంగా లేకపోతే, వేళ్లు నిటారుగా, బలంగా లేకపోతే వీరిని అదృష్టం వరించదు. సాదాసీదాగా బ్రతుకుతుంటారు.

జ్యోతిషం చెప్పే ముందు అవతలి వ్యక్తి చేతిని మన చేతిలోకి తీసుకోకుండా, దూరంగా ఉంచి పరిశీలించాలి. స్పర్శ వల్ల వారి చేయి ముకులించుకోవడం, బిగుసుకోవడం, నరాలు బిగపట్టడం, వేడి ఎక్కడం, చల్లబడటం లాంటివి జరుగుతాయి. అప్పుడు చెప్పేవారి అంచనాలకు, చెప్పించుకునేవారి యదార్థతకు

పొత్తు కుదరదు. వేళ్ల బలాలు, గ్రహస్థానాల బలం, చేతి రంగు, వేడి మంచి ఫలితాలు చెప్పడానికి సహకరిస్తాయి.

## మధ్యతరగతి హస్తం

సాధారణంగా మధ్యతరగతికి చెందినవారి అరచేయి చతురస్రంగా ఉంటుంది. వేళ్లు పొడవూ పొట్టీ కాకుండా సన్నగా ఉంటాయి. అందులో విద్యావంతులైనవారి వేళ్లు సన్నగా, పొడవుగా ఉంటాయి. వ్యవసాయ, వ్యాపార రంగాలలోనివారి వేళ్లు పొట్టిగా, గట్టిగా ఉంటాయి. అరచేయి కాస్త మందంగా ఉంటుంది. గ్రహక్షేత్రాలు చదువుకొన్నవారికి మంచిరంగులో పలచగా ఉంటాయి. వ్యాపారులకు రంగు తక్కువగా, గట్టిగా ఉంటాయి. అరచేయి కఠినంగా ఉన్నవారు కార్యశూరులు. పట్టుదలతో కష్టపడి పైకి వస్తారు. వీరెవరికి కపటం ఉండదు. నిర్మొహమాటంగా మాట్లాడతారు. చర్చలు, వాదోపవాదాలు చేస్తారు. ఏ పని చేయాలన్నా మంచిచెడులు ఆలోచించిగానీ చేయరు. వీరి స్వభావమే అంత.

## ఉత్తమ శ్రేణిహస్తం

ఉత్తమ శ్రేణికి చెందిన హస్తం మనిషి వలె అందంగా, మృదువుగా, బలంగా, మంచి రంగులో ఉంటుంది. వేళ్లు పొడవుగా, నిటారుగా ఉంటాయి. ఒక వేలు మరొక వేలుపైన వాలదు. వేళ్లు వంకర టింకరగా ఉండవు. గోళ్లు ఎర్రగా, ఆకర్షణీయంగా ఉంటాయి. అలా గోటితో నొక్కితే, అద్దంలో ప్రతిబింబం వలె లోపల రక్తం కనిపిస్తుంది. చేతిలో అనవసరమైన రేఖలుండవు. గజిబిజి ఉండదు. చేయి కోమలంగా, మృదువుగా ఉంటుంది. అలాంటివారు జన్మతః అదృష్టవంతులు, విద్యావంతులు, ఆలోచనాపరులు అవుతారు. లేదా జీవితంలో అదృష్టాన్ని వెతుక్కుంటూ పైకిపోగలుగుతారు. సుఖసంసారం, సుఖజీవనం వారి ప్రత్యేకత. జీవితంలో ఉన్నతస్థితికి చేరడమే వారి లక్ష్యం.

## అధమ స్థాయి హస్తం

ఇది మరీ కష్టపడి పనిచేసేవారి హస్తం. సంపాదిస్తేగాని రోజు గడవనివారి చేతులు వృత్తాకారంగా ఉంటాయి. అరచేయి కుండలా, నల్లగా ఉంటుంది. రేఖలు అస్పష్టంగా, నల్లగా ఉంటాయి. చిన్నచిన్న రేఖలు అసలు ఉండవు. ఏ కొందరిలోనో అదృష్టరేఖ బయలుదేరి వేళ్లవైపుగా వెళుతుంది. అలాంటి వారు ప్రత్యేకించి అదృష్టం వెతుక్కుంటారు. సాదాసీదా కుటుంబంలో జన్మించినా, స్వశక్తితో చదువుకుని సమాజంలో మంచిస్థానం సంపాదిస్తారు.

# 3. స్వరూప స్వభావాలు

**చే**తుల్ని ఆకారాలను బట్టి, స్వరూప స్వభావాలను బట్టి స్థూలంగా ఏడు రకాలుగా విభజిస్తారు. మన భారతీయ పద్ధతి ఇది కాదు. పాశ్చాత్యులు రూపురేఖలకు ఎక్కువ ప్రాధాన్యం ఇస్తారు. కనుక ఇది ఇంగ్లీషు సంప్రదాయం. జ్యోతిషంలోనూ ఇంగ్లీషు పద్ధతిలో మనిషి స్వభావాలకు, గుణగణాలకు ఎక్కువ ప్రాధాన్యం ఉంది. మన భారతీయ పద్ధతిలో రేఖలకు, ఇతర సంకేతాలకు ప్రాధాన్యం ఎక్కువ.

## 1. సామాన్య హస్తం




అరచేయి చిన్నగా, మొరటుగా, మందంగా ఉంటుంది. బొటనవేలు పొట్టిగా, చిన్నదిగా అనిపిస్తుంది. అరచేయి కఠినంగా, మొద్దుగా ఉంటుంది. ప్రధానమైన జీవితరేఖ, హృదయ, మస్తిష్కరేఖలు మాత్రం ఉంటాయి. మిగిలిన రేఖలు ఏవీ స్పష్టంగా ఉండవు. గోళ్లు చిన్నగా ఉంటాయి. ఇవి దరిద్రానికీ, అల్పబుద్ధికి సంకేతాలు. ఇలాంటి చేతులు గల వ్యక్తికి ఆలోచనా శక్తి, వివేకం ఉండవు. బుద్ధి మందగిస్తుంది. పశువులా ప్రవర్తిస్తాడు. బుద్ధిలేనితనం వల్ల చెడ్డపనులపైకి మనసు పోతుంది. మచ్చుకైనా దయా ధర్మ గుణాలుండవు. మనిషి చూపులకే క్రూరంగా, వికారంగా ఉంటాడు. దొంగతనాలు, వ్యభిచారం పైన మోజు ఉంటుంది. శాడిస్టుగా

బ్రతుకుతాడు. ఎప్పుడూ ఏదో ఒక చెడ్డపని చేస్తేగాని ఇలాంటి వారికి తృప్తి ఉండదు. మంచిగా బ్రతకాలని, మంచి వాడనిపించు కోవాలని ఉండదు. పైగా మంచివారిని హింసించి, అవమానించి ఆనందం పొందుతారు.

వీరిలో బొటనవేలు బలంగా ఉన్నవారు, అరచేయి కఠినంగా వున్నా ఉత్సాహంగా కాలం గడుపుతారు. వీరెంత దుర్మార్గులైనా రాజకీయాలలో రాణిస్తారు. దొంగ వ్యాపారాలు, స్మగుల్డ్ వ్యాపారాలు చేస్తారు. నీతిగా ఉండరు. స్త్రీ వ్యామోహం ఎక్కువ. జూదం, తాగుడు అంటే ఇష్టం.

## 2. చతురస్ర హస్తం

అరచేయి నాలుగు భుజాలు దాదాపు సమానంగా ఉంటాయి. మధ్యవేలి పొడవు, మణికట్టు నుండి మధ్యవేలి మొదలు వరకు ఉన్న పొడవుకు సమానంగా ఉంటుంది. అరచేయి, పైన నాలుగువేళ్లు సన్నగా వున్నా బలంగా, అందంగా, కోమలంగా ఉంటాయి. బొటన వేలు చక్కగా వెనుకకు వంగుతుంది. దృఢంగా, బలంగా ఉంటుంది. గోళ్లు సైతం చతురస్రా కారంలోనే ఉంటాయి. ఇలాంటి వారే మనకు ఎక్కువగా కనిపిస్తారు. వీరికి సామాజిక స్పృహ ఎక్కువ. తమ బాధ్యతల్ని గుర్తించి, అనుకూలంగా ప్రవర్తిస్తారు. దేశసేవ, ప్రజాసేవ, సమాజ సేవ ఏదో ఒక సేవచేసి, తమ వంతు కర్తవ్యం నిర్వహిస్తారు. తమ చదువు, ఉద్యోగం, సంపాదన సద్వినియోగం కావాలను కుంటారు. వీరి చేతిలో మంచి రేఖలుంటే కార్యశూరులు, మేధావంతులు కాగలరు. చిన్న, పెద్ద ఉద్యోగస్తులు ఎక్కువభాగం ఈ కోవలోకి వస్తారు. వీరు సోమరితనంగా బ్రతకరు. కష్టపడి సంపాదించి, సుఖపడతారు. ఇలాంటివారికి కడుపే కైలాసం, ఇల్లే వైకుంఠం. కలహాల జోలికి పోరు. ప్రశాంతంగా ఏ లోటు లేకుండా జీవితం సాగితే చాలు. నియమంగా జీవించి, ప్రశాంతంగా కన్నుమూయడం వీరి లక్ష్యం.



వేళ్లు బలంగా, చతురస్రంగా ఉన్న వ్యక్తులు శాంతి కాముకులు. ప్రశాంత జీవితం వాంఛిస్తారు. పెద్దగా మాట్లాడరు. తమ ధర్మం తెలిసి ప్రవర్తిస్తారు.

వేళ్లు సన్నగా ఉన్నవారు భేషజంగా బ్రతుకుతూ, ఆడంబరంగా కనిపిస్తారు. వేషంలో, మాటల్లో డాబు, దర్పం ప్రదర్శిస్తారు. స్వేచ్ఛగా, సుఖంగా జీవించడం వీరికి ఇష్టం.

అరచేయి మాత్రం చతురస్రంగా వుండి, వేళ్లు పొట్టిగా, చివరలు చతురస్రంగా ఉన్నవారు విషయలోలురవుతారు. తాము చూచింది నమ్ముతారు తప్ప ఇతరులు చెప్పింది నమ్మరు. మొండి పట్టుదల ఎక్కువ. వీరిని నమ్మించడం బ్రహ్మతరం కాదు. మూఢత్వం వల్ల సంకుచిత మనస్తత్వం పెరుగుతుంది. విపరీతంగా ధనం సంపాదిస్తారు. అయినా లోభ గుణం ఉండదు. గొప్పకోసం దానధర్మాలు చేస్తారు. భక్తిని కొనుక్కుంటారు. లంచం ఇచ్చి దేవుణ్ని సైతం మంచి చేసుకోగలరు. వీరికి ధనార్జన, స్వసుఖం ప్రధాన లక్ష్యాలు.

చతురస్ర హస్తంలో వేళ్లు పొడవుగా ఉండి, చివరలు కూడా చతుష్కోణంగా వున్న వ్యక్తి బుద్ధిబలం, మనోవికాసం కలవాడు, విద్యావంతుడు అవుతాడు. మంచి భావుకుడవుతాడు. వీరు న్యాయవేత్తలు, న్యాయవాదులు అవుతారు. వీరికి అసూయా ద్వేషాలు, పక్షపాతాలు ఉండవు. అందరితో ప్రేమగా, స్నేహంగా, మంచిగా ఉంటారు.

చతురస్రహస్తంలో వేళ్లు పొడవుగా ఉండి, కణుపులు లావుగా, గట్టిగా ఉంటే, దూరదృష్టి, విశాల దృక్పథం అలవడతాయి. ప్రణాళికలు వేయగల స్ఫురదృష్టి ఏర్పడుతుంది. అయితే వీరు గాలిలో మేడలు కడతారు తప్ప ఆచరణకు పనికిరారు. కళలు, గణితం, వైద్యరంగం, జ్యోతిష రంగాలలో ఇలాంటివారు రాణిస్తారు.

చతురస్రహస్తంలో వేళ్లు పొడవుగా, మృదువుగా, సున్నితంగా, కొసలు తేలి వుంటే వారు కళాకారులుగా రాణిస్తారు. సంగీత, సాహిత్య, నృత్య, చిత్ర కళారంగాలలో పైకొస్తారు. వీరు కలలు కనడం ఎక్కువ, ఉద్రేకాలు ఎక్కువ. నైతిక విలువలకు తక్కువ ప్రాధాన్యం ఇస్తారు. మరీ మృదువుగా వుంటే, వారి కళలు, పాండిత్యం రాణించవు. కళల్ని వ్యాపారంగా మార్చగలుగుతారు.

చతురస్రహస్తంలో వేళ్లు మరీ సున్నితంగా, మృదువుగా, సన్నగా వుంటే ఎవరూ కార్యనిర్వహణకు పనికి రారు. ఆరంభ శూరత్వమే తప్ప, కార్య నిర్వహణ దక్షత ఉండదు. ఉద్రేకాల వల్ల పని చెడగొడతారు. ఊహలలో బంగారు ఊయెల లూగుతుంటారు. కటికనేల మీద పడుకుని బంగారు కలలు కంటారు. ఇదే

స్త్రీలయితే తమ రూపలావణ్యాలతో పురుషుల్ని లొంగతీసుకుంటారు. శృంగార జీవితం గడప గలరు.

చతురస్రహస్తంలో నాలుగువేళ్లు నాలుగు రకాలుగా వుండి, బొటనవేలు దూరంగా వెలివేసినట్లు ఉండి, పైకి బాగా వెనక్కి వంగితే, వారి ఆలోచనల్లో స్థిరత్వం ఉండదు. ఉద్రేకాలకు, కోపతాపాలకు లోనవుతుంటారు. ఎంత వివేకంగా కనిపిస్తారో, అంత అవివేకంగా ప్రవర్తిస్తారు. ఒక రోజున మేధావి అనిపిస్తారు, మర్నాడే వెర్రి వెంగళప్పగా రుజువు చేసుకుంటారు. అలాంటి వారిని నమ్మి ఏ పనీ అప్పగించడానికి వీలు పడదు.

## 3. శ్రామిక హస్తం

దీనిని స్పాచులేట్‌హేండ్ అని, కుంభాకార హస్తమనీ అంటారు. చూడటానికి బోర్లించిన కుండలా ఉంటుంది. మణికట్టు వద్ద వెడల్పు ఎక్కువ, వేళ్ల క్రింద తక్కువ వెడల్పు ఉంటుంది. లేదా వేళ్ల వద్ద ఎక్కువ వెడల్పుగా, మణికట్టువద్ద తక్కువ వెడల్పుగా ఉంటుంది. బొటన వేలు క్రింద భాగం గట్టిగా ఉంటుంది. నాలుగు వేళ్లు నాలుగు రకాలుగా ఉంటాయి. అయితే మొత్తం మీద చేయి ఆకర్షణీయంగా వుండి, అదృష్టాన్ని సూచిస్తుంది.




శ్రామికహస్తం అనడం వల్ల కేవలం శ్రామికులకు, కార్మికులకు ఇది పరిమితం కాదు. ప్రాక్టికల్ హాండ్, శ్రమచేసి, జీవించాలనుకునే వారు, కష్టపడి పైకి రావాలనుకునే వారి చేతులు ఇలాగే ఉంటాయి. వీరు ఎన్ని కష్టనిష్టురాలైన సహించి విజయం సాధించగలరు. ఒళ్లు దాచుకోరు, శ్రమకు భయపడరు, కష్టాలు చూచి పారిపోరు. విశ్రాంతి కోరరు. తమ ఉద్రేకాల్ని పట్టుదలగా మార్చుకుని, ప్రతి పనిని ఛాలెంజ్‌గా తీసుకుంటారు. ఇది చాలా మంచి లక్షణం. వీరి దాపులకు సోమరితం చేరదు. వీరు ఎంత స్వతంత్రంగా జీవిస్తారో, ఇతరులను అంతగానూ గౌరవిస్తారు, అభిమానిస్తారు, ప్రేమిస్తారు. మంచివారితోనే స్నేహం చేస్తారు. చెడుకు దూరంగా

ఉంటారు. వీరికి ఆచారాలు, సంప్రదాయాలపట్ల పట్టుదల లేకపోయినా గౌరవం ఉంటుంది. సమాజంలో గుర్తింపు కోసం, తమ వ్యక్తిత్వం కోసం శ్రమిస్తారు, ఆరాటపడతారు.

ఇలాంటి చేతులలో మణికట్టు వద్ద వెడల్పుగా ఉండడం అభిలషణీయం. అలా ఉన్నవారు ప్రతిభావంతులు, ప్రజ్ఞావంతులు, వ్యవహార వేత్తలు అవుతారు. అనవసరంగా కాలాన్ని, డబ్బును ఖర్చుపెట్టరు. ఆచి, తూచి అడుగువేయడం వీరికి ఇష్టం.

ఇలాంటి చేయి మరీ మృదువుగా వుంటే బుద్ధి అస్థిరంగా ఉంటుంది. పిచ్చి పిచ్చి పథకాలు వేస్తుంటారు. ప్రయోజకత్వం తక్కువ. ఏ పనిపైన మనస్సు పెట్టలేరు. జీవితమంతా అసంతృప్తితో గడిచిపోతుంది. నిరుపయోగ జీవితం వీరిది.

అరచేయి గట్టిగా, దృఢంగా ఉండాలి. అలా ఉన్నవారు నియమబద్ధ జీవితం గడపగలుగుతారు. ప్రయోజకులవుతారు. కష్టించి పనిచేస్తారు. వీరు ఏ పనిలోనైనా చురుకుగా పాల్గొంటారు. మానసికంగా ఎంత శ్రమనైనా తట్టుకోగలుగుతారు. నిమిషం ఊరికే ఉండరు. తలకు మించిన పనులు చేస్తారు. వాటిని నిర్వహించే శక్తి సామర్థ్యాలు తమకు లేకపోయినా, తలకెత్తుకుని నిర్వహిస్తారు. కార్యనిర్వహణలో కష్టనష్టాలు, అవమానాలు ఎదురైనా పట్టించుకోరు. విజయం సాధించడమే వారి లక్ష్యం.

ఈ శ్రేణిహస్తం మరీ మృదువుగా ఉంటే ఆ వ్యక్తి సాహసకార్యాలు చేస్తూ, పోట్లాడుతుంటాడు. చట్టాన్ని, న్యాయాన్ని లెక్కచేయడు. ప్రభుత్వ వ్యతిరేక కార్యకలాపాలు చేస్తాడు. తను చెప్పిందే న్యాయం, తనదే చట్టం అంటాడు. నక్సల్స్‌లో ఇలాంటి మంచివారు ఉంటారు. వీరు వస్తుతః చెడ్డవారు, క్రూరులు కారు. సమాజం, ప్రభుత్వం వీరిని అర్థం చేసుకోకపోవడం వల్ల తిరుగుబాటుతత్వం పెంపొందించుకుంటారు.

అరచేయి మాత్రం మృదువుగా ఉండి, వేళ్లు బలంగా మొరటుగా ఉంటే, వారు రసికులు, కళాప్రియులు అవుతారు. తమవల్ల కళలు బ్రతుకుతున్నాయను కుంటారు. ఎంత డబ్బు అయినా ఖర్చుచేస్తారు. కళాపోషణ వీరి వృత్తి, కళా బంధువులుగా జీవించడం వీరికి తృప్తి.

వేళ్లు మరీ మొరటుగా వున్న వ్యక్తి పైకి విలన్‌గా కనిపించినా మంచి మనిషిగా బ్రతుకుతుంటాడు. కపట వేషాలు వేసినా, మనస్సులో కపటం ఉండదు.

అరచేయి కుంభాకారంగా వుండి, వేళ్లు కొనలుతేలితే ఆ వ్యక్తి ఫిలాసఫర్‌గా మారతాడు. క్రమంగా మనస్సు ఆధ్యాత్మిక విషయాలపైకి పోతుంది. జ్ఞానార్జన అతని లక్ష్యం. పరోపకారం, ధర్మకార్య నిర్వహణ అతనికి ఆలంబనాలు. ఆదర్శమూర్తి అవుతాడు. కాని మానసిక దౌర్బల్యం వెంటాడుతుంది. ధనం మీద వ్యామోహం బొత్తిగా ఉండదు. వ్యాపారాలకు, ఉద్యోగాలకు పనికిరాడు.

బొటనవేలు బలంగావుంటే మంచి ఫలితాలు కలుగుతాయి. కుంభాకార హస్తం కలవారికి చదువు పట్ల శ్రద్ధ ఉండదు. చదువుల్ని సీరియస్‌గా తీసుకోరు. చిన్నతనం నుండి ఆటపాటలంటే ఇష్టం ఏర్పడి చదువుపట్ల శ్రద్ధ పోతుంది. డిగ్రీలు, ఉద్యోగాలు కోరరు. జీవితంలో కష్టపడి బ్రతకాలనుకుంటారు. వీరి మేధ చదువులేకపోయినా చురుకుగా పనిచేస్తుంది. ప్రయోజకులు కాగలుగుతారు.

## 4. దార్శనిక హస్తం

దీనినే ఫిలాసఫర్ హాండ్ అంటారు. అరచేయి పొడవుగా ఉండి, వేళ్ల చివరలు గోపురం ఆకారంగా ఉంటాయి. వేళ్లు బలంగా, అరచేయి కన్న పొడవుగా ఉంటాయి. వేళ్ల కణుపులు బలంగా, గట్టిగా ముడివేసినట్లు కనిపిస్తాయి. కణుపులు లావుగా, గట్టిగా ఉండడం మేధావి లక్షణం. గొప్ప మేధావులు, ఆలోచనాపరులు, తాత్వికులు అయ్యే వీలుంది. వేళ్లు సన్నగా, మృదువుగా ఉన్నవారు ఆలోచించరు. మస్తిష్కరేఖ (హెడ్‌లైన్) చక్కగా వుంటే, తత్వవేత్త, యోగి, జిజ్ఞాసాపరుడు అవుతాడు.




దార్శనికహస్తంలో అరచేయి క్రిందికి సగం వెడల్పుగా ఉంటుంది. వేళ్లు పొడవుగా, బలంగా ఉంటాయి. చివరలు సన్నగా, గుండ్రంగా ఉంటాయి. ఇలాంటి వారి ఆలోచన, ప్రవర్తన చిత్రంగానూ ఇతరులకు భిన్నంగానూ ఉంటుంది. ఎందరితో స్నేహం చేసినా, ఎవరికీ తమ హృదయంలో స్థానం ఇవ్వరు. వీరికి ఆత్మీయులు ఉండరు. ఒంటరిగా ప్రపంచంలో

తాము జీవిస్తున్నామనుకుంటారు. భార్యాబిడ్డల విషయంలోనూ వీరు అంటీ ముట్టనట్లు ప్రవర్తిస్తారు. వీరు బాగా సంపాదిస్తారు. కాని ఆ సంపాదన బయటవారికి ఖర్చు చేస్తారు.

వీరు మానవతా దృక్పథంతో పరిశోధనలు చేస్తారు. జీవితం నియమ బద్ధంగా, నీతివంతంగా ఉంటుంది. సౌమ్య, సరళ స్వభావం వీరిది. ఆడంబరాలు ఇష్టపడరు. పైకి గంభీరంగా కనిపిస్తారు. లోపల అంతా ప్రశాంతి. తాము గొప్పవారమనుకుంటారు. అహంకారం ఎక్కువ. ఎవరినీ లెక్కచేయరు, గౌరవించరు. కవులు, రచయితలు, మార్గదర్శకులు ఈ కోవలోకి వస్తారు. సమాజాన్ని తామే సంస్కరిస్తున్నామనుకుంటారు. ఇలాంటివారు జర్నలిస్టులుగా, పత్రికా రిపోర్టర్లుగా రాణిస్తారు. తమకన్నా పైవారితో హాయిగా కలిసిపోయి జీవించగలరు.

## 5. కళా హస్తం

కళాకారులు, కళారాధకులు, కవులు, రచయితలు, జర్నలిస్టులు, సినిమా, టి.వి. ఆర్టిస్టులు, సాంకేతిక నిపుణులు ఈ శ్రేణిలోకి వస్తారు. వీరి చేతి వేళ్లు అడుగున లావుగా, పోనుపోను సన్నగా ఉంటాయి. ప్రత్యేకించి కణుపులు కనిపించవు. అంత మృదువుగా, మెత్తగా ఉంటాయి. వీరిలో కళాకారులయ్యే వారు, కళావంతులయ్యేవారు, కళా ప్రియులు ఉంటారు. కొందరు విలాస జీవితం గడుపుతారు. ఇతర రేఖల్ని బట్టి, సినిమా నిర్మాతలు, దర్శకులు కావడం జరుగుతుంది. కొందరు ఎంత ప్రతిభ వున్నా రాణించరు. మనస్సు చంచలం, ఏపనిపైనా పూర్తిగా మనస్సు పెట్టరు. చాలా మంది జీవితాలు అసంతృప్తిగా గడుస్తుంటాయి.




ఇలాంటి చేతులు గల ఆడవారు సౌందర్యవతులు, అలంకార ప్రియులై, సుఖమయ జీవితాన్ని, భోగాలను కాంక్షిస్తారు. ప్రశంసలకు, పొగడ్తలకు లొంగిపోతారు. ప్రేమంటే వీరికి మక్కువ. ప్రేమ, భోగం లేని

జీవితం వ్యర్థం అనుకుంటారు. శృంగారం విషయంలో సిగ్గు, లజ్జ ఉండవు. తొలిచూపులోనే ప్రేమించగలరు. ఇలాంటి చేతులు కోమలంగా వున్నా, దృఢంగా, గట్టిగా ఉంటే మంచిది. అప్పుడు వారి వారి అభిమాన కళల్లో, రంగాలలో రాణించ గలుగుతారు. కీర్తి ప్రతిష్టలు సంపాదించడంతో పాటు అపకీర్తి పాలవుతుంటారు. అరచేయి, వేళ్లు దృఢంగా ఉన్నవారు మంచి కళాకారులై ధనం, కీర్తి ప్రతిష్టలు సంపాదిస్తారు. నీతి నియమబద్ధులై, యశస్సు నార్జిస్తారు.

## 6. ఆదర్శ హస్తం

అన్ని రకాల చేతుల కంటే ఈ రకం చేయి చాలా అందంగా, ఆకర్షణీయంగా ఉంటుంది. కాని వీరు ప్రాపంచిక విషయాలలో, సంసార విషయంలో దురదృష్ట వంతులు. ఈ రకం అరచేయి చిన్నదిగా పొడవుగా ఉంటుంది. వేళ్ల చివరలు పలచగా ఉంటాయి. వేళ్ల మొదళ్లు లావుగా ఉంటాయి. మొత్తం మీద చేయి అతి సున్నితంగా, కోమలంగా ఉంటుంది. వీరిని జనం ఆదర్శంగా తీసుకుంటారు గానీ, వారిలా తాము జీవించాలనుకోరు. అరచేయి పరిమాణంలో చిన్నదిగా ఉన్నవారు చిత్రంగా వ్యాపార, ఉద్యో గాలలో, రాజకీయాలలో రాణిస్తారు. మంచి గుర్తింపు పొందుతారు. వీరి ప్రపంచం వీరిది. ఎవరినీ పట్టించు కోరు. వీరి మనస్తత్వం పసిపిల్లల మనస్తత్వం. కలలుకంటూ, ఆ కలలు ఎప్పటికైనా నిజం అవుతాయనుకుంటూ బ్రతుకుతారు. ఒంటరిగా బ్రతకడం, ఏకాంతంగా కాలం గడపడం వీరికి ఇష్టం.




వీరు నిలకడగా ఒకచోట, ఒకే ఉద్యోగం చేయరు. మనస్సు చపలం, కాలు నిలువదు. బుద్ధి కుదరదు. ఒకరి క్రింద పనిచేయడానికి మనసొప్పదు. అయినా దయా ధర్మ గుణం ఉంటుంది. అవసరం అయితే తప్ప దేవుని సైతం స్మరించరు. మస్తిష్కరేఖ తిన్నగా, బలంగా ఉంటే వీరు కన్న కలలు నిజాలవుతాయి.

వీరి కృషి రాణిస్తుంది. చేయకూడని పనులు చేయడం వీరికి సరదా. చెడ్డపనులు చేసి మంచివారుగా చలామణి అవుతుంటారు. వీరికి సంసార సుఖం తక్కువ. జ్ఞాపకశక్తి తక్కువ. ఒకవేళ ఆర్థికంగా మంచిస్థితిలో ఉన్నా, తమ పనిలో, వ్యవహారాలలో అసంతృప్తి ఉంటుంది. అన్నీ వదలి సన్యసిస్తారు. లేదా వేదాంతం వల్లిస్తూ భైరాగుల వలె జీవిస్తారు. ఇలాంటి వారి ఆధ్యాత్మికత నేతి బీరకాయలోని నేయి వంటిది. నిజమైన ఆత్మజిజ్ఞాస వీరికి ఉండదు.

## 7. మిశ్రమ హస్తం

పైన చెప్పిన ఆరు తరగతులలో దేనికీ చెందక, అన్నిటి లక్షణాలు కాస్త కాస్త పొందివున్న చేయి మిశ్రమహస్తం. కనుక ఫలితాలూ మిశ్రమంగానే ఉంటాయి. ఈ రకం చేతిని గుర్తించడం సులభం. కొన్ని వేళ్లు సన్నగా, కొన్ని లావుగా ఉంటాయి. కొన్ని మృదువుగా, కొన్ని మొరటుగా ఉంటాయి. రెండు చేతుల వేళ్లు గమనించాలి. కణుపులు కొన్ని చిన్నవి, కొన్ని పెద్దవి. వీరి స్వభావం చిత్రంగా ఉంటుంది. మిగిలిన వారి వలె తీవ్రంగా, లోతుగా ఆలోచిస్తారు కాని ఆచరణలో పెట్టరు. వీరి నిర్ణయాలు, సలహాలు ఆచరణ యోగ్యాలు కావు. అన్నీ తమకు తెలిసినట్లే లొడలొడా మాట్లాడుతుంటారు. ఏ పనైనా ఆరంభిస్తారు తప్ప ఏ ఒక్కటి సవ్యంగా పూర్తి చేయరు.

వేళ్లు చతురస్రంగా ఉండి, కొనలు తేరి, సన్నగా వుంటే వారు పచ్చి స్వార్థ పరులవుతారు. విశ్వాస ఘాతుకులవుతుంటారు. ఇతరులను మోసం చేసి, నమ్మిన వారిని వెన్నుపోటు పొడిచి, తాము లాభం పొందుతారు. దివాళాకోరు రాజకీయాలు నడపడం వీరికి నల్లేరుమీద నడక.




మిశ్రమ హస్తంలో కళాకారుని లక్షణాలుంటాయి. ఆ లక్షణాలు గల వ్యక్తి ఎవరి కాళ్లు పట్టుకుని అయినా తన పని చేయించు కుంటాడు. ప్రగల్భాలు పలకడం హాబీ. అడగకపోయినా, తన అమూల్యాభిప్రాయాలు కక్కుతుంటాడు. ఎవరు తనను ద్వేషించినా, అసహ్యించుకున్నా పట్టించుకోడు. సిగ్గు, లజ్జ వదలి పేరు, డబ్బు

సంపాదిస్తాడు. తన పబ్బం గడుపుకుంటాడు. ఇలాంటి వారు చోటా రాజకీయాలలో, సినిమారంగంలో విరివిగా కనిపిస్తారు.

మిశ్రమ హస్తంలో కొన్ని చతురస్ర హస్తం లక్షణాలు కలిసినట్లయితే ఆ వ్యక్తి నియమ నిష్టలు కలవాడై పారిశ్రామిక వేత్త అవుతాడు. ఇండస్ట్రీలు స్థాపిస్తాడు. అయితే ఎవరినీ, ఏ పరిస్థితిలోనూ నమ్మడు. అసలు తనపై తనకే నమ్మకం ఉండదు.

మొత్తం మీద చేతుల్ని ఈ ఏడు రకాలుగా విభజించడం జరిగినా, ఆడవారి చేతుల్ని ప్రత్యేకించి పరిశీలించవచ్చు. అలాగే సమాజంలో జీనియస్‌లుగా చలామణి అవుతున్నవారు, సోమరులుగా బ్రతికేవారు, రహస్యస్థావరాల్లో జీవించేవారు, అవకాశవాదులు – వీరి చేతుల్నీ ప్రత్యేక రీతిలో పరిశీలించాలి.

## 8. మేధావి హస్తం

సమాజంలో కొందరు మేధావులుగా బ్రతుకుతుంటారు. వీరు ఏ పనీ చేయరు. అయినా వీరు మేధావులు. వీరి చేతులలో మిశ్రమ లక్షణాలుంటాయి. అరచేయి చతుష్కోణంగా ఉంటుంది. చేయి మొత్తం మీద చాలా పొడవనిపిస్తుంది. అరచేతినిండా గజిబిజి రేఖలు అనేకం ఉంటాయి. ప్రధానమైన రేఖలు పద్మాలుగా ఉంటాయి. అలాంటి చేతి రేఖల్ని చూచి వెంటనే ఫలితం చెప్పడం కష్టం. వీరు జీనియస్‌లు అయినా అర్థం కారు. అర్థం చేసుకోనివ్వరు. వీరు కాలం పైన తమ ముద్ర వేస్తారు. చరిత్రలో మిగిలిపోతారు. కొన్ని తరాల వరకు ప్రజలు వీరిని మరచిపోరు. వీరు శత్రువుల్ని మిత్రులుగా మార్చుకో




గలరు. వీరికి జనాకర్షణ శక్తి ఎక్కువ. స్వార్థం ఉండదు. సమాజ శ్రేయస్సు కోసం, దేశం కోసం ప్రాణాలు అర్పించడానికైనా వెనుకాడరు.

## 9. మూర్ఖ హస్తం

మేధావి హస్తానికి శుద్ధ వ్యతిరేకంగా ఉంటుంది మూర్ఖహస్తం. అరచేయి మందంగా, మొరటుగావున్నా మెత్తగా ఉంటుంది. వేళ్లు పొడవుగా సన్నగా ఉంటాయి. బొటనవేలు, చేతికి అతికించినట్లు చిన్నగా, అసహ్యంగా ఉంటుంది. వేళ్లు వంకర టింకరగా, కణుపులు కదిలితే శబ్దం అవుతూ ఉంటాయి. వేళ్ల కొనలు గుండ్రంగా ఉంటాయి. వీరికి ఉద్రేకం పాలు ఎక్కువ. తాగుడు, వ్యభిచారం ఇష్టం. పిచ్చివారి చేతిలోని రేఖలు, లక్షణాలు ఇలాగే ఉంటాయిగానీ, పిచ్చివారి చేతిలో మస్తిష్కరేఖ కొంతవరకు సవ్యంగా ఉండి తర్వాత వక్రమవుతుంది లేదా తెగిపోతుంది లేదా మరొకరేఖ వచ్చి దానిని ఖండిస్తుంది. ఇలాంటి వారు హంతకులు, దొంగలు, స్మగ్లర్లు అవుతుంటారు. సమాజంలో తలెత్తుకు తిరగలేరు.

## 10. హంతక హస్తం

ఇది అధమాధమం. అరచేయి లావుగా, దళసరిగా, వెడల్పుగా ఉంటుంది. ఎర్రగా, నల్లగా ఉంటుంది. వేళ్లు మొరటుగా ఉంటాయి. నాలుగువేళ్లు కలిసి కుంభాకారంగా ఉంటాయి. రెండవ కణుపులు మాత్రం బలంగా ఉంటాయి. బొటనవేలు మొదటి పర్వం లావుగా, మాంసం ముద్దలా ఉంటుంది. కణుపులు చిన్నగా ఉంటాయి. బొటనవేలు వెనక్కివంగక అరచేతి వైపు వంగి ఉంటుంది.

## 11. అవకాశవాది హస్తం

ఈనాటి సమాజంలో అవకాశవాదుల సంఖ్య ఎక్కువగా ఉంది. సామాన్య హస్తంలో కళాహస్త లక్షణాలు కొన్ని కలిసినపుడు అవకాశవాద హస్తం అవుతుంది. సామాన్య కుటుంబంలో జన్మించినా సాధారణమైన తెలివితేటలున్నా, అవకాశం కలిసి రావడం వల్ల, ఉన్నతస్థితికి చేరుతుంటారు. ఇది రిజర్వేషన్ కోటాలాంటిది. వీరు రాజకీయాల్లో కనిపిస్తారు. చట్టసభల్లోను, మంత్రులుగానూ కనిపిస్తారు. ప్రజాసేవ వీరి భారీ పరిశ్రమ. పారిశ్రామికవేత్తలు, నటులు, రచయితలు ఈ తరగతిలోకి వస్తారు. సాధారణ మేధస్సుతో ఐ.ఎ.ఎస్. పదవుల్లోకి వస్తారు. ఈనాడు ప్రసిద్ధి చెందిన వారిలో సగంమంది ఇలాంటి అవకాశవాదులే. వీరు కోట్లు గడించి, నాయకులుగా చలామణీ అవుతారు. వీరికి అరచేయి వెడల్పుగా, మొరటుగా, చతురస్రంగా ఉండి వేళ్ల మొదళ్లు లావుగా ఉంటాయి, చివరలు సన్నగా ఉంటాయి. బొటనవేలు మాత్రం బలంగా లావుగా ఉంటుంది. మొదటి పర్వం పెద్దదిగా, రెండవది చిన్నగా ఉంటుంది. బొటనవేలు వెనక్కి ధనుస్సులాగా వంగడం విశేషం. వేళ్లకొనలు సన్నగా ఉన్నందున ఉద్రేకం, జ్ఞానం, లౌకికం ఎక్కువగా ఉంటాయి.

# ఆడవారి చేతులు

కొందరు సాముద్రికవేత్తలు ఆడవారి చేతులకు, మగవారి చేతులకు భేదం పాటించరు. ఒకే సూత్రాన్ని అన్వయిస్తారు. అనుభవంలో ఆడవారి చేతులు వేరుగా అర్థం చేసుకోవాలనిపిస్తుంది. ఎందువల్లనంటే ఆడవారిలో చతురస్ర, కుంభాకార హస్తాలు ఎక్కువగా ఉండవు స్త్రీల శరీర నిర్మాణం, మానసిక స్థితి, ఆర్థిక స్థితి వేరు. పురుషుల వలె వీరు అన్ని రంగాలలో పనిచేయలేరు. అంచేత సున్నితంగా, మృదువుగా ఉండే ఆదర్శహస్తాలే ఆడవారిలో కనిపిస్తాయి. దీనిని బట్టి ఆడవారి భావ శబలత, సౌకుమార్యం గుర్తించవచ్చు.

ఆడవారి చేతివేళ్లకు కణుపులు బలంగా ఉండవు. బహు కొద్ది మందిలో కనిపించినా, మగవారి వేలి కణుపులంత పటిష్టంగా, బలంగా ఉండవు. అయినా మంచి ఫలితాలుంటాయి. ఈ కణుపులు గల స్త్రీలు మాత్రమే ఆధ్యాత్మిక జిజ్ఞాస పెంపొందించుకోగలరు. గురుక్షేత్రం మాత్రం ప్రతిభావంతంగా ఉన్నవారు పూజలు, వ్రతాలతో కాలం గడుపుతారు. వారికి విప్లవ భావాలుండవు.

ఆడవారి చేతులలో ముఖ్యంగా గమనించవలసింది బొటనవేలు. బొటనవేలు పెద్దదిగా, బలంగా ఉన్నవారు మంచి విద్యావంతులవుతారు. సూక్ష్మ పరిశీలన, వ్యవహార దక్షత అలవడుతుంది. రీజనింగ్ పవర్ ఎక్కువ కావడం వల్ల ఎంత కఠినమైన సమస్యనైనా వీరు సులభంగా పరిష్కరించగలరు. బొటనవేలు దృఢంగా ఉన్నవారు రాజకీయాలలో, అధికార పదవులలో రాణిస్తారు.

బొటనవేలు చిన్నదిగా ఉన్న స్త్రీలు అధిక విద్యావంతులు కాకపోయినా, మేధా సంపద, తెలివితేటలు, చదువుకున్న వారికంటే ఎక్కువగా కలిగి ఉంటారు. వీరికి పరిజ్ఞానం, పరిశీలనా దృష్టి ఉంటుంది. ఇలాంటివారు కుటుంబ వ్యవహారాలలో పైచేయిగా ఉంటారు. గృహ నిర్వహణలో, వ్యవహారాలలో వీరిది తిరుగులేని మాట.

హస్తం కుంభాకారంగా ఉండి, బొటనవేలు చిన్నదిగా ఉన్న స్త్రీలు స్వేచ్ఛగా జీవిస్తారు. స్వతంత్రంగా ఉండాలనుకుంటారు. కట్టుబాట్లు, ఇతరుల పెత్తనం వీరికి సయించదు. అయితే నీతి తప్పరు. తాము చేసే అన్ని పనులను కూలంకషంగా తెలుసుకుని చేస్తారు. సుఖంగా జీవిస్తారు. ఇతరుల విమర్శలు లెక్కచేయరు.

బొటనవేలు చిన్నదిగా, వేళ్లు చదరంగా ఉన్న స్త్రీలు ఇంటా, బయటా మన్నన పొందుతారు. వ్యవహార దక్షత కలిగి ఉంటారు. చదువు, పదవి లేకపోయినా

సూక్ష్మంగా ఆలోచించగలరు. న్యాయంగా తీర్పు చెప్పగలరు. అందరితో కలుపుగోలుగా, చనువుగా ఉంటారు. అన్యాయం సహించరు. తమ శక్తికొలదీ సమాజశ్రేయస్సు కాంక్షిస్తారు. సోషల్ వర్కర్లుగా, సోషల్ వెల్‌ఫేర్ కార్యక్రమాలలో పాల్గొంటారు. ఇతరులు శాసించినా, తమ మర్యాదకు భంగం రానీయరు.

చతురస్ర హస్తంగల స్త్రీలు మతం పట్ల, ఆచారాల పట్ల అభినివేశంతో, విశ్వాసంతో ఉంటారు. హస్తం మృదువుగా, పలచగా, గులాబీరంగులో ఉండి, వేళ్ల కణుపులు ఉండీ లేనట్లు కనిపిస్తే అలాంటి మహిళామణులు ప్రతిభా వ్యుత్పత్తులు కలవారై ఉంటారు. మాట నేర్పరితనంతో అందరినీ ఆకట్టుకో గలరు. హాస్య సంభాషణ చేయగలరు. వీరు సరదాగా జీవించగలరు.

అరచేయి గట్టిగా ఉండి, వేళ్లు కొనలుతేలి బొటనవేలు చిన్నదిగా గల స్త్రీలు కీర్తి ప్రతిష్ఠలకు పరుగులు తీస్తారు. సంగీత, సాహిత్యాల పట్ల అభిరుచి ఉంటుంది. అయితే వీరికి భోగవాంఛ అధికం. నీతికి కట్టుబడి ఉండరు. సౌందర్యారాధన వల్ల చూచిన అందమైన ప్రతి వస్తువు తమకు కావాలనుకుంటారు. వీరి ప్రేమ వ్యవహారాలు గోప్యంగా జరుగుతుంటాయి.

వేళ్లు మృదువుగా, కోమలంగా ఉండి కొనలు తేలిన వారి అభిరుచులు ఉత్తమంగా ఉన్నా, వారికి ఆదరణ ఉండదు. అవకాశాలు అంది రావు. జీవితంలో సుఖాలు అమితంగా అనుభవిస్తారు. మతం, ఆచారాలు, సంప్రదాయాలను గౌరవిస్తూనే అతిక్రమిస్తారు. పైకి శాంతంగా కనిపించినా లోపల ఉద్రేకాలు ఎక్కువ. దేనినీ మూఢంగా నమ్మరు. ఎప్పుడైనా సంప్రదాయంపై తిరుగుబాటు చేయగలరు. వేళ్లు చతురస్రంగా లేని స్త్రీలు తాత్కాలికంగా ఉద్రేకాలకు లోనవు తుంటారు. క్షణికావేశం ఎక్కువ. అందాన్ని, అందమైన వస్తువుల్ని ప్రేమిస్తారు. ఒక రోజు ఉత్సాహంగా, మరొక రోజు నిరుత్సాహంగా కనిపిస్తారు.

సాధారణంగా ఆడవారి వేళ్ల కణుపులు బలంగా కనిపించవు. మొదటి కణుపులు మృదువుగా ఉన్నవారికి భావనాబలం, విల్‌పవర్, తాత్వికత ఎక్కువగా ఉంటుంది. రెండవ కణుపులు స్ఫుటంగా కనిపిస్తే భోగాసక్తి ఎక్కువ. ప్రాపంచిక సుఖభోగాలను ఆశిస్తారు. బొటన వేలు పెద్దదిగా, దృఢంగా ఉన్న స్త్రీలూ సుఖభోగాలు ఆశిస్తుంటారు. స్వేచ్ఛగా తిరుగుతారు. ప్రేమ వ్యవహారాలలో కట్టుబాట్లు, నీతి నియమాలు పాటించరు. ఎంత మంది పురుషులతోనైనా జతకట్టగలరు. ఎవరికీ భయపడరు. బొటన వేలు చిన్నదిగా ఉన్న స్త్రీలలో రహస్యం దాగదు. వారి మాటకు వారే కట్టుబడి ఉండరు. ఇతరులను విమర్శించడానికి,

దూషించడానికి వెనుకాడరు. బొటన వేలు లావుగా, మొరటుగా వున్న స్త్రీలు మందబుద్ధి కలవారవుతారు. చురుకుగా ఉండరు. వీరి మనస్సు కుత్సితంగా ఉంటుంది. వీరికి పెళ్లి ఒక వ్యాపారం లాంటిది. ప్రేమ, మమత, అనుభూతి వీరి దగ్గరకు రావు. చివరకు పశ్చాత్తాప పడతారు.

## మణికట్టు

మణిబంధానికి పాశ్చాత్య సాముద్రికులు అంతగా విలువ నివ్వరు. దీని పైన వున్న రేఖల్ని మాత్రం పరిగణిస్తారు. మనవారు ముంజేతిని కేతువు స్థానంగా గుర్తించారు. కేతువు పూర్వజన్మ కర్మ ఫలాలను సూచిస్తుంది. మోక్షాన్ని సూచిస్తుంది. మనిషి మొత్తం జన్మ ఫలాన్ని కేతువు ద్వారా అంచనా వేయవచ్చు. చెట్టుకు మొదలు వంటిది చేతి మణికట్టు. మొత్తం చేతి బలాన్ని మణికట్టులో బంధించారనవచ్చు. మణికట్టుపై రేఖలను మణిబంధ రేఖలనీ, కంకణ రేఖలనీ అంటారు.

మణికట్టు ముంజేయి కన్న సన్నగా ఉండడం విశేషం. మణిబంధం బలంగా, దృఢంగా వున్న వ్యక్తి సుఖభోగాలు పుష్కలంగా అనుభవిస్తూనే సమాజంలో గౌరవం, ఆదరణ పొందగలుగుతాడు. ఉద్యోగాలలో, వ్యాపారాలలో బాగా రాణిస్తాడు. వీరు మేధావంతులు అనిపించుకుంటారు.

మణికట్టు పీలగా, బలహీనంగా ఉన్నవారికి శారీరక, మానసిక బలహీనతలు, రుగ్మతలు ఉంటాయి. మరీ బలహీనంగా ఉన్న వ్యక్తి దరిద్రుడుగా జీవిస్తాడు. ఎంతో కష్టపడితే తప్ప భుక్తి గడవదు. అలాంటి వారు జీవితంలో సుఖపడరు. ముంజేతిని కదలించినప్పుడు శబ్దం వినిపిస్తే అది మరీ దరిద్రం, దౌర్భాగ్య సూచకం. చేతిలో ఎన్ని అదృష్టరేఖలున్నా, అలాంటి వారిని దౌర్భాగ్యం, దురదృష్టం వెన్నంటి ఉంటుంది. యావజ్జీవం దరిద్రులుగా, అశోపహతులుగా ఉండిపోతారు.

# 4. వేళ్ల స్వరూపాలు-మానవ స్వభావాలు

## బొటనవేలు

**హ**స్త పరిశీలనలో బొటనవేలికి ప్రత్యేక స్థానం ఉంది. మనిషి మానసిక స్థాయికి, ఇచ్ఛా, జ్ఞాన, క్రియా శక్తులకు ఇది సంకేతం. మనిషి నైజం, మనోబలం, ప్రవృత్తి బొటన వేలును బట్టి గ్రహించవీలుంది. ఆలోచనకు, ఆచరణకు ఇదే సంకేతం. బొటనవేలు శక్తికి కేంద్రం. బొటనవేలికి, మెదడుకు సంబంధం ఉంది.




చేతితో చేసే ప్రతి పనికి బొటనవేలు సహకరిస్తుంది. మెదడు సహకరిస్తుంది. కనుక మనిషి స్వభావం, మానసిక స్థితిగతులు అంచనా వేయ వీలుంది. బొటనవేలిపై రేఖలను గుర్తించి, గుణించి నాడీ జ్యోతిషం చెప్పేవారు జనన తేదీని,సమయాన్ని, లగ్నాన్ని అంచనా వేస్తారు. బొటన వేలునుబట్టి మొత్తం జీవితం చదవగలవారున్నారు.

బొటనవేళ్లు రెండు రకాలు. కఠినంగా ఉండేవి, కోమలంగా ఉండేవి.

బొటనవేలు పొడవుగా, బలంగా, దృఢంగా ఉంటే ఆకర్షణీయంగా ఉండి మనిషి ఔన్నత్యం చెబుతుంది. సన్నగా, మృదువుగా, కోమలంగా ఉన్న బొటన వేలు శ్రేష్ఠం కాదు. అలాంటి వారిని దురదృష్టం వెన్నంటి ఉంటుంది. వీటి బలాబలాలను, ప్రభావాలను మస్తిష్కరేఖను బట్టి నిర్ణయించాలి.

హస్త పరీక్షలో ముందుగా రేఖలను పరిశీలించడం మంచి పద్ధతి కాదు. వేళ్లు, బొటనవేలు, అరచేయి నైసర్గిక స్థితులు, గ్రహక్షేత్రాల బలాబలాలు ముందుగా అంచనా వేసి పెట్టుకోవాలి. వీటిని బట్టి కుటుంబం స్థితి గతులు తెలుస్తాయి. సంప్రదాయం, మనిషి స్వభావం, గుణగణాలు అంచనా వేసుకోవాలి. రేఖలను బట్టి వ్యక్తిగత విషయాలు చెప్పవచ్చు.

బొటనవేలిని బట్టి కుటుంబ పరిస్థితి, తండ్రి స్వభావం తెలుస్తాయి. తండ్రి చేతి బొటనవేలు జాతకుని బొటనవేలు ఒకటిగా ఉంటే ఆ వ్యక్తి జీవితంలో ఎదుగు, బొదుగు ఉండదు. చెప్పుకోదగ్గ విశేషం ఉండదు. తండ్రి వారసత్వంతో జీవిస్తాడు. బొటనవేలు స్వరూప, స్వభావాలను బట్టి పదిరకాలుగా విభజించవచ్చు.

బొటనవేలు పొడవుగా, బలంగా ఉండి, వెనక్కి వంగకపోయిన ఆ వ్యక్తి స్వతంత్ర బుద్ధి కలవాడు, ప్రయోజకుడు అవుతాడు. ఒక విధంగా స్వతంత్ర గుణాన్ని నిరంకుశత్వంగా మార్చుకుంటాడు. స్వేచ్ఛగా జీవిస్తాడు. బంధువులను చేరనివ్వడు. అయిన వారిని ఆదరించడు. అతని స్వభావం సౌమ్యంగా ఉండదు. గంభీరంగా, గోప్యంగా వ్యవహారాలు సాగిస్తాడు. తాను చేయదలచిన పని చేసిగానీ వదలడు. పట్టుదల జాస్తి. వేలు ఎంత పొడవుగా ఉంటే అతని మానసిక బలం అంత ఎక్కువగా ఉంటుంది. అందరికన్నా భిన్నంగా ఉండడం, దూరంగా బ్రతకడం వీరికి ఇష్టం. తమ లక్ష్యాన్ని చేరుకుంటారు.

బొటనవేలు కోమలంగా ఉండి, వెనక్కి వంగిన వ్యక్తి స్వభావం అస్థిరంగా ఉంటుంది. మానసిక బలం తక్కువ. అయితే హెడ్‌లైన్ అంటే మస్తిష్కరేఖ బలంగా ఉంటే, ఈ రకం బొటనవేలు మంచి ఫలితాలను ఇస్తుంది. మస్కిష్క రేఖ వంకర లేకుండా, తిన్నగా మంచిరంగులో ఉండాలి. అప్పుడు బొటన వేలు ధనుస్సులా వెనక్కి వంగినా, కోమలంగా ఉన్నా జాతకుడు విద్యావంతుడు, బుద్ధిమంతుడు అవుతాడు. అదృష్టం అతనిని వెతుక్కుంటూ వస్తుంది. మస్తిష్కరేఖ బలంగా ఉన్న వ్యక్తి అన్నివిధాల తండ్రిని మించిపోతాడు. చదువు, ఉద్యోగం, పలుకుబడి, అదృష్టం అన్నీ తండ్రి హోదాకు మించి సంపాదిస్తాడు. అతని వల్ల కుటుంబానికి

కీర్తి ప్రతిష్టలు కలుగుతాయి. ఐశ్వర్యం సమకూరుతుంది. అతని ప్రభావం అతని బిడ్డలందరి పైనా పడి వారంతా ఉన్నత స్థితికి వస్తారు.

బొటనవేలి మొదటి కణుపు పొడవుగా, బలంగా ఉన్నవ్యక్తి కుశాగ్రబుద్ధి కలవాడవుతాడు. అది రెండవ దాని కన్న చిన్నదిగా ఉంటే, అంధ విశ్వాసం పెంచుకుంటాడు. వానికి బుద్ధి మాంద్యం, మూర్ఖ స్వభావం ఉంటుంది. ఆలోచన తక్కువ, ఆవేశం ఎక్కువ, జ్ఞాన శూన్యం. దీనికి తోడు మస్తిష్కరేఖ చంద్రస్థానంలోకి జారివుంటే ఈ ఫలితాలు ఖచ్చితంగా చెప్పవచ్చు. గురు క్షేత్రం ఎత్తుగా, బలంగా ఉంటే అతను తన గురించి గొప్పలు చెప్పుకుంటాడు. డాంబికంగా బ్రతుకుతాడు. స్వోత్కర్ష ఎక్కువ. బొటనవేలి రెండవ కణుపు లావుగా, బలంగా వుంటే అతను నియమబద్ధుడు, కార్యకుశలుడు అవుతాడు. అయితే స్వార్థం అధికం. సమాజ సేవ చేస్తాడు. తనతో పాటు అందరూ సుఖపడాలని ఆశిస్తుంటాడు.

బొటనవేలు రెండు పర్వాలు ఎవరికీ ఒకటిగా ఉండవు. ఒకటి బలంగా, దృఢంగా ఉండి, రెండవది పీలగా, కోమలంగా ఉండడం జరుగుతుంది. మొదటి పర్వం బలహీనమైన వ్యక్తి ఇతరుల ప్రభావానికి తలవంచి బ్రతుకుతాడు. ఇతరుల కోసం తన ఆలోచన, నడవడి, దేనినైనా మార్చుకోగలడు. అంటే వ్యక్తిత్వం తక్కువ. దుర్బల మనస్సు. రెండవ పర్వం బలహీనంగా వుంటే అతను పరిస్థితులకు తలవంచక తప్పదు. అన్ని అపజయాలను, దురదృష్టాలను, విధిని, కర్మను నిందిస్తూ, కాలాగుణంగా బ్రతుకుతుంటాడు. ఇతరులను బాధపెట్టలేక తానే మారుతుంటాడు.

బొటనవేలు దృఢంగా ఉండి మొదటి పర్వం మాత్రం మృదువుగా ఉంటే, ఆ వ్యక్తి ఆలోచనలు బలహీనంగా ఉంటాయి. ఆడంబరాలకు, గొప్పలకు ధనం వ్యయ పరుస్తాడు. అనవసరంగా ఖర్చు పెట్టి తర్వాత విచారిస్తాడు. అతని ఉదారబుద్ధిని ఆసరా చేసుకుని మిత్రులు అతని చేత ఖర్చు పెట్టిస్తుంటారు. ఈ పరోపకారం వల్ల అతనికి కష్టనష్టాలే తప్ప తృప్తి మిగలదు.

రెండవ పర్వం మెత్తగా, కోమలంగా ఉండి బొటనవేలు వెనక్కి ధనుస్సులా వంగితే అతను విశాల దృక్పథం కలవాడవుతాడు. ప్రతి పనిలోనూ చొరవ, ఆసక్తి చూపిస్తాడు. ఆర్థిక విషయాలలో అతి జాగ్రత్తగా ఉంటాడు. రీతి, నీతి ఉంటుంది. పద్ధతి తప్పి నడుచుకోడు.

అంగుష్ట పరిశీలనలో మూడు విషయాలు ముఖ్యంగా గమనించాలి. విల్, లాజిక్, లవ్ ...... అన్ని వేళ్లకు మూడు పర్వాలుంటాయి. బొటనవేలి మూడవ

పర్వం శుక్రస్థానం. విల్ పవర్‌కు మొదటి పర్వం. లాజిక్, రీజనింగుకు రెండవ పర్వం. ప్రేమకు మూడవ పర్వం – అంటే శుక్రమండలం. ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తులను ఈ మూడు పర్వాలను బట్టి గ్రహించవచ్చు. బొటనవేలు అతి చిన్నదిగా ఉన్నవారిలో ఈ మూడు శక్తులు కొరవడినట్లే అవుతుంది.

మనిషి జీవితంపైన మిగిలిన అన్ని గ్రహాల కన్న శుక్రుని ప్రభావం ఎక్కువగా ఉంటుంది. శుక్రుడు కళలకు అధిపతి. సుఖాలు ఇస్తాడు. కుటుంబం అతని ప్రభావం క్రిందనే ఉంటుంది. శుక్రస్థానం బలంగా ఉన్నవారు ప్రేమ వ్యవహారాలలో విజయం పొందగలరు. అధిక కాముకత్వం వల్ల దుష్ఫలితాలు పొందడమూ సహజమే. బలమైన శుక్రుని ప్రభావం మిగిలిన గ్రహ మండలాలపై పడుతుంది. ఆ వ్యక్తి అన్ని విషయాలలోనూ రాణిస్తాడు, విజయాలు సాధిస్తాడు. మొదటి పర్వం చిన్నదిగా ఉన్న వ్యక్తి ప్రేమ విషయంలో నిరంకుశంగా వ్యవహరిస్తాడు. కాని అతనిది పవిత్ర ప్రేమ, ఆదర్శ ప్రేమ. ప్రేమించిన వారి మనస్సు తెలుసుకుని, తన ప్రేమను వ్యక్తం చేస్తాడు. వారి మనస్సు దోచుకుంటాడు. కొందరు సౌందర్యారాధకులై పవిత్ర ప్రేమికులవుతారు. నీతి తప్పి చరించరు, కానీ తమ ప్రేమను, అనురాగాన్ని మరచిపోలేరు. వారి ప్రేమ ఇతర రంగాలలో మంచి ఫలితాలనిస్తుంది.

బొటనవేలి రెండు పర్వాలు ఒకే పొడవున్న వ్యక్తి ఉత్తముడు. ఆదర్శంగా, పవిత్రంగా, నియమబద్ధంగా జీవిస్తాడు. మేధావి అవుతాడు. ప్రేమకు లొంగిపోడు. ప్రతి చిన్న విషయంలో తన ప్రతిభను ప్రదర్శిస్తాడు.

మొదటి పర్వం కన్న రెండవది పొడవుగా ఉన్నవానికి తార్కిక శక్తి, ఆలోచనా బలం ఎక్కువ. ప్రతి విషయం తనలోతానే తర్జన భర్జన చేసుకుంటాడు. అలాంటివారు కార్యశీలురు కాలేరు. పనులు నిర్వహించడం తక్కువ. ఆలోచించడం ఎక్కువ.

మొదటి పర్వం రెండవ దానికన్న పొడవుగా ఉన్న వ్యక్తి స్వేచ్ఛాప్రియుడై, నిరంకుశంగా వ్యవహరిస్తాడు. వాదనలంటే యిష్టం. అనర్గళంగా మాట్లాడగలడు. అయితే అతనికి దయా దాక్షిణ్యా లుండవు.

మొదటి పర్వం చిన్నదిగా ఉన్న వ్యక్తికి ఆలోచనలు బలంగా ఉండవు. తన పైన తనకే విశ్వాసం ఉండదు. అతని స్వభావం చంచలంగా ఉంటుంది. ఆ స్వభావం అనేక ఆర్థిక సమస్యలను సృష్టిస్తుంది. మొదటిపర్వం గుండ్రంగా ఉన్నా, వెడల్పుగా ఉన్నా, మంచి ఫలితాలు కలగవు.

## కోణం

చేతి నాలుగు వేళ్లు కలిపి వుంచి, అరచేతిని విస్తరించినపుడు బొటనవేలికి, చూపుడువేలికి మధ్య సహజంగా ఏర్పడేది కోణం. ఈ కోణం 90 డిగ్రీలు దాటి ఉంటే శ్రేష్టం. ఎంత పెద్దదిగా ఉంటే అంత మంచిది. స్వతంత్రత, పరోపకారం, ధర్మగుణం ఎక్కువగా ఉంటాయి. ఇది సమకోణం (అంటే సుమారు 90డిగ్రీలు)గా ఉండి బొటన వేలు స్వభావరీత్యా వెనక్కి వంగక, నిటారుగా వుంటే ఆ వ్యక్తి నిరంకుశంగా వ్యవహరిస్తాడు. స్వేచ్ఛగా జీవిస్తాడు. ఎవరినీ లెక్కచేయడు. చట్టానికి చిక్కకుండా ఆపదలు కొని తెచ్చుకుంటాడు. చట్టానికి చిక్కినా బయటపడు తుంటాడు.

బొటనవేలికి, అరచేతికి మధ్య కోణం చిన్నదిగా ఉన్న వ్యక్తి ఎప్పుడూ నిరుత్సాహంగా, ఉదాసీనంగా ఉంటాడు. భయం ఎక్కువ. ఇతరుల చెప్పు చేతలలో బ్రతుకుతుంటాడు. స్వతంత్రంగా ఏ పని చేయడు. స్వంత ఆలోచనలున్నా పనులు ఇతరులు చెప్పినట్లు చేస్తాడు. తన నిర్ణయం పైన తనకే విశ్వాసం ఉండదు. గుండె ధైర్యం, ఆత్మవిశ్వాసం తక్కువ.

శుక్రస్థానం ఎత్తుగా, బలంగా ఉండి, బొటనవేలు నిటారుగా, దృఢంగా ఉన్న వ్యక్తి ఉన్నతస్థితికి వస్తాడు. న్యాయశాస్త్రంలో నిష్ణాతులై, వైజ్ఞానిక, పారిశ్రామిక రంగాలలో ఉన్నత పదవులు నిర్వహించగలుగుతాడు. బొటనవేలు వెనక్కి వంగిన వ్యక్తి సౌందర్యారాధకుడు, కళాప్రియుడు కాగలడు. వీరు నటులు, నర్తకులు, రచయితలు.

బొటనవేలు చివర లావుగా, గుండ్రంగా ఉన్న వ్యక్తి తామస ప్రవృత్తి కలిగి, ఎప్పుడు చిరాకు పడుతుంటాడు. కోపతాపాలు ఎక్కువ. అమానుషంగానూ ప్రవర్తిస్తాడు. చిన్న విషయాలను పెద్ద తప్పులుగా మార్చి గొడవ చేస్తాడు. వివేక రహితంగా ప్రవర్తించడం జరుగుతుంది.

బొటనవేలు చివర మధ్యభాగం సన్నగా ఉన్న వ్యక్తి మహా మేధావి అవుతాడు. అతని మేధ పరమాద్భుతం. ఎంత క్లిష్టమైన సమస్యనైనా ఇట్టే పరిష్కరించగలడు. అతని నిర్ణయాలు, అంచనాలు ఎప్పుడూ తప్పవు. పరిశోధనా, ప్రణాళికా రంగాలలోనూ, న్యాయ మూర్తులుగానూ వీరు రాణిస్తారు.

బొటనవేలు ముందుకు వంగిన వ్యక్తి సంగీతంలో రాణిస్తాడు. సంగీత, వాద్య నిపుణుడవుతాడు లేదా గాయకుడు కాగలడు.

మొదటి రెండు పర్వాల మధ్యనున్న రేఖపైన ఒక ద్వీపచిహ్నం ఉన్న (బియ్యం గింజలా ఉంటుంది) వ్యక్తి ధన, వస్తు, వాహనాలు సంపాదించి, పుష్కలంగా సుఖభోగాలు అనుభవిస్తాడు. ఆ గుర్తు రెండు మూడు పర్వాల మధ్యరేఖపైన ఉంటే అతని బిడ్డలు ప్రయోజకులవుతారు.

ఈ ద్వీప చిహ్నం కుడి బొటనవేలి మొదటి రెండు పర్వాల మధ్యరేఖ పైన ఉంటే జాతకుడు శుక్లపక్షంలో పగటివేళ జన్మించి ఉంటాడు. ఎడమచేతి బొటనవేలి పైన ఉంటే అతను కృష్ణపక్షంలో రాత్రి పూట జన్మించి ఉంటాడు. రెండు బొటనవేళ్ళలో ఆ చిహ్నం ఉంటే అతను కృష్ణపక్షంలో పగటిపూట జన్మించి ఉంటాడు. ఈ ద్వీప చిహ్నం కుడి బొటనవేలిపై వుంటే అతని జననేంద్రియానికి కుడి వైపున, ఎడమ బొటనవేలిపైన ద్వీపచిహ్నం ఉన్న జననేంద్రియానికి ఎడమవైపున ఒక పుట్టుమచ్చ ఉంటుంది. ఇది తొడపై భాగాన కనిపిస్తుంది.

కుడిచేతి బొటనవేలి మూలరేఖపై (అరచేతికి బొటనవేలికి మధ్యనున్న రేఖ) ద్వీప చిహ్నమున్న వానికి అందరూ పుత్రులే కలుగుతారు. లేదా పుత్ర సంతతి అధికం. ఎడమచేతి బొటనవేలి మూల రేఖపైన ఈ ద్వీపచిహ్నం కలవారికి ఆడ సంతతి ఎక్కువ.

బొటనవేలు అరచేతి వైపుకు వాలి ఉన్న వ్యక్తి దొంగ వ్యాపారాలు చేస్తాడు. మనస్సు కుత్సితంగా ఉంటుంది. చిన్నచిన్న దొంగతనాలు సరదాగా చేస్తుంటాడు.

బొటనవేలు మృదువుగా ఉండి, సహజంగా కాస్త వెనుక వైపుకు వాలితే అతను సహజ మేధావి, ప్రతిభావంతుడు, గొప్ప ఆలోచనా పరుడు అవుతాడు. చిన్న వయస్సులోనే మహా ప్రతిభను ప్రదర్శిస్తాడు.

బొటనవేలు మెత్తగా, పరుపువలె ఉన్న వ్యక్తి పశుప్రాయుడు. అతనికి యుక్తాయుక్త విచక్షణ ఉండదు. శత్రువులు అధికం. అతనికి పగ, ప్రతీకార వాంఛ అధికం. ఉద్రేకంలో హత్యలు చేసి తప్పించుకు తిరుగుతాడు.

బొటనవేలు పై భాగం పలచగా, బలహీనంగా ఉన్న వ్యక్తి విశేషంగా శ్రమిస్తాడు. కామాసక్తి ఎక్కువ. మొదటి కణుపు చిన్నదిగా ఉన్నందున విశ్వాసహీనుడవుతాడు, కలహప్రియుడవుతాడు. క్రింది భాగం బలహీనంగా ఉన్న వ్యక్తి ప్రేమ వ్యవహారంలో మొండిగా వ్యవహరిస్తాడు. అందరినీ తిట్టి, అవమాని స్తుంటాడు.

# 5. వేళ్ల పరిశీలన

**వే**ళ్ల కొనల పైన దేవతలు నివశిస్తారంటారు. నాలుగు వేళ్లు క్షుణ్ణంగా పరిశీలించడం చతుర్ముఖ పారాయణం వంటిది. బ్రహ్మగారి నాలుగు ముఖాల నుండి నాలుగు వేదాలు పుట్టాయంటారు. నాలుగు వేదాలను పారాయణం చేయడం చతుర్వేద పారాయణం. అంటే వేదవిదుడు కావడం. ఇక్కడ నాలుగు వేళ్లను నిశితంగా పరిశీలిస్తే జాతకుని గుట్టు మట్టులన్నీ తెలుసుకోవచ్చు. వైజ్ఞానికంగా చూచినా వేళ్ల చివరన సున్నితనాడు లుంటాయి. ఈ నాడులకు మెదడుతో డైరెక్టు కనెక్షను ఉంటుంది. వైద్య విజ్ఞానం ఈ విషయాన్ని అంగీకరిస్తుంది. మనిషి మేధ మనిషి సంకల్పాన్ని బట్టి, ఇచ్ఛాశక్తిని బట్టి పనిచేస్తుందని మనస్తత్వవేత్తల అభిప్రాయం. మనిషిని నడిపించేది మేధస్సు. మనస్సును అదుపులో పెట్టగల శక్తి మనిషికి ఉంది. రానున్న దానిని రాకుండా చేయడం, ప్రమాదాన్ని తప్పించుకోవడం సాధ్యమే. అంటే మనిషి తన ఇచ్ఛాశక్తిని, మానసిక శక్తిని కంట్రోల్ చేసుకోవీలుంది. అందుకు కర్మ అడ్డుకాదు. అంతా కర్మానుసారమే జరగదు. మనిషి ప్రజ్ఞ కర్మను అధిగమించిపోతుంది. ఆలోచించగల మేధస్సుకు, కర్మకౌశలం గల వేళ్ళకు దగ్గర సంబంధం ఉంది. మానసిక స్థితిగతుల్ని బొటనవేలి స్వరూప, స్వభావాలను బట్టి తెలుసుకున్నట్లే, మనిషి కర్మబద్ధతను మిగిలిన నాలుగు వేళ్లను పరిశీలించి గ్రహించవీలుంది.

నాలుగు వేళ్లు ఎవరికీ ఒక్కలా ఉండవు. ఇవి మనిషి జీవిత రహస్యాలను దాచిపెడతాయి. నాలుగు ప్రధాన గ్రహాలకు ఇవి ప్రాతినిధ్యం వహిస్తాయి. తర్జని బృహస్పతికి, మధ్యవేలు శనికి, అనామిక రవికి, కనిష్టాంగుళి బుధునికి నివాస స్థలాలు. ఆయా గ్రహ లక్షణాలు, బలాలు, ప్రభావాలు ఈ నాలుగువేళ్లను బట్టి చెప్పుకొనవచ్చు.

నవగ్రహాలలో బృహస్పతిది గురుస్థానం, అగ్రస్థానం. గురువు విద్యలకు అధిపతి. ప్రతిభకు ప్రతినిధి. దయా దాన ధర్మ గుణాలకు ఖని. రహస్య పరిశోధనలు, దైవకార్యాలు, తపస్సు, యోగం, దివ్యజ్ఞానం గురువు పరిధిలోకి వస్తాయి. శీలస్వభావాలు, పూర్వపుణ్యం గురువును బట్టి గుణించాలి. మధ్యమాంగుళికి అధిపతి శని. శని మందబుద్ధి, ఉగ్రస్వభావి. ధనానికి, ఐశ్వర్యానికి అధిపతి. మనస్సును శాసించగలది శని. ఐహిక, ఆముష్మిక సుఖాలు రెండూ శని అధీనంలోనే ఉంటాయి. అనామిక రవి స్థానం. మనిషి కీర్తి ప్రతిష్ఠలు, తేజస్సు, యశస్సు ఈ వేలును బట్టి, రవి బలాన్ని బట్టి చెప్పుకోవాలి. భోగభాగ్యాలకు, సుఖాలకు రవి అండగా నిలుస్తాడు. ప్రతిభావిశేషాలు, కీర్తి ప్రతిష్ఠలు రవి ప్రభావాన్ని బట్టి ఉంటాయి. కనిష్ఠాంగుళి బుధుని స్థానం. బుధుడు విద్యకు, వివేకానికి అధిపతి. విజ్ఞానం బుధుని విశేష ప్రజ్ఞ. మిత్రులు, శత్రువులు, వ్యాపారం, వాణిజ్యం, ఆస్తిపాస్తులు, ఉద్యోగం లాంటివి బుధుని అజమాయిషీలో ఉంటాయి.

మొత్తం మీద వేళ్లు బలంగా ఉన్నవి, బలహీనంగా ఉన్నవి అని రెండే రకాలు.

ప్రతివేలికి రెండు కణుపులు, మూడు పర్వాలు ఉంటాయి. కణుపులు లావుగా, గట్టిగా ఉంటే బలమైన వేళ్లు. వీరు సహజంగా బుద్ధిమంతులు, ధనవంతులు, అదృష్టవంతులు అవుతారు. ఏ ఒక్క కణుపు లావుగా బలంగా ఉన్నా మంచి ఫలితాలనిస్తుంది. నాలుగు వేళ్ల మొదటి పర్వాలు మేధస్సుకు, తెలివితేటలకు సంబంధించి ఉంటాయి. మొదటి కణుపులు ఆయా వ్యక్తుల బుద్ధికి, అదృష్టానికి పునాదులని చెప్పవచ్చు. మొదటి కణుపులు బలంగా, గట్టిగా వున్నవారు మేధావులు, జ్ఞానులు అవుతారు. వీరిలో వివేకం, ఇచ్ఛాశక్తి ఎక్కువ. రెండవ కణుపులు సంపదలను, మనిషి స్థాయిని సూచిస్తాయి. రెండు కణుపులూ బలహీనంగా వున్న వ్యక్తి సమాజంలో రాణించలేడు.

అరచేయి చిన్నది అయినా, పెద్దది అయినా వేళ్ల పొడవు అరచేయి అంత పొడవుగా ఉండటం మంచిది. అలాకాక వేళ్లు అరచేయి పొడవుకన్నా తక్కువగా ఉంటే అతడు జన్మవిరోధి, నాస్తికుడు, దైవదూరుడు అవుతాడు. అరచేయి కన్న వేళ్లు పొడవుగా ఉన్న వ్యక్తి ఆదర్శంగా జీవిస్తాడు. అతని భక్తి ప్రపత్తులు స్థిరంగా ఉంటాయి. ఉన్నత పదవులు పొందుతాడు. అతని నిర్ణయానికి తిరుగుండదు. లాభం లేని పనులు చేయడు.

వేళ్ల కణుపులు లావుగా ఉన్నవారు తత్వవేత్తలు, జ్ఞానులు అవుతారు. వీరికి పారలౌకికక విషయాసక్తి ఎక్కువ. తర్జని మొదటి కణుపు మాత్రమే లావుగా వున్న వ్యక్తి ధర్మ పరాయణు డవుతాడు. సంప్రదాయాలను, పూర్వ ధర్మాలను త్రోసిరాజని కొత్త ధర్మాలను, సిద్ధాంతాలను ప్రతిష్టిస్తాడు.

కొన్ని సిద్ధాంతాల ప్రకారం వేళ్లు పుష్టిగా, లావుగా ఉన్నా లేక కణుపులు మాత్రమే బలంగా ఉన్నా ఆ వ్యక్తి మంచి గృహస్థుడు, కార్యకుశలుడు అయి నియమనిష్టలతో జీవితం గడిపేవాడవుతాడు. వేళ్ల బలం తగ్గి, కణుపులు మాత్రం బలంగా వుంటే అతను వ్యవహార శూన్యుడవుతాడు. పరులను దూషించి, అపకీర్తి పాలవుతాడు. రెండు కణుపులు బలంగా ఉన్న వ్యక్తి వ్యవహారదక్షుడు, వేదాంతి, కార్యవాది అవుతాడు. న్యాయవాదులుగా రాణిస్తాడు. దానికి తోడు చంద్రక్షేత్రం బలంగా ఉంటే అతను గాయకుడు లేదా కవి అవుతాడు. కణుపులు బలంగా కనిపించని వ్యక్తి కళల పట్ల, శాస్త్ర విషయాల పట్ల ఆసక్తిని ప్రదర్శిస్తాడు. అతనికి పరిజ్ఞానం తక్కువ, ప్రతిభ శూన్యం.

చిన్నవేళ్లు కలిగిన వారు సమయస్ఫూర్తిగా మాట్లాడగలరు. మంచి ఆలోచన చేస్తారు. అరచేయి చతురస్రంగా ఉండడం మరీ మంచి ఫలితాలనిస్తుంది. అలాంటి వారు లెక్చరర్లు, లాయర్లుగా రాణిస్తారు. రాజకీయ పదవులు, పరపతి సంపాదిస్తారు.

వేళ్లు పొడవుగా, లావుగా ఉన్న వ్యక్తి ప్రవర్తన కఠినంగా ఉంటుంది. హృదయం లేని వాడనిపించుకుంటాడు. వేళ్లు కోమలంగా ఉంటే మనిషి స్వభావం కోమలంగా ఉంటుంది. స్వేచ్ఛగా జీవిస్తాడు. ఎవరి ఆజ్ఞలు, అధికారాలు లెక్కచేయడు. తను నమ్మిన దానిని చేసి తీరతాడు. తన ఇష్టానికి ప్రతికూలంగా ఏ పని చేయడు.

వేళ్లు ఒక దాని కొకటి అతికినట్లున్న వ్యక్తి క్రియా శూన్యు డవుతాడు. ఏ పని చేయడు. నిందలు, అపకీర్తి పైన వేసుకుంటాడు. ధర్మాలు, నీతులు వల్లిస్తాడు గాని పని మాత్రం చేయడు.

వేళ్లు కోమలంగా ఉండి, చివరలు వంగి ఉన్నా, లేదా వంకర తిరిగినా, ఆ వ్యక్తి బుద్ధి మాంద్యం వల్ల మూర్ఖుడవుతాడు. అతని పనులు భయంకరంగా, క్రూరంగా ఉంటాయి. చివరకు పిరికివాడవుతాడు. ఎవర్నైనా విమర్శించగలడు. తను మాత్రం ఎందుకూ పనికిరాడు.

అరచేయి తెల్లగా కాంతివంతంగా ఉన్న వ్యక్తికి అభిమానం అధికం. చేయి గట్టిగా వుంటే అందరితో కలిసిమెలిసి సఖ్యంగా ఉంటాడు. అందరికీ మంచి చేస్తుంటాడు.

హస్తం పై భాగాన వెంట్రుకలున్న వారు కోపిష్టివారవుతారు. విలాస జీవితం గడుపుతూ ధనం వ్యయం చేస్తారు. వారి కోపమే వారికి అనర్థాలు, కష్టాలు తెచ్చి పెడుతుంది.

కనిష్టాంగుళి (చిటికెన వేలు) అనామిక (ఉంగరం వేలు) మొదటి పర్వాన్ని తాకేటంత పొడవుగా ఉంటే, ఆ వ్యక్తి కటిక పేద కుటుంబంలో జన్మించినవాడైనా ధనవంతుడవుతాడు. స్వశక్తితో ఐశ్వర్యవంతుడవుతాడు. తన కుటుంబంలో వారి కన్న, దగ్గిర బంధువుల కన్న ఎక్కువగా ఎక్కువ కీర్తి ప్రతిష్ట లార్జించి, ధనవంతు డవుతాడు. ధైర్యంగా స్వశక్తితో, స్వీయ ప్రతిభతో అదృష్టాన్ని అన్వేషిస్తాడు. ఎవరిపైన ఆధారపడడు. ఎవరి దయాధర్మాలకు అంగలార్చడు.

వేళ్లు  పొడవుగా, తిన్నగా వుండి ఆరంభంలో పీలగా ఉంటే అతనికి ఎంత ప్రతిభ ఉన్నా దరిద్రుడుగానే ఉంటాడు. మూలస్థానం దృఢంగా, బలంగా ఉంటే ధనవంతుడవుతాడు.

కనిష్ట, అనామికల మధ్య జాగా ఎక్కువగా ఉన్న వ్యక్తి వృద్ధాప్యంలో ఐశ్వర్యవంతుడై ధన సంపదలతో సుఖిస్తాడు. అనామిక, మధ్య అంగుళుల మధ్య జాగా ఎక్కువ ఉన్న వ్యక్తి మధ్య వయస్సులో సుఖాలనుభవిస్తాడు. మధ్యమ, తర్జనీల మధ్య జాగా ఉన్నవాడు బాల్యం నుండి యవ్వనం వరకు సుఖిస్తాడు. ఈ పరిశీలన వేళ్లను పూర్తిగా విస్తరించి నిర్ణయించాలి. వేళ్ల మూలస్థానాలు చక్కగా ఒకే గీతపై అమర్చినట్లున్న అతనిని అన్నివిధాల అదృష్టం వరిస్తుందని చెప్పవచ్చు.

వేళ్లు వంకరలు తిరిగి, గోళ్లు చిన్నవిగా ఉన్న వ్యక్తి నిర్దయుడై చెడ్డ పనులు చేస్తాడు. హత్యలకు వెనకాడడు. అరచేతిలో ఎన్ని మంచి రేఖలున్నా వేళ్లు వంకరగా ఉన్న వ్యక్తి స్వభావం భయంకరంగా ఉంటుంది. వేళ్లను విస్తరించినపుడు వేళ్ల మధ్య జాగా ఎక్కువగా ఉన్న వ్యక్తి బుద్ధిమంతుడు, జ్ఞాని, సంపన్నుడు అవుతాడు. తర్జని మధ్యమాంగుళి నడుమ జాగా ఎక్కువగా ఉన్నవాడు కల్పనాశక్తి కలవాడవుతాడు. కవులు, రచయితల, నటులు, కళాకారులు ఈ కోవకు చెందుతారు. మధ్యమాంగుళి, అనామికల నడుమ జాగా ఎక్కువగా ఉన్న వ్యక్తి భాగ్యవంతుడు. అనామిక, కనిష్టాంగుళుల మధ్య ఎక్కువ జాగా ఉన్నవారు స్వతంత్రంగా జీవిస్తారు. ఈ జాగాలు ఎడమచేతిలో ఉంటే స్వార్థం, అభిమానం

తోడవుతాయి. కుడిచేతిలో అలా ఉంటే స్వతంత్రం, స్వేచ్ఛ, నిష్ఠ, నియమం, పట్టుదల ఎక్కువగా ఉంటాయి. ఇవి మనిషి రాణించడానికి దోహదం చేస్తాయి.

వేళ్ల పైభాగం (అరచేతిని బోర్లించి చూడండి) దృఢంగా, గట్టిగా ఉంటే ఆ వ్యక్తి జన్మతః కార్యనిర్వహణా చాతుర్యం కలవాడవుతాడు. మంచి ఉద్యోగాలలో రాణిస్తాడు. మేధావి, సహృదయుడు, బుద్ధిమంతుడు అనిపించుకుంటాడు.

వేళ్లు సన్నగా, గుండ్రంగా, గట్టిగా ఉన్న వ్యక్తులు సాఫ్ట్‌వేర్, ఎలెక్ట్రానిక్స్, ఇంజనీరింగ్ రంగాలలో రాణిస్తారు. నాలుగువేళ్లు కలిసినపుడు సమకోణ చతుర్భుజాకారం ఏర్పడితే, వారు గణితంలో, వైజ్ఞానిక రంగంలో, ఎలెక్ట్రానిక్స్‌లో రాణిస్తారు.

వేళ్లు మెలికలు తిరిగి సుడులు, ముడులు ఉన్నవారు చిత్రకారులు, రచయితలు, హాస్య నటులు అవుతారు. చరిత్ర, జియోలజీ, ఆర్కియాలజీ రంగాలలో రాణిస్తారు.

అరచేయి కన్న వేళ్ల పొడవు ఎక్కువగా ఉన్న వారికి కామాసక్తి ఎక్కువ. శృంగార జీవితం పట్ల మక్కువ అధికం. ఎప్పుడూ విరహంతో కాలిపోతుంటారు. కాని దైవభీతి వల్ల బయటపడరు. నీతివంతులు అనిపించుకోవాలని కోరికల్ని అణచిపెడుతుంటారు. వీరి ఆలోచనల్లో వేగం, పనులలో జాప్యం కనిపిస్తుంది.

వేళ్లు అరచేయికన్న పొట్టిగా వున్న వ్యక్తి సంకుచిత స్వభావి అవుతాడు. నాస్తికుడుగా మారిపోతాడు.

## తర్జని

ఇది బొటనవేలు తర్వాత, కుడిచేతిలో కుడి నుండి చూస్తే మొదటి వేలు. ఇదే తర్జని. చూపుడు వేలు పొడవుగా ఉన్న వ్యక్తి అభిమానవంతుడు, కళల పట్ల ఆసక్తి కలవాడు, భోగ, విలాసప్రియుడు అవుతాడు. ఇతనికి అలంకార ప్రియత్వం ఎక్కువ, మధ్యవేలు కంటే ఇది పొడవుగా ఉంటే పై లక్షణాలు అతిగా ఉంటాయి.

తర్జని పొట్టిగా, కురచగా వున్న వ్యక్తిలో వశీకరణ శక్తి అధికం. ఎవరినైనా ఇట్టే తన బుట్టలో వేసుకుంటాడు. లౌకికం ఎక్కువ. అతని ప్రవర్తన నీచంగా, హీనంగా ఉంటుంది. జుగుప్సాకరంగా జీవిస్తుంటాడు. దీనికి తోడు తర్జని పర్వాలు వికృతంగా వుంటే అతని ప్రవర్తన, జీవితం మరీ నికృష్టంగా, భయంకరంగా ఉంటుంది.

తర్జని పైకణుపు గుండ్రంగా ఉన్న వ్యక్తి బుద్ధిమంతుడు, విద్యావంతుడు, వివేకి అవుతాడు. అతనికి బహు విషయ ప్రావీణ్యం ఉంటుంది. మొదటి కణుపు సన్నగా, పీలగా ఉంటే అతని మనస్సు సంకుచితంగా ఉంటుంది. వివేకం ఉన్నా చంచల స్వభావం ఎక్కువ. బుద్ధిమాంద్యం కనిపిస్తుంది.

తర్జని పొడవుగా మధ్య వేలంత పొడవుగా ఉంటే ఆ వ్యక్తికి దూరదృష్టి ఎక్కువ. మొత్తంగా ఖర్చు చేస్తాడు. నిత్య యవ్వనుడుగా ఉంటాడు. ఆడవారితో చనువుగా ఉండి వారి అభిమానం పొందుతాడు.

తర్జని మొదటి పర్వం మీనరాశి, రెండవది కుంభరాశి, మూడవది మకరరాశి

## మధ్య వేలు

దీని అధిపతి శని. మొదటి పర్వం ధనుస్సు, రెండవ పర్వం వృచ్ఛికం, మూడవ పర్వం తులా రాశులు. నాలుగు వేళ్లలో పొడవైనది ఇదే. బొటనవేలితో కలిపి అయిదు వేళ్లు కనుక దీనిని మధ్యవేలు అంటారు. ఇది పొడవుకు తగిన బలంగా వున్న వ్యక్తి ఏకాంత జీవితం కోరుకుంటాడు. ఎవరితో కలిసి మెలిసి ఉండడం ఇష్టపడడు. స్వయంకృషితో, స్వీయార్జనతో విద్య పూర్తి చేస్తాడు. స్వయం ప్రతిభతో రాణిస్తాడు. రికమెండేషన్లు ఇష్టపడడు. అతను క్రమంగా పై పదవులు సాధించి, కీర్తి ప్రతిష్టలు ఆర్జించగలడు. జీవితంలో గొప్ప క్రమశిక్షణ, సెల్ఫ్ డిసిప్లిన్ ఉంటుంది. గంభీరంగా ఉంటాడు. ఆత్మాభిమానం ఎక్కువ. రహస్య విద్యలపట్ల ఆసక్తి ఉంటుంది. మిగిలిన రేఖల్ని పరిశీలించాలి లేకపోతే అదొక బలహీనత అవుతుంది. అమాయకుల్ని, ఆడవారిని మోసగించి డబ్బు సంపాదిస్తాడు. ఇతర శుభ చిహ్నాలు, రేఖలు ఉంటే ఈ చెడు పనులు చేయడు. మధ్యమాంగుళి పొడవుగా ఉన్న వ్యక్తికి జీవకారుణ్యం అధికం. తర్జనితో సమానమైన పొడవున్న వ్యక్తి జంతువుల వల్ల మరణిస్తాడు.

మధ్యవేలు పొడవుగా ఉండి, మూడవవేలు అంటే అనామిక దీని అంత పొడవుగా ఉన్న వ్యక్తికి జూదం వ్యసన మవుతుంది. వీరికి స్పెక్యులేషన్ వ్యాపారాలు, చిట్‌ఫండ్స్, ఫైనాన్స్ కంపెనీలు లాభిస్తాయి. స్టాక్ ఎక్స్చేంజి వీరికి క్రీడాస్థలం అవుతుంది. గుర్రం పందాలలో, బెట్స్‌లో నష్టపోతుంటారు.

మధ్య అంగుళి మొదటి పర్వం మిగిలిన రెండు పర్వాల కన్న పొడవుగా ఉంటే పైన చెప్పిన దోషాలుండవు. నష్టాలుండవు. పైగా ఆయారంగాలలో

రాణిస్తాడు. అయితే ఆడంబరం, అహంకారం ఎక్కువ. తన మాట శాసనం కావాలంటాడు. మహారాజుగా బ్రతికి చివరకు బ్రెయిన్ హేమరేజ్‌తో కోమాలో మరణిస్తాడు.

మధ్యవేలు పొట్టిగా వున్న వ్యక్తి ఇతరుల వ్యవహారాలలో చొరబడుతుంటాడు. ప్రతిభ ఉండదు. నీచమైన ఆలోచనలు చేస్తుంటాడు. నీచులతో, అల్పులతో స్నేహం చేస్తాడు. మధ్యవేలు వంకరగా, కఠినంగా ఉన్న వ్యక్తి ఎప్పుడూ ఎవరినో దూషిస్తుంటాడు. బూతులు తిడుతుంటాడు. ఎప్పుడూ ఏదో ఒక రోగంతో బాధపడుతుంటాడు. మొదటి పర్వం పొడవుగా ఉన్నవ్యక్తి ఎప్పుడూ నిరాశగా, నిస్పృహగా గడుపుతూ, నిత్యం మృత్యువును ఆహ్వానిస్తాడు. రెండవ పర్వం పొడవుగా ఉన్న వ్యక్తికి మార్మిక విద్యల పట్ల, జ్యోతిష్య సాముద్రిక విషయాల పట్ల ఆసక్తి ఎక్కువ. ఇంద్రజాల విద్యలు, తంత్ర, మంత్ర శాస్త్రాలు నేర్చుకుంటాడు. యోగం, తపస్సు, ధార్మిక విషయాలు అతనికి ఇష్టంగా ఉంటాయి. మూడవ పర్వం పొడవుగా ఉన్న వ్యక్తి లోకంలో పూజింపబడతాడు. అమితంగా సంపాదించి, మితంగా ఖర్చు పెడతాడు. వ్యవహార కుశలుడు, ప్రతిభా సంపన్నుడు అవుతాడు.

## అనామికాంగుళి

మూడవవేలు, బొటనవేలితో కలిపి చూస్తే నాల్గవ వేలు అనామిక. మనం ఉంగరం వేలు అంటాం. దీని అధిపతి రవి. మనకు కాంతి, వేడి యిచ్చేది సూర్యుడు. అలాగే మన జీవితాలలో కాంతి, వేడి ప్రసాదించేది అనామికాంగుళి. దాని క్రింద ఉన్నది రవిక్షేత్రం. దీని ప్రథమపర్వం కన్యారాశి, ద్వితీయ పర్వం సింహరాశి, తృతీయం కటకరాశి.

అనామిక మొదటి కణుపు సన్నగా, నాజూకుగా ఉండడం శ్రేష్ఠం. అలా ఉన్నవారు కళలలో రాణిస్తారు. కళ కోసం డబ్బు ఖర్చు చేసి, ఆ కళలతోనే ధనవంతులవుతారు. ఆప్తులకు, బంధువులకు సహాయం చేసే ఉదార స్వభావం ఉంటుంది.

అనామిక తర్జని కన్న చిన్నదిగా ఉన్న వ్యక్తికి కుటుంబ సుఖం తక్కువ. శృంగారంలో సుఖం పొందలేడు. ఉద్యోగ వ్యాపారాలు అసంపూర్ణంగా ఉంటాయి. వ్యాపారంపైన, ఉద్యోగంపైన, సంపాదనపైన, సంసారంపైన ఇష్టం ఉండదు. ఎవరినీ నమ్మడు. చంద్ర, శుక్ర క్షేత్రాలు బలహీనంగా ఉంటే ఈ లక్షణాలు మరీ ఎక్కువగా ఉంటాయి. కుజక్షేత్రం బలంగా ఉంటే వ్యాపార, ఉద్యోగాలలో రాణిస్తాడు.

ఒక మనిషి సమాజంలో ముఖ్యంగా వృత్తిలో రాణించడానికి కుజుని బలం అవసరం. లేకుంటే ఎంత ధనవంతుడైనా మంచిపేరు సంపాదించలేడు.

అనామికాంగుళి, తర్జని ఒకే పొడవుగా ఉన్న వ్యక్తి కళాకుశలుడవుతాడు. నూతన విషయాలు కనిపెట్టడం పట్ల ఆసక్తి ఎక్కువ. పరిశోధనలు చేసి, ధనార్జన చేయగలడు. మంచి శ్రమ జీవి. ఏకాగ్రత ఎక్కువ.

తర్జని అనామిక కన్న పొడవుగా ఉన్న వ్యక్తి ఉన్నత స్థితికి చేరడానికి, విజయానికి చాలా శ్రమించాలి. చాలా కష్ట నష్టాలు. బాధలు పడవలసి ఉంటుంది. సహాయం చేయగల మిత్రులే శత్రువులుగా వ్యవహరిస్తారు. పైగా అపకారం చేస్తుంటారు. అలాంటివారు అర్హతలున్నా అదృష్టం పొందలేరు.

అనామికాంగుళి సాధారణ పొడవుగా ఉన్నవారు కీర్తి ప్రతిష్టల కోసం అంగలారుస్తుంటారు. కళలపట్ల ఆసక్తి ఉంటుంది. ప్రేమించే హృదయం ఉంటుంది. ఎక్కువ పొడవుగా ఉంటే వ్యాపారంలో, ఉద్యోగాలలో విజయం సాధించగలరు. బుద్ధి చాతుర్యం ఉంటుంది. జూదం, పేకాట అంటే ఇష్టం. స్పెక్యులేషన్ ద్వారా డబ్బు సంపాదించా లనుకుంటారు.

అనామిక చిన్నదిగా వున్న వ్యక్తి అన్ని విధాల అప్రతిష్ట పాలవుతుంటాడు. అనామికాంగుళి, మధ్యమాంగుళి అంత పొడవుండి, రెండవ పర్వం ఎత్తుగా బలంగా ఉంటే, కుజక్షేత్రం బలంగా వుంటే, అతను గొప్ప న్యాయవాది అవుతాడు. వాద ప్రతివాదాలలో ప్రజ్ఞ చూపిస్తాడు. లాటరీలు, జూదం, స్పెక్యులేషన్, స్టాక్ మార్కెట్, షేర్ల వ్యాపారంపట్ల ఆసక్తి. దీనికి తోడు బుధ క్షేత్రం కూడా బలంగా వుంటే, వారు విదేశాలలో రాయబారులవుతారు. రాచకార్యాలు చక్కబెట్టగలరు. మధ్యవర్తులుగా రాణిస్తారు. పెట్టుబడి లేకుండా పెద్ద వ్యాపారాలు చేస్తారు.

## కనిష్టాంగుళి

అన్ని వేళ్లలో చివరది, చిన్నది చిటికినవేలు. ఇది బుధుని స్థావరం. బుద్ధి వికాసం, వ్యాపార చాతుర్యం, వ్యవసాయం, పరిశోధన, విజ్ఞానం, శత్రువులు, మిత్రులు, లాభనష్టాలు దీనిని బట్టి చెప్ప వచ్చు. మొదటి పర్వం మిధునరాశి, రెండవది వృషభరాశి, మూడవది మేషరాశి.

ఈ వేలు పొడవుగా, బలంగా ఉంటే జ్ఞానం, తర్కం, దూరదృష్టి, వాక్చాతుర్యం కలవాడవుతాడు. అనేక భాషలతో పరిచయం ఉంటుంది. మహామేధావి, ప్రతిభా వంతుడు, సంపన్నుడు అని కీర్తి గడిస్తాడు. చిటికిన వేలు బాగా పొడవుగా

ఉన్నవారు చతురులు, నీతివంతులు, బుద్ధిమంతులు అవుతారు. అయితే మిత్రులైన వారే శత్రువులుగా మారి అపకారం చేయడం వల్ల దూరంగా పారిపోయి, అజ్ఞాతంలో జీవించవలసి వస్తుంది. స్వార్థ ప్రయోజనాల కోసం దొంగలతో, ద్రోహులతో చేతులు కలిపి స్నేహం చేస్తాడు. చివరకు దేశద్రోహిగా మారతాడు.

చిటికిన వేలు చిన్నదిగా ఉంటే బుద్ధిమాంద్యం, మందమతి సూచితం. వీరు ఏ రంగంలోనూ రాణింపుకు రారు, గుర్తింపు ఉండదు. కాని తమకు ఉన్నంతలో ఇతరులకు సహాయం చేసే గుణం ఉంటుంది. అదే ప్రజాసేవ, దేశసేవ అని తృప్తి పడుతుంటారు. అరచేయి మెత్తగా, మృదువుగా, అందంగా ఉంటే పై లక్షణాలు కనిపిస్తాయి.

కనిష్టాంగుళి చిన్నదిగా ఉండి, అరచేయి మొరటుగా ఉన్నవ్యక్తి పశువుతో సమానం. చిటికిన వేలు వంకరగా ఉన్న వ్యక్తి మానసికంగా దుర్బలుడవుతాడు. మంచి ఆలోచన చేయడు. నీతి నియమాలు పాటించడు. సదా ఇతరుల ముందు చేయి చాచి అర్థిస్తుంటాడు.

కనిష్టాంగుళి పైభాగం వెడల్పుగా ఉన్నవారు ఉపాధ్యాయ వృత్తిలో రాణిస్తారు. ఇది సామాన్యంగా ఉంటే మనిషికి ఓర్పు, సహనం ఉంటుంది. శత్రువులనైనా క్షమిస్తారు. అహింసావాది, సత్యప్రియుడు అవుతాడు. మిత్రుల కోసం త్యాగాలు చేస్తుంటాడు.

కనిష్టాంగుళి మధ్యవేలంత పొడవుండడం మంచిది కాదు, అశుభసూచన. ఆ వ్యక్తి రహస్యాలను తనలో దాచుకుని కుమిలిపోతుంటాడు. సంతోషంగా జీవించలేడు. కష్టాల కాపురం అతని జీవితం.

కనిష్టాంగుళి మరీ చిన్నదిగా వుండి, మధ్యవేలు మరీ పొడవుగా ఉన్న వ్యక్తి చరిత్రహీనుడు, భ్రష్టుడు అవుతాడు. వ్యభిచారి కావడం వల్ల, స్త్రీల వల్ల బాధలు పడతాడు. దుష్టసహవాసం, దుర్మార్గపు జీవితం అతనిది. కనిష్టాంగుళి కన్న అనామిక చిన్నదైన వ్యక్తి సచ్చరిత్రుడై, లోక కళ్యాణం కొరకు అనేక త్యాగాలు చేస్తాడు. తన సర్వస్వం దేశం కోసం, ప్రజల కోసం వెచ్చిస్తాడు. మహాత్ముడుగా ప్రసిద్ధుడవుతాడు.

## వేళ్ల వంపులు

సహజంగా వేళ్లు ఒకదానిపై ఒకటి వాలినట్లుంటాయి. అలా వాలడం వల్ల, ఆ వేలి ప్రభావం అవతలి వేలిపై పడుతుంది. ఆ రెండు వేళ్ల మిశ్రమ

ఫలితాలు గ్రహిస్తుండాలి. జాతక చక్రంలో, ఒక గ్రహం మరొక గ్రహాన్ని, దాని స్థానాన్ని చూడడం లాంటిది. చివరి మూడు వేళ్లు చూపుడు వేలు (తర్జని) వైపు వంగితే, ఒక్క తర్జని మాత్రమే నిటారుగా ఉన్నట్లు లెక్క. ఆ వ్యక్తి చాలా ఉన్నతాశయాలు కలవాడై, స్వతంత్రంగా ఆలోచిస్తాడు. సదా ఉత్సాహంగా ఉంటూ తన చుట్టూ ఆహ్లాద, అనుకూల వాతావరణం సృష్టించుకోగలుగుతాడు. అతని వెంట ఎప్పుడూ పదిమంది ఉంటారు. అది నాయకత్వ లక్షణం. స్వయంకృషితో, ప్రజాసేవతో పదవులు పొందుతాడు. రాజకీయ నాయకులలో ఈ లక్షణం ఉంటుంది.

తర్జని మధ్యఅంగుళి వైపు వాలినట్లున్న వ్యక్తి ఎప్పుడూ నిరుత్సాహంగా, దిగులుగా ఉంటాడు. శని ప్రభావం వల్ల ప్రతి పని ఆలస్యంగా చేస్తాడు. శని మందుడు. తర్జని వలె కనిష్ఠాంగుళి, అనామికాంగుళి, మధ్యవేలి వైపు వాలినట్లున్న, అంటే మధ్యవేలు ఒక్కటి మాత్రమే నిటారుగా ఉన్న ఆ వ్యక్తి ఎల్లప్పుడు విచారగ్రస్తుడై ఉంటాడు. ఎప్పుడు ఏవేవో బాధలు అనుభవిస్తుంటాడు. చింతాక్రాంతుడుగా ఉంటాడు. అతనిపైన శని ప్రభావం ఎక్కువ. ఎవరితోను కలిసి మెలిసి సరదాగా జీవించలేడు. ఒంటరిగా దిగులుపడుతుంటాడు.

మధ్యవేలు మాత్రం తర్జని వైపు వంగిన వ్యక్తి సదా చెడు ఆలోచిస్తుంటాడు. అనుమానాలు ఎక్కువ. అపనిందలు, దూషణలు భరిస్తుంటాడు. అతని ప్రవర్తన నీచంగా ఉంటుంది. అతను లంపటాలు, దుర్మార్గాలు, పాపాలు చేస్తాడు. ఇతరులకు అపకారం, హాని చేయడంలో అతను ఆనందం పొందుతుంటాడు. శాడిస్టుగా జీవిస్తాడు. అతనిని చూస్తే జనం తప్పుకు పారిపోతారు.

మధ్యవేలు మాత్రం అనామిక వైపు వంగినట్లున్న వ్యక్తి ఉత్సాహంగా ఉంటాడు. ఆశాజీవి. అయితే మరుక్షణంలో నిరాశతో క్రుంగిపోతాడు. అతని ప్రవృత్తి ద్వంద్వంగా ఉంటుంది. ఆలోచనలు స్థిరంగా ఉండవు.

అనామికాంగుళి మధ్యవేలి వైపు వాలిన ఆ వ్యక్తి నీచుడు, అవినీతిపరుడు అవుతాడు. అమానుష, ఆకృత్యాల పట్ల ఆసక్తి మెండు. చెడ్డ పనులు చేసి అపకీర్తి పాలవుతాడు. అలాంటివారు దొంగలు, హంతకులు, విశ్వాస ఘాతుకులుగా మారతారు. అనామిక చిటికిన వేలు పైకి వాలిన ఆ వ్యక్తి కళలతో, కళాకారులతో వ్యాపారం చేస్తాడు. కళారాధన పేరున ధనార్జన చేయ సమర్థుడు. సినిమా నిర్మాతలు, ఆడియో వ్యాపారులు, టెలివిజన్ వారు ఈ కోవలోకి వస్తారు.

కనిష్టాంగులి అనామికాంగులి వైపు వంగిన – ఆ వ్యక్తి అటు కళారంగం లోను, ఇటు వ్యాపార రంగంలోనూ రాణిస్తాడు. అతని వృత్తి ప్రవృత్తి ఉద్యోగం, వ్యాపారం, వ్యసనం అన్నీ కళల చుట్టు, కళాకారుల చుట్టు తిరుగుతుంటాయి. సినిమా నిర్మాణం, పంపిణీ, ప్రదర్శనలు, ఆర్టుగ్యాలరీలు, టి.వి., వీడియో, ఆడియో వ్యాపారం చేస్తాడు.

నాలుగు వేళ్లు నిటారుగా ఉంటే ఉత్తమం. వారు సహజంగా విద్యావంతులు. ప్రతిభావంతులు అయి, స్వయంకృషితో, పట్టుదలతో పైకి వస్తారు. ధన, సంపద లార్జిస్తారు. సుఖపడి ఆనందంగా జీవిస్తారు.

తర్జని నిటారుగా ఉండి, అరచేయి వైపుకు, అంటే లోపలకు వాలినట్లున్న వ్యక్తి చాలా గొప్పవాడు. మహర్జాతకుడవుతాడు. మహాత్ముడు కాగలడు. ప్రధాన రాజకీయ పదవులు పొందగలడు.

## వేళ్ల మధ్య దూరాలు

వేళ్లను విస్తరింపచేసినపుడు వేలికి, వేలికీ మధ్య ఏర్పడే దూరాన్ని బట్టి కొన్ని ఫలితాలు చెప్పవచ్చు. బొటనవేలికి, తర్జనికి మధ్య జాగా ఎక్కువగా ఉంటే ఉదార హృదయుడు, సరళస్వభావి, విశాలదృక్పథం కలవాడై ఉంటాడు. స్వతంత్రంగా ఆలోచిస్తాడు, పరోపకార, దయాధర్మ గుణాలు ఉంటాయి. నీతిపరుడై, గౌరవ మర్యాదలతో జీవిస్తాడు. అతను జీవితాంతం నీతి నియమాలు తప్పడు. ఉత్తముడు అనిపించుకుంటాడు.

తర్జని, మధ్య మాంగులి మధ్య ఎడం ఎక్కువగా ఉన్న వ్యక్తి దీర్ఘాలోచనా పరుడవుతాడు. తన ఇష్టానుసారం నిర్ణయానుసారం పనులు చేస్తాడు. ఎవరినీ ఆశ్రయించడు.

మధ్యవేలికి, అనామికకు మధ్య అంతరం ఎక్కువగా ఉన్న వ్యక్తి పవిత్రంగా జీవిస్తూ స్థిరచిత్తంతో, సత్కర్మలాచరిస్తాడు. ఎంత ధైర్యం వున్నా అధర్మ కార్యాలు చేయడు.

అనామిక, కనిష్టాంగుళుల మధ్య అంతరం ఎక్కువగా ఉన్న వ్యక్తి కార్య నిర్వహణలో స్వతంత్రంగా ఉంటాడు. స్వబుద్ధితో పనులు చక్కబెడుతుంటాడు. ఎవరి సలహాలు, విమర్శలు లెక్కచేయడు. అలాంటి వారు రాజకీయ నాయకులు, సివిల్ అధికారులు, న్యాయమూర్తులు అవుతారు.

## కణుపులు - పర్వాలు

వేళ్లలోని మూడు పర్వాలు కొన్ని ప్రత్యేక గుణాలకు, లక్షణాలకు ప్రాతినిధ్యం వహిస్తుంటాయి. అందుకు సూచికలవుతాయి. ప్రథమ పర్వాలు ఆధ్యాత్మికత, ధర్మ, దయాగుణం, జ్ఞానం, విద్య, కళాకౌశలం. రెండవ పర్వాలు భావనాశక్తి, ఆలోచన, దూరదృష్టి, నిర్ణయం, తర్కం. మూడవ పర్వాలు భౌతిక, లౌకిక విషయాలు, వైజ్ఞానిక ప్రతిభ, సుఖ సంతోషాలు, కార్యనిర్వహణ సామర్థ్యం, క్షమ, దయాది గుణాలు.

మొదటి కణపులు బలంగా, అందంగా ఉన్నవారు ఆదర్శవంతులు, ఆధ్యాత్మిక తత్పరులు, జ్ఞానులు అవుతారు. వీరికి ధర్మ, కర్మ జిజ్ఞాస అధికం. యోగం, ధ్యానం, తపస్సు అంటే ఇష్టం. ధర్మకార్యాలపట్ల అనురక్తి, దైవచింతన మెండు. ఏదైనా ఒక ప్రత్యేక కార్యంలో రాణిస్తారు. మొదటి కణుపులు సన్నగా ఉంటే, వారికి కళల పట్ల విపరీతమైన ఆసక్తి ఉంటుంది. వారికి ఇష్టమైన కళలలో ప్రతిభావంతులవుతారు.

ద్వితీయ పర్వాలు పొడవుగా, బలంగా ఉన్న వ్యక్తి మేధావంతుడు, బుద్ధిమంతుడు అవుతాడు. చక్కగా ఆలోచిస్తాడు. అనుభవ జ్ఞానం ఉంటుంది. ఈ పర్వాలపై నిలువు రేఖలున్న వ్యక్తి సూక్ష్మ పరిశీలన, దూరదృష్టి కలిగి ఉంటాడు. సమయస్ఫూర్తి అధికం. ఒక పని ప్రారంభించడానికి ముందే చక్కగా ప్లాన్ చేస్తాడు. విశ్వాసపాత్రుడుగా ఉంటాడు. అందరి అభిమానం పొందుతాడు.

తృతీయ పర్వాలు భౌతిక సుఖ, భోగాలకు సంబంధించినవి. ఇవి బలంగా ఉన్నవారు చతుర సంభాషణాపరులు, వ్యవహార విదులు, నీతిమంతులు అవుతారు. ఓర్పు, సహనం ఉండి ఇతరులను తమవైపు ఆకర్షిస్తారు. తమ పనుల్ని ఇతరులచే చేయించుకుంటారు. కపటం ఉండదు. అలంకారం, సుఖభోజనం, సుఖభోగాలు ఇష్టం. విచ్చలవిడి జీవితం గడిపి తృప్తి పడతారు.

ప్రథమ పర్వాలు మొరటుగా ఉన్న వ్యక్తి బాగానే ఆలోచిస్తాడు గానీ, అతని ఆలోచనలు ఫలించవు.

తృతీయ పర్వాలు మొరటుగా ఉన్న వ్యక్తి సుఖ, సంపదల కోసం, విలాస జీవితం కోసం పరుగులు తీస్తాడు. కన్యలకై వెదుకుతాడు. అతనిది నీచబుద్ధి. మొరటుగా ప్రవర్తిస్తాడు, కామాంధుడై, మానభంగాలు చేసి కారాగారవాసం చేస్తాడు. అలాకాక, తృతీయ పర్వాలు చిన్నగా ఉండి, మూలస్థానం సన్నగా

ఉంటే అతను విలాసపురుషుడుగా కనిపించినా, నీతిమాలి చరించడు. శృంగార ప్రియుడవుతాడు తప్ప విలాసపురుషుడు కాలేడు.

## గోళ్లు

గోళ్లను బట్టి ఆరోగ్య విషయాలు తెలుస్తాయి. అద్దంలో అందం చూచుకున్నట్లు గోళ్లలోంచి రక్త పరీక్ష చేయవచ్చు. గోళ్లను నాలుగు రకాలుగా విభజించుకోవాలి. పొడవు, పొట్టి, వెడల్పు, సన్నం.

గోళ్లు పొడవుగా ఉన్న వ్యక్తి మంచి ఆరోగ్యవంతుడుగా ఉంటాడు. సాధారణంగా జబ్బుపడడు. అయితే గుండె బలహీనంగా ఉంటుంది.

గోళ్ల చివరలు వంగిన క్షయవ్యాధి సూచితం. గోళ్లు పొడవుగా ఉండి, వాటి మధ్య చారలవంటి గీతలు ఏర్పడిన వ్యక్తి సదా అనారోగ్యంతో బాధపడు తుంటాడు. అతనికి గుండె, శ్వాసకోశ వ్యాధులు వస్తాయి. అతని కుటుంబంలోనూ న్యూమోనియా బాధితులుంటారు.

గోళ్లు చిన్నవిగా, వెడల్పుగా ఉన్న వ్యక్తికి గొంతు సంబంధమైన జబ్బులుంటాయి. గొళ్లు పొడవుగా, చివరలు వెడల్పుగా మొదలు నీలం రంగుగా ఉంటే రక్తదోషం ఉంటుంది. గుండె బలహీనత ఉంటుంది.

గోళ్లు పొడవుగా ఉండి, ఆరంభంలో అర్ధచంద్రాకారపు గుర్తులున్న వారికి హృదయ దౌర్బల్యం తప్పదు. గుండె ఆగి అకాల మృత్యువాత పడతారు. ఈ చంద్రాకారం పెద్దగా ఉంటే హైబీ.పి ఉంటుంది. చిన్న విషయాలకు సైతం రక్త ప్రసారం పెరుగుతుంది. మూర్ఛ, పక్షవాతం, గాలిచేష్టలు వీటివల్ల వస్తాయి.

మస్తిష్కరేఖ కుజక్షేత్రంలోకి పోయినా మానసికంగా దుర్బలత్వం కలుగుతుంది. మస్తిష్కరేఖపై ద్వీపచిహ్నం ఉంటే పై దుర్ఘటనలు తప్పవు. గోళ్లు పొడవుగా ఉంటే ప్రాణహాని సూచితం. గోళ్లు పొడవుగా, సన్నగా ఉంటే వెన్నుకు సంబంధించిన రోగాలు వస్తాయి. గోళ్లు పొడవుగా, పలచగా ఉంటే గుండెకు, గొంతుకు సంబంధించిన జబ్బు చేస్తుంది. గోళ్లు పొట్టిగా, పలచగా, క్రింది భాగం వెడల్పుగా ఉన్న వ్యక్తి పరమనికృష్టు డవుతాడు. నపుంసకు డవుతాడు. పొట్టి గోళ్లు శరీరం క్రింది భాగానికి సంబంధించినవి. గోళ్లు వెడల్పుగా ఉంటే ఉదరకోశ వ్యాధులు వస్తాయి. చివరలు వంగి ఉంటే ఆ జబ్బులు ప్రాణాంతకమవుతాయి.

రక్తదోషాలు, గోళ్ల రంగు మార్పును బట్టి, మచ్చలు, గీతలు, రేఖలు, పగుళ్లను బట్టి చెప్పవచ్చు. ఆ రేఖలు గోరు ఆరంభం నుండి కొనవరకు ఉంటే

తొమ్మిది నెలలుగా ఆ వ్యాధి ఉందని అర్థం. గోరు మధ్యలో అయితే అయిదు నెలలు, ఆరంభంలో అయితే అప్పుడే ప్రారంభం అయినట్లు.

గోళ్లు పొడవుగా ఉన్న వ్యక్తి శాంతస్వభావి, కోమలమైన మనస్సు కలవాడు అని చెప్పాలి. అలాంటి వారు భావనా జగత్తులో విహరిస్తుంటారు. గోళ్లు పొడవుగా, తెల్లగా వుంటే బుద్ధిమంతులు, ఆలోనాపరులు, స్థిరబుద్ధి కలవారు, స్థితిమంతులు అవుతారు. పొడవుగా ఉండి, వంగి ఉన్నా, పసుపు రంగులో వున్నా ఆ వ్యక్తి స్వభావం కఠోరంగా ఉంటుంది. గోళ్లు పొట్టిగా, ఎర్రగా ఉంటే కోపతాపాలు, తామస ప్రవృత్తి అధికం. వారు ఎప్పుడు చిర్రు బుర్రు లాడుతుంటారు. గోళ్లు పొట్టిగా, వెడల్పుగా ఉండి, క్రింది భాగం అణగిపోయినట్లు వున్న వ్యక్తి కలహ ప్రియుడవుతాడు. దీనికి తోడు కుజక్షేత్రం ఎత్తుగా ఉంటే ఈ దుర్లక్షణాలు అధికమవుతాయి.

గోళ్లు పొట్టిగా, వెడల్పుగా ఉండి బొటనవేలు చిన్నదిగా ఉన్న వ్యక్తి ఇంటి దొంగ అవుతాడు. ఒక్కచోట ఉండడు. అడ్రసులు మారుస్తుంటాడు. ఆడవారిచేతిలో ఈ లక్షణాలున్న వారి స్వభావం కర్కశంగా ఉంటుంది. దానికి తోడు హృదయరేఖ చిన్నదిగా, మస్తిష్కరేఖ తిన్నగా, సరళంగా ఉంటే, ఆమె పురుష స్వభావం పొంది, అన్ని రంగాలలో పురుషులతో ధీటుగా నిలబడుతుంది. తాను ఆడదాన్ననే విషయమే మరచిపోతుంది.

గోళ్లు పొట్టిగా ఉండి, వెడల్పుగా కాక మామూలుగా ఉంటే వారు మేధావులు, నిశితబుద్ధి కలవారు అవుతారు. వ్యాఖ్యాత లవుతారు. వీరు వక్తలు, పత్రికా సంపాదకులు, రచయితలు కాగలరు. చేయి కోమలంగా ఉండడం అవసరం. కోమలత్వం ఉన్నత స్థితికి సూచన, హాస్య ప్రియత్వానికి గుర్తు. గోళ్లు పొట్టిగా, గుండ్రంగా, తెల్లగా ఉన్న వ్యక్తులలో కోపతాపాలు ఎక్కువగా ఉంటాయి.

కనిష్ఠాంగుళి (చిటికినవేలు) గోరు చిన్నదిగా ఉన్నవారు ఇతరుల మనస్సులోని మాటను, భావాన్ని, స్వభావాన్ని సులభంగా గ్రహిస్తారు. గోళ్లు పొట్టిగా, కాంతిరహితంగా ఉంటే మోసగాళ్లు, దొంగలు అవుతారు. గోళ్లు పొడవుగా, వెడల్పుగా ఉన్నవారు చర్చలలో, వాద ప్రతివాదాలలో పాల్గొంటారు. నైపుణ్యంగా వాదించి, విజయం పొందుతారు.

గోళ్లు పలచగా, సన్నగా ఉన్న వ్యక్తి ఎప్పుడూ ఏదో విచారంతో ఉంటాడు. కఫరోగాలుంటాయి. గోళ్లు బల్ల పరుపుగా ఉంటే నిత్యదరిద్రం. గోళ్లు పొట్టురేగు

తుంటే వారు సంసారానికి పనికిరారు, నపుంసకులవుతారు. గోళ్లు రంగులేకపోతే కుత్సిత బుద్ధి ఏర్పడుతుంది. ఎర్రగా, రాగి వర్ణంలో ఉంటే ధనవంతుడు, ఐశ్వర్యవంతుడు అయి సుఖపడతాడు, గౌరవ సన్మానాలు పొందగలడు. పసుపు పచ్చగా ఉంటే విశ్వాస ఘాతకుడవుతాడు. గోళ్లు చిన్నవిగా ఎర్రగా ఉంటే ఉగ్రస్వభావం, తామసం సూచితం. గోళ్లు చిన్నవిగా, చతురస్రంగా ఉంటే హృదయ, శ్వాసకోశ వ్యాధులు కలుగుతాయి.

బొటన వేలి గోరుమీద తెల్లని మచ్చ ఉన్న వ్యక్తి ఆచారపరుడు, నీతివంతుడు అవుతాడు. అది నల్లగా ఉంటే అవినీతి పరుడై, చెడ్డపనులు చేస్తుంటాడు.

చిటికిన వేలి గోరు పైన తెల్లని మచ్చ ఏర్పడడం శుభసూచన. అది ఆకస్మిక ధనలాభం సూచిస్తుంది. అది నల్లగా ఉంటే ధననష్టం, ఆరోగ్యానికి హాని కలుగుతుంది.

అనామిక గోరు పై తెల్లని మచ్చగల వ్యక్తికి తన కృషిపైన విశ్వాసం ఉంటుంది. ఉద్యోగ వ్యాపారాలలో విజయం పొందుతాడు. ఆ మచ్చ నల్లగా వుంటే అపజయం, అవమానం, ఉద్యోగ వ్యాపార నష్టాలు సూచితాలు.

మధ్యవేలి గోరుపై తెల్లని బిందువు విదేశప్రయాణ సూచిక. అది పచ్చగా ఉంటే మానసిక అశాంతి, చీకాకులు. నల్లగా వుంటే ఆకస్మిక నష్టాలు, కష్టాలు తప్పవు.

తర్జని గోరుపై తెల్లని బిందువు ధనలాభం. ఐశ్వర్యం, కీర్తి, సన్మానం సూచిస్తుంది. అది నల్లగా వుంటే అపకీర్తి, అవమానం, దరిద్రం, నీచకార్యం సూచితం.

ఆడవారి గోళ్లపై తెల్లని మచ్చలు వారి స్వతంత్ర ప్రవర్తనను సూచిస్తాయి. అలాంటివారు నిరంకుశంగా ప్రవర్తిస్తారు.

# 6. క్షేత్ర వివరణ : రేఖలు

**అ**రచేతిలో బొటనవ్రేలి క్రింది భాగాన్ని శుక్రక్షేత్రం అంటారు. జీవితరేఖ దీనిని వలయంగా చుట్టి ఉంటుంది. తర్జని మూల స్థానం గురుక్షేత్రం. మధ్య వ్రేలి మూలస్థానం శని క్షేత్రం. అనామిక మూల స్థానం రవిక్షేత్రం. కనిష్టాంగుళి మూలస్థానం బుధ క్షేత్రం. గురుశుక్ర క్షేత్రాల మధ్య జీవితరేఖకు ఆరంభంలో దిగువన కుజక్షేత్రం. బుధక్షేత్రం క్రిందుగా, హృదయరేఖ దాటిన తర్వాతది కుజక్షేత్రం. దాని క్రిందది చంద్ర క్షేత్రం. అరచేయి మధ్య భాగం రాహుక్షేత్రం. మణికట్టు కంకణరేఖల ప్రాంతం కేతు క్షేత్రం. ఇవి జాతకంలోని నవగ్రహాలకు అరచేతిలో నిర్దేశించిన తొమ్మిది స్థానాలు. తొమ్మిది గ్రహక్షేత్రాల గురించి, వాటి స్వభావాల గురించి సూక్ష్మంగా పరిశీలిద్దాం. ఆయా క్షేత్రాల గురించి విపులంగా తర్వాత చెప్పుకుందాం. ఇక్కడ వాటి స్వభావాలను సూక్ష్మంగా చూద్దాం.



## 1. గురుక్షేత్రం

గ్రహాలకు నాయకుడు గురువు. తర్జని మూలస్థానం గురుక్షేత్రం. విద్య, వినయం, బుద్ధి, ప్రజ్ఞ, ప్రాభవం, ప్రతిష్ట, శాంతి, అహింస, దైవాంశలు గురువు అధీనంలోవి. మనిషి కోరికలు, ఇష్టాలు, భావనాబలం, ఔన్నత్యం దీనిని బట్టి తెలుస్తాయి. ప్రేమించగలది, ప్రేమను పంచగలదీ, శిక్షించగలదీ గురువే. విద్యా వివేకాలు గురుక్షేత్రాన్ని బట్టి తెలుస్తాయి.

## 2. శనిక్షేత్రం

ఇది మధ్య వ్రేలి మూలస్థానం. గురువు కలిగించే సుగుణాలకు ధైర్యసాహసాలను జతపరిచేది శని. శని అనగానే భయపడవలసిన పనిలేదు. ధనం, ఐశ్వర్యం, భోగభాగ్యాలు శనిక్షేత్రం ఇస్తుంది. యోగం, జ్ఞానం, దివ్యజ్ఞానం, మోక్షం లాంటివి శని అధీనంలో ఉంటాయి.

## 3. రవిక్షేత్రం

గురు, శనిక్షేత్రాలు అందించే అదృష్టాన్ని సద్వినియోగ పరిచేది రవి క్షేత్రం. రవి క్షేత్రం బలంగా లేని పక్షంలో మనిషి తెలివితేటలు, చదువులు, ధన సంపదలు ఉండీ అనుభవించలేడు. రాణింపుకు రాడు. రవిబలం ఉన్నవారు కీర్తి ప్రతిష్టలు గడిస్తారు. వారి ఐశ్వర్యానికి విలువ వస్తుంది బంగారానికి తావి అబ్బినట్లు. ఉన్నత రవిక్షేత్రం గల వ్యక్తిని మహర్జాతకుడని చెప్పాలి.

## 4. బుధక్షేత్రం

కనిష్టాంగుళి మూలస్థానం బుధక్షేత్రం. బుధుడు మనస్సుకు, బుద్ధికి అధిపతి. బుధునికి, బుధక్షేత్రానికి విశేష ప్రాధాన్యం ఉంది. వ్యాపార, వ్యవహార దక్షత, విజ్ఞానం, మనస్సు, చిత్తం నిర్ణయించవలసింది బుధబలంతోనే. బుద్ధి స్థిరంగా, మనస్సు ప్రశాంతంగా, నిశ్చలంగా లేని వ్యక్తి ఏ రంగంలోనూ రాణించలేడు. ఎన్ని భోగభాగ్యాలున్నా బుద్ధిలేని వానికి సుఖం ఉండదు.

## 5. కుజక్షేత్రం

బుధక్షేత్రానికి దిగువన చంద్రక్షేత్రానికి పైగా, హృదయరేఖను ఆనుకొని, క్రిందగా ఉన్నది మొదటి కుజక్షేత్రం. గురు, శుక్ర క్షేత్రాల నడుమ జీవిత రేఖకు దిగువన ఉండేది రెండవ కుజక్షేత్రం. స్థితి, సంకల్పం, ధైర్య సాహసాలు తెలుస్తాయి. రెండు కుజక్షేత్రాలు బలంగా ఉన్నవారు సాహసకార్యాలు చేస్తారు.

## 6. చంద్రక్షేత్రం

అరచేయి క్రిందిభాగం కుడివైపు సగం శుక్రక్షేత్రం, రెండవ సగం చంద్రక్షేత్రం. మనస్సుకు, బుద్ధికి అధిపతి చంద్రుడు. చంద్రక్షేత్రం బాగున్న వ్యక్తి విద్యావంతుడు, మేధావి, సత్యవ్రతుడు అవుతాడు. కాల్పనిక శక్తులన్నీ చంద్రునివే. మనోవైకల్యం, పిరికితనం, పిచ్చి, ఉన్మాదం, చాంచల్యం చంద్రుని బలహీనతలు.

## 7. శుక్రక్షేత్రం

బొటన వేలు మూలస్థానం శుక్రక్షేత్రం. పరాక్రమం, సుఖభోగాలు, సంసారం, తోబుట్టువులు, తల్లిదండ్రులు, పిల్లలు మొదలైన విషయాలు శుక్రుని బట్టి తెలుస్తాయి. గురువు తర్వాత జాతకునికి శుక్రుడే ఆనందం కలిగించేది. ప్రాపంచిక భోగాలన్నీ శుక్రునివే.

## 8. రాహుక్షేత్రం

ఒకటి రెండు కుజక్షేత్రాల మధ్యనున్న దీనిని ప్రాచ్య, పాశ్చాత్య సాముద్రికులు కుజమండలం అంటారు. ప్రాచీన భారతీయ శాస్త్రాలలో దీనికి రాహుక్షేత్రం అని పేరు పెట్టారు. మనిషి మొత్తం స్థితి గతుల్ని పరిశీలించినా ఈ ఒక్క రాహు క్షేత్రం చూచి టోటల్ మార్కులు వేయవచ్చు. ఈ రాహుక్షేత్రం గుంటగా, లోతుగా ఉన్న వ్యక్తి ఎంత చదువుకున్న వాడైనా పైకి రాడు. జన్మతః సంపన్నుడు, ధనవంతుడు అయినా చివరకు దరిద్రుడు, సన్యాసి అవుతాడు. సన్యాసులకు, బైరాగులకు రాహుక్షేత్రం గుంటగా ఉంటుంది. రాహుక్షేత్రం బలంగా ఉన్న సన్యాసి రాజభోగాలు అనుభవిస్తాడు.

## 9. కేతుక్షేత్రం

మణికట్టు ప్రాంతం కేతుక్షేత్రం. దీనిపై గల కంకణ రేఖలు భారతీయ సాముద్రికంలో ప్రత్యేక స్థానం పొందాయి. మణికట్టు గట్టిగా, దృఢంగా లేని వారు నరకం అనుభవిస్తారు. కంకణ రేఖలున్నవారు జీవితంలో అన్నీ అనుభ విస్తారు.

# గ్రహక్షేత్ర బలాబలాలు

జ్యోతిషంలో శుభగ్రహాలు, పాపగ్రహాలు ఉన్నాయి. శుభగ్రహాలు అప్పుడప్పుడు పాపగ్రహాల ఫలితాలు, పాపగ్రహాలు శుభగ్రహ ఫలాలు యిస్తాయి. వాటి స్థానాలను

బట్టి, ఇతర గ్రహాల దృష్టిని బట్టి. సాముద్రికంలోనూ అంతే. స్వభావరీత్యా కొన్ని, స్థానరీత్యా కొన్ని ఫలితాలు తారుమారవుతుంటాయి. సాముద్రిక వేత్తలు జాగ్రత్త పడవలసింది ఇక్కడే. ఈ పరిశీలన, అంచనా సరిగా లేకపోతే చెప్పే ఫలితాలు తప్పిపోతుంటాయి. ముందుగా ఆయా గ్రహాల క్షేత్ర బలాలు తెలుసుకోవాలి. వాటి ఉనికిని బట్టి, వాలును బట్టి, స్వరూపాన్ని బట్టి ఫలితాలు మారతాయి.

సామాన్యంగా గురు, శుక్ర, చంద్ర, బుధ క్షేత్రాలు మంచి శుభ ఫలితాలనిస్తాయి రవి, కుజ, శని, రాహు, కేతువులు పాప గ్రహాలు కనుక, అవి యిచ్చే ఫలితాలలో కొంతవరకు చెడు కలిసే అవకాశం ఉంటుంది. శుభగ్రహ క్షేత్రాలు నాలుగులో ఏ ఒక్కటైనా బలంగా లేకపోతే మిగిలినవి ఏవీ మంచి ఫలితాలు కలిగించవు. కేవలం పాపగ్రహ క్షేత్రాలు ఎంత బలంగా ఉన్నా ఫలితం ఉండదు. చాలామంది ఈ ఒక్క సూత్రం మరచిపోతుంటారు. 'అంగడిలో అన్నీ వుండి అల్లుడినోట శని' అన్నట్లు అవుతుంది.

గ్రహక్షేత్రానికి బలం ఆ క్షేత్రం మందంగా, ఎత్తుగా ఉంటే ఉన్నట్లు కాదు. ఆ క్షేత్రంలో ఒక్కటైనా శుభచిహ్నం ఉండాలి. అశుభచిహ్నాలుంటే వ్యతిరేఖ ఫలితాలు తప్పదు. శుభచిహ్నాలు క్షేత్రబలాన్ని పెంచుతాయి. ఇది మరొక ప్రధాన సూత్రం. ఒక క్షేత్రం బలహీనంగా కనిపించినా, దానిపైన ఏ ఒక్క శుభ చిహ్నం ఉన్నా, ఆ క్షేత్రానికి బలం ఉన్నట్లే. ప్రతిగ్రహ క్షేత్రాన్ని ఉన్నతం, అత్యున్నతం, సమం, నీచం, అతినీచం, విషమం, భ్రష్టం అని ఏడు రకాలుగా విభజించి చూచుకోవాలి. ఫలితాలు డిగ్రీలను బట్టి గ్రేడులు నిర్ణయించుకోవాలి.

## 1. ఉన్నతం

క్షేత్రం నాలుగు వైపుల ఒకే లెవెల్‌గా ఉండి, మధ్యభాగం ఎత్తుగా (చిన్న దిండు అనిపించాలి) ఉండి, ఎపెక్స్ (అంటే చిన్నచిన్న గీతలు వలలాగా అల్లుకుని ఒక కేంద్ర బిందువు చుట్టూ విస్తరిస్తాయి. ఆ బిందువు ఎపెక్స్) క్షేత్రానికి మధ్యలో ఉన్నప్పుడు అది ఉన్నత క్షేత్రం అవుతుంది. పూర్ణ ఫలితాల నిస్తుంది. అలాంటి ఉన్నత క్షేత్రం అన్ని మంచి ఫలితాలను పుష్కలంగా యిస్తుంది. పాప గ్రహక్షేత్రాలైనా చెడు చేయవు. ఉన్నత గ్రహక్షేత్రం ఏదైనా శుభప్రదమే అవుతుంది.

## 2. అత్యున్నతం

అరచేయి స్థాయిని మించి ఒక గ్రహక్షేత్రం ఉబ్బుగా, ఎత్తుగా ఉంటే అది అత్యున్నతం. అది అనారోగ్య సూచకం. కుజక్షేత్రం అత్యున్నతంగా ఉంటే

తలపోటు, శిరోభారం, తలకు సంబంధించిన జబ్బులు వస్తాయి. బుధక్షేత్రం అత్యున్నతం అయితే ఉదరవ్యాధులు వస్తాయి. చంద్రస్థానం అత్యున్నతం అయితే పాండురోగం, సుఖరోగాలు; రవిక్షేత్రం అత్యున్నతం అయితే తరచు జ్వరాలు, బుద్ధిమాంద్యం. గురువు కారణంగా గుల్మరోగాలు, సుఖసంకటాలు; శని అత్యున్నతం అయితే గాలి, పిశాచం, దెయ్యాలు, హృదయ దౌర్బల్యం; రాహువు అత్యున్నతం అయితే మశూచి, పాముకాటు, సర్పదోషాలు, దృష్టిదోషం, కుష్టువ్యాధి, గర్భాశయరోగాలు ప్రాప్తిస్తాయి. కేతువు అత్యున్నతం అయితే గుండె జబ్బులు, క్రిమిదోషాలు, నీచ స్త్రీ సాంగత్యం, శారీరక, మానసిక వికారాలు ఏర్పడతాయి.

## 3. నీచం

అరచేయి నైసర్గిక స్థితిని బట్టి చూస్తే ఉండవలసిన స్థాయి కన్న తక్కువగా ఉన్న క్షేత్రం నీచగ్రహక్షేత్రం. ఆ గ్రహం ఇవ్వవలసిన ఫలితాలు ఇవ్వదు. అలాంటి నీచగ్రహక్షేత్రాలు ఎక్కువగా ఉన్నవారు జీవితంలో సుఖపడరు. ఏ పని సవ్యంగా, సమర్థవంతంగా చేయలేరు. కార్య శూన్యులు. వారి ఆలోచనలు బలహీనంగా ఉంటాయి. ఏ చిన్న పనికీ పట్టుదల ఉండదు.

## 4. అతినీచం

మరీ లోతుకు పోయినట్లున్న గ్రహక్షేత్రం అతినీచం. అతి మంచి ఫలితాలు ఇవ్వకపోగా చెడ్డ ఫలితాల నిస్తుంది. చెడును, దురదృష్టాన్ని పోత్సహిస్తుంది. అలాంటి వారిని దరిద్రం, దురదృష్టం వెన్నంటి ఉంటాయి. అన్నిరకాల దుర్మార్గ లక్షణాలు వారినే వరిస్తాయి. పరులకు హాని చేయడంలోనే వారికి ఆనందం ఉంటుంది.

## 5. సమోన్నతం

మరీ ఎత్తు, మరీ పల్లంగా కాక, సమంగా ఉండేది సమోన్నత గ్రహక్షేత్రం. ఇలాంటి వారు గొప్ప పదవులు పొందరు. పెద్దగా కీర్తి ప్రతిష్టలు గడించరు. ఉన్నంతలో తృప్తిగా హాయిగా బ్రతుకుతారు. తాము మాత్రమే సుఖంగా బ్రతుకుతున్నా మనుకుంటారు. వీరికి పెద్ద ఆశయాలు, కోరికలు ఉండవు. ఉన్నంతలో తృప్తిగా బ్రతకగలరు.

## 6. విషమం

గ్రహక్షేత్రం ఒకవైపు ఎత్తుగా బలంగా, రెండవ వైపు పల్లంగా బలహీనంగా ఉంటే అది విషమ గ్రహక్షేత్రం. అలాంటి వారికి స్వయంప్రకాశం ఉండదు.

వాటి ప్రభావం జాతకునిపై ఉండదు. అవి ఏ క్షేత్రం వైపు బలంగా కనిపిస్తే ఆయా క్షేత్రాల ఫలితాలను పుష్కలంగా యివ్వడానికి సహాయం చేస్తాయి.

## 7. భ్రష్టం

ఎపెక్స్ అనగా కేంద్రబిందువు మధ్యగా కాకుండా ప్రక్కలకు వాలి ఉంటే అవి భ్రష్టమండలాలు. ఆ బిందువు ఏ క్షేత్రం వైపు చూస్తే ఆ గ్రహక్షేత్రానికి బలం పెరుగుతుంది. అవి సహజంగా బలహీనమైనా వీటి దృష్టి వల్ల అవి గొప్ప ఫలితాలను యిస్తాయి.

ఏ వ్రేలు పొడవుగా, బలంగా, నిటారుగా ఉంటే ఆ వ్రేలికి సంబంధించిన గ్రహక్షేత్రం బలమైనదని సూత్రం. గ్రహక్షేత్రం బలంగా కనిపించకపోయినా, దానిపైన ఒక స్పష్టమైన నిలువురేఖ ఉంటే ఆ గ్రహక్షేత్రం ఉన్నతమే. దానికి చెందిన మంచి ఫలితాలను జాతకునికి యిస్తుంది. అలా నిలువుగీతలు రెండు ఉంటే ఫలితాలు చాలా ఎక్కువ కలుగుతాయి. జీవితం ఉజ్వలంగా, ఉదాత్తంగా, ప్రతిభావంతంగా సాగుతుంది.

ఒక గ్రహక్షేత్రం పైన అనేక రేఖలు గజిబిజిగా ఉండి వలలాగా ఏర్పడితే అవి అశుభ ఫలితాలనిస్తాయి. ఆ గ్రహక్షేత్రం నీచమయినట్లు, రావలసిన ఫలితాలు చేతికందవు.

ఒకే ఒక్క గ్రహక్షేత్రం బలంగా వుండి, మిగిలిన వాటిని డామినేట్ చేస్తే, ఆ వ్యక్తి ఆ ఒక్క గ్రహక్షేత్ర ఫలితాలనే అనుభవిస్తాడు. శుభ ఫలితాలను మాత్రమే చెప్పుకోవాలి.

ఏ వ్రేలు బలంగా, నిటారుగా, పొడవుగా ఉంటే, దానికి సంబంధించిన క్షేత్రం పైన ఒక చిన్న నిలువురేఖ ఉన్నా, అది సర్వోత్తమ గ్రహక్షేత్రం. తత్ గ్రహ ఫలాలన్నీ జాతకుని వరిస్తాయి. అలాకాక గ్రహక్షేత్రం అతి సున్నితంగా, మెత్తగా ఉంటే దాని ఫలితాలు పొందడంలో ఆలస్యం అవుతుంది. చేతికి అందినట్లే అనిపిస్తుంది గానీ ఫలితం కనిపించదు.

గ్రహక్షేత్రాలు ఎర్రగా కాక గులాబీరంగులో ఉంటే చక్కని ఫలితాలు కలుగుతాయి. తెల్లగా వున్న గ్రహక్షేత్రాలు సత్ఫలితాలనివ్వవు. నల్లగా లేక ముదురు ఎరుపుగా ఉన్న క్షేత్రాలు విపరీత ఫలితాల నిస్తుంటాయి. ఆ దుర్ఘటనలు జీవితరేఖ, హృదయ, మస్తిష్క రేఖలు, అదృష్టరేఖలను గుణించి, గమనించవలసి ఉంటుంది.

మంచి, చెడు సంఘటనలు జీవిత రేఖ నుండి బయలుదేరి పైకి వెళ్లే రేఖలను బట్టి, దుర్ఘటనలు దానిని ఖండించే చిన్నరేఖలను బట్టి, ఆ రేఖల పైన కనిపించే గుర్తులను బట్టి తెలుసుకోవాలి.

## బల నిరూపణ

గురు, శని, రవి, బుధ క్షేత్ర బలాలను పై నాలుగు వేళ్లను బట్టి నిర్ణయించుకోవచ్చు. వేళ్లు బలంగా వుంటే ఆయా క్షేత్రాలు బలంగా ఉన్నట్లు. అవి పూర్తి ఫలితాలను ఇస్తాయి.

మణిబంధ రేఖ నుండి మధ్యవేలు మూలస్థానం వరకు కొలిస్తే అది అరచేయి పొడవు. అది మధ్య వేలు పొడవుకు సమంగా ఉంటే, శనిక్షేత్రం బలమైనదని చెప్పవచ్చు. వేలు పొడవు అరచేయి నిడివి కన్న తక్కువ అయితే అతి నీచక్షేత్రం, బలం లేనిదవుతుంది. ఎక్కువైతే అత్యున్నతం, అప్పుడు ఫలితాలు విపరీతంగా ఉంటాయి.

మధ్య వ్రేలు అరచేయి  అంతపొడవుండి తర్జని మధ్యవ్రేలు మొదటి పర్వంలో సగం వరకు వుంటే అది ఉన్నత గురుక్షేత్రం అవుతుంది. మధ్యవ్రేలితో సమానమైన పొడవు ఉంటే అత్యున్నతం. తక్కువగా ఉంటే నీచం.

అనామిక, మధ్య వ్రేలి ఊర్ధ్వ పర్వం మధ్య వరకు ఉంటే, రవి మండలం ఉన్నతం, మరీ ఎక్కువగా ఉంటే అత్యున్నతం, మరీ తక్కువైతే నీచ క్షేత్రం అవుతుంది.

కనిష్టాంగుళి అనామిక రెండు పర్వాలంత పొడవు ఉండాలి. అంటే ఒకటి రెండు పర్వాల సంధి రేఖ వరకు ఉంటే ఉత్తమం. అప్పుడు బుధ మండలం ఉన్నతం అవుతుంది. అంతకు మించి ఉంటే అత్యున్నతం – తక్కువైతే నీచక్షేత్రానికి సమం.

## రేఖలు

చేతిలో  ముఖ్యమైన రేఖలు ఏడు. అందరి చేతుల్లో అన్నిరేఖలూ ఉండకపోవచ్చు. అవికాక మరి ఏడు చిన్నరేఖ లుంటాయి. మొత్తం పధ్నాలుగు రేఖలు.




1. జీవితరేఖ
లైఫ్ లైన్
2. మస్కిష్కరేఖ
హెడ్ లైన్
3. హృదయరేఖ
హార్టు లైన్
4. రవిరేఖ
సన్ లైన్
5. అదృష్టరేఖ
ఫేట్ లైన్
6. కుజరేఖ మార్సులైన్
7. ఆరోగ్యరేఖ హెల్త్ లైన్
8. జ్ఞానరేఖ లైన్ ఆఫ్ ఇంట్యూషన్
9. సువర్ణరేఖ రింగ్ ఆఫ్ సాలమన్
10. శనివలయం రింగ్ ఆఫ్ శాటర్న్
11. శుక్రవలయం రింగ్ ఆఫ్ వీనస్
12. కళత్రరేఖ మారేజ్‌లైన్
13. చంద్రరేఖ లూనాలైన్
14. కంకణరేఖ బ్రాస్‌లెట్

## జీవితరేఖ

గురుక్షేత్రం క్రింద ప్రారంభమై కుజ, శుక్ర క్షేత్రాలను చుట్టి కంకణ రేఖ వరకు పోతుంది. ఇది గురుక్షేత్రం నుండి కూడా బయలుదేరవచ్చు.

## మస్తిష్క రేఖ

జీవితరేఖతో కలిసి ప్రారంభమై అరచేయి రెండవ అంచువరకు ఏటవాలుగా పోయి చంద్రక్షేత్రం మీద ఆగిపోతుంది. ఇది గురు క్షేత్రం నుండి, లేక మొదటి కుజక్షేత్రం నుండి, లేదా జీవిత రేఖతో కలిసి ప్రారంభం కావచ్చు.

## హృదయరేఖ

గురుక్షేత్రం మధ్య నుండి లేక తర్జనీ మధ్యమాంగుళుల మధ్య నుండి లేదా శని క్షేత్రం నుండి ప్రారంభమై, శని, రవి, బుధ మండలాల దిగువగా పయనించి, అరచేతి ఎడమ అంచుకు చేరుతుంది.

## అదృష్టరేఖ

భాగ్యరేఖ లేక అదృష్టరేఖ మణిబంధన నుండి గానీ, జీవితరేఖపై నుండి గానీ, శుక్రక్షేత్రం నుండి గానీ, అరచేయి మధ్యభాగం నుండిగానీ, చంద్రక్షేత్రం నుండిగానీ బయలు దేరి శని మండలం చేరుతుంది. మధ్యవ్రేలి లోపలి వరకు చొచ్చుకుపోతుంది లేదా గురు, రవి, బుధక్షేత్రాలకు పోతుంది. ఈ ఏడు ప్రధానరేఖలు, ఏడు ప్రాణరేఖలు స్పష్టంగా, ప్రభావ వంతంగా ఉంటే చక్కని ఫలితాలు కలుగుతాయి. అవి బయలుదేరిన క్షేత్రాల బలం పెరుగుతుంది.

# 7. గురుక్షేత్రం

**నా** అధ్యయనంలో రేఖలకిచ్చిన ప్రాధాన్యం వంటిది క్షేత్రాలకు, ఇతర చిహ్నాలకు ఇవ్వడం జరిగింది. రేఖలు బలహీనమైనా శుభ చిహ్నాలుంటే క్షేత్రానికి బలం. అంటే ఫలితాలు ఏ మాత్రం తగ్గవు. కేవలం అదృష్ట రేఖ వుండి మిగతా శుభ లక్షణాలు, బలాలు లేకపోతే ఫలించదు. ఒక్కొక్క గ్రహమండలం, దానికి సంబంధించిన చిహ్నాలు, రేఖలు పరిశీలిస్తూ పోదాం.

గురుక్షేత్రం ఉన్నతంగా గల వ్యక్తి ఉత్తముడు, సద్గుణ సంపన్నుడు, అదృష్టశాలి అని లోగడ చెప్పుకున్నాం. అతని స్వభావం గంభీరంగా, సరళంగా, ఆత్మీయంగా ఉంటుంది. విద్యావేత్త, వివేకవంతుడు, ప్రాజ్ఞుడు, చతుర సంభాషణాపరుడు అవుతాడు. అతను అంత పొడగరి కాదు, పొట్టి కాదు, మధ్యమంగా ఉంటాడు. చక్కని ఆరోగ్యంతో పదుగురి దృష్టిని ఆకర్షిస్తాడు. అతనిని చూడగానే ఎవరికైనా గౌరవభావం కలుగుతుంది. అతని అలవాట్లు, ఆచారాలు ప్రశంసనీయంగా ఉంటాయి.

గురు ప్రభావం గల వ్యక్తి మృదువుగా, సరళంగా, స్పష్టంగా మాట్లాడతాడు. మనస్సులో కల్మషం, దాపరికం ఉండవు. ముఖం పద్మంవలె గుండ్రంగా ఉంటుంది. నవ్వుతూ ఉంటాడు. చక్కని పలువరస, విశాలవక్షం. వీరు ఉన్నత పదవుల్లోకి వెడతారు. ప్రజానాయకులు కాగలరు లేదా వారివారి రంగాలలో ఉన్నతస్థితికి చేరి ప్రశంసలు పొందుతారు. వారి ప్రతిభ గురించి, మంచి గురించి ప్రజలు చెప్పుకుంటారు. వీరి మాట శాసనంగా పనిచేస్తుంది.

తెలివితేటలే వీరికి ఆస్థి, పెట్టుబడి ఆలోచన. అవసరమైన వృత్తులలో రాణిస్తారు. కళాకారులు, సాహితీపరులు, న్యాయమూర్తులు అవుతారు. ప్రజా సంక్షేమమే తప్ప వీరికి స్వార్థ చింతన ఉండదు. బాగా ధనార్జన చేయగలరు.

స్వీయప్రతిభ, స్వయంకృషి, పట్టుదల వీరి అదృష్టానికి పెట్టుబడి. బాల్యం నుండి తమ ప్రత్యేకతను నిలుపుకుంటారు. పెద్దలను ఆకర్షిస్తారు. అవినీతి, దుష్టసాంగత్యం వీరి దరికి రావు.

గురు మండలం అత్యున్నతంగా వున్న వ్యక్తి ఎన్ని పదవులు పొందినా, ఎన్ని కోట్లు గడించినా కుటిలబుద్ధి కలవాడవుతాడు. నీచపు పనులు చేస్తాడు. స్త్రీలపై వ్యామోహం పెరుగుతుంది. నీతి బాహ్యమైన పనులు చేసి అపకీర్తి పాలవుతాడు. అతని భార్య మంచి అందగత్తె, గుణవతి అవుతుంది. అతనిలో ఎన్ని చెడ్డ లక్షణాలు ఉంటాయో ఆమెలో అన్ని మంచి గుణాలుంటాయి. కాని కామాసక్తి వల్ల పర పురుష సాంగత్యం చేసి కులట అనిపించుకుంటుంది. చివరకు సుఖరోగాలతో, మనో వేదనతో మరణిస్తుంది.

గురుక్షేత్రం నిమ్నమైన వానికి నిద్రలేమి, అజీర్ణం, వాత, శ్లేష్మ, చర్మ రోగాల బాధలుంటాయి. చివరకు క్షయ వ్యాధితో మరణిస్తాడు. అతనికి దేశాటనం అంటే ఇష్టం. నికృష్టంగా జీవిస్తాడు. అతని భార్య సౌందర్యవతి అయినా పరపురుష సాంగత్యం చేస్తుంది. గురుక్షేత్రం మరీ నీచంగా వున్న వ్యక్తి పరమనీచుడు.

ఈ క్షేత్రాలకు నాలుగు అంచులు సమంగా ఉండకపోవటం, కేంద్రబిందువు (అపెక్స్) మధ్యలో ఉండక అటు ఇటు వాలడం, అసలు లేకపోవడం జరుగుతుంది. అవి ఏ వైపుకు వాలితే, ఆ వైపున ఉన్న క్షేత్రానికి బలం పెరుగుతుంది. ఆ రెండు గ్రహాల మిశ్రమ ఫలాలు చెప్పుకోవలసి ఉంటుంది. గురుకేంద్రం అటు శని క్షేత్రం వైపునకు లేదా కుజుని వైపుకు లేక రాహు మండలం వైపుకు జరిగినట్లున్న ఆయా గ్రహ ఫలాలను గురువు స్వయంగా సమకూర్చడం జరుగుతుంది. అంటే ఒక గ్రహానికి రెండు మండలాల ఆధిపత్యం వస్తుంది. జ్యోతిషంలో అంటే రవి, చంద్రులకు ఒక్కోరాశి ఆధిపత్యం, మిగిలిన అయిదు గ్రహాలకు రెండేసి రాశులపై ఆధిపత్యం ఉంటుంది. వాటిని ఆయాగ్రహాల స్థానాలనే అంటారు. ఈ పరిశీలన కొంచెం శ్రమతో కూడినది అయినా, ఫలితాలు చక్కగా తెలుస్తాయి.

గురువు శనిని చూస్తే, అంటే గురుక్షేత్రం శనిక్షేత్రం వైపు ఉబ్బుగా వుంటే, ఆ వ్యక్తి కోమల స్వభావం కలవాడయినా శత్రుభయం ఎక్కువ. ఉదారబుద్ధి కలిగి పరులకు ఉపకారాలు చేస్తాడు. శనిదైన ధర్మగుణం, దైవ చింతన, నిష్ఠ, నియమపాలన ఉంటాయి. అతని ఇల్లాలు అందగత్తె, గుణవతి అయినా పరమలోభి. సదా రోగాలతో బాధపడుతుంది.

గురువు  ద్వితీయ కుజక్షేత్రం వైపు వాలి ఉన్న, ఆ వ్యక్తి తనలో రహస్యం దాచుకోలేడు. విషయాసక్తి ఉన్నా అవివేకంగా ప్రవర్తిస్తాడు. చర్మ రోగాలతో బాధపడుతుంటాడు. స్త్రీలలో ఈ లక్షణం మంచిది. ఆమె గుణవంతురాలు, దక్షతగల స్త్రీ అనిపించుకుంటుంది. కానీ ధనమదంవల్ల ఇతరులను నీచంగా చూస్తుంది.

గురువు రాహుమండలాన్ని చూస్తుంటే మంచిది. ఆ వ్యక్తి భాగ్యవంతు డవుతాడు.  పరోపకార గుణం ఉంటుంది. కార్యదక్షు డవుతాడు. చాలా ప్రశాంతంగా జీవిస్తాడు. సంతానం ఎక్కువ ఉంటుంది. అతని భార్య గుణం, అందం వున్నా అనవసరంగా డబ్బు ఖర్చు పెడుతుంది.

గురు, కుజ మండలాలు ఎత్తులో సమానంగా ఉండి సమబలం పొందిన వ్యక్తికి మత సహనం ఉండదు. మాతృవిరోధి అవుతాడు. తన పిల్లలు కారణంగా కష్టాలు అనుభవిస్తాడు. అతని మేధాశక్తి అమోఘంగా ఉంటుంది. కీర్తి ప్రతిష్టలు సంపాదిస్తాడు. కుజుని ప్రభావం వల్ల కష్టాలు, చిక్కులు ఏర్పడుతుంటాయి. గురుని ప్రభావం వల్ల ఓర్పుగా వాటిని దాటిపోగలుగుతాడు.

గురు, శుక్ర క్షేత్రాలు ఒకే ఎత్తు వుంటే, అతను శత్రువులతో జాగ్రత్తగా ఉంటూ సాహస కార్యాలు చేస్తుంటాడు. ప్రగల్భాలు పలకడం అలవాటు. పరమ లోభి, బహు కుటుంబీకుడు. మొండిగా వాదిస్తాడు. తగవులంటే ఆసక్తి. స్త్రీల విషయంలో అవివేకంగా ప్రవర్తిస్తాడు.

గురు, చంద్ర క్షేత్రాలు సమానబలంగా వుంటే ఆ వ్యక్తి మహామేధావి, సంపన్నుడు, మార్గదర్శి అవుతాడు. సమాజంలో గొప్ప స్థానం పొంది, ఉత్తము డనిపించుకుంటాడు.  మంచి వ్యవహార దక్షత కలిగి, సమర్థుడనిపించు కుంటాడు. అతనికి జీవితంలో ఏ లోటు ఉండదు.

## ఇతర చిహ్నాలు

అరచేతిలో రేఖలే కాక, చిన్నచిన్న గుర్తులు, చిహ్నాలు ఉంటాయి. వాటి ఆకారం అస్పష్టంగా వున్నా ప్రభావం ఎక్కువగా ఉంటుంది. గుణకం, క్రాస్, చదరం, చతుష్కోణం, నక్షత్రం, ద్వీపం, త్రిభుజం, త్రిశూలం, వృత్తం, పుట్టుమచ్చలు ఉంటాయి. అవి ఏ గ్రహక్షేత్రం పైన ఎంత స్ఫుటంగా ఉండేది గమనించాలి. ఆయా క్షేత్రఫలాలను అవి మెరుగు పరచడం లేదా హీన పరచడం జరుగుతుంది.

# గురుక్షేత్రం పైన .....

## గుణక చిహ్నం

చాలా శుభప్రదం. మంచి ఫలితాలను యిస్తుంది. గురువుపై గుణక చిహ్నం గల వ్యక్తి విశేష ఖ్యాతి గడిస్తాడు. ఐశ్వర్యం, సుఖభోగాలు అనుభవిస్తాడు. అందమైన స్త్రీలను, కోమల స్వభావం గలవారిని ఆకర్షిస్తాడు. అది వశీకరణగా, ఆకర్షణ యంత్రంలా పనిచేస్తుంది. అతనికి అవినీతి, వ్యభిచారం, వ్యసనాలు గిట్టవు. ఎన్నో కష్టాలు ఎదుర్కొని ఉన్నతస్థితికి చేరుకుంటాడు. ఉన్నత స్త్రీల సహాయం అతనికి ఎప్పుడూ లభిస్తుంటుంది. వారి ప్రేమ పవిత్రంగా ఉంటుంది. స్త్రీలను పవిత్రంగా ఆరాధిస్తాడు. అతని ప్రేమ కోసం జీవితాంతం తపించే వారుంటారు. వీరు చివరకు యోగులు, జిజ్ఞాసాపరులు అవుతారు. దార్శనికులుగా ప్రశస్తి పొందుతారు. ఈ గుణక చిహ్నం అస్పష్టంగా ఉన్న వ్యక్తి మానసిక వికారాలకు లోనవుతాడు. అసంభవ విషయాల గురించి ఆలోచించి, మనస్సు చెడగొట్టు కుంటాడు. బంగారం చేయడం, రసవిద్యలు, తంత్ర, మంత్రాలు వీరికి యిష్టం.

తర్జని, గురుక్షేత్రాల మధ్యరేఖను ఆనుకుని ఒక గుణక చిహ్నం ఉన్నట్లయితే అతను వైభవాలు అనుభవిస్తాడు. గొప్ప ధనవంతుడవుతాడు. కాని వివాహానంతరం పరస్త్రీ వ్యామోహంలో పడతాడు వీనికి సంతానం కలగదు. ఒక రిద్దరు కలిగినా అల్పాయుష్కులవుతారు.




గురు, కుజక్షేత్రాల మధ్య, అనగా జీవితరేఖకు దగ్గరగా ఒక గుణకచిహ్నం ఏర్పడితే, ఆ వ్యక్తి వేదాంతి, తత్వవేత్త అవుతాడు. ఎప్పుడూ పరావిద్యకై తపన పడు తుంటాడు. యజ్ఞ యాగాలు చేస్తాడు లేదా సన్యాసులలో

యోగు లతో కలసి పోతాడు. పన్నెండు సంవత్సరాల వయస్సులో అతనికి చదువు పట్ల శ్రద్ధ ఏర్పడుతుంది. అప్పుడే మనస్సులో జ్ఞానబీజం మొలకెత్తుతుంది.

గురుక్షేత్రంపై గుణక చిహ్నానికి తోడు, వివాహరేఖ చక్కగా ఉన్న వ్యక్తి సంపన్నులఇంటి పిల్లను వివాహం చేసుకుంటాడు.

## గురుక్షేత్రంపై చతుర్భుజ చిహ్నం

గురు మండలంలో చతుర్భుజం లేదా చతుష్కోణ చిహ్నం – ఆ వ్యక్తి క్రియాశీలతను తెలుపుతుంది. మంచి కార్యదక్షు డవుతాడు. అతనికి ఎంత సంపాదించినా తృప్తి ఉండదు. ఎన్ని పదవులు పొందినా తృప్తి ఉండదు. ఎన్ని సన్మానాలు జరిగినా ఇంకా కావాలనే ఆరాటం. అన్ని అర్హతలకు మించిన అత్యాశ ఉంటుంది. మహామేధావి, చతురుడు, బుద్ధి మంతుడు. ఈ చిహ్నం ఉండి గురుక్షేత్రం బలంగా లేకపోతే అనేక రోగాలు, విషాద సంఘటనలు కలుగుతాయి. కారాగారశిక్ష పడవచ్చు. అడుగడుగునా అవమానాలు ఎదుర్కోవలసి వస్తుంది.

గురుక్షేత్రం ఉన్నతంగా ఉండి దానిపైన చతుష్కోణ చిహ్నం ఉంటే ఆ వ్యక్తి యంత్ర, తంత్ర, మంత్ర విద్యలలో దిట్ట అవుతాడు. ఆధ్యాత్మిక శక్తులు సంపాదించి మహాయోగిగానో, మహర్షిగానో ప్రసిద్ధుడవుతాడు.

ఈ చతుష్కోణం అరచేతిలో ఎక్కడ ఉన్నా జాతకునికి రక్షాకవచంగా ఉంటుంది. ఆపదల నుండి కాపాడుతుంది. రానున్న దుష్పరిణామాలను నివారిస్తుంది. అంటే అన్ని గ్రహాల చెడును ఇది చాలావరకు హరించి వేస్తుంది.

## గురుక్షేత్రం పైన నక్షత్ర చిహ్నం

గురుక్షేత్రంలో నక్షత్ర చిహ్నం ఉన్న వ్యక్తి సకల ఐశ్వర్యాలు పొందుతాడు. మహా అదృష్టవంతుడవుతాడు. అతనిలో ఉదారస్వభావం, పరోపకార గుణం, క్షమాహృదయం ఉంటాయి. అతని జీవితం క్రమశిక్షణతో నడుస్తుంది. నీతి వంతుడుగా మన్ననలు పొందుతాడు. అతను బంధుమిత్రులకు అవసర సహాయం చేస్తుంటాడు. స్త్రీల నుండి అన్ని సహాయాలు పొందగలడు.

ఈ నక్షత్రచిహ్నం గురు శని క్షేత్రాల మధ్యన ఉంటే, అతనికి బంధుప్రీతి ఎక్కువ. నక్షత్ర చిహ్నం వ్యక్తి ఉన్నత గుణాలకు సూచిక–అనేక శుభఫలాలనిస్తుంది.

## ద్వీప చిహ్నం

రెండు చిన్న వంకర రేఖలతో ఏర్పడుతుంది. వడ్ల గింజకన్నా చిన్నదిగా ఉంటుంది. ఇది ఉన్న వ్యక్తిని సంఘం బహిష్కరిస్తుంది. కాని పనులు చేసి

సమాజంలో అవమానం పొందుతాడు. కారాగారం అతని రెండవ నివాసం. స్వార్థం, అహంకారం, ద్వేషం ఎక్కువ. ఎప్పుడూ వ్యభిచార వాడలలో, జూద గృహాలలో తిరుగుతూ, దొంగతనాలు చేసి జీవిస్తుంటాడు. తాగుడు, వ్యభిచారం, మోసం అతనికి ప్రియం.

## గురుక్షేత్రం పై పుట్టుమచ్చ

గురుక్షేత్రంపై నల్లని మచ్చ అశుభం. తెల్లని మచ్చ శుభసూచకం. నల్లని మచ్చ అపకీర్తిని, అవమానాలను సూచిస్తుంది. ధననష్టం కలిగిస్తుంది. ఈ మచ్చ ఎల్లకాలం ఉండదు. జాతకుని చెడు కాలం పోగానే అది మాయమైపోతుంది. నలుపు తగ్గుతున్న కొద్దీ చెడు తగ్గుతుందని అర్థం. ఎర్రని మచ్చ కలహాలను, ధనవ్యయాన్ని, మానసిక క్షోభను సూచిస్తుంది.

## సాలెగూడు

అనేక చిన్నా చితకా రేఖలు అడ్డంగా, నిలువుగా, అడ్డదిడ్డంగా జల్లెడలా ఏర్పడితే ఆ వ్యక్తికి ఆకస్మిక మరణం తప్పదు. రాజకీయ వ్యవహారాలలో అవమానాలు, అపజయం పొందుతుంటాడు. సంసారసుఖం ఉండదు. భార్యా బిడ్డలను సుఖపెట్టడు. తాను సుఖపడడు.

## త్రిశూల చిహ్నం

గురు మండలంలో త్రిశూలాకారం (ట్రైడెంట్) ఉన్న వ్యక్తి రోగాలవల్ల అకాల మరణం చెందుతాడు. వానికి ఆలోచన ఉండదు. డబ్బు బాగా ఉంటుంది కాని శత్రువులు ఎక్కువ. ఐశ్వర్యం అనుభవించడానికి ఆరోగ్యం ఉండదు. పగలకు పట్టుదలకు పోయి పగవారి చేత హతుడవుతాడు.

## త్రిభుజ చిహ్నం

గురుక్షేత్రం పైన త్రిభుజ చిహ్నం కలవారు ప్రజాసేవకు అంకితమవుతారు. ఉద్యోగాలలో మంచి పదవులు సంపాదిస్తారు. వ్యాపార వాణిజ్య రంగాలలో రాణిస్తారు. ఎక్కువగా రాజకీయాలలో రాణిస్తారు. ప్రజాప్రతినిధులై మంత్రి పదవులు పొందగలరు.

## వృత్తం

గురు క్షేత్రంలో వృత్తం చిహ్నం బుద్ధి బలానికి గుర్తు. వీరు ఎంతటి సమస్యలనైనా పరిష్కరిస్తారు. పరోపకారం, ధర్మగుణం ఉంటాయి. కళాసాహిత్య రంగాలలో ప్రతిభావంతులవుతారు.

# గురుక్షేత్రంలో చిన్న రేఖలు

1. గురుక్షేత్రం పైన రెండు నిలువు రేఖలు క్రిందికి జారి మస్తిష్కరేఖను తాకిన ఆ వ్యక్తి డాంబికుడు, కపటి, విశ్వాసఘాతకుడు అవుతాడు. తన ప్రయోజనాలకు ఇతరుల్ని వాడుకుంటాడు. కార్య నిర్వహణలో ఎంతటి కష్టనష్టాలనైనా ఎదుర్కొంటాడు. పనిని తప్పించుకోడు. అతని దౌర్బల్యం పరస్త్రీ వ్యామోహం, నమ్మిన వారిని తన పనికి ఉపయోగించుకుంటాడు.

2. గురు, శని క్షేత్రాల నడుమ నుండి బయలుదేరిన రేఖ హృదయరేఖను దాటి, మస్తిష్కరేఖను చేరినా, ఖండించినా, అతను శిరచ్ఛేదం వల్ల మరణిస్తాడు. బ్రెయిన్ హేమరేజ్, బ్రెయిన్ ట్యూమర్ లాంటి ప్రమాదం సంభవిస్తుంది.

3. జీవితరేఖ, మస్తిష్కరేఖలు రెండూ గురుక్షేత్రం క్రిందనుండి బయలు దేరినప్పుడు, అందులో మస్తిష్క రేఖను మాత్రం మందంగా ఉన్న రెండు చిన్న రేఖలు ఖండిస్తే అతను మానసికంగా దుర్బలుడవుతాడు. తెలివితేటలు తక్కువ. చిన్నతనం నుండి రోగాలతో బాధపడతాడు. వయస్సులో సుఖాలు అను భవించలేక, దుర్భర జీవితం గడుపుతాడు. పైగా శత్రువులు అధికం. ఎప్పుడూ ఏవో కష్టాలు ఎదురవు తుంటాయి. మన శ్శాంతి, సుఖం ఉండవు. కోప తాపాలు ఎక్కువ. అంద రితో దెబ్బలాడుతుంటాడు.




4. గురుక్షేత్రం నుండి బయలుదేరిన ఒక రేఖ మస్తిష్క, జీవిత రేఖల్ని దాటి ద్వితీయ కుజమండలాన్ని చేరితే, అతను మహామేధావి, గుణసంపన్నుడు అవుతాడు. గొప్ప సాహితీపరుడు లేదా కళాకారుడు అవుతాడు. లౌక్యంగా, కాకాలు పట్టి డబ్బు, కీర్తి ప్రతిష్టలు గడిస్తుంటాడు.

5. గురు, శని క్షేత్రాల మధ్య ప్రారంభమైన రేఖ స్పష్టంగా వుండి, హృదయరేఖను స్పృశించినా లేక ఖండించినా, ఆ వ్యక్తి తరచు శిరస్సుకు సంబంధించిన రోగాలకు గురవుతాడు. లేదా హృదయ, శ్వాసకోశ వ్యాధులకు గురికావచ్చు. హార్ట్ అటాక్స్ లాంటివి సూచితం.

6. గురుక్షేత్రం మీద హృదయరేఖను వేరొక చిన్న నిలువురేఖ ఖండిస్తే, అతను అధర్మవర్తనుడు, దురాలోచనాపరుడు, కపటి, అనాచారి, వ్యభిచారి అవుతాడు. మదుమాంస ప్రియత్వం ఎక్కువ. నీచ జీవితం గడుపుతాడు. తరచు అకృత్యాల వల్ల శిక్షలు పొందుతాడు. శత్రుభయం ఎప్పుడూ వెన్నాడుతుంది. వృద్ధాప్యంలో నరకం అనుభవిస్తాడు.

## సువర్ణరేఖ

1. గురుక్షేత్రంలో అర్ధవలయాకారంగా లేక తిన్నగా (అడ్డంగా గాని, ఏటవాలుగా గాని ఉండవచ్చు, నిలువుగా ఉండకూడదు) ఉండే రేఖను సువర్ణరేఖ, లేక దీక్షారేఖ అంటారు. రింగ్ ఆఫ్ సాల్మన్ అంటారు ఇంగ్లీషులో. పేరును బట్టి ఇది బంగారం వర్షిస్తుందని, అదృష్టం కలిసొస్తుందని తెలుస్తుంది. దీక్షారేఖ ఉంటే యోగజాతకం. ప్రవక్తలు, మహర్షులు, యోగులు, మహావిద్వాంసుల చేతుల్లో ఈ రేఖ కనిపిస్తుంది. ఈ సువర్ణరేఖ ఉన్నవారు పుణ్యమూర్తులు. అలాంటి వారిని స్మరించినా మేలు కలుగుతుంది.




సువర్ణరేఖ స్పష్టంగా కలిగిన వ్యక్తి జ్ఞాని, తాత్త్వి కుడు, జితేంద్రియుడు అవుతాడు. ఉదారస్వభావం కలవాడై విశ్వ శ్రేయస్సు కాంక్షిస్తాడు. అతనిలో స్వార్థం కాని, లోభ మోహ మద మాత్సర్య గుణాలు కాని ఉండవు. కర్మయోగిగా జీవిస్తాడు. బ్రహ్మ జ్ఞాని అవుతాడు. మధ్య వయస్సులో గురువును ఆశ్రయించి జ్ఞానదీక్ష తీసుకుని దైవశక్తులు సాధిస్తాడు. ఆ

యోగశక్తులతో సకల సౌభాగ్యాలు పొంది, ఇహ, పరసాధన చేస్తాడు. గృహస్తులకు ఈ సువర్ణరేఖ చాలా మేలు చేస్తుంది. అది ఉన్న గృహస్తు కుటుంబ గౌరవం పొందుతూనే, ఆధ్యాత్మిక విషయాలలో నిష్ణాతుడవుతాడు. యోగిగా జీవిస్తాడు. బ్రహ్మజిజ్ఞాసాపరుడై వైరాగ్యంతో జీవిస్తాడు. సంసారం వదలి సన్యసించవచ్చు.

2. గురు, శని క్షేత్రాల మధ్యనుండి ఆరంభమైన ఒకరేఖ సువర్ణరేఖను ఖండించిన ఆ వ్యక్తికి హార్ట్ అటాక్ వస్తుంది. గుండె సంబంధమైన జబ్బు తథ్యం.

3. గురు మండలంలో రెండు నిలువురేఖలు చిన్నవి సువర్ణరేఖను తాకిన, ఆ వ్యక్తి తన జీవిత లక్ష్యాన్ని నెరవేర్చుకుంటాడు. ఆశించిన గమ్యం చేరగలుగుతాడు. అతని జీవితాశయం తప్పక నెరవేరుతుందని చెప్పవచ్చు.

ఆ రెండు రేఖలు వంకర టింకరగా ఉంటే ఆశయం నెరవేరకపోగా అందుకై అవస్థలు పడడం జరుగుతుంది. రాజకీయ నాయకులలో చాలా మందికి ఈ వంకర రేఖలు ఉంటాయి. వారికి అప్పుడప్పుడు ఓటమి తప్పదు.

4. సువర్ణరేఖ హృదయరేఖను ఖండిస్తే ఆ వ్యక్తి ప్రేమ విషయాలలో అపజయం పొందుతాడు. ప్రేమించిన స్త్రీని వివాహం చేసుకోలేడు. అతని జీవితం విరక్తిగా గడుస్తుంది. దానికి తోడు గురు క్షేత్రం పైన అస్తవ్యస్త రేఖలుంటే అతను అపకీర్తి పాలవుతాడు. దుర్భర జీవితం గడపవలసి వస్తుంది.

5. గురుమండలంలో ఒక స్పష్ట మైన రేఖ హృదయరేఖను తాకిన, గురుక్షేత్రం బలహీనంగా, నీచంగా వున్నా, తర్జని చిన్నదిగా ఉన్నా ఆ వ్యక్తి చిన్న వయస్సులోనే భార్యాహీనుడవుతాడు. నిత్య దరిద్రంతో బాధపడతాడు. నికృష్ట జీవితం గడపవలసి వస్తుంది.




6. గురుక్షేత్రంలో ఒక స్పష్ట మైన నిలువురేఖ ఉన్న వ్యక్తి కీర్తి వంతు డవుతాడు. ఉన్నత విద్యా వంతుడై, ఉన్నత పదవులు పొందుతాడు. కళలలో, సాహి త్యంలో, వైజ్ఞానిక విషయాలలో

అభిరుచి, అభినివేశం ఉంటుంది. అన్ని రంగాలలో తనకు ప్రవేశం, ప్రతిభ ఉన్నవని పించు కుంటాడు. అయితే కొన్ని వ్యసనాలకు బానిసై, దురలవాట్ల వల్ల బంధుమిత్రులను దూరం చేసుకుంటాడు. తన బలహీనతలు బంధుమిత్రులకు తెలియడం ఇష్టముండదు.

7. గురుక్షేత్రం ఉన్నతంగా ఉండి, తర్జని మధ్యవేలంత పొడవున్న, మస్తిష్క రేఖ చంద్రక్షేత్రంలోకి వాలుగా వంగిన, అతను చరిత్ర సృష్టిస్తాడు, ఘనకీర్తి సంపాదిస్తాడు. విద్వాంసుడవుతాడు, బహుభాషలతో పరిచయం ఉంటుంది.

8. తర్జని ఊర్ధ్వపర్వం చిన్నదై, సూర్యక్షేత్రం ఉన్నతంగా ఉండి, హృదయరేఖ చిన్నదిగా ఉన్న వ్యక్తి జీవితంలో ఉన్నత శిఖరాలు అధిరోహిస్తాడు. అతని బంధుమిత్రులు అడుగడుగునా అభివృద్ధికి అడ్డు తగులుతుంటారు. మిత్రులు సైతం అతని కీర్తికి అసూయపడి శత్రువులుగా మారతారు, అవమానిస్తారు. అప్పుడప్పుడు అతనికి అనుకోని విషాదాలు ఎదురవుతుంటాయి. క్రమంగా జీవితం కష్టభూయిష్ట మవుతుంది. ఉన్నత స్థితికి చేరిన ఆ వ్యక్తి అధోపతనం కావడం జరుగుతుంది.

పై లక్షణాలు ఉండీ, రవి, గురు క్షేత్రాలు బలంగా, ఉన్నతంగా ఉంటే అన్ని చెడు ఫలితాలు కలగవు. మంచి ఫలితాలకు అవకాశం ఉంటుంది. తర్జని ఊర్ధ్వపర్వం చిన్నదిగా ఉండడం అశుభ సూచకం. అయినా రవి, గురుమండలాల ప్రభావం వల్ల మంచి ఫలి తాలు కలుగుతాయి.




9. హృదయరేఖకు పైగా, గురుక్షేత్రం నుండి ఒక రేఖ బయలుదేరి, వంకరగా రవి క్షేత్రం వరకు పోయిన ఆ వ్యక్తి దీర్ఘవ్యాధులకు గురి అవుతాడు.

ఆ రేఖ స్పష్టంగా ఉండి, తిన్నగా, సాఫీగా, హృదయరేఖకు సమాంతరంగా

వెళ్లితే అత్యంత శుభం. అలాంటి వ్యక్తి ఆధ్యాత్మిక సంపన్నుడై ఉపాసనా బలం సంపాదిస్తాడు. వేదాంత, మీమాంస, తర్క పండితుడవుతాడు. గొప్పవక్త, గురుభక్తి కలవాడు. అతని భార్య గొప్ప సౌందర్యవతి, వివేకవతి అయి గృహనిర్వహణ దక్షత కలిగి ఉత్తమ ఇల్లాలనిపించుకుంటుంది. సంతానం ఎక్కువ. వారు ఆదర్శ దంపతులుగా, అన్యోన్యంగా ప్రేమానురాగాలతో జీవిస్తారు.

10. గురు, శని క్షేత్రాల నడుమ అయిదు చిన్నా చితక రేఖలున్న వ్యక్తి మహామొండివాడు, శంకితుడు అవుతాడు. అయినా చదువు, పదవి ఉన్నందున మిత్రులను ఆకర్షిస్తాడు. ఆ మిత్రులంతా అవకాశవాదులే. తమ అవసరాలకు అతనిని ఆశ్రయించి కాకా పడుతుంటారు. చివరకు తన మూర్ఖత్వం కారణంగానే అకాలమృత్యువాత పడతాడు. మతి స్థిమితం ఉండదు. చివరకు హీనంగా మరణిస్తాడు.

11. ఈ అయిదు రేఖలలో ఒకటి హృదయరేఖను ఖండిస్తే, ఆ వ్యక్తి వార్ధక్యంలో బలమైన గాయాలతో మరణిస్తాడు లేదా శస్త్ర చికిత్స పొందిన తర్వాత పోతాడు. లేదా యాక్సిడెంట్‌లో ప్రాణం కోల్పోతాడు. 50వ సంవత్సరంలో ఈ దుర్ఘటన జరుగుతుంది.




12. గురుక్షేత్రంలో రెండు నిలువు రేఖలను ఒక అడ్డరేఖ ఖండిస్తే అది శుభప్రదమే. అలాంటి వారు ధార్మిక రంగంలో రాణిస్తారు. దైవకార్యాలు చేస్తారు. దేవాలయాలు, సత్రాలు, టూరిజం రంగాలలో ఉంటారు. పురాతత్వ పరిశోధన, చరిత్ర పరిశోధన, పురావస్తు పరిశోధన చేస్తారు. సైంటిస్టులు, ఎడిటర్లు, కళాకారులు ఈ చిహ్నం కలిగి ఉంటారు. వీరు ఎంత ధనవంతులైనా మృదుమధుర స్వభావం కలవారై అందరితో ప్రేమగా ఉంటారు.

13. గురుక్షేత్రం నుండి బయలుదేరిన ఒక స్పష్టమైన రేఖతో బాటు వేరొక వక్రరేఖ మస్తిష్కరేఖపై వాలిన, ఆ వ్యక్తి స్వభావరీత్యా ఉగ్రుడు, కామాంధుడు అవుతాడు. స్పష్టంగా ఉన్న రేఖ మస్తిష్కరేఖను తాకిన, అలాంటి లక్షణాలు గల

స్త్రీ భార్యగా లభిస్తుంది. ఈ రేఖలకు తోడు గురుక్షేత్రం ఉన్నతంగా ఉన్న వ్యక్తి నీతిపరుడై కీర్తి ప్రతిష్టలు కలిగి పరోపకారి అనిపించుకుంటాడు.

14. గురు మండలంలో అనేక రేఖలు వల (గ్రిల్) వలె ఉన్న వ్యక్తి స్వార్థపరుడవుతాడు. అతని పనులు, ఆలోచనలు ప్రమాదకరంగా ఉంటాయి. దయా, ధర్మ గుణం ఉండవు. కుత్సిత స్వభావం, అహంకారం. అతని భార్య అకాల మృతి చెందుతుంది. తర్వాత అతను కామాంధుడై విచ్చలవిడిగా తిరుగుతాడు. అకృత్యాలు చేస్తాడు.

15. గురుక్షేత్రం పై సగంలో తర్జనికి క్రిందగా మూడు స్పష్టమైన రేఖలున్న వ్యక్తి గుణవంతుడు, ధనవంతుడు, శాస్త్రవేత్త, సాహితీపరుడు అవుతాడు. పెద్ద పదవులు పొంది, గొప్ప వ్యక్తిగా రాణిస్తాడు.

16. గురు మండలంలో ఎగువ నుండి రేఖలు శని క్షేత్రానికి పోయిన అతను మహా ఐశ్వర్యవంతుడవుతాడు. అన్ని సుఖాలు, భోగాలు అనుభవిస్తాడు. చివరకు మనశ్శాంతి కరువై, తలకు దెబ్బ తగిలి మరణిస్తాడు.

17. గురు మండలం క్రింది సగంలో మూడు చిన్న రేఖలున్న వ్యక్తి బహు విషయాసక్తి కలవాడు, కామాంధుడు అవుతాడు. తరచు వాతరోగాలకు గురి అవుతూ ఉంటాడు. ఎవరూ అతనిని గౌరవించరు. అయినా వెంటపడి పరులకు ఉపకారం చేస్తూ ఉంటాడు.

18. గురు, శని క్షేత్రాల మధ్యఉన్న ఒకరేఖ, తర్జని మూలస్థానం నుండి బయలుదేరి శనిక్షేత్రానికి పోయే రేఖను ఖండించిన ఆ వ్యక్తి మహాకార్య నిర్వాహకుడవుతాడు. ఎక్జిక్యూటివ్ పదవులు పొందుతాడు. కాని విలాసాలు, భోగప్రియత్వం అధికం. స్వార్థం, అభిమానం ఎక్కువ. ధైర్యంగా అకృత్యాలు చేస్తాడు. లంచాలు తీసుకోవడంలో ఘటికుడు. తరచు శిరోవేదన అనుభవిస్తాడు. క్రమంగా ఆరోగ్యం క్షీణిస్తుంది.

19. ధనుషాకార రేఖ బుధక్షేత్రంపై అనేక రేఖలుగా చీలిన, అట్టి వ్యక్తి మహా విద్వాంసుడు, ఉన్నత కళాకారు డవుతాడు. అన్ని సుఖాలు అనుభవిస్తాడు. సంపన్నుడుగా, భోగవిలాస జీవితం గడుపుతాడు.

## కొన్ని విశేష ఫలితాలు

1. తర్జని పొడవుగా ఉండి గురు, చంద్ర క్షేత్రాలు ఉన్నతంగా ఉండి, మస్తిష్కరేఖ స్పష్టంగా ఉండి కనిష్టాంగుళి సన్నగా మొనతేలి ఉన్న ఆ వ్యక్తి పెద్ద న్యాయ

కోవిదుడవుతాడు. హైకోర్టు, సుప్రీం కోర్టుల న్యాయమూర్తి అవుతాడు, లేదా శాసనసభ్యుడు, పార్లమెంటు సభ్యుడు కావచ్చు. లేదా ప్రొఫెసర్ కావచ్చు.

2. తర్జని పొడవుగా ఉండి, కొన మొనదేలి ఉన్న, గురుక్షేత్రం బలంగా వుండి, మూలస్థానం నుండి ఒక రేఖ గురు మండలం మధ్య వరకు దిగిన, అతనికి దివ్యదృష్టి ఏర్పడుతుంది. ఆత్మ దర్శనం పొంది మహాయోగిగా, ఉపాసకుడుగా రాణిస్తాడు. మహా మేధావంతుడై ఉన్నత పదవులు పొందగలడు లేదా మఠాధిపతి, పీఠాధిపతి, మఠాచార్యుడు అవుతాడు.




3. ఉన్నత గురుక్షేత్రంలో ఒక స్పష్టమైన చిన్నరేఖ ఉండి, హృదయరేఖ గురు, శని క్షేత్రాల మధ్య ప్రదేశం నుండి బయలు దేరితే తాత్వికుడు, యోగి అవుతాడు. గురుస్థానం పొందుతాడు. అతనికి అనేక మంది శిష్య, ప్రశిష్యులు, పరోక్షంగా వేలమంది అభిమానులు ఉంటారు.

4. గురుక్షేత్రం ఉన్నతంగా ఉండి దానిపైన ఒక గుణక చిహ్నంగాని, నక్షత్రచిహ్నంగాని ఉండి, కుజరేఖ(అంటే రెండవ కుజక్షేత్రం నుండి బయలుదేరి, జీవితరేఖకు లోపలివైపు, జీవితరేఖకు సమాంతరంగా పోయే రేఖ) చక్కగా, స్పష్టంగా ఉంటే, ఆ వ్యక్తి భార్యవల్ల ధన లాభం పొందుతాడు. వివాహ సమయంలో కట్నకానుకలు దండిగా లభిస్తాయి. భార్యమూలంగా ఆస్తి వస్తుంది. దాంపత్య జీవితం అద్భుతంగా ఉంటుంది.

5. తర్జని మూలస్థానం నుండి ఒక రేఖ బయలుదేరి, తర్జని ద్వితీయపర్వంలోకి వెళ్లిన, బుధక్షేత్రంలో వివాహరేఖ హృదయరేఖ మీదకి వాలి ఉన్నా, చేతిలో నిరర్థక రేఖలు ఎక్కువగా ఉన్నట్లయితే అతను దరిద్రుడు, దుర్మార్గుడు అవుతాడు. భార్యా విహీనుడై, జీవితాంతం దిగులుతో బాధపడతాడు.

6. తర్జని పొడవుగా ఉండి కొనతేలి ఉన్న, అంగుష్టం పొడవుగా, దృఢంగా ఉంటే అతను శత్రు విజయంతో సంపన్నుడవుతాడు. సుఖసంపదలు అనుభవిస్తూ, ఇతరుల్ని ద్వేషిస్తూ, అసూయచెందుతుంటాడు.

7. తర్జని పొడవుగా కొనతేలి ఉన్న, కనిష్టాంగుళి ఊర్ధ్వపర్వం పొడవుగా ఉండి, గురుక్షేత్రం ఉన్న తంగా వుంటే ఆ వ్యక్తి వ్యాపారంలో సమర్ధుడవుతాడు. ధనార్జన చేస్తాడు. ధర్మబుద్ధి, పరోపకార గుణం, ఉదార స్వభావం ఉంటాయి.



8. నాలుగువేళ్ల తృతీయం పర్వాలపై నిలువు రేఖలు మిత్రుల్ని సూచిస్తాయి. రేఖలు ఎన్ని ఉంటే అంతమంది మిత్రులుంటారు. అవ సరానికి అందరూ సహాయం చేస్తారు.

9. తర్జని తృతీయ పర్వంపైన మూడు నిలువురేఖలు, ఇతర మూడువేళ్లపైన మొత్తం నాలుగు నిలువు గీతలున్న వ్యక్తికి వాదోపవాదాల వల్ల ధననష్టం కలుగుతుంది. గుర్రం పందాలు, లాటరీలు, జూదాలలో నష్టపోతుంటాడు.

10. గురుక్షేత్రం ఉన్నతంగా ఉండి, దానిపైన ఒక నక్షత్ర చిహ్నం ఉండి, రవిరేఖ స్పష్టంగా ఉండి, రవి క్షేత్రం పైన నక్షత్ర చిహ్నం ఉంటే రవి, శని మండలాలు ఉన్నతంగా వుండి, మస్తిష్క హృదయ రేఖలు బాగుంటే మంత్రులు విదేశరాయబారులు అవుతారు. దేశవిదేశా లలో కీర్తి గడిస్తారు.



11. తర్జని బాగా పొడవుగా ఉండి, అంగుష్టం బలంగా, గురుక్షేత్రం అత్యున్న తంగా వుంటే, మస్తిష్కరేఖ ఈ కొన నుండి రెండవ చివరకు ఉన్న ఆ వ్యక్తి పైకి గొప్ప వాడుగా చలామణీ అయినా విషయలో లుడు, కుచ్చితుడు, దుర్మార్గుడు అవుతాడు. ఆలోచన, బుద్ధి సరిగా ఉండవు. అత్యాచారా లకు, హత్యలకు పాల్పడతాడు. వ్యభిచారం అతని ప్రధాన వ్యసనం.

12. తర్జని, మధ్యమాంగుళి సంధిస్థానం నుండి బయలుదేరిన రేఖ అరచేయి మధ్యవరకు పోయిన అతను జీవితాంతం విచారగ్రస్తుడుగా ఉంటాడు. అనేక కష్టాలు అనుభవిస్తాడు. ధనం అతన్ని రక్షించదు, సుఖం ఇవ్వదు. బంధుమిత్రులు అతనిని చేరనివ్వరు.

13. పైన చెప్పిన రేఖ చివర అదృష్టరేఖతో గాని, జీవితరేఖతోగాని కలిసిన, పైన చెప్పిన దుష్ఫలితాలు తొలగిపోతాయి. పైగా అద్భుత ఫలితాలు కలుగుతాయి. అది అదృష్టరేఖను, జీవితరేఖను తాకిన వయస్సులో అతనికి విపరీత రాజయోగం పడుతుంది. అంతకు ముందు అనూహ్యంగా కొన్ని కష్టనష్టాలు అనుభవిస్తాడు.

14. గురుక్షేత్రంలో దిగువన ఒక స్పష్టమైన రేఖ, హృదయరేఖ స్పష్టంగా ఉంటే, అతను గొప్ప వక్త, సత్యవాది అవుతాడు. వేద, వేదాంత, ఉపనిషత్తులపై ప్రసంగాలు చేస్తాడు. సచ్చరిత్రుడని పేరు సంపాదిస్తాడు.

15. గురుక్షేత్రం ఉన్నతంగా ఉండి, తర్జని అనామికవలె చిన్నదిగా ఉంటే తర్జని మధ్యవేళ్ల మధ్య జాగా ఎక్కువగా ఉంటే ధర్మకార్యాలు చేస్తాడు. పాఠశాలలు, పఠన మందిరాలు, దేవాలయాలు కట్టిస్తాడు. సాధు సజ్జనులను ఆదరిస్తాడు. ఎప్పటికీ ధనలోపం ఉండదు.

16. గురుమండలం శ్రేష్ఠంగా ఉన్న స్త్రీలు సౌందర్యవతులు, సంభాషణా చతురులు అవుతారు. విద్యాబుద్ధులు, వినయ విధేయతలు కలిగి ఉంటారు. భర్తకు అనుకూలంగా వుండి, దైవభక్తి, సత్ప్రవర్తన కలిగి, సుఖంగా జీవిస్తూ, ఉత్తమ ఇల్లాలు అనిపించుకుంటారు.

# 8. శనిక్షేత్రం

**జ్యో**తిషంలో 'శని' అనగానే కీడు శంకిస్తారు. శని పడితే ఏడేళ్లు నానాకష్టాలు పడతారు. జన్మరాశికి అటుఇటు రెండు రాసుల్లో శని సంచరించే ఏడున్నర సంవత్సరాలు ప్రతి మనిషి కొన్ని బాధలు పడతాడు. మొదటిసారి వచ్చినపుడు కలిగినంత కష్టం రెండవసారి ఏళ్లనాటి శని సమయంలో ఉండదు. సాముద్రికంలో గురువు తర్వాత ఎక్కువ మేలు చేసేది శని. ఇక్కడ శనిని బట్టి మనిషి అదృష్టం మొత్తం అంచనా వేయవచ్చు. శనిక్షేత్రం ఉన్నతంగా బలంగా ఉండి దానిపైన ఏవైనా శుభచిహ్నాలుంటే శని అద్భుత ఫలితాలనిస్తుంది. సాముద్రికంలో గురువువలె శని గొప్ప ఫలదాత.

మధ్య వ్రేలి మూలస్థానం శనిక్షేత్రం. దానికి అటు గురుక్షేత్రం, ఇటు రవిక్షేత్రం. ఇవి రెండూ మనిషికి మహోన్నత ఫలితాల నిచ్చే గ్రహాలే, గ్రహమండలాలే. వాటితో సమానంగానే శనిమండలం ఫలితాలను ప్రసాదిస్తుంది. శని ప్రభావం గల వ్యక్తి కొంచెం పొడవుగా సన్నగా ఉంటాడు. బుజాలు కొంచెం వంగి ఉంటాయి. నడక మందంగా ఉంటుంది. పాదాలు, వేళ్లు పసుపురంగులో ఉంటాయి. కళ్లు చిన్నవిగా, లోతుగా ఉంటాయి. కనుబొమలు ముడివేసి నట్లుంటాయి. ముక్కు పొడవుగా కొనతేరి ఉంటుంది. చెవులు పెద్దవిగా, దవడలు బలిష్టంగా, పళ్లు పెద్దవిగా, మెడ సన్నగా, పొడవుగా ఉంటుంది.

ఆ వ్యక్తి ప్రకృతి గంభీరంగా, స్వభావం తీవ్రంగా ఉంటుంది. ధైర్యసాహసాలు ఎక్కువ. విద్యావివేకాలు అధికం. నియమనిష్ఠలు జాస్తి. డిసిప్లిన్ ఎక్కువ. మనిషిలో సహనం తక్కువ. ఖర్చు పరిమితం. తన విషయంలో నీతి నియమాలు ఖచ్చితంగా పాటిస్తూ ఇతరుల విషయంలో ఉదారంగా ఉంటాడు. పరుల కోసం ఎంతయినా ఖర్చుపెడతాడు. తన విషయంలో మితవ్యయం, కార్య నిర్వహణలో ఎవరినీ అనుసరించడు. అన్నీ కొత్త పోకడలే.

శని ప్రభావం గలవారికి అజ్ఞాత శత్రువులు ఉంటారు. పైకి స్నేహం, విధేయత నటిస్తూ లోపల గోతులు తవ్వుతుంటారు. దుష్ప్రచారం చేసి, తృప్తి పడుతుంటారు. ప్రత్యక్షంగా అతనిని ఏమీ చేయలేరు. తనను అవమానించినవారు ఎంత గొప్పవారైనా, ధనవంతులైనా అతను క్షమిస్తాడు. వానికి గుప్త విద్యా రహస్యాలు తెలుస్తాయి. సంగీతం, గణితం పట్ల ఆసక్తి ఉంటుంది. కొందరు గణితజ్ఞులు, జ్యోతిష్కులు, ఖగోళశాస్త్రజ్ఞులు అవుతారు. మరి కొందరు సంగీత శాఖలలో నిష్ణాతులవుతారు. వీరికి సౌందర్యారాధన ఎక్కువ.

## ఉన్నత శనిక్షేత్రం

ఉన్నత శనిక్షేత్రం గల వ్యక్తి మహా పరాక్రమవంతుడు, స్థితప్రజ్ఞుడు, పట్టుదల గలవాడై ఏకాంతాన్ని కోరుతుంటాడు. మితంగా మాట్లాడతాడు. రహస్య, నిగూఢ విషయాలను పరిశోధిస్తుంటాడు. స్వతంత్రం అధికం. వీరు యోగం, వేదాంతం, గణితం, ఖగోళం, జ్యోతిషం, పరిశోధనా రంగాలలో రాణిస్తారు. వీరికి స్త్రీల పట్ల, సంసారసుఖం పట్ల ఆదరణ, ఇష్టం తక్కువ. గొప్ప గొప్ప పనులు సునాయాసంగా నిర్వహిస్తారు. మిత్రులకు సహాయం చేస్తారు. గొప్పగా కీర్తి ప్రతిష్టలు సంపాదిస్తారు. అయితే భార్య వలన సుఖం తక్కువ.

ఆడవారి చేతిలో శని మండలం ఉన్నతంగా ఉంటే ఆమె ధర్మపరురాలు, గొప్ప ఇల్లాలు, మేధావంతురాలు అవుతుంది. మితవ్యయం చేస్తుంది. అబద్ధాలు చెప్పదు. ఆమెకు శత్రువులుండరు. పుత్ర సంతానం ఎక్కువ. అవినీతిపరులను దగ్గరకు రానివ్వదు.

## అవనత శనిక్షేత్రం

శని మండలం బలహీనంగా ఉన్నవారు స్థిరబుద్ధితో ఉండరు. తరచు శిక్షలు పొందుతుంటారు. అవమానాలు, అపవాదులు భరిస్తూ వ్యసనాలకు బానిసలై అకాలంలో మరణిస్తారు.

## అత్యున్నత శనిక్షేత్రం

శనిమండలం అత్యున్నతంగా గల వ్యక్తి నీచ సాంగత్యాలు చేస్తాడు, నీచపు పనులు చేస్తుంటాడు. అతనికి దయా దాక్షిణ్యాలుండవు. ఎప్పుడూ ఆత్మహత్యను గురించి ఆలోచిస్తాడు. తరచు ఉదర, మూత్ర రోగాలతో బాధపడుతుంటాడు. లో బి.పి. వల్ల బుద్ధి మందగిస్తుంది. నిరాశగా బ్రతుకుతాడు. వ్యభిచారం అంటే వల్లమాలిన ఇష్టం. అత్యాచారాలకు సైతం వెనుదీయడు.

## సమోన్నత శనిక్షేత్రం

శనిక్షేత్రం సమతలంగా ఉంటే మంచిది కాదు. వీరు బంగారం పట్టుకుంటే మట్టి అవుతుంది. ఎంత కష్టపడి పనిచేసినా ఫలితం ఉండదు. జీవితాంతం కష్టాలతో కాపురం చేస్తున్నట్లే ఉంటుంది. ఎన్ని మంచి పనులు చేసినా ఎవరూ గుర్తించరు. శని మండలంలో శుభచిహ్నాలు ఈ ఫలితాలను మంచిగా మార్చి వేస్తాయి.

## శని, రవి క్షేత్రాలు

శనిమండలం రవి క్షేత్రాన్ని చూస్తుంటే, అంటే దాని బలం రవి వైపు మొగ్గితే శని ఫలాలను రవి క్షేత్రం గ్రహించి, తన బలాన్ని పెంచుకుంటుంది. అనగా శని ఇవ్వవలసిన ఫలాలు నేరుగా అందవు. రవిక్షేత్రం ద్వారా అందుతుంటాయి. అలాగే శని, గురుక్షేత్రం వైపు చూస్తే ఆ వ్యక్తి వ్యవహారవేత్త, దీక్షాపరుడు కాలేడు. జీవితమంతా దిగులుతో గడపవలసి వస్తుంది. బంధువుల వల్ల ఇబ్బందులు ఉంటాయి. వృద్ధాప్యంలో బిడ్డల వల్ల సుఖపడతాడు. శేషజీవితాన్ని ఆధ్యాత్మిక చింతనతో గడుపుతాడు. గురువుల్ని ఆశ్రయించి ఆముష్మిక చింతన పెంపొందించుకుంటారు.

అత్యున్నత శనిక్షేత్రం రాహు మండలాన్ని చూస్తుంటే, ఆ వ్యక్తి జీవితంలో ఎప్పుడూ సుఖపడలేడు.

రవి, శని క్షేత్రాలు రెండూ నీరసిస్తే, ఆవ్యక్తి జీవితం వ్యర్థం. మంచి రేఖలుంటే కొంత చెడు తొలగిపోతుంది కానీ దాంపత్య సుఖం ఉండదు. జీవితాంతం రోగాలతో, పుత్రశోకంతో కృశించిపోతాడు.

శని, గురు మండలాలు రెండూ సమాన ఎత్తుగా వుంటే గొప్ప లక్షణం. అలాంటి వ్యక్తి సదాచారపరుడు, విద్యావంతుడు, ధనవంతుడు అవుతాడు. వేదాంతం, లలితకళల పట్ల ఆసక్తి ఉంటుంది. ఆదర్శంగా జీవిస్తాడు. ఆడవారి చేతిలో ఈ లక్షణాలు పూర్తి శుభఫలితాల నిస్తాయి. అలాటి స్త్రీ పరమసాధ్వి, పతివ్రత అని కీర్తి పొందినా, ఆమెను మానసిక వ్యాధులు బాధిస్తాయి. హిస్టీరియా వస్తుంది.

రవి, శని మండలాలు ఒకే ఎత్తుగా వుంటే, ఆ వ్యక్తికి బంధునాశం, భార్యా వియోగం కలుగుతుంది. ఒకే కుమారుడు అదృష్టవంతుడై ఐశ్వర్యాలు అనుభవిస్తాడు. అతని వల్ల తండ్రి గౌరవం పెరుగుతుంది. ఎంత ఐశ్వర్యం అనుభవించినా స్త్రీ సుఖం ఉండదు.

శని, బుధ క్షేత్రాలు ఉన్నతమై సమాన బలంగా వుంటే, అతడు కుచ్ఛిత స్వభావి, అబద్ధాలకోరు, దగాకోరు అవుతాడు. పరమలోభి, వ్యసనపరుడు అవుతాడు. అయినా గొప్ప విద్యావేత్త, వ్యాపారదక్షుడు, ఉద్యోగి అవుతాడు. తనకన్న తక్కువ స్థాయి వారితో కలసి వ్యాపారాలు చేస్తాడు. నీచస్త్రీల పొందు కోరుతుంటాడు.

శని, కుజ క్షేత్రాలు బాగా బలంగా, ఎత్తుగా వున్న వ్యక్తి, కుజ ప్రభావం వల్ల పరమ దుర్మార్గు డవుతాడు. కోపతాపాలు అధికం, చెడ్డ పనుల పట్ల ఆసక్తి మెండు. ఇతరుల్ని అనవసరంగా ద్వేషిస్తాడు. నీతి, నియమం, ఆచారం, పెద్దలంటే గౌరవం ఉండవు.

శని, చంద్ర మండలాలు ఉన్నతంగా ఉండడం మంచిది. ఆ వ్యక్తి ధనం, ఐశ్వర్యం పుష్కలంగా గడించగలడు. అభిమానం ఎక్కువ. చిన్నతనం నుండి అతి జాగ్రత్తగా ఉంటూ ఉన్నతస్థితికి చేరుకుంటాడు. కార్యకుశలత ఎక్కువ. క్రమశిక్షణ ఎక్కువ. స్వశక్తితో ఉన్నత స్థితికి చేరి సంపన్నుడవుతాడు.

శని, శుక్ర క్షేత్రాలు బలంగా వున్న వ్యక్తి బల పరాక్రమాలు కలిగి ఉంటాడు. రసికత ఎక్కువ. సౌందర్యారాధన, కళాచతురత ఉంటుంది. చివరకు వేదాంతిగా మారతాడు. మేధావిగా, తను ఎన్నుకున్న రంగంలో కీర్తి సంపాదించి ధనవంతు డవుతాడు.

శనిక్షేత్రంతో బాటు రాహు క్షేత్రం కాస్త ఉబ్బుగా, ప్రతిభావంతంగా ఉంటే, అతను గొప్ప కళాకారుడు, ఐశ్వర్యవంతుడు అవుతాడు. సైంటిస్టు కావచ్చు, విద్యాధికుడు కావచ్చు.

శని, బుధ, గురు క్షేత్రాలు మూడూ సమోన్నతమైన వ్యక్తి పరిశోధకు డవుతాడు. సైంటిస్టుగా లేక ఎలెక్ట్రానిక్స్‌లో గొప్ప ప్రతిభ కనపరచి, విదేశాలలో స్థిరపడతాడు. బుధ మండలంలో మూడు నిలువు రేఖలున్న వ్యక్తి విజ్ఞాన శాస్త్రంలో, అయిదు రేఖలున్న వ్యక్తి వైద్య రంగంలో రాణిస్తారు.

శనిక్షేత్రం నీచమైన వ్యక్తి జీవితం నిరాశాపూర్ణమవుతుంది.

శుక్రక్షేత్రం నీచమైన వ్యక్తి స్త్రీ లోలుడు, వ్యసనపరుడు అవుతాడు. ప్రతిరోజు కొత్త అనుభవం కోసం వెదుకుతుంటాడు. అతనిని వివాహం చేసుకున్న స్త్రీ సుఖపడదు.

శుక్రమండలం ఉన్నతంగా ఉన్న వ్యక్తి తను ప్రేమించిన స్త్రీని వివాహం చేసుకుని సుఖపడతాడు. వివాహబంధాన్ని అతి పవిత్రంగా భావిస్తాడు. ఆచారపరుడు, సచ్ఛీలుడు అవుతాడు. అయితే పెళ్లికి ముందే అనేక మందితో

వ్యవహారాలు సాగించి తాను పవిత్రంగా ఉన్నానని నమ్మిస్తాడు. నీతి సూత్రాలు వల్లిస్తాడు. ఈ లక్షణాలు స్త్రీ హస్తంలో ఉంటే ఆమె పవిత్ర జీవనం సాగిస్తూ, పతివ్రత అవుతుంది. ఐశ్వర్యం, చక్కని సంతానంతో ఉత్తమ ఇల్లాలు అనిపించు కుంటుంది. ఆమె విద్యావంతురాలు, రచయిత్రి అవుతుంది. రచయిత్రిగా మారిన తర్వాత ఆమె స్వభావం చంచలం అవుతుంది.

## శని వలయం

మధ్యవ్రేలి మూలస్థానం శనిక్షేత్రం. ఆ శనిక్షేత్రం పైభాగంలో అర్ధచంద్రా కారంగా, అసంపూర్ణంగా ఉండే రేఖను శని వలయం అంటారు. ఇది స్పష్టంగా, చంద్రరేఖ వలె ఉండదు. తెగిపోయి ఉంటుంది. శని వలయం స్పష్టంగా వుంటే మనిషి ప్రగతిని నిరోధిస్తుంది. అనేక ఆటంకాలు కలిగిస్తుంది. ఉద్యోగం పైన, సంపాదనపైన, సంసార జీవితంపైన ఆసక్తి ఉండదు. పూర్తి వలయం గల వ్యక్తి జీవితాంతం దరిద్రం అనుభవిస్తాడు. అది తెగి, ముక్కలుగా ఉంటే అన్నీ మంచి ఫలితాలు కలుగుతాయి.

శని, శుక్ర క్షేత్రాలు ఉన్నతంగా ఉండి, వాటిపైన అశుభ చిహ్నాలు లేకుంటే, శని వలయం అద్భుత ఫలితాల నిస్తుంది. అలాంటి వారు యోగులు, బ్రహ్మోపాసకులు, రససిద్ధులు, మహా జ్ఞానులు అవుతారు. అవతార పురుషులుగా కీర్తి గడిస్తారు.

శని వలయం మధ్యలో చీలినా, శుక్రక్షేత్రం పైన పుష్పం వంటి చిహ్నం ఏర్పడినా ఆ వ్యక్తి కామాంధుడు, స్త్రీ లోలుడు, వ్యసనపరుడై, యోగభ్రష్టుడవుతాడు. ఆర్జిత పుణ్యాన్ని, ఆత్మశక్తిని కోల్పోతాడు.

శని వలయం ఉన్న వ్యక్తి ఎపుడూ పెద్దపెద్ద పథకాలు వేస్తూ తలకు మించిన పనులు, శక్తికి మించిన కార్యాలు పైన వేసుకుంటాడు. వాని ఆలోచన తీవ్రంగా ఉంటుంది కాని ఆచరణలో శూన్యం. ఏ పనిని పూర్తి చేయడు. మానసిక బలహీనతకు తోడు ఇతర దురదృష్టాలు వెన్నంటి ఉంటాయి.

## శుక్ర వలయం

ఈ రేఖ చాలా తక్కువ మందిలో కనిపిస్తుంది. గొప్ప ఫలితాలను సూచిస్తుంది. దీనిని గర్డిల్ ఆఫ్ వీనస్ అంటారు. సృజనాత్మక ప్రతిభగల వారందరి చేతుల్లో శుక్ర వలయం ఉంటుంది. ఇది కలవారు సంప్రదాయాన్ని ఛేదించి, కొత్తపోకడలు పోయి, నవ్యసృష్టి చేస్తుంటారు. ఇది తర్జని మధ్యమాంగుళి మధ్య

నుండి బయలుదేరి శని, రవి మండలాలు దాటి, అనామిక, కనిష్టాంగుళుల మధ్య వరకు పోతుంది.




ఇది వలయాకారంగా, అర్థ చంద్రాకారంగా ఉంటుంది. కొందరి చేతుల్లో ఇది రవి మండలాన్ని దాటి బుధక్షేత్రంలోకి చొచ్చుకుని పోతుంది. అలా వెళ్లినపుడు అతి మంచి ఫలితాల నివ్వదు. స్థాన భ్రంశం చెందినట్లు గమనించాలి.

శుక్ర వలయం పవిత్ర ప్రేమకు, ప్రేమాసక్తికి గుర్తు. ఇంద్రియ చాపల్యం సూచిస్తుంది. శుక్ర వలయం ఉన్నవారు విలాసజీవితం కోరు తుంటారు. శృంగార ప్రియులై రసికుల మనిపించుకుంటారు. శుక్ర క్షేత్రం బాగా సమోన్నతంగా ఉంటేనే ఈ ఫలితాలు. అలాకాక, శుక్ర మండలం సమోన్నతంగా ఉండి, చంద్ర, రవి, బుధ క్షేత్రాలలో ఏ ఒక్కటి ప్రతిభావంతంగా ఉన్నా శుక్ర వలయం చెడు ఫలితాల నివ్వదు. పైగా అలాంటి వారు గొప్ప నటులు, రచయితలు, భావుకులు అవుతారు.

అరచేయి చిన్నదిగా, లావుగా, బలంగా ఉండి, శుక్రమండలం అత్యున్నతంగా ఉంటే, హృదయరేఖ మధ్యవ్రేలి మూలస్థానం వరకు ఉన్నా లేక శని మండలం బలంగా ఉన్నతంగా ఉన్నా ఆ శుక్రవలయం అరిష్టదాయకం.

శుక్రవలయం స్పష్టంగా ఉన్న వ్యక్తి మహావిద్వాంసుడు, ప్రతిభాశాలి, రచయిత, కళాకారుడు, నటుడు కాగలడు. కాని స్వభావం అస్థిరంగా ఉంటుంది. ఆలోచన చంచలంగా ఉంటుంది.

శని, శుక్ర వలయాలు రెండూ ఉండి, రెండూ స్పష్టంగా ఉంటే, గురుమండలం పైన ఒక గుణక చిహ్నంగాని, పుష్పంగానీ ఉంటే, హృదయరేఖ పైగా రవిక్షేత్రంలో ధ్వజం, పల్లకి, మందిరం లాంటి గుర్తు ఏర్పడితే అతను తత్వవేత్త అవుతాడు. నూతన ప్రవక్త అవుతాడు. ఒక కొత్త సిద్ధాంతాన్ని ఆవిష్కరించగలుగుతాడు. మహాయోగి, తాపసి, మహర్షి అని ఖ్యాతి పొందుతాడు. అన్నివిధాల ఇది శుభలక్షణం.

పైన చెప్పిన శుభ చిహ్నలలో ఏ ఒక్కటి అయినా శనిక్షేత్రంలో వుండి, హృదయరేఖ చక్కగా ఉంటే అతను గొప్ప మేధాసంపద గల రచయిత, ఎడిటర్ అవుతాడు. తాత్వికుడుగా ప్రసిద్ధుడవుతాడు. సత్యాన్వేషి కాగలడు. సంప్రదాయాలను, ఆచారాలను లెక్కచేయడు.

శని మండలంలో శుభ చిహ్నం ఏదైనా మనిషి పారమార్థిక చింతనకు, వైరాగ్యానికి గుర్తు. దానికి తోడు ధనరేఖ ఉంటే ఎంత వేదాంతి, తాత్వికుడు అయినా సుఖజీవితాన్ని వదులుకోడు. జీవితంలో అన్ని సుఖభోగాలు, ఐశ్వర్యం అనుభవిస్తూనే తత్వవేత్త అవుతాడు.

శుక్ర వలయం శని, రవి క్షేత్రాలలో భాగ్యరేఖను, రవిరేఖను ఖండిస్తే, శుక్రవలయం ఫలితాలు తగ్గిపోతాయని కొందరంటారు. కాని, అనుభవంలో అలాంటి దోషం కనిపించదు. ఎందుకంటే బాగా పైకి వెళ్లే భాగ్యరేఖను, రవిరేఖను శుక్ర వలయం ఖండించక తప్పదు. అది సహజం.

శుక్రవలయం ఉన్న వ్యక్తి ప్రతి చిన్న విషయానికి ఆవేశం చెందుతాడు. ఉద్రేక స్వభావం ఉంటుంది. శుక్రవలయం అస్పష్టంగా వుండి, మధ్యలో తెగిన, ఆ వ్యక్తి కాముకుడై, చెడు పనులలో ఆసక్తి చూపిస్తాడు. ఈ వలయం కుజ మండలాన్ని చూస్తే అతనికి క్రూర కర్మల పట్ల ఆసక్తి ఉంటుంది. బుధమండలం పైన ఈ శుక్రవలయం అంతమైతే ఆ వ్యక్తి మిత్రద్రోహి, విశ్వాస ఘాతకుడు అవుతాడు. శుక్రవలయం తెగివుంటే మంచిదని కొందరి సిద్ధాంతం.

# శనిక్షేత్రంపై చిహ్నలు

## చతుష్కోణం

చతుష్కోణ చిహ్నం ఏ గ్రహక్షేత్రం పైన ఉన్నా, అది కవచంగా పనిచేస్తుంది. ఆ గ్రహం తాలూకు చెడు ఫలితాలను నిరోధిస్తుంది. శనిక్షేత్రం పై చతుష్కోణం మంచి చేస్తుంది. శుభ ఫలితాల నిస్తుంది. చతుష్కోణం చక్కగా ఏర్పడకపోతే, దానిపైన ఏవైనా అడ్డ రేఖలు ఉంటే మంచి ఫలితం కలగదు. ప్రమాదం గడచినట్లే ఉంటుంది కాని ముంచుకొస్తుంది. ప్రాణాపాయం కలగక పోయినా పతనం తప్పదు. ఈ చతుష్కోణం మధ్యలో ఒక నక్షత్రం శుభకరం కాదు. అది అకాల మృత్యువుకు, మరణశిక్షకు సూచన. అయితే చతుష్కోణం మరణశిక్షను తప్పిస్తుంది. మృత్యుగండం గడచిపోతుంది. ఈ చతుష్కోణంలో ఏ కోణం పైన గాని ఎర్రని మచ్చ వుంటే అగ్ని ప్రమాదం, ప్రాణభయం కలుగుతుంది. చతుష్కోణ ప్రభావంతో ప్రమాదం నుండి బయటపడడం జరుగుతుంది.

## గుణక చిహ్నం




శనిక్షేత్రంలో గుణకచిహ్నం మంచిది కాదు. అది మనిషి అభివృద్ధికి, ఔన్నత్యానికి ఆటంకమవుతుంది. ఆరోగ్యం చెడి ఎప్పుడూ రోగాలతో బాధపడ వలసి వస్తుంది.

శనిక్షేత్రంలో రెండు గుణక చిహ్నాలు చాలా మంచిది. ఆ వ్యక్తి సకల సౌభాగ్యాలు పొందగలడు. ధైర్య సాహసాలు ప్రదర్శించి, అదృష్టాన్ని వరిస్తాడు. ప్రపంచంలోని సుఖాలు, సంపదలు అన్నీ అనుభవిస్తాడు. అందులో తేడా వస్తే ప్రబలమైన రోగాలకు గురై అకాల మరణం పొందుతాడు.

శని మండలం పైన రెండు గుణక చిహ్నాలకు తోడు మధ్యవ్రేలి ఊర్ధ్వపర్వం పైన మరొక గుణకచిహ్నం ఉండి శనిక్షేత్రం క్రిందగా హృదయరేఖ చీలి ఉంటే మరణశిక్ష లేదా అకాలమృతి సూచితం. మన భారతీయ సాముద్రిక సిద్ధాంతం ప్రకారం శనిక్షేత్రం పైన రెండు గుణక చిహ్నాలుండడం మంచిదే. విశేష ఫలాలను ఇస్తుందంటారు. అయితే ఇతరత్రా అవలక్షణాలుండకూడదు.

శని మండలానికి దిగువన మస్తిష్కరేఖ పైన ఒక గుణక చిహ్నం ఉంటే అది ప్రమాదాల నుండి రక్షణ కలిగిస్తుంది. శని మండలంలోని గుణకచిహ్నం విష ప్రయోగం, విద్యుదాఘాతం సూచిస్తుంది. చేతిలో చతుష్కోణం ఉంటే ఆ ప్రమాదం నుండి బయటపడతాడు.

శని మండలంలో అదృష్టరేఖ సమీపంగా ఒక గుణకచిహ్నం ఉంటే ఆ వ్యక్తి గొప్ప అవమానం పొంది, ఆత్మహత్యకు పూనుకుంటాడు. ఆరోగ్యం చెడిపోతుంది.

## వృత్తం

శని మండలంలో వృత్తాకార చిహ్నం ఖగోళ, ఖనిజ విషయాలను సూచిస్తుంది. అలాంటి లోహాలకు సంబంధించిన పరిశోధనలు, వ్యాపారాలు, ఉద్యోగాలు చేస్తాడు. ధన సంపాదన బాగా ఉంటుంది. ఈ వృత్తం శనిక్షేత్రంలో

పైభాగాన ఉండడం మంచిది కాదు. క్రింది భాగంలో హృదయరేఖకు పైగా, వృత్తచిహ్నం ఉన్న వ్యక్తి అన్ని రంగాలలో కష్టనష్టాలు అనుభవిస్తాడు. హృదయ సంబంధమైన రోగాలతో బాధపడతాడు.

## నక్షత్రం

రవి, శని క్షేత్రాల మధ్య నక్షత్ర చిహ్నమున్న వ్యక్తి విద్యుత్ ప్రమాదానికి గురవుతాడు. చతుష్కోణం ఉంటే రక్షణ కల్పిస్తుంది. శని మండలంలో నక్షత్ర చిహ్నం ఒక్కటి మాత్రమే ఉన్న వ్యక్తి జీవితంలో అడుగడుగునా దుర్ఘటనలు ఎదుర్కొంటాడు. భాగ్యరేఖ స్పష్టంగా, శనిక్షేత్రంలోకి వెళితే, అలాంటి అశుభాలు కలగవు.

## త్రిభుజం

శని మండలంలో త్రిభుజ చిహ్నం విశేష ఫలితాల నిస్తుంది. ఖండాంతర ఖ్యాతి నిస్తుంది. అలాంటి వ్యక్తి ఇంద్రజాల విద్యలలో, రస విద్యలో, యోగంలో ప్రసిద్ధుడవుతాడు. తత్త్వవేత్త, బ్రహ్మజ్ఞాని అయి చరిత్రలో నిలిచిపోతాడు. అభిమానం ఎక్కువ. ఆ త్రిభుజంపైన నక్షత్ర చిహ్నం ఉంటే అతని ప్రతిభకు ఇతరులు అసూయపడి, హత్యా ప్రయత్నం చేస్తారు. అవమానించ ప్రయత్నిస్తారు. కాని అతనిని ఏమీ చేయలేరు.

## శంఖ, చక్ర, రథ, ధ్వజ చిహ్నాలు

శనిమండలంలో శంఖ, చక్ర, రథ, ధ్వజ ఆకారాల వంటి చిహ్నాలు భారతీయ సాముద్రికంలో మహారాజయోగ చిహ్నాలు. వీటిలో ఏ ఒక్కటి ఉన్నా చాలు జీవితం వైభవంగా ఉంటుంది. రాజయోగం ప్రాప్తిస్తుంది. అది వున్నవారు మహా విద్వాంసులు, రాజపూజితులు అవుతారు, సన్మానాలు పొందుతారు. వీరికి ఒకరి క్రింద పనిచేయడం ఇష్టం ఉండదు. స్వేచ్ఛా ప్రియులు. రాజకీయాలలో ప్రతి పక్షంలో రాణిస్తారు. కళా సాహిత్య రంగాలలో విమర్శకులవుతారు.

## శని క్షేత్రంలో రేఖలు

1. శనిక్షేత్రంలో ఒక ద్వీపచిహ్నం, దాని నుండి బయలుదేరిన రేఖ మస్తిష్కరేఖ, ఆరోగ్య రేఖలు కలిసే చోటుకు చేరిన, ఆ వ్యక్తి తలకు ఆపరేషన్ జరుగుతుంది. ఆపరేషన్ తర్వాత పది సంవత్సరాల కన్న జీవించడు. ఆ పది పన్నెండు సంవత్సరాలు చాలా సుఖంగా ఉంటాడు.

2. ద్వీప చిహ్నం నుండి బయలు దేరిన రేఖ, మస్తిష్క ఆరోగ్యరేఖలను దాటిపోతే, అంటే వాటిని ఖండిస్తే ఆ వ్యక్తి ఆపరేషన్ సమ యంలో మరణిస్తాడు.

3. శనిక్షేత్రం నుండి బయలు దేరిన చిన్నరేఖలు హృదయరేఖను ఖండిస్తే, ఆ వ్యక్తి గాస్టిక్ అల్సర్ లాంటి జబ్బులు పొంది మానసి కంగా బలహీనుడవుతాడు.



ఆ రేఖలు వంకర టింకరగా, మస్తిష్కరేఖ వరకు సాగితే అశుభం. అలా కాక అవి జీవితరేఖ వరకుపోతే అతడు గొప్ప ఔన్నత్యం పొందుతాడు. అవి జీవితరేఖను కలిసే వయస్సులో అకస్మాత్ ధనలాభం, అదృష్టం వరిస్తాయని చెప్పవచ్చు. అవి వంకరగా ఉన్నా ఫరవాలేదు. ఆరంభంలో ఆటంకాలు, బాధలు కలిగినా, ఫలితం అనుకూలంగా ఉంటుంది.

4. శనిక్షేత్రం నుండి ఒక రేఖ వాలుగా వచ్చి హృదయరేఖను తాకితే, ఆ వ్యక్తి గొప్ప అదృష్టం పొందుతాడు. భోగభాగ్యాలతో తులతూగుతాడు. గొప్పగా కీర్తి గడిస్తాడు. అతనికి బంధుమిత్రులు అమితంగా ఉంటారు.

5. హృదయరేఖ బుధ మండలం నుండి శనిక్షేత్రం వరకు చక్కగా వుండి శనిక్షేత్రం దిగువన చీలి, తిరిగి బయలుదేరితే శని మండలం నుండి బయలుదేరిన రేఖ ఒకటి ఆ ప్రాంతానికి వస్తే, అతను వైరాగ్యంతో చిన్నతనంలోనే ఇల్లు విడిచిపోతాడు. సాధుసన్యాసులలో కలసిపోయి తపస్సు చేస్తాడు. అతనికి భౌతిక ప్రపంచంతో, లౌకిక ప్రపంచంతో సంబంధం ఉండదు, భవబంధాలుండవు.

6. మధ్య మాంగుళి మూలస్థానం నుండి బయలుదేరిన ఒక రేఖ హృదయ రేఖను తాకినట్లున్న, హృదయరేఖ గురుక్షేత్రం నుండి బయలుదేరిన ఆ వ్యక్తి తపస్సంపన్నుడు, విరాగి అవుతాడు. తపస్సు చేసి అనేక శక్తులు, సిద్ధులు పొందినా, తాను అజ్ఞాతంగా ఉంటూ విశ్వకళ్యాణం కొరకు కృషి చేస్తాడు.

హృదయరేఖ గురు, శని క్షేత్రాల మధ్య నుండి బయలుదేరిన, అతను సంసారిగా ఉంటూ, యోగం చేసి రాజర్షి, మహర్షి అవుతాడు. మోక్షం సంపాదిస్తాడు.

7. రవి, శని క్షేత్రాల మధ్యనున్న ఒక స్పష్టమైన రేఖ హృదయరేఖను ఖండిస్తే ఆ వ్యక్తి చివరిదశలో సుఖపడతాడు. బిడ్డల అభివృద్ధికి తన సర్వస్వం త్యాగం చేస్తాడు. బిడ్డలు పైకి వచ్చి, బాగా సంపాదిస్తారు. అలాంటి వ్యక్తి మధ్య వయస్సులోనే భార్యా వియోగం పొందుతాడు. అది హృదయరేఖను స్పృశిస్తే, తిరిగి వివాహం చేసు కుంటాడు. ఆ వివాహం వల్ల ఎలాంటి ఇబ్బందులు రావు.



8. శనిక్షేత్రం నుండి బయలు దేరిన ఒక రేఖ జీవితరేఖ వరకు పోతే, అతను ఉన్నత అధికార పద వులు పొంది, గౌరవప్రతిష్ట లార్జించి, ధనవంతు డవుతాడు. అతనికి భార్య ద్వారా, ఇతర స్త్రీల ద్వారా ఆస్తి వస్తుంది. ఆ రేఖ జీవితరేఖను కలిసిన వయస్సులో ఆ అదృష్టం వరిస్తుంది. వృత్తి, ఉద్యోగాలలో ఉన్నవారికి పదోన్నతి లభిస్తుంది. అదే సమయంలో శుక్రరేఖ జీవితరేఖ నుండి బయలుదేరితే అప్పుడు వివాహం జరుగుతుంది. భార్య వలన ధనలాభం, ఆస్తి వస్తాయి.

9. గురు, శని క్షేత్రాల మధ్యనుండి బయలుదేరిన మూడు రేఖలు హృదయ రేఖను తాకిన ఆ వ్యక్తి భోగభాగ్యాలకు లోటుండదు. అన్ని సుఖాలు, భోగాలు అనుభవిస్తాడు. చతుర సంభాషణతో జనాన్ని ఆకర్షిస్తాడు. శాస్త్రనిపుణు డవుతాడు.

10. గురు శని క్షేత్రాల మధ్య నుండి బయలుదేరిన ఒక రేఖ శనిక్షేత్రంలోకి పోవటం అత్యంత శుభప్రదం. మంచి ఫలితాల నిస్తుంది. అలాంటి వారు రాజకీయాలలో రాణిస్తారు. శాసన సభ్యులు కాగలరు. మంత్రి కాగలరు. ఐ.ఎ.ఎస్. లాంటి ఉన్నత పదవులు లభిస్తాయి. వీరు సైన్యంలో ఉన్నత పదవులు పొందగలరు. మంచి వక్తలుగా రాణిస్తారు. వీరికి సత్సాంగత్యం, దైవచింతన అధికం.

11. శనిక్షేత్రంలో ఒక ద్వీప చిహ్నా ముండి, ఆ ద్వీపం నుండి బయలుదేరిన ఒక రేఖ ఆరోగ్యరేఖ చివరి అంచువరకు పోయి దానితో కలిసిపోయిన అతని




మానసికారోగ్యం బలహీనంగా ఉం టుంది. ఏ పని ఏకాగ్రంగా చేయలేదు. అతనికి ఆలోచనలు నిలవవు.

12. నిచ్చెనలాగా ఉన్న రేఖలు శని క్షేత్రం నుండి గురుక్షేత్రం వరకు ఉంటే ఆ వ్యక్తి లోక కళ్యాణం కొరకు నిస్వా ర్థంగా, ప్రజాసేవ చేస్తాడు. అతనిలో సాత్విక స్వభావం, సహిష్ణుత, ధర్మగుణం ఎక్కువ. వీరు రాజకీయాలలో ఉత్తమ ప్రమాణాలు నెలకొల్పుతారు.

13. శని మండలంలో మూడు రేఖ లుండి, అందులో మధ్యరేఖ పొడవుగా ఉంటే, ఆ వ్యక్తి దరిద్రుడు, ఆచారహీనుడు, వ్యసనపరుడు, వ్యభిచారి అవుతాడు.

14. ఆరేఖలు డమరుకం ఆకారంలో అంటే మధ్యరేఖ చిన్నదిగా, అటు ఇటు రేఖలు కాస్త పొడవుగా ఉంటే శుభప్రదం. అలాంటి వ్యక్తి ధన వస్తు వాహనాలు పొందగలడు. మంచివాడని పేరు గడిస్తాడు.

15. శని మండలంలో మధ్య వ్రేలి మూలస్థానం వద్ద ఒక రేఖ వక్రంగా ఉంటే అతను డాంబికుడు, ఆచారహీనుడు, వ్యసనపరుడు, జూదరి అవు తాడు. ఆ వక్రరేఖ మరీ ఛిద్రంగా ఉంటే, అతడు భ్రష్టు డవుతాడు. మాన మర్యాదలు లెక్కించడు.




16. శని మండలంపైన ఛిద్రమైన రేఖలు అపజయానికి సంకేతం. ఏ పని సవ్యంగా చేయడు. గుండె జబ్బుతో,

శ్వాసకోశ వ్యాధులతో బాధపడుతుంటాడు. ఆ రేఖలు హృదయరేఖను స్పృశిస్తే ఫలితం మరీ భయంకరంగా ఉంటుంది.

17. శనిక్షేత్రం నుండి ఒక రేఖ వంకరగా రవిక్షేత్రానికి చేరితే ఆ వ్యక్తి పాపపు ఆలోచనలు చేస్తుంటాడు. వాని బుద్ధి, మనస్సు పాప పంకిలం, దుష్ట సాంగత్యం, అక్రమ వ్యాపారం అంటే ఇష్టం. వ్యసనాల వల్ల, ఐశ్వర్య వంతుడైనా, చెడ్డపేరు గడిస్తాడు.




18. శని క్షేత్రంలోని రెండు నిలువు రేఖలను వేరొక అడ్డరేఖ ఖండిస్తే, అతను అయిన వారిలో కీర్తి సంపాదిస్తాడు. ధన వంతుడై భోగ భాగ్యాలు పొందుతాడు. అతని ఇల్లాలు ధనాశతో, భోగలాలసగా మారి రోగిష్టి దవుతుంది.

19. శనిమండలంలోని భోగరేఖ (శుక్రవలయం) చిన్నాభిన్నమై బుధమండలం వరకు పోతే, అతను మూర్ఖుడు, చపలచిత్తుడు అవుతాడు. అతనికి శత్రుబాధ అధికం. వ్యాపార విషయాలలో నమ్మదగిన వ్యక్తి కాదు. స్మగుల్డ్ వ్యాపారాలు, చిట్టీ వ్యాపారాలు, రహస్య వ్యాపారాలు చేస్తాడు.

భోగరేఖ రవిక్షేత్రంలో అర్ధచంద్రాకారమైనా లేదా చెడినా, అతను కార్యకుశలుడు, మంచి నిర్వహణదక్షుడు, నీతి నియమాలు పాటించేవాడు అవుతాడు. సన్మానాలు, సత్కారాలు పొంది ఐశ్వర్యవంతుడవుతాడు.

20. భోగరేఖను రవిక్షేత్రంలో దిగువన హృదయరేఖ ఖండించిన (హృదయరేఖ బుధ మండలం వరకు ఉండాలి) ఆ వ్యక్తి తన సంపదలను, వారసులను కోల్పోవలసి వస్తుంది. కోర్టులలో తన ఆస్తిని తిరిగి పొందినా సుఖపడడు. అపఖ్యాతి పాలవుతాడు.

21. శని మండలం నుండి బయలుదేరిన మూడురేఖలలో, రెండు మధ్యవేలి మూలస్థానం వరకు పోతే అతడు అజీర్ణవ్యాధితో, ప్లీహ సంబంధ వ్యాధులతో

బాధపడతాడు. కారాగార శిక్ష అనుభవిస్తాడు. ఈ చిహ్నమున్న స్త్రీ వ్యభిచారిణి అవుతుంది.

22. శని మండలంలో రెండు అడ్డరేఖలు శని వలయాన్ని ఖండిస్తే, అతను వ్యసనపరుడు, దరిద్రుడు, దుష్టబుద్ధి గలవాడు అవుతాడు. తన మూర్ఖత్వం వల్ల మరణిస్తాడు. అతని శత్రువులు అందరూ గుణవంతులు, సజ్జనులు, వానికి భార్యా బిడ్డల వల్ల, బంధువుల వల్ల సుఖం ఉండదు.

23. శనిక్షేత్రంలో ఆరు చిన్నరేఖలున్న వ్యక్తి ఎప్పుడూ విచారంగా ఉంటాడు. దెబ్బలాటలలో తల పగులుతుంది.



24. శనిక్షేత్రంలో మూడు వక్రరేఖలున్న వ్యక్తి వాతరోగాలు పొందుతాడు. బంధువులను, అయిన వారిని దూరం చేసుకుంటాడు. దరిద్రుడై, శత్రుపీడ అనుభవిస్తాడు. వ్యవసాయం, వ్యాపారం చేసినా, అంతంత మాత్రంగానే అతని జీవనం సాగుతుంది.

25. శనిమండలంలో స్పష్టమైన ఒక పెద్దరేఖను చిన్నరేఖలు ఖండిస్తే అతను వృద్ధాప్యంలో కష్టాలు అనుభవిస్తాడు. ఆ రేఖ మధ్యవేలి మూలస్థానం నుండి బయలుదేరితే అతను సదా విచారగ్రస్తుడుగా ఉంటాడు.



26. శని మండలంలో రెండు స్పష్టమైన రేఖలుండి వాటిని ఏ ఇతర రేఖలు ఖండించకుండా ఉంటే అతనికి ఉద్రేకం ఎక్కువ. అనేక విధాల డబ్బు సంపాదిస్తాడు. అందులో ఒకరేఖ ఛిద్రమైతే రోగ పీడితుడవుతాడు.

27. ఈ రేఖలను ఇతర రేఖలు ఖండిస్తూ, అవి వలగా ఏర్పడితే ఆ వ్యక్తి వికలాంగుడవుతాడు. అతనికి దయా దాక్షిణ్య గుణాలుండవు.

28. మధ్యవ్రేలు క్రింది పర్వం నుండి బయలుదేరిన ఒకరేఖ శుక్రవలయం దాటి అదృష్టరేఖతో కలిసిన అతను ధన సంపన్నుడవుతాడు. అయితే అతనికి హృదయ సంబంధమైన రోగా లుంటాయి. ఎయిడ్స్ వంటి సెక్సు సంబంధమైన సుఖరోగాలతో బాధపడతాడు.




29. శని మండలం నుండి బయలుదేరిన రేఖలు హృదయ, మస్తిష్క రేఖలను ఖండించిన, మస్తిష్కరేఖపై ఒక మచ్చ ఉన్న, వీటికి తోడు శుక్రవలయం ఉంటే అతను అధిక విద్యా ధనసంపదలు సంపాదిస్తాడు. సదా రోగగ్రస్తుడయినా, సన్మానాలు పొందుతుంటాడు.

తర్జని, మధ్యమాంగుళి అంత పొడవుగా వున్న వ్యక్తి ప్రధాన న్యాయమూర్తి అవుతాడు. హైకోర్టు లేదా సుప్రీం కోర్టు జడ్జి అవుతాడు. మస్తిష్కరేఖపైన ఒక మచ్చ ఉంటే అతను బ్యాంకులో పెద్ద అధికారి లేదా మానేజింగు డైరెక్టరు, లేదా వాణిజ్య సంస్థలకు అధిపతి అవుతాడు. ఏ రంగంలోనైనా మనిషిని ఉన్నతస్థాయికి చేర్చగల గుర్తు అది.

30. శని మండలం ఉన్నతంగా ఉండి, శుక్రవలయం చక్కగా ఉండి శనివలయాన్ని అనేకరేఖలు ఖండిస్తే రవి మండలం ఉన్నతమైన, మస్తిష్కరేఖ శనిక్షేత్రం క్రింద తెగి వున్న, ఆ వ్యక్తి యావజ్జీవం బాధలు పడుతుంటాడు. అర్థాయుష్కుడవుతాడు.

రవి, శని మండలాలు బలంగా వుంటే అతని దురదృష్టం కుటుంబ సభ్యులకు అంటదు. అతని మరణం వల్ల అయినవారు లాభపడతారు.

31. శనిక్షేత్రం నుండి బయలుదేరిన ఒక రేఖ శుక్ర వలయం దాటి, హృదయ రేఖను ఖండిస్తే, ఆ వ్యక్తి పరమ దరిద్రంతో మరణిస్తాడు. అనేక రోగాలు, వేదనలు అతనిని అకాలమృత్యువుకు ఎరవేస్తాయి.

32. శనిక్షేత్రంపైన అనేక చిన్నరేఖలు వలగా ఏర్పడితే ఆ వ్యక్తి మహాక్రూర స్వభావం కలవాడు, దరిద్రుడు అవుతాడు. అతనికి నీతి విలువ తెలియదు. వ్యభిచారి అయి, సగం జీవితం కారాగారంలోనే గడుపుతాడు.

# 9. రవిక్షేత్రం

**మ**నిషి జీవితంపైన వెలుగు, కాంతి ప్రసరింపచేసేది రవి. మనిషి ప్రతిభ, ప్రాభవం, కీర్తి, ప్రతిష్ట, గుర్తింపు, అదృష్టం లాంటివి రవిక్షేత్రాన్ని బట్టి తెలుస్తాయి. హృదయ రేఖకు పైగా, అనామికకు దిగువగా, శని బుధ మండలాల మధ్య ఉన్నది రవిక్షేత్రం. తేజస్సు, శాస్త్రవిజ్ఞానం, మానసికబలం రవి కలిగిస్తాడు. సత్యం, విద్య, సత్వగుణం రవి లక్షణాలు. జాతకరీత్యా ఇది రాజ్యభావం. సన్మానం, కళలు, ప్రతిభ, విద్య, కీర్తి, ప్రేమ, ఆరాధన, ధర్మతత్పరత, తీర్థయాత్రలు, కళలు, సంగీత సాహిత్యాలు రవి మండలంలోకి వస్తాయి. రవి జాతకులు ఉన్నతాశయాలు కలిగి ఉంటారు. సమాజంలో గొప్పస్థానం సంపాదిస్తారు. పదిమంది ప్రశంసించే పనులు చేస్తారు. రవి ఆత్మకు, తండ్రికి ప్రతినిధి. సంపద, వైభవం రవి వల్ల తెలుస్తాయి.

రవి ప్రభావం గల వ్యక్తి సౌందర్యవంతుడని చెప్పవచ్చు. మరీ పొడవూ, పొట్టి కాకుండా మధ్యస్థంగా ఉంటాడు. స్థూలకాయుడూ కాదు, అర్భకంగానూ ఉండడు. సన్నగా వున్నా, గట్టిగా, బలంగా, ఆరోగ్యంగా ఉంటాడు. ఎపుడూ యువకుడుగానే కనిపిస్తాడు. మనిషిలో, మాట తీరులో ఆకర్షణ హెచ్చు. కళ్లు పెద్దవి. కనుబొమలు పెద్దవిగా ముడివేసినట్లు ఉంటాయి. కళ్లలో దయ, కరుణ, ప్రేమ తొణికిస లాడతాయి. కోటేరు ముక్కు, ముఖం గుండ్రం, పెదవులు పలచగా, ఎర్రగా ఉంటాయి. విశాలవక్షం, సన్ననికంఠం, మధురస్వరం, శరీరం గులాబి రంగులో ఉంటుంది.

రవి ప్రభావం గల వారికి హృదయ సంబంధమైన జబ్బులు చేస్తాయి. కళ్ల జబ్బులు వస్తాయి. అయితే ఎప్పుడూ రోగి అనిపించుకోడు, మంచాన పడడు. చిన్న చిన్న జబ్బులు అతని దగ్గరకు రావు. సౌందర్యారాధన హెచ్చు. ఉన్నతంగా, పవిత్రంగా, ఆనందంగా, తృప్తిగా జీవిస్తాడు.

వీరు స్వతంత్ర జీవనం వాంఛిస్తారు. అధికారానికి తలవంచరు. తక్కువ శ్రమచేసి ఎక్కువ ఫలితం పొందుతారు. అనేక రంగాలలో ప్రతిభ ఉంటుంది. అనేక భాషలు నేర్చుకుంటారు. ఆలోచనలు అవసరమైనచోట్ల వీరు రాణిస్తారు. పేరు, కీర్తి కావాలని ఆరాటపడతారు. వీరిని చూచి అసూయపడేవారు ఎక్కువ. ఇతరుల అసూయాద్వేషాల వల్ల వీరికి కలిగే నష్టం లేదు.

గురు, శుక్ర క్షేత్రాలు బలంగా ఉన్నవారు కళాకారులవుతారు. గురు చంద్ర క్షేత్రాలు బలంగా ఉన్నవారు సాహితీపరు లవుతారు.

రవిక్షేత్రం ఉన్నతంగా ఉండి, మధ్యభాగం ఉబ్బుగా ఉంటే, అనామిక పొడవుగా ఉండి, దాని ఊర్ధ్వపర్వం ఎక్కువ పొడవుగా ఉంటే, రవిక్షేత్రంలో ఒక నిలువురేఖ ఉంటే అతను మహానటుడు, కళాకారుడు అవుతాడు. అనేక విద్యలు నేర్చి ఆనందంగా జీవిస్తాడు. దరిద్రుల పట్ల, అనాధల పట్ల దయగా ఉంటాడు. బాధితులకు శక్తిమేరకు సహాయం చేస్తుంటాడు. అతని ఇల్లాలు సౌందర్యవతి, అనుకూలవతి అవుతుంది. వీరికి స్నేహితులు ఎక్కువగా ఉంటారు.

రవిమండలం ప్రభావం గల వ్యక్తులు మానసికానందం కలిగించే వ్యాపారాలలో రాణిస్తారు. సినిమాలు, సంగీతం, చిత్రలేఖనం, సాహిత్యం. వీరు వ్యాపార రంగంలోనూ విశేషంగా రాణించగలరు. వీరికి దరిద్రం అంటే చిరాకు. ధన సంపాదన, సుఖ జీవనం, ఆనందంగా, తృప్తిగా గడపడం వీరి ధ్యేయం. రహస్యాలు ఇట్టే గ్రహిస్తారు.

ఈ లక్షణాలు గల స్త్రీలు సౌందర్యవతులు, ఐశ్వర్య సంపన్నులు అయినా పరులను ద్వేషిస్తారు. అహంకారం ఎక్కువ. వీరి ధనమదం, సౌందర్యం చూసి అసహ్యించుకునేవారేగానీ, గౌరవించేవారు తక్కువ. తమ బంధుమిత్రుల వరకు ప్రేమాదరాలు చూపిస్తారు. పేదవారిని చిన్నచూపు చూస్తుంటారు.

## రవిక్షేత్రం : బలాబలాలు

### ఉన్నత రవిక్షేత్రం

రవిక్షేత్రం ఉన్నతంగా గల వ్యక్తి అందంగా, ఆకర్షణీయంగా ఉంటాడు. తన సౌందర్యంతో ఇతరుల్ని ముగ్ధుల్ని చేయగలడు. అతను మనస్ఫూర్తిగా ప్రేమించగలడు. చక్కగా వాదించగలడు. కల్లాకపటం ఉండదు. చెడ్డ పనులు చేయడు. తనకు నచ్చిన పనులలో విశేష ప్రావీణ్యం చూపిస్తాడు. ధైర్యసాహసాలతో కాక, వివేకంతో, ప్రతిభతో ఆటంకాలను దాటిపోగలడు. వ్యవసనాలకు, నీచ

సాంగత్యానికి దూరంగా ఉంటాడు. కుటుంబ గౌరవం, ఆత్మ గౌరవం కాపాడు కుంటాడు. శత్రువుల్ని మిత్రులుగా మార్చుకోగలడు. మొదట పేదవాడుగా ఉన్నా, మధ్య వయస్సులో ధనార్జన చేసి ఐశ్వర్యవంతుడవుతాడు. వీరు పుట్టినచోట రాణించరు. జన్మభూమికి కడుదూరంగా జీవిస్తారు. ఏ దేశంలో, ఏ ప్రాంతంలోనైనా వీరు రాణిస్తారు. సాహితీవేత్తలు, న్యాయవాదులు, కళాకారులు, వ్యవహారవేత్తలు ఈ శ్రేణిలోనివారే.

ఆడవారి చేతిలో ఉన్నత రవిక్షేత్రం అంతకు మించిన ఫలితాల నిస్తుంది. గొప్ప సంస్కారం ప్రదర్శించినా ఆ స్త్రీ చిటపటలాడుతూ, ఇతరులతో కలహిస్తుంది. దయాధర్మగుణం, గౌరవం అన్నీ ఉంటాయి. ఉన్నత విద్యావంతురాలవుతుంది.

## అవనత రవిక్షేత్రం

రవిక్షేత్రం పల్లంగా, లోతుగా ఉంటే నీచం అని, అవనతమనీ చెప్పవచ్చు. రవి నీచమైతే పనిపై ప్రభావం కనిపిస్తుంది. పనులలో జాప్యం, చురుకుదనం లేకపోవడం, విలాసజీవితం, చెడ్డసహవాసాలు, దయా రాహిత్యం. వీరు ఐశ్వర్యం, సుఖభోగాలు ఎక్కువ ఆశించి, అంగలార్చి తక్కువగా అనుభవిస్తారు. సినిమా రంగంలో అన్ని శాఖలలో ఇలాంటి వారుంటారు. అనేకమందితో స్వేచ్ఛాప్రణయం సాగిస్తారు. జీవితంలో ఆశించింది మాత్రం సాధించలేరు. వీరి ఆలోచన ఎప్పుడూ స్త్రీల గురించే.

## అత్యుచ్ఛ రవిక్షేత్రం

మిగిలిన గ్రహక్షేత్రాల కన్న రవిక్షేత్రం ఎత్తుగా, గట్టిగా, బలంగా కనిపిస్తే అది అత్యుచ్ఛ రవిక్షేత్రం. అలాంటి వారు ఎన్ని డిగ్రీలు సంపాదించినా డబ్బు సంపాదించలేరు. విద్యార్జన తప్ప విత్తార్జన ఉండదు. ఆడంబరాలకు పిత్రార్జితం తగలేస్తారు. అనవసరంగా వాదించడం, అకారణంగా ద్వేషించడం వీరి స్వభావం. బంధుస్త్రీలతో పాపకార్యాలు చేస్తారు. స్త్రీ వ్యామోహంలో దరిద్రులవుతారు. వీరిని మూత్రాశయ రోగాలు, తల బాధలు, కంటి జబ్బులు తరచు వేధిస్తుంటాయి. 40వ ఏట నేరంచేసి జైలుకు వెళ్లడం జరుగుతుంది లేదా గుండెపోటుతో మరణిస్తారు.

# రవిపై ఇతర క్షేత్రాల ప్రభావం

1. రవిక్షేత్రం ఉన్నతంగా ఉండి బుధక్షేత్రం వైపు వాలితే అతని స్వభావం విలక్షణంగా ఉంటుంది. దత్తత పోవడం వల్ల ధనవంతుడవుతాడు. ఆర్థికశాస్త్రంలో

పెద్ద డిగ్రీలు సంపాదిస్తాడు. అకారణ భయం, పిరికితనం వల్ల డబ్బు వ్యయం చేస్తాడు.

ఈ లక్షణాలు గల స్త్రీ సౌందర్యవతి, రూపసి, గుణవతి అవుతుంది. చక్కగా సుఖజీవనం చేస్తుంది. పతిభక్తి అధికం. గొప్ప శీలవతి అవుతుంది.

2. ఉన్నత రవిక్షేత్రం అవనత శని మండలాన్ని చూస్తే, అంటే శనివైపు వాలినట్లున్న, అతను ఐశ్వర్యవంతుడై భోగవిలాసప్రియు డవుతాడు. భగవద్భక్తి, పెద్దల పట్ల గౌరవం ఉంటాయి. పరిజనం ఉంటారు. ఎంత ధర్మపరుడైనా మనస్సు చంచలంగా ఉంటుంది. ఉద్యోగాలలో, రాజకీయాలలో ఇలాంటి వారు రాణిస్తారు. పరస్త్రీ సంగమం వీరికి ఇష్టం. తమ అందచందాలు, డబ్బు చూపి ఆడవారిని లోబరచుకుంటారు. సుఖభోగాలకు ఎంత డబ్బు అయినా వ్యయం చేస్తారు.

ఆ లక్షణాలు గల స్త్రీ ఉన్నతురాలు కాదు. కోపం అధికం. సంసారపక్షంగా ఉన్నా కోపం వల్ల చెడ్డపేరు సంపాదిస్తుంది.

3. రవి, గురు మండలాలు సమానమైన బలంగా ఉన్న వ్యక్తి దయాధర్మగుణాలు కలిగి సాత్వికుడవుతాడు. పరోపకారి, విద్యావంతుడు, ప్రతిభాశాలి అవుతాడు. తల్లిదండ్రులను, గురువులను ప్రేమిస్తాడు. చిన్నతనం నుండి చదువులో ప్రతిభ చూపిస్తాడు. శరీరం పుష్టిగా, బలంగా ఉంటుంది. కళల పట్ల అభిరుచి ఉంటుంది. విజ్ఞానశాస్త్రాలలో, సాహిత్య, సారస్వత రంగాలలో ప్రసిద్ధి పొందగలడు. ప్రజోపయోగ కార్యాలలో అధికార పదవులు పొందగలడు. స్వచ్ఛంద సేవా సంస్థలు నిర్వహించగలడు.

ఆడవారి చేతిలో రవి, గురు మండలాలు సమానం లేదా ఉన్నతమైతే ఆమె విద్యాధికురాలై, మంచిభర్తను పొందుతుంది. తండ్రి నుండి ఆస్తిపాస్తులు, ధనం వచ్చి చేరతాయి. యవ్వనంలో పూర్ణజీవితం అనుభవించి, తర్వాత వైరాగ్యం వైపు మనస్సు మళ్లి ధర్మ కార్యాలు చేసి, తీర్థయాత్రలు చేసి, స్వామీజీలను ఆశ్రయించి, పరమార్థం అన్వేషిస్తుంది.

4. రవి, శని మండలాలు ఉన్నతమైన వ్యక్తి దుష్ట ప్రకృతి కలవాడైనా, ఉన్నతిని సాధిస్తాడు. నీచ ప్రవృత్తి వాని మనుగడకు, అభివృద్ధికి అవరోధం కాదు. అతను పెద్ద మనిషిగా, ధర్మమూర్తిగా చలామణీ అవుతాడు. దొంగతనాలు, హత్యలు చేయించినా దొరవలె చలామణీ అవుతాడు. కపటస్వాములు, దొంగబాబాలు ఈ లక్షణం కలిగి ఉంటారు. ప్రభుత్వం, చట్టాలు వీరిని ఏమీ చేయలేవు. రాజకీయ

నాయకుల నీడలో వీరు బ్రతుకుతూ, తమ మోసాల్ని, అఘాయిత్యాలను నిరాటంకంగా కొనసాగిస్తారు.

స్త్రీల చేతిలో ఈ లక్షణం నైతిక పతనాన్ని సూచిస్తుంది. ఆమె కులట అనిపించుకోకుండా వ్యభిచరిస్తుంది. రాజకీయ నాయకులు వీరికి అండ. ఎందరు పురుషులతో తిరిగినా, అది లాంఛనం, అవసరార్థం అంటారు గానీ వ్యభిచారం అనరు.

5. రవి, బుధ క్షేత్రాలు ఉన్నతంగా ఉన్న స్త్రీలు, పురుషులు సౌందర్యవంతులు. ప్రతిభావంతులు, విద్యావంతులు. పెద్ద చదువులు చదివి, పెద్ద ఉద్యోగాలు చేస్తారు. పెద్ద పరిశ్రమల్లోనూ రాణిస్తారు. విపరీతంగా సంపాదించి సుఖంగా జీవిస్తారు. ఆశలు, ఆశయాలు ఎక్కువగా ఉంటాయి. కోపతాపాలు ఎక్కువ. శత్రువులు అధికం. వీరి స్నేహం ఎప్పుడూ ధనవంతులతో, సమాన హోదా, ఐశ్వర్యం కలవారితో. పేదలను దగ్గరకు రానివ్వరు.

6. రవి, కుజ మండలాలు ఉన్నతంగా గల వ్యక్తి సత్యవ్రతుడు, ఆచారవంతుడు, ధర్మమూర్తి, ఉత్తమ సాహితీవేత్త అవుతాడు. వీరు సర్జన్స్, డెంటిస్టులు, ఆర్కిటెక్ట్స్ అవుతారు. వీరు పుట్టిన చోట రాణించరు. ఉద్యోగ, వాణిజ్య కారణంగా పర రాష్ట్రాలలో, విదేశాలలో నివశిస్తారు. పెద్ద కుటుంబం, స్త్రీల వల్ల ధనప్రాప్తి. అయితే అనారోగ్యం వదలదు. అలాంటి వారికి ఎవరూ సమయానికి సహాయం చేయరు.

ఈ లక్షణాలు గల స్త్రీ పతిభక్తి కలిగి, సంసారాన్ని చక్కగా దిద్దుకుంటుంది. అందరితో స్నేహంగా ఉంటుంది. వీరు ఉద్యోగాలలో ఎంత ఉన్నత పదవిలో ఉన్నా కుటుంబం, సంసార బాధ్యతలు విస్మరించరు.

7. రవి, చంద్ర క్షేత్రాలు ఉన్నతంగా వున్న వ్యక్తి స్వభావం విలక్షణంగా ఉంటుంది. క్షణంలో శాంతమూర్తిగా ఉండి, మరుక్షణంలో రౌద్రమూర్తి అవుతాడు. శరీరపుష్టి వల్ల గంభీరంగా, భయంకరంగా కనిపించినా ఎవరికీ అపకారం చేయడు. బాల్యంలో ఇద్దరి తల్లుల పెంపకంలో పెరిగి ఉంటాడు. అభిమానం, నిష్ట అధికం. అనవసర విషయాలలో కోపం ఉన్నా, అవసర విషయాలలో శాంతంగా, నిగ్రహంగా ఉంటాడు. చర్చలు, వాగ్వివాదాలు ఇష్టం. భార్య విద్యావంతురాలు, అందగత్తె అయినా, ఇద్దరికీ పడదు. ఆమెకు పిల్లలపై కోరిక ఉండదు. ఉన్నా పిల్లల్ని ప్రేమించదు. అప్పుడప్పుడు ధన నష్టం కలుగుతుంది. చివరకు జలగండం వల్ల మరణం ప్రాప్తిస్తుంది.

8. రవి, శుక్ర మండలాలు ఉన్నతంగా ఉన్న వ్యక్తి పరాక్రమవంతుడు, ప్రతిభాశాలి, ధైర్యసాహసాలు కలవాడై ఉంటాడు. కాని స్త్రీకి దాసోహం చేస్తాడు. ఆశ్రితులకు ఉదారంగా సహాయం చేస్తాడు. సంగీత, సాహిత్యాల పట్ల ఆసక్తి, అభిరుచి ఉంటుంది. మెతక స్వభావం వల్ల ధననష్టం కలుగుతుంది. అప్రయత్నంగా అన్ని సుఖాలు, సంపదలు లభిస్తాయి. శత్రువులు బహుస్వల్పం. అయినవారు, ఆశ్రితులే శత్రువులుగా మారుతుంటారు. వీరి బలహీనత స్త్రీ. లోలత్వం, వ్యసనం, తాగుడు, మాంసాహారం, విలాసజీవితం, సుఖభోగాలపట్ల ఆసక్తి.

ఒక సూచన

గురు, శని, రవి, బుధ క్షేత్రాల బలాలను వాటి ఎత్తు పల్లాలను బట్టి, వాలును బట్టి, ఇతరక్షేత్రాల వైపు మొగ్గు చూపడం బట్టి, వేళ్ళ బలాన్ని బట్టి నిర్ణయిస్తాం. చంద్ర, కుజ, శుక్ర క్షేత్రాలను వాటి నైసర్గిక స్థితిని బట్టి నిర్ణయించలేం. వాటిపైన ఉన్న శుభ చిహ్నాలను బట్టి, అశుభ చిహ్నాలను బట్టి బలాబలాలు నిర్ణయించాలి. రాహుమండలం ఎత్తును బట్టి, గుంటను బట్టి నిర్ణయించాలి. కుజక్షేత్ర బలాన్ని మణికట్టు గట్టిదనాన్ని ఆధారం చేసుకుని దానిపై నున్న కంకణ రేఖల్ని బట్టి నిర్ణయించాలి.

## రవి క్షేత్రంపై చిహ్నాలు

1. రవి, శనిక్షేత్రాల మధ్య సంకలన చిహ్నం (ప్లస్) ఉన్న వ్యక్తి జన్మతః విచారగ్రస్తు డవుతాడు. బ్రతికినంత కాలం బాధలకులోనై చీకు చింతలతో సతమత మవుతాడు. పవిత్రంగా, నిజాయితీగా జీవించినా సుఖపడడు. అతనికి దొరికే స్నేహితులు నీచులు, చరిత్రహీనులు అయివుంటారు.




2. రవి, శని మండలాల మధ్య సంకలన చిహ్నం ఉండి దానికి పైగా ఒక చిన్న రేఖ ఉంటే అతడు దుష్కర్మల వల్ల కారాగార శిక్ష అనుభవిస్తాడు. హత్యా నేరంలో పట్టుబడ తాడు.

3. రవి మండలంలో ఒక స్పష్టమైన గుణకచిహ్నం (ఇంటు) చాలాశ్రేష్టం. ఇంటు గుర్తున్న వ్యక్తి ధర్మవేత్త, శాస్త్రజ్ఞుడు,

విద్యావంతుడు అవుతాడు. ఉన్నత పదవులు పొంది, ధనార్జన చేసి, గౌరవం పొందుతాడు. ప్రజాసేవలో ఉంటే మంచి నాయకు డనిపించుకుంటాడు.

స్త్రీ హస్తంలో ఈ గుణకచిహ్నం ఉంటే ఆమె గొప్ప సౌందర్యవతి, విలాసిని అవుతుంది. ధనం మీద కాంక్షతో వ్యభిచారం చేస్తుంది. కాని ఎవరితోనూ శాశ్వత సంబంధం పెట్టుకోదు. పలుకుబడి కోసం, పరపతి కోసం, అధికార దర్పం కోసం శీలాన్ని వాడుకుంటుంది. ఆమె అందచందాలకు, హావభావాలకు ఎలాంటి మగవాడైనా పడిపోతాడు.

4. రవిక్షేత్రంపై చతుర్భుజ చిహ్నం ఉన్న వ్యక్తి సహజంగా మంచి ఆస్తిపరు డవుతాడు. వ్యాపారంలో రాణిస్తాడు. రవిక్షేత్రం యొక్క బలాన్ని బట్టి అతని ప్రావీణ్యం ఉంటుంది. రవిక్షేత్రం బలంగా ఉంటే వ్యాపారంలో రాణిస్తాడు. డబ్బు బాగా గడిస్తాడు. పెద్ద పరిశ్రమలు నెలకొల్పుతాడు. విజ్ఞానం నిమిత్తం విదేశ పర్యటనలు చేస్తాడు. అతని విద్యా వివేకాలు లోకానికి బాగా ఉపయోగిస్తాయి. చతుష్కోణం అన్ని ఆపదలను, అవరోధాలను దాటించి, విజయం సంపాదించి పెడుతుంది. వీరికి ధన సంపాదన కొదవుండదు. ఆశించిన సుఖభోగాలన్నీ అనుభవిస్తాడు. హైక్లాసుగా జీవితం గడిచిపోతుంది.

5. రవిక్షేత్రంలో ద్వీపచిహ్నం మంచిది కాదు. ఆ చిహ్నం ఉన్న వ్యక్తి జీవితంలో అధికభాగం అపకీర్తి పాలవుతాడు. మనఃక్లేశాలు, శారీరక రోగాలు అధికంగా ఉంటాయి. పుత్ర శోకం అనుభవించ వలసి వస్తుంది.

6. రవిక్షేత్రంపై చిన్న చిన్న రేఖలు వల వలె ఏర్పడితే, అతను చంచల బుద్ధి కలవాడు, కోపిష్టి అవుతాడు. బుద్ధి మాంద్యం వల్ల కష్టాల పాలవుతాడు. భార్యాబిడ్డల వల్ల, బంధుమిత్రుల వల్ల సుఖం ఉండదు. సదా దరిద్రంతో బాధ పడుతుంటాడు. అతని భార్యకు అబార్షన్ అయి రోగిష్టిగా బ్రతుకుతుంది.



7. రవి, శని మండలాల మధ్య చిన్న రేఖల వలె ఏర్పడిన ఆ వ్యక్తి అన్ని దుర్గుణాలు కలిగి రాక్షసంగా ప్రవర్తి

స్తాడు. అతని పనులు కిరాతకంగా ఉంటాయి. నరరూప రాక్షసుడుగా అపకీర్తి పొందుతాడు.

8. రవి, బుధ క్షేత్రాల మధ్య వల చిహ్నం ఉన్న వ్యక్తి ఏ రంగంలోనూ రాణించలేడు. అతని చేయి తాకితే బంగారం మట్టి అవుతుంది. అలాంటి వారికి దూరంగా ఉండడం మంచిది.

9. రవిక్షేత్రంలో ఎక్కడ వున్నా నల్లని మచ్చ అనారోగ్య సూచన, ఆ మచ్చ ఉన్నంత కాలం ప్రవాస జీవితం తప్పదు. బంధుమిత్రులకు దూరంగా బ్రతుకుతాడు. అప్రతిష్ట పాలవుతాడు. వాని తల్లిదండ్రులు రోగగ్రస్తు లవుతారు. ఇంట్లో ప్రతిరోజు దెబ్బలాటలు జరుగుతాయి.

ఈ మచ్చ రవిక్షేత్రంలో మధ్యగా ఉంటే అతని సోదరులు మరణిస్తారు. ఆ వ్యక్తి నీచపు పనులు చేసి అపఖ్యాతి పాలవుతాడు. రోగగ్రస్థ డవుతాడు. కాని అనేక ప్రభుత్వ గౌరవాలు, సత్కారాలు పొందగలుగుతాడు.

10. రవి మండలంలో అర్ధవృత్తం ఉండి, అదే చిహ్నం అనామిక మూడవ పర్వంలోనూ ఉంటే, ఆ వ్యక్తి విశ్వాస ఘాతకుడు, కపటి, కలహప్రియుడు, రోగి అవుతాడు. ఉద్యోగి అయితే, పైవారి ఆగ్రహానికి తరచు గురవుతుంటాడు.

11. అనామిక మూలస్థానం నుండి బయలుదేరిన వంకరరేఖలు రవిక్షేత్రం మధ్య వరకు సాగితే, ఆ వ్యక్తి దురహంకారి, మొండివాడు, నీచ కార్యాసక్తుడు అవుతాడు. ఆడంబరాలు అధికం. అతని తల్లి రోగగ్రస్థురాలు, భార్య ఉత్తమురాలు అవుతారు. అతను సంసారం గురించి, భార్యాబిడ్డల గురించి, వారి సుఖం గురించి విచారిస్తుంటాడు. ఉన్నత పదవులు పొందగలడు. జీవితంలో మొదటి సగంలో కష్టాలు, రెండవ సగంలో సుఖాలు. చివరకు తీర్థయాత్రలో మరణిస్తాడు.



12. రవిక్షేత్రంపైన అనామిక మూల స్థానంలో అర్ధ చంద్రాకార చిహ్నా మున్న వ్యక్తి అనేక బాధలు అనుభవించి, అపవాదులతో కృశిస్తాడు. కళ్ల జబ్బుతో

చూపు కోల్పోతాడు. రవిక్షేత్రం ఉన్నతమైతే కళా సారస్వత రంగాలలో ప్రవీణుడై సర్వత్రా సన్మానాలు పొందుతాడు. సుఖ సంపదలు పుష్కలంగా అనుభవిస్తాడు.

13. రవిక్షేత్రం ఉన్నతంగా ఉండి, అనామిక మధ్య వ్రేలివైపు వంగిన ఆ వ్యక్తి ఉన్నత కళాకారు డవుతాడు. గొప్ప చిత్రకారుడు, ఉపన్యాసకుడు అవుతాడు. కానీ అతనికి కోపం అధికం. ఎప్పుడూ చిటపటలాడుతుంటాడు. మనస్సు నిష్కల్మషంగా ఉంటుంది. సినిమా ఆర్ట్ డైరెక్టర్లు, డిజైనర్లు, పబ్లిసిటీ ఆర్టిస్టులు ఈ లక్షణం కలిగి ఉంటారు. వీరు మిత్రుల వల్ల, నమ్మిన వారి వల్ల మోస పోతుంటారు.




14. రవి మండలం నీచంగా ఉండి, అనామిక మధ్యవ్రేలి వైపు వాలినట్లున్న లేదా అటు వంగిన ఆ వ్యక్తి కళాకారుడైనా గుర్తింపు పొందడు, రాణింపుకు రాడు. అది నీచ రవి ప్రభావం. ధనవ్యయం చేస్తాడు. మిత్రుల వలన వ్యసనాల పాలవు తాడు. స్త్రీలోలుడై పతనం చెందుతాడు.

15. రవిక్షేత్రం పైభాగంలో బయలు దేరిన రేఖ అస్తవ్యస్తంగా అనామిక మొదటి పర్వం వరకు సాగితే అతను మహా ఐశ్వర్య సంపన్నుడవుతాడు. ఉన్నతాశయాలు కలిగి వుంటాడు. తంత్ర మంత్ర విద్యలు అభ్యసిస్తాడు. రేఖ అస్పష్టంగా వుంటే అతను సంసారం త్యజించి సన్యసించడం జరుగుతుంది.

16. రవి, శని మండలాల మధ్యలో ఒక చిన్న అడ్డరేఖ ఉంటే ఆ వ్యక్తి అవివేకి, దురాలోచనాపరుడు, కోపిష్టి అవుతాడు. పిత్రార్జిత సంపదలు నాశనం చేస్తాడు. రోగాలతో కృశిస్తాడు. అతని సంపదలు పర స్త్రీలు అనుభవిస్తారు. అనాథలన్నా, దీనజనులన్నా ప్రేమ, దయ. వారికై తన ధనం ఖర్చు చేస్తాడు. వాహన ప్రమాదాలలో గాయపడతాడు.

17. అనామిక మూలస్థానంలో అర్థవృత్త చిహ్నం ఉంటే, ఆ వ్యక్తి భయంకరమైన కష్టాలు పడతాడు. వావివరుసలు పాటించక వ్యభిచరిస్తాడు. శాడిస్టుగా

బ్రతుకుతాడు. అనాథ బాలికలు, విధవస్త్రీలు అతనికి ఇష్టం. తన కోర్కెల కోసం హత్యలు చేయడానికైనా జంకడు.

స్త్రీ హస్తంలో ఈ లక్షణం అధిక కామాసక్తి సూచిస్తుంది. కాని సమాజానికి భయపడి వ్యభిచరించదు. తన పతి సంగమంలోనే తన కిష్టమైన వారిని ఊహించుకుని తృప్తి చెందుతుంది. చివరకు తృప్తి లేక ఆత్మహత్యకు పాల్పడుతుంది.

18. రవి మండలంలో పై భాగంలో అర్ధవృత్తం ఉంటే, అతని స్వభావం సరళంగా ఉంటుంది. ఎలాంటి దురాలోచనలు, దుర్గుణాలు ఉండవు. చక్కని జీవితం సాగుతుంది.

19. రవిక్షేత్రం పైభాగంలో అర్ధవృత్త చిహ్నం ఉండి, దాని రెండు చివర్లను ఒక స్పష్టమైన రేఖ కలుపుతూంటే అతను మహాజ్ఞాని అవుతాడు లేదా గొప్ప ప్రజా నాయకుడవుతాడు. మహాభోగాలు, ఐశ్వర్యాలు అనుభవిస్తాడు. అతనిలో వశీకరణశక్తి అధికం. వ్యాపార దక్షత అధికం. గురు, బుధ క్షేత్రాలపై శుభ చిహ్నాలుండి, రవిక్షేత్రం బలహీనంగా ఉన్నా పై ఫలితాలు కలుగుతాయి. అయినా మధ్య వయస్సులో విరక్తి పెంచుకుని అన్ని సుఖాలు వదులుకొని సన్యసించడమో, విరాగి కావడమో జరుగుతుంది.




20. రవిక్షేత్రం పైన అనామిక మూలస్థానంలో రెండు నిలువు రేఖలున్న వ్యక్తి మిక్కిలి ధనవంతుడవుతాడు. కీర్తి కాంక్ష ఎక్కువ. కళాకారుడు, సాహితీవేత్త అవుతాడు. రవిక్షేత్రం బలహీనంగా ఉంటే అతను కాముకుడవుతాడు. పరస్త్రీ వ్యసనం ఎక్కువ. సాహిత్యంలో, కళల్లో రాణించడు. లేని ప్రతిభను చెప్పుకుని స్త్రీలను వశపరచు కుంటాడు.

21. రవిక్షేత్రంలో మధ్యన అనామిక మూల స్థానంలో రెండు వంకర రేఖలున్న వ్యక్తి దుర్మార్గుడు, నిందార్హుడు, కోపిష్టి అవుతాడు. సమాజంలో అపకీర్తి గడిస్తాడు.

22. రవి, శని క్షేత్రాల నడుమ వేళ్ళ మూలస్థానంలో రెండు నిలువు రేఖలున్న ఆ వ్యక్తి స్వభావం కఠినంగా ఉంటుంది. అనేక దుర్గుణాలుంటాయి. పైకి బుద్ధిమంతునివలె, ఉత్తమునివలె కనిపిస్తాడు. కీర్తికండూతి అధికం. కడకు మానసికంగా క్రుంగి కృశించి పోతాడు.




23. రవి, శని క్షేత్రాలమధ్య వేళ్ల మూలస్థానంలో ఒకే ఒక్క రేఖ ఉండడం అదృష్టం. అలాంటి వ్యక్తి పవిత్రంగా జీవిస్తాడు. నీతితప్పి చరించడు. ఎంత ప్రతిభ ఉన్నా అహంకారం, గర్వం, స్వార్థం ఉండవు. తన ప్రతిభతో రాణిస్తాడు. కాని మిత్రులు అతనిని చూచి అసూయపడి, అపనిందలు వేస్తారు. వీరు రచయితలు, జర్నలిస్టులు, ప్రజానాయకులుగా రాణిస్తారు. స్వయంకృషితో బాగా సంపాదిస్తారు. తాతగారి ఆస్తికి వారసులవుతారు.




24. రవి మండలం పైభాగం నుండి రెండు రేఖలు సమాంతరంగా శనిక్షేత్రం లోకి వెళ్లితే అతను మహా పాపి, విశ్వాస హీనుడు అవుతాడు. పైకి ఉత్తముడుగా కన్పించినా, దుష్కర్మలు చేస్తాడు. ఎన్ని దుర్మార్గాలు చేసినా, పైకి పోతూ ఉంటాడు. వానికి స్త్రీ వ్యసనం అధికం. భార్య కురూపి, కులట అవుతుంది.

25. అనామిక, మధ్యమాంగుళి మధ్య నుండి ఒక రేఖ అస్తవ్యస్తంగా రవి క్షేత్రంలోకి పోతే, ఆ వ్యక్తి

అభిమాన వంతుడు కాని పరమ మూర్ఖుడుగా ప్రవర్తిస్తాడు. మనిషిలో కపటం ఎక్కువ. వ్యసనపరుడై, నిరాశతో జీవిస్తుంటాడు.

26. హృదయరేఖ నుండి బయలుదేరిన ఒక రేఖ కొంత మందంగా రవిక్షేత్రాన్ని దాటి అనామిక, మధ్య వేలు మూలస్థానం వరకు చేరితే అతను సదా విచారగ్రస్థుడై అనేక కష్టనష్టాలు అనుభవిస్తాడు. కాని కష్టాలను లెక్క చేయక కీర్తి సంపాదిస్తాడు. అతను సహాయం చేసినవారంతా అతనికి అపకారం చేస్తారు. తనకు హాని చేసిన వారిని సైతం క్షమించగల స్వభావం అతనిది.

27. రవి మండలంపైన ఒక త్రిభుజచిహ్నం ఉండి, అది తెగినట్టున్న, ఆ వ్యక్తి అనేక సద్గుణాలు కలవాడవుతాడు. ఐశ్వర్యసంపదలు పొంది సుఖపడతాడు. వానికి పిల్లలు కలగరు. దత్త పుత్రుడు వ్యసనపరుడై తండ్రిని హత్య చేస్తాడు.

28. రవి, బుధ క్షేత్రాల మధ్యన నక్షత్ర చిహ్నం ఉండడం మంచిది. అతనికి వివాహానంతరం అదృష్టం కలిసి వస్తుంది. భార్య వల్ల సంపదలు రావచ్చు. లేదా వివాహానంతరం అదృష్టం కలిసిరావచ్చు.

29. రవిక్షేత్రంలో నక్షత్ర చిహ్నం ఉండి, రవిరేఖ స్పష్టంగా లేకపోతే ఆ వ్యక్తి ఎంత డబ్బు, కీర్తి సంపాదించినా ఎప్పుడూ దిగులుగా ఉంటాడు. చెప్పుకోలేని బాధలతో క్రుంగిపోతుంటాడు.

# 10. అదృష్టరేఖ

**మ**నిషి అదృష్టాన్ని, భోగభాగ్యాలను తెలియజేసే రేఖను అదృష్టరేఖ, భాగ్యరేఖ అంటారు. మనిషి తనకున్న దానితో తృప్తి పడడు. మనిషి కోరికలు, ఆశలు, ఆశయాలు ఎంతవరకు ఫలించేదీ చెప్పేది అదృష్టరేఖ. కొందరి చేతులలో అదృష్టరేఖ ఉండదు. అయినా భోగభాగ్యాలకు, సుఖాలకు కొదవ ఉండదు. కేవలం గ్రహక్షేత్రాల బలం వల్ల వారికి అదృష్టం పడుతుంది. అదృష్టం వరించాలంటే కృషి, పట్టుదల, అర్హత ఉండాలి. కృషి లేకపోయినా కొందరిని అదృష్టం వరిస్తుంది. అలాంటివారు అదృష్ట జాతకులు. కష్టపడి పనిచేస్తేగానీ కొందరిని అదృష్టం వరించదు. కష్టపడి అదృష్టాన్ని వరించే వారికి అండగా నిలుస్తుంది అదృష్టరేఖ. దానికి అండగా నిలుస్తుంది రవిరేఖ. ఈ రెండు రేఖలు ప్రక్కప్రక్కనే ఉంటాయి కనుక అదృష్టాన్ని బేరీజు వేసేటప్పుడు రెంటినీ కలిపి చూడాలి. అదృష్టరేఖ మనిషి కృషిని, ఉద్యోగ, వ్యాపార ఫలాల్ని సూచిస్తుంది. రవిరేఖ మనిషి వైభవాన్ని, ఉన్నతిని సూచిస్తుంది.

అదృష్టరేఖ సాధారణంగా శుక్రక్షేత్రం, చంద్రమండలం మధ్య జాగా నుండి గానీ, ఆ రెండుక్షేత్రాలలో ఏదో ఒక దాని నుండి గానీ బయలుదేరుతుంది. లేక అరచేయి మధ్య ఎక్కడ నుండైనా బయలుదేరవచ్చు. ఎక్కడ నుండి ఎలా ప్రారంభమైనా అది శనిక్షేత్రానికే చేరుతుంది. మధ్య మస్తిష్క, హృదయ రేఖలను దాటి నడుమ వంపుతిరిగి గురు, రవి, బుధ క్షేత్రాలలోనికి వెళ్ళవచ్చు. అలా దారి తప్పిన అదృష్టరేఖ ఫలితాలు విచిత్రంగా, అసాధారణంగా ఉంటాయి. చాలా జాగ్రత్తగా పరిశీలించి ఫలితాలు నిర్ణయించవలసి ఉంటుంది. తొందరపడి రకరకాల అదృష్టాలు వరిస్తాయని చెప్పకూడదు. ఆయా క్షేత్రాల బలాలు, వాటిపైన ఉన్న శుభాశుభ చిహ్నాలు అదృష్టాన్ని పెంచడం, నిరోధించడం జరుగుతుంది.

1. చంద్రమండలం, శుక్రక్షేత్రం మధ్యన, అనగా జీవితరేఖకు సమీపంగా అదృష్టరేఖ బయలుదేరి, శనిక్షేత్రానికి సరాసరి వెళ్లిన, ఆ వ్యక్తి గొప్ప అదృష్ట జాతకుడని చెప్పవచ్చు. రవి క్షేత్రంలోకి పోతే కళా, సాహిత్య రంగాలలో ప్రతిభావంతు డవుతాడు. బుధ మండలం దిశగా పోతే పెద్ద పారిశ్రామిక వేత్తగా, ఎక్జిక్యూటివ్‌గా, వాణిజ్యవేత్తగా రాణిస్తాడు. శనిక్షేత్రానికి పోయిన అదృష్టరేఖ అక్కడ వంపు తిరిగి గురుక్షేత్రం దిశగా పయనిస్తే అతను మహర్జాతకుడవుతాడు. మహాత్ముడనిపించుకుంటాడు. మహోన్నత పదవులు అలంకరిస్తాడు. కాని ఔన్నత్యం అంతా ఒక స్త్రీ స్నేహంతో సమాప్తి చెందుతుంది. రాజకీయ రంగంలో ఇలాంటి లబ్దప్రతిష్టలు, లుబ్దప్రతిష్టులు కనిపిస్తారు.




2. ఒక్కొక్కరి హస్తంలో భాగ్యరేఖ అసలు కనిపించదు. అతను దరిద్రుడని, దురదృష్ట వంతుడని నిర్ణయించకూడదు. అది లుప్త భాగ్యరేఖ. భాగ్యరేఖ లుప్తమైనా అతని జీవితం ఎలాంటి ఒడుదుడుకులకు లోనుకాదని అర్థం. సాఫీగా, ఎగుడు దిగుళ్లు లేకుండా నిర్విచారంగా సాగుతుంది. సామాన్య జీవితం గడుపుతూ, ఎలాంటి పేరు ప్రఖ్యాతులు పొందనివారి చేతులలో అదృష్టరేఖ కనిపించదు.

3. కొన్ని చేతులలో అదృష్టరేఖ హృదయరేఖ నుండి మాత్రమే స్పష్టంగా ఉంటుంది. అలాంటివారు జీవితం ద్వితీయార్థంలో అంటే 50 సంవత్సరాల తర్వాత సుఖపడతారు. సంపూర్ణంగా జీవిస్తారు. అప్పుడు జీవితంలో ఏ లోటు ఉండదు. హృదయరేఖ దాటిన తర్వాత అదృష్టరేఖ స్పష్టంగా ఉన్నవారు బాల్యంలో కష్టపడినా చివరి జీవితం సుఖమయం చేసుకుంటారు. ఇలాంటి వారిని జూదాలు, లాటరీలు వరించవు. కష్టపడి సంపాదించుకున్నదే మిగులుతుంది. స్వయంకృషితో అదృష్టవంతులవుతారు.

4. అదృష్టరేఖ జీవితరేఖ నుండి, లేక దానికి సమీపం నుండి గానీ బయలుదేరి శనిక్షేత్రం దాటి, మధ్యవేలు క్రింది పర్వంలోకి పోతే ఆ రేఖ ఎర్రని రంగులో ఉంటే ఆ వ్యక్తి దారుణంగా మృతిచెందుతాడు. జైలుశిక్ష అనుభవిస్తాడు. దీనికి తోడు మధ్యవ్రేలి మొదటి పర్వంపైన ఒక నక్షత్రచిహ్నం ఉంటే జీవితాంతం అసంతృప్తిగా, ఆవేశంగా గడిపి పక్షవాతంతో మరణిస్తాడు.

5. ఎవరిచేతిలోనైనా అదృష్టరేఖ ఆరంభంలో ఛిద్రంగా, అస్తవ్యస్తంగా, గొలుసులాగా ఉంటే అతను బాల్యంలో తండ్రి దరిద్రం వల్ల అనేక కష్టాలు పడవలసి ఉంటుంది. లేక అతని అభివృద్ధికి ఆరంభంలో అనేక ఆటంకాలు ఏర్పడతాయి.




6. అదృష్టరేఖ, హృదయరేఖ సమీపంలో ఛిన్నాభిన్నమైతే అతడు భగ్న ప్రేమికుడవుతాడు. ప్రేమించిన స్త్రీని వివాహం చేసుకోలేడు. చేసుకున్న స్త్రీతో సుఖపడడు. సంసార జీవితం నరకప్రాయ మవుతుంది. అతను ఎవరిని ప్రేమించినా, అతను ప్రేమకు ఆటంకాలు ఏర్పడుతుంటాయి.

7. అదృష్టరేఖ మధ్యభాగం బలహీనంగా ఉండి సరిగా, స్పష్టంగా కనిపించకపోయినా, లేదా కొంతమేర అసలు లేకపోయినా, అతను మధ్య వయస్సులో అనేక కష్ట నష్టాలు ఎదుర్కోవలసి వస్తుంది. అతని చదువు, ఉద్యోగం, తెలివి ఏవీ అక్కరకు రావు.




8. అదృష్టరేఖ అల వలె వంకరటింకరగా చిన్నముక్కలుగా ఉన్న వ్యక్తి స్థిమితంలేక, అందరితో కలహిస్తుంటాడు. ఏ పని నిలకడగా చేయడు. ఒక ఉద్యోగం స్థిరంగా చేయడు. రెండు రేఖలు అల వలె ఏర్పడిన

జీవితాంతం అశాంతితో గడపవలసి వస్తుంది. అవి జంట అదృష్టరేఖలని పొరపడరాదు. అదృష్టరేఖ కొంతదూరం లోతుగా, కొంత వంకరగా, అనేక చిన్న రేఖలతో జతపడిన వ్యక్తి ఉద్రేక స్వభావం కలిగి ఉంటాడు. అతని ఉద్రేకంవల్ల నరాల బలహీనత ఏర్పడుతుంది. ఆ బలహీనత అతని అభివృద్ధికి ఆటంకమవుతుంది.



9. అదృష్టరేఖ మూడు మణిబంధరేఖల క్రింద ప్రారంభమై శనిక్షేత్రం వరకు వెళ్ళిన, ఆ వ్యక్తి సదా విచారగ్రస్తు డవుతాడు.

10. అదృష్టరేఖ మణిబంధనరేఖ నుండి ప్రారంభమైతే అతడు బాల్యం లోనే కుటుంబం బాధ్యతలు వహించ వలసి వస్తుంది.

11. అదృష్టరేఖ మొదటి మణి బంధనరేఖ నుండి బయలుదేరి హృదయ రేఖతో ఆగిన, ఆ వ్యక్తి ప్రేమ వ్యవహారాల్లో చిక్కుకుంటాడు. గుండె జబ్బులు కొని తెచ్చుకున్నట్లవుతుంది.

12. అదృష్టరేఖ మణిబంధనరేఖ నుండి ప్రారంభమై మూడవపర్వం వరకు ఉన్న వ్యక్తిని విపరీతమైన అదృష్టం వరిస్తుంది.

13. అదృష్టరేఖ జీవితరేఖ నుండి బయలుదేరిన వ్యక్తి స్వయంకృషితో రాణిస్తాడు. అయినవారు అతని అదృష్టానికి అసూయపడుతుంటారు. గురు, శుక్ర క్షేత్రాలు బలంగా వుంటే ఆ వ్యక్తి ఉన్నతస్థితికి చేరుకుని, ఐశ్వర్య వంతుడై, సుఖశాంతులు పొందుతాడు. ఇది గొప్ప అదృష్టరేఖ అని చెప్పవచ్చు.



14. అదృష్టరేఖ జీవితరేఖ సమీపం నుండి బయలుదేరిన, ఆ వ్యక్తి బంధుమిత్రులు అతనికి మార్గదర్శకులై అతని అభివృద్ధికి అన్నివిధాలా సహాయ సహకారాలు అందిస్తారు.

15. అదృష్టరేఖ జీవితరేఖ లోపలనుండి అనగా శుక్రక్షేత్రం నుండి బయలుదేరిన – అతని కుటుంబ సభ్యులే అన్ని విధాల సహాయం చేస్తారు.

16. అదృష్టరేఖ చంద్ర మండలం నుండి బయలుదేరిన ఆ వ్యక్తి పుష్కలంగా సుఖభోగాలు, ఐశ్వర్యం అనుభవిస్తాడు. అతనికి జీవితమే ప్రేమాలయం. అందరూ ప్రేమించదగినవారే. అతని అభివృద్ధికి స్త్రీలు ఎక్కువగా సహాయపడతారు.




17. అదృష్టరేఖ అరచేయి మధ్య నుండి బయలుదేరి శని క్షేత్రం చేరిన – ఆ వ్యక్తి స్వయంకృషి వల్ల జీవితం అనేక మార్పులు చెందుతుంది. అతని అభివృద్ధికి ఎవరి సహాయం ఉండదు. స్వయంకృషితో, స్వీయ ప్రతిభతో ఉన్నతస్థితికి చేరతాడు. ఆ రేఖ మధ్యవ్రేలి మూడవపర్వం వరకు పోయిన అతను దురదృష్టవంతుడవుతాడు.

18. అదృష్టరేఖ హృదయ, మస్తిష్క రేఖల నడుమ ప్రారంభమైన వ్యక్తి 35 సంవత్సరాలకు గాని స్థిరపడడు. అప్పుడు అతనిని అదృష్టం వరిస్తుంది. మంచి ఉద్యోగంలో, లేదా వ్యాపారంలో స్థిరత్వం ఏర్పడుతుంది. ఒకస్థితిలో జైలు పాలవుతాడు. 40 వయస్సు తర్వాత అతను వెనుతిరిగి చూడవలసిన పని ఉండదు.

19. భాగ్యరేఖ ఆరంభంలో రెండుగా చీలివున్న – ఆ వ్యక్తి అదృష్టానికి ఒక దూరపు బంధువు సహాయం లభిస్తుంది. లేదా దత్తుపోవడం వల్ల అదృష్టం వరిస్తుంది. అందులో ఒకశాఖ శుక్రస్థానం నుండి బయలుదేరితే – అతను చిన్నతనంలోనే దత్తుపోతాడు. లేదా తలిదండ్రులకు దూరమై అనాథగా ఎవరి పంచనో జీవిస్తాడు.

20. భాగ్యరేఖ రెండు పాయలు కలిసి ఏర్పడితే అందులో ఒకటి శుక్రమండలం నుండివచ్చి కలిసినట్లున్న, అది కలిసే వయస్సులో ప్రేమ వ్యవహారం సాగుతుంది. ఆ రేఖ సవ్యంగా ఉంటే ప్రేమించిన వ్యక్తిని వివాహం చేసుకుంటాడు. ఆమె వల్ల అదృష్టం పడుతుంది.

21. అదృష్టరేఖ చంద్రమండలం నుండి బయలుదేరి హృదయరేఖతో అంతమైతే అతడు భగ్నప్రేమికుడవుతాడు. ప్రేమించిన స్త్రీని పొందలేక వ్యధకు లోనవుతాడు. విఫల ప్రేమ కారణంగా గుండె జబ్బులకు గురి అవుతాడు.




22. రెండు చేతులలో భాగ్యరేఖ రాహుమండలం నుండి, అనగా అరచేయి మధ్య నుండి బయలుదేరిన – ఆ వ్యక్తి పట్టుదలతో, స్వయంకృషితో అదృష్ట వంతుడవుతాడు. అవకాశాలను చక్కగా వినియోగించుకుంటాడు. ఆ రేఖ మధ్య వేలు మూడవ పర్వంలోకి వెళితే కొన్ని కష్టనష్టాలు తప్పవు. జీవితం బాధా మయమవుతుంది.

23. కొందరి చేతిలో భాగ్యరేఖ మస్తిష్కరేఖ నుండి బయలు దేరుతుంది. అలాంటి వారు 30–35 సం॥ల వయస్సులో రాణింపుకు వస్తారు. అప్పుడు వారిని అదృష్టం వరిస్తుంది. మంచి ఉద్యోగం రావడం, వ్యాపారంలో స్థిరపడడం ఆ వయస్సులో జరుగుతుంది. గురు, శని, బుధ క్షేత్రాల బలాన్ని బట్టి, ఉద్యోగం, వ్యాపారం, స్వతంత్ర జీవనం నిర్ణయించాలి. ఆ మూడు క్షేత్రాలు బలహీనంగా ఉంటే వచ్చిన అవకాశం చేజారిపోతుంది. ఆ క్షేత్రాలు బలంగా ఉంటే ఉన్నత పదవులు, విజయాలు లభిస్తాయి.

24. మస్తిష్కరేఖ నుండి బయలుదేరిన భాగ్యరేఖ అర్ధచంద్రాకారంగా శనిక్షేత్రంలోకి వెళితే – ఆ వ్యక్తి కష్టపడి, అదృష్టాన్ని వెదుక్కోవాలి. అనాయాసంగా ఏవీ సమకూరవు. వంకరరేఖలు ఎప్పుడూ మైనస్ మార్కులే. కొంత అపజయాన్ని, ఆలస్యాన్ని సూచిస్తాయి.

25. భాగ్యరేఖ సగం వరకు అతిపలచగా, పేలవంగా ఉండి, చంద్రమండలం బలంగా వుంటే ఆ వ్యక్తి పచ్చి స్వార్థపరుడవుతాడు. అభిమానం వల్ల అభివృద్ధిని చెడగొట్టుకుంటాడు.

26. భాగ్యరేఖ మస్తిష్కరేఖతో ఆగిపోయిన వ్యక్తి స్వయంకృతాపరాధాల వల్ల అదృష్టం చేజార్చుకుంటాడు. అతని అపజయాలకు, దురదృష్టానికి అతని చేతలే కారణం. అతను మానసికంగా బలహీనుడవుతాడు.

27. అదృష్టరేఖ, హృదయరేఖతో ఆగిపోయినా, శనిమండలంలో అనేక రేఖలున్నా, ఆ వ్యక్తి ప్రేమ వ్యవహారాలలో భంగపడతాడు. సంసారసుఖం

తగ్గిపోతుంది. మతి చలించినా ఆశ్చర్యం లేదు. ప్రేమ వైఫల్యమే అతని చిత్త చాంచల్యానికి కారణం.

28. భాగ్యరేఖ సూటిగా గురుక్షేత్రంలోకి వెళ్లినా, లేక గురు మండలాన్ని చూచినా, ఆ వ్యక్తి అన్ని విధాల అదృష్టవంతుడు. ప్రేమించిన అమ్మాయితో సుఖంగా జీవించి ఆదర్శ దంపతు లనిపించుకుంటారు.

29. రెండు చేతులలో భాగ్యరేఖ బుధమండలానికి పోయినట్లు స్పష్టంగా వుంటే ఆ వ్యక్తి వ్యాపార, వాణిజ్య, శాస్త్ర, విజ్ఞాన, పరిశోధనా, వైద్య రంగాలలో ఏదో ఒక దానిలో ప్రతిభావంతు డవుతాడు. గొప్పగా ధనం సంపాదించి భోగభాగ్యాలు అనుభ విస్తాడు. విదేశాలు పర్యటిస్తాడు.




30. అదృష్టరేఖ చివరన మూడు పాయలుగా చీలి గురు, శని, రవి క్షేత్రాలకు మూడు పాయలు పోయిన – ఆ వ్యక్తి మహా మేధావి, ఉన్నతాశయాలు కలవాడు. తన ప్రతిభా విశేషాలతో ఉన్నత స్థితికి వస్తాడు. ఇలాగ అదృష్టరేఖ చివరన మూడుగా చీలిన వ్యక్తి జీవితంలో అపజయం పొందదు.

31. భాగ్యరేఖ నుండి చిన్న రేఖలు క్రిందికి జారినట్లున్న – ఆ వయస్సులో ధననష్టం, ఆస్తినష్టం, పరువు నష్టం కలుగు తుంది. పైకి వెళ్లే రేఖలు ధనలాభం, ఉద్యోగం, అభివృద్ధి, ఆస్తిలాభం, సన్మానం సూచిస్తాయి. ఆయా వయస్సులో విద్యా, కళా, సాంస్కృతిక రంగాలలో రాణింపు, గుర్తింపు, అవార్డులు లభిస్తాయి.




32. అదృష్టరేఖ ఎన్ని ముక్కలైతే, ఎన్ని వంపులు తిరిగితే, అన్నిసార్లు జీవితంలో మార్పులు, వృత్తి, ఉద్యోగాలలో మార్పులు వచ్చి తీరుతాయి. ఒకరేఖ అంతమయ్యే లోగా మరొకటి బయలుదేరితే ఆ మార్పుల వల్ల

పెద్దగా కష్టం, నష్టం కలగదు. ఏవైనా రేఖలు భాగ్యరేఖను ఖండిస్తే ఆ వయస్సులో శృంగభంగం, ధననష్టం, ఉద్యోగ, వ్యాపార నష్టం తప్పవు. శనిమండలం ఉన్నతంగా ఉండి, మధ్యవ్రేలు బలంగాఉంటే అలాంటి కష్టనష్టాలు ఉండవు. మధ్యవ్రేలు వంకరగా ఉన్నా కష్టనష్టాలు తప్పవు. అదృష్టరేఖ లోపాల్ని మధ్యవ్రేలు బలంగా ఉంటే పూరిస్తుంది. కాపాడుతుంది. మనిషిని పతనం కానీయదు.

33. భాగ్యరేఖ రెండు పాయలుగా చీలి, అందులో ఒక పాయ చంద్రక్షేత్రం నుండి వచ్చి భాగ్యరేఖలో కలిసినట్లున్న, అలా కలిసిన వయస్సులో ఒక ప్రమాదం జరుగుతుంది, లేదా ఒక స్త్రీ వలన మోసం జరుగుతుంది.

34. మస్తిష్క, హృదయరేఖల మధ్యన భాగ్యరేఖ ముక్కలైతే ఆ వయస్సులో ఒక స్త్రీ కారణంగా పతనం చెందుతాడు లేదా ఉద్యోగం పోతుంది. మధ్యవయస్సులో పరస్త్రీ సాంగత్యం లభిస్తుంది. రవిరేఖ స్పష్టంగా ఉంటే ఆ స్త్రీ సాంగత్యం, స్నేహం అతనికి మేలు చేస్తుంది.

35. భాగ్యరేఖ రెండు ముక్కలతో ఏర్పడి, చేతిలో ప్రయాణ రేఖలు ఎక్కువగా ఉంటే, ఆ వ్యక్తి ఎక్కువ భాగం విదేశాలలో ఉంటాడు. ఆ రేఖ గురు మండలానికి వెళ్లినచో, అది చీలిన వయస్సులో మరొక స్త్రీని వివాహం చేసుకుంటాడు. మొదటి భార్యను, బిడ్డలను వదలిపెడతాడు. తన ప్రగతికి, అదృష్టానికి అవసరమైన స్త్రీని వివాహం చేసుకుంటాడు. లేదా వివాహం కాకుండా స్నేహంగానూ కలిసి జీవించ వచ్చు.




36. చంద్ర మండలం నుండి బయలు దేరిన భాగ్యరేఖ హృదయరేఖతో కలిసి గురుక్షేత్రం వైపు వంగినట్లున్న – ఆ వ్యక్తి తన కన్న ఉన్నత స్థితిలో ఉన్న స్త్రీని వివాహం చేసుకుంటాడు. వారు ఆదర్శ దంపతులుగా రాణిస్తారు.

37. జీవితరేఖను, భాగ్యరేఖను ఏవైనా అడ్డరేఖలు ఖండించిన అవి ఖండించిన వయస్సులో కుటుంబంలో ఒడిదుడుకులు, ఉద్యోగ వ్యవహార రంగాలలో దురదృష్టం సంభవం. ఆర్థిక చిక్కులు, మానసిక వేదనలు సూచితం.

38. శుక్రమండలం దిగువ భాగం నుండి బయలుదేరిన రేఖలు ఒకటి, రెండు భాగ్యరేఖను కలిస్తే, ఆ వ్యక్తిలో కామోద్రేకం, స్త్రీ వ్యామోహం అధికంగా ఉంటాయి. తను వాంఛించిన స్త్రీని పొందడానికి ఏమైనా చేస్తాడు.

39. హృదయరేఖ నుండి క్రిందికి వాలినరేఖలు ఆ వ్యక్తి ప్రేమ వైఫల్యాలను సూచిస్తాయి. ధన నష్టం, మానసిక వేదన తప్పవు. ఆ రేఖలు భాగ్యరేఖను ఖండించిన వయసులో ఆప్తుల మరణం, ఒకచో జీవిత భాగస్వామి మరణం సూచితం.




40. మస్తిష్కరేఖ నుండి ఏవైనా రేఖలు బయలుదేరి, భాగ్యరేఖను ఖండిస్తే ఆ వయస్సులో కోర్టు వ్యవహారాలు, ఆర్థిక చిక్కులు, కళాసాహిత్య రంగాలలోని వారికి అవమానం, వ్యతిరేకత, ఉద్యోగ, వ్యాపార రంగాలలో ఇబ్బందులు కలుగుతాయి.

41. శని మండలంలో భాగ్యరేఖను ఏవైనా అడ్డురేఖలు ఖండిస్తే ఆ వ్యక్తి జీవితానికే ప్రమాదకరమైన సంఘటనలు జరుగుతాయి. కొందరికి కారాగారం ప్రాప్తిస్తుంది. ఈ చిన్న రేఖలు చతుష్కోణంగా ఏర్పడితే ఆ ప్రమాదాలు, కష్టనష్టాలు తొలగిపోతాయి.

42. శని మండలంలో, భాగ్యరేఖ చివరన ఒక గుణకచిహ్నం ఉంటే ప్రమాదం సంభవిస్తుంది. అయితే ఆ ప్రమాదం తర్వాత మనిషిలో మంచి మార్పు వస్తుంది. ఆ ప్రమాదం ఆస్తి నష్టం, ధన నష్టం కావచ్చును, ఉద్యోగ భంగం కావచ్చును.

43. భాగ్యరేఖ ఎక్కడైనా చీలితే, అలా చీలిన చోట ఒక గుణకచిహ్నం ఉంటే ప్రమాదం సంభవిస్తుంది. అయితే ఆ ప్రమాదం తర్వాత మనిషిలో మంచి మార్పు వస్తుంది. ఆ ప్రమాదం ఆస్తి నష్టం, ధన నష్టం కావచ్చును, ఉద్యోగ భంగం కావచ్చును.

44. హృదయ, మస్తిష్క రేఖల మధ్య, భాగ్యరేఖను ఆనుకుని ఒక గుణచిహ్నం ఉంటే ఆతడు పరమఛాందసుడవుతాడు. అతనికి కళాభిమానం, మతాభిమానం చాలా ఎక్కువ. మొదటి నుండి ఆ దృష్టి లేకపోవచ్చు. ఆ చిహ్నం భాగ్యరేఖను తాకిన వయస్సులో, అనగా మధ్యవయసులో పిచ్చి మతాభిమానం ఏర్పడుతుంది.

45. భాగ్యరేఖ, జీవితరేఖల నడుమ ఈ గుణకచిహ్నం ఉంటే ఆ వయస్సులో ఒక ఆత్మీయుని కోల్పోవడం జరుగుతుంది.

46. భాగ్యరేఖ ప్రారంభంలో ఒక నక్షత్ర చిహ్నం ఉంటే అతని బాల్యంలోనే కుటుంబం సర్వం కోల్పోయి దరిద్రం అనుభవిస్తుంది. భాగ్యరేఖ పైన నక్షత్రం ఆ వయస్సులో ప్రమాదాన్ని సూచిస్తుంది. లేదా చిన్న వయస్సులో తల్లిదండ్రుల మరణం సూచిస్తుంది.

47. దీనికి తోడు శనిక్షేత్రంలో మరొక నక్షత్రం ఏర్పడితే ఇతరుల వల్ల ఆ వ్యక్తికి నష్టం కలుగుతుంది.

48. భాగ్యరేఖ చివరన ఒక నక్షత్రం, జీవితరేఖ చివరన మరొక నక్షత్రం ఉంటే అతనికి పక్షవాతం తప్పదు.




49. భాగ్యరేఖ చివరన ఒక నక్షత్రం, చంద్రక్షేత్రంలో మరొక నక్షత్రం ఉంటే ఆ వ్యక్తి తప్పక ఆత్మహత్య చేసుకుంటాడు.

50. భాగ్యరేఖపైన ఒక ద్వీపచిహ్నం ఉంటే, ఆ ద్వీపం ఉన్నంత కాలం భార్యా భర్తలు కలసి ఉండరు. ఎవరికీ సంసార సుఖం ఉండదు. అన్ని విధాలా అప జయం సూచిస్తుంది. ఎంత డబ్బు వున్నా సుఖం లభించదు.

51. భాగ్యరేఖ ఆరంభంలో ఒక ద్వీప చిహ్నం ఉంటే – ఆ వ్యక్తి జననమే పరమ రహస్యం. భాగ్యరేఖ అస్పష్టంగా ఉంటే అతని తల్లి పతిత, వ్యభిచారి అయి వుంటుంది. అతనిని కని ఎక్కడో వదిలిపెడుతుంది.

52. భాగ్యరేఖపై ద్వీపచిహ్నం, గురుక్షేత్రంపై నక్షత్రచిహ్నం గల వ్యక్తి తన కన్న ఉన్నత స్థితిలో ఉన్న స్త్రీని (వయస్సులో, ధనసంపదలలో, అంతస్థులో) ప్రేమించి, రహస్యంగా ఆమెతో కామకలాపాలు సాగిస్తాడు.

రవి మండలం పైన ఒక నక్షత్ర చిహ్నం ఉన్న వ్యక్తి గొప్ప కళాకారుడు, నటుడు, సాహిత్యవేత్త అవుతాడు.

బుధక్షేత్రం పైన నక్షత్రం ఉంటే అతను గొప్ప సైంటిస్టు, డాక్టరు, వాణిజ్యవేత్త, పారిశ్రామికుడు అవుతాడు.

ఈ గ్రహ క్షేత్రాలలో ఎన్ని నక్షత్రాలుంటే అతను అంతమంది స్త్రీలతో ప్రేమ వ్యవహారం సాగిస్తుంటాడు.

53. జీవితరేఖ, హృదయరేఖల మధ్య ద్వీపచిహ్నం ఉండి, అది చివరన రెండుగా చీలితే ఆ వ్యక్తి భార్యకు విడాకులిచ్చి, ఒక అమాయకురాలిని చేరదీస్తాడు.




54. జీవిత భాగ్యరేఖల నడుమ త్రిభుజాకార చిహ్నం ఉండి, అది భాగ్యరేఖను తాకుతుంటే, కుజక్షేత్రం బలంగా ఉంటే, అతను పెద్ద సైనికాధికారి అవుతాడు లేదా పోలీసుశాఖలో పెద్ద పదవి పొందుతాడు. 'వీరచక్ర' లాంటి బిరుదులు సంపాదిస్తాడు.

55. భాగ్యరేఖపైన చతుష్కోణ చిహ్నం ఉన్న వ్యక్తి ఆ వయస్సులో పూర్తిగా ధననష్టం పొంది బికారి అవుతాడు. తర్వాత నెమ్మదిగా సంపాదించుకుంటాడు.

56. భాగ్యరేఖ మధ్యవ్రేలి లోపలకు చొచ్చుకుపోయి, ఆ రేఖపై ఎక్కడైనా చతుష్కోణం ఉంటే అతడు అన్ని ప్రమాదాలను దాటిపోగలడు.

57. రాహుక్షేత్రంలో (అరచేయి మధ్యలో) భాగ్యరేఖను తాకుతూ, జీవితరేఖ వైపుగా ఈ చతుష్కోణం ఉంటే, ఇంట్లో ఒక ప్రమాదం జరుగుతుంది. అది జీవితరేఖ మీద నిర్ధారించాలి. భాగ్యరేఖపై చుతుష్కోణం తాకే వయస్సులో ప్రమాదం జరుగుతుంది.

58. ఈ చతుష్కోణం చంద్ర మండలం వైపుగా ఉంటే అతను ప్రయాణంలో ఒక ప్రమాదంలో చిక్కుకుంటాడు.

## ప్రేమ రేఖలు

59. చంద్రమండలం నుండి బయలుదేరిన ఒక రేఖ భాగ్యరేఖకు సమాంతరంగా ప్రయాణిస్తే అతనికి జీవితంలో భార్యవలన, ఇతరుల వలన సహాయ సహకారాలు లభిస్తుంటాయి.

60. చంద్ర మండలం నుండి బయలుదేరిన ఒక రేఖ భాగ్యరేఖను కలిసే వయస్సు వివాహ వయస్సు. ఆ రేఖ కుజమండలం నుండి వచ్చి భాగ్యరేఖను కలిస్తే ఆ వివాహానికి పెద్దల ఆమోదం ఉండదు. ఎక్కడో ఉద్యోగం చేసే

అమ్మాయిని డబ్బు ఆశతో పెళ్లి చేసుకోవడం జరుగుతుంది. అది సాధారణంగా ప్రేమవివాహం అవుతుంది. కులాంతరం కావచ్చు, మతాంతరం కావచ్చు. అంతర్జాతీయం కావచ్చు.

61. అది భాగ్యరేఖను ఖండిస్తే అతను మతభ్రష్టుడు, మతిభ్రష్టుడు అవుతాడు. మనస్పర్థలు కారణంగా ప్రేమించి పెళ్లి చేసుకున్న తర్వాత విడిపోతారు.




62. అది కేవలం భాగ్యరేఖను స్పృశిస్తే వారి ప్రేమ వివాహానికి దారి తీస్తుంది. భాగ్యరేఖకన్న ఈ రేఖ బలంగా, స్ఫుటంగా ఉంటే ఆ ప్రేమించిన స్త్రీ ఇతనిని వశపరచుకుంటుంది. ప్రేమ పిచ్చిలో పడిపోయి ప్రపంచాన్నే మరచి పోతాడు.

63. ఈ రేఖ భాగ్యరేఖను చేరేలోగా, శుక్రమండలం నుండి వచ్చిన మరొక రేఖ దానిని ఖండిస్తే అతని ప్రేమను కుటుంబంలో ఎవరూ ఆమోదించరు.

64. ఈ రేఖపైన ఒక ద్వీపచిహ్నం ఉంటే ఆ స్త్రీ వలన, వివాహం వల్ల ఆ వ్యక్తి అనేక కష్ట నష్టాలు ఎదుర్కోవలసి ఉంటుంది.

65. ఆ రేఖ నుండి మరొక రేఖ బయలుదేరి రవిక్షేత్రానికి చేరితే, ఆ ప్రేమించిన స్త్రీ వల్ల అతని కీర్తి ప్రతిష్టలు పెరుగుతాయి. ఐశ్వర్యం చేకూరుతుంది. స్వంతకార్లు, బంగళాలు ఏర్పడతాయి.

66. దానికి తోడు గురు మండలంపైన ఒక గుణక చిహ్నం లేదా నక్షత్ర చిహ్నం ఉంటే అతను వివాహానంతరం కోటీశ్వరుడవుతాడు. పెద్ద బంగళాలలో నివశిస్తాడు. ఎప్పుడూ కార్లు, విమానాలలోనే తిరుగుతుంటాడు. ఉద్యోగంలో మహోన్నత పదవి పొందుతాడు. వాణిజ్యంలో అయితే పెద్ద పారిశ్రామికవేత్త, అధికారి అవుతాడు.

# 11. రవి రేఖలు

**అ**దృష్టరేఖ తర్వాత జాగ్రత్తగా గమనించ వలసింది రవిరేఖ. మనిషి డబ్బు సంపాదించడం, సుఖపడడం ఎలా కోరుకుంటాడో సమాజంలో తనకో స్థానం కావాలని అలానే కోరుకుంటాడు. తను చేసేపని పదిమంది మెప్పు పొందాలని వాంఛిస్తాడు. ఆ గుర్తింపును సూచించేది రవిరేఖ. భాగ్యరేఖ వలె ఇది అరచేతిలో ఏదో ఒక చోటునుండి బయలుదేరి, భాగ్యరేఖకు దాదాపు సమాంతరంగా పోయి రవి మండలం చేరుతుంది. రవిరేఖ మనిషి అదృష్టానికి గీటురాయిగా పనిచేస్తుంది. మనిషి జీవితంలో ఎన్ని మెట్లు ఎక్కగలడో చెబుతుంది. కీర్తి, తేజస్సు, ప్రతిభ, సన్మానం, గౌరవం లాంటివి మనిషికి ఏయే పాళ్ళలో ఉన్నది తెలుస్తుంది. రవిరేఖ ఉన్న వ్యక్తి నిర్ద్వందంగా విద్యావంతుడో, గొప్ప జీవితాశయాలు కలవాడో అవుతాడు. రవిరేఖ, భాగ్యరేఖ రెండూ గల వ్యక్తి జీవితంలో తన ఆశయాల్ని నేరవేర్చుకోగలడు. గమ్యం చేరగలడు. కీర్తి ప్రతిష్టలార్జించగలడు.

కేవలం అదృష్టరేఖ మాత్రం ఉండి, రవిరేఖ లేనపుడు, ఆ వ్యక్తి సంపద కూడబెట్టగలడు గాని కీర్తి సంపాదించలేడు. ఎవరూ అతని గురించి చెప్పుకోరు. అజ్ఞాతంగా జీవిస్తాడు. రవిరేఖ ఉన్న వ్యక్తి అప్రయోజకుడు, అయోగ్యుడు కాడు. భాగ్యరేఖ ప్రక్కన లేకపోతే రవిరేఖ ఒక్కటీ రాణించదు. అలాంటి మనిషి పేరు సంపాదించినా సుఖపడలేడు. తృప్తిగా, ఆనందంగా జీవించడు. రవిరేఖ ప్రారంభమైన వయస్సులో మనిషికి అనుకోని అదృష్టం కలిసివస్తుంది. మనిషిలో సంపూర్ణమైన మార్పు వచ్చి వ్యక్తిత్వ వికాసం కలుగుతుంది. రవిరేఖ, భాగ్యరేఖ రెండూ లేని వ్యక్తికి వరాలు అనుగ్రహించడం కూడని పని.

రవిరేఖ మణిబంధ రేఖ నుండి గానీ, దానికి  దగ్గరగా గానీ, చంద్రమండలం నుండి, జీవితరేఖ నుండి, రాహు మండలం నుండి, మస్తిష్క, హృదయ రేఖల నుండి గానీ బయలుదేరవచ్చు. దాని ప్రయాణం రవిక్షేత్రం దిగువన.

1. రవిరేఖ మణిబంధన రేఖ నుండి లేదా ఆ దగ్గర నుండి బయలుదేరి, భాగ్యరేఖకు సమాంతరంగా నడచి, రవిక్షేత్రాన్ని చేరితే, ఆ వ్యక్తి అద్వితీయ ప్రతిభావంతుడు, ఐశ్వర్యవంతుడు అవుతాడు. నిండు నూరేళ్లు హాయిగా జీవిస్తాడు. ఎలాంటి పనినైనా సునాయాసంగా నిర్వర్తిస్తాడు. అతనికి కష్టాలు, విచారాలు ఉండవు. స్త్రీ సుఖం పుష్కలంగా ఉంటుంది. ప్రజారంజకుడవుతాడు. గవర్నరు, జిల్లా కలెక్టరు, మంత్రి పదవులు పొందగలడు. లక్ష్మీ పుత్రుడై అన్ని విధాలా, ఏ రంగంలోనైనా రాణిస్తాడు.




2. రవిరేఖ చంద్రమండలం నుండి బయలుదేరి వంపుగా రవిక్షేత్రం చేరితే, ఆ వ్యక్తి ఇతరులను ఆశ్రయించి పైకి వస్తాడు. ఉద్యోగాలు చేస్తాడు. తనకంటే ధనికులను, ఉన్నతాధికారులను ఆశ్రయించి, వారి కనుసన్నలలో మెలుగుతూ తన పని చేసుకుంటాడు. ఇతరుల అనుగ్రహం పైన అతని అదృష్టం ఆధారపడి ఉంటుంది. ఇతరుల సహాయ సహకారాలు లేనిది రాణించలేడు.

చంద్రమండలం నుండి బయలుదేరిన రవిరేఖ ఏటవాలుగా కాక, తిన్నగా రవిక్షేత్రాన్ని చేరితే అతను అమిత ధనవంతుడవుతాడు. అతని ప్రయత్నాలన్నీ ఫలిస్తుంటాయి. జీవితంలో ఒక్కొక్క మెట్టు ఎక్కి ఉన్నత స్థితికి చేరతాడు. ఆలోచనలు స్థిరంగా ఉంటాయి. అతని ప్రయత్నాలకు కొన్ని ఆటంకాలు కలిగినా విజయం తథ్యం.

3. రవిరేఖ జీవితరేఖ నుండి బయలుదేరిన వ్యక్తి జీవితం స్వయంప్రకాశం. స్వయంకృషితో, స్వీయప్రతిభతో రాణిస్తాడు. తన యోగ్యత, పట్టుదల, పరిశ్రమ ఫలితంగా అదృష్టాన్ని చేజిక్కించుకుంటాడు.

అది ఆర్టిస్టిక్ చేయి అయితే, తన కిష్టమైన కళలో ప్రతిభావంతుడవుతాడు. వానికి సౌందర్యారాధన ఎక్కువ. రవిరేఖ జీవితరేఖనుండి బయలుదేరితే, ఆ వ్యక్తి జీవితంలో ఆశలు నెరవేరి, ఆశించిన ఫలితాలు సాధిస్తాడు. వీరు తమ అదృష్టానికి

ఇతరుల్ని కర్తలుగా అంగీకరించరు. తమ శక్తి సామర్థ్యాలపై నమ్మకం ఎక్కువ. అలాగే విజయం సాధించి తీరుతారు.

రవిరేఖ జీవితరేఖ లోపల నుండి, అనగా, శుక్రక్షేత్రం నుండి గానీ, రెండవ కుజక్షేత్రం నుండి గానీ బయలుదేరిన వ్యక్తికి అదృష్టం, ఒక స్త్రీ వల్ల కలిసి వస్తుంది. భార్య, లేక ప్రేయసి సహకారంతో పైకి వస్తాడు. లేదా ఒక స్త్రీ అతనిని ప్రేమించి తన సంపదలు అతనికి అందిస్తుంది. ఆమె సహాయ సహకారాలతో విజయం సాధిస్తాడని చెప్పవచ్చు.




4. రవిరేఖ అదృష్టరేఖ నుండి బయలుదేరితే ఆ వ్యక్తి అదృష్టం పదింతలవుతుంది. భాగ్యరేఖ ఫలాలు విపరీతంగా పెరుగుతాయి. రవిరేఖ ప్రారంభమైన వయస్సున అదృష్టం వరిస్తుంది. అంత వరకు ప్రతిభకు గుర్తింపు ఉండదు. రవిరేఖ ఎంత స్పష్టంగా ఉంటే ఫలితాలు అంత అద్భుతంగా ఉంటాయి. అతని కీర్తి ప్రతిష్టలకు అదే ప్రారంభదశ.

5. అరచేయి మధ్యనుండి, అనగా రాహుమండలం నుండి, రవిరేఖ బయలుదేరితే, అతని ప్రగతికి, ప్రయత్నాలకు ఆటంకాలు అనేకం ఏర్పడతాయి. ఎన్నో కష్టనష్టాలు భరించవలసి వస్తుంది. ఓర్పుతో, సహనంతో పనులు సాధించాలి. కుటుంబంలో చిక్కులు, ఇబ్బందులు తప్పవు. వ్యక్తిగతంగా అనారోగ్యం తప్పనిసరి. చివరికి ఎప్పుడో తృప్తి కలుగుతుంది. జీవితంలో కష్టాలు కారణంగా సుఖం, తృప్తి ఉండవు. దినదిన గండం నూరేళ్ళ ఆయుష్షుగా సాగుతుంది.

6. రవిరేఖ మొదట కుజమండలం నుండి బయలుదేరితే ఆ వ్యక్తి వీరునివలె పోరాడి విజయం సాధిస్తాడు. ఓటమిని లెక్కచేయడు. తన ఆశయాలు నెరవేర్చుకోవడమే అతని ప్రధాన లక్ష్యం. ఆశయాల కోసం పోరాడుతూ విజయాలు సాధిస్తూ ఆ విజయాలతోనే తృప్తి చెందుతాడు.

7. రవిరేఖ మస్తిష్కరేఖ నుండి ప్రారంభమైన వ్యక్తికి మనోధైర్యం ఎక్కువ. తన ఆశయాలకు చక్కని మార్గాలు అన్వేషిస్తాడు. 30 సంవత్సరాలు దాటిన

తర్వాత అతని పథకాలు నెరవేరడం ఆరంభమవుతాయి. జీవితం రెండవ సగంలో రాణిస్తాడు.




8. రవిరేఖ హృదయరేఖ నుండి బయలుదేరిన వ్యక్తి 40 సంవత్సరాల తర్వాత గానీ జీవితంలో సుఖం పొందలేడు. భాగ్యరేఖ ప్రభావంవల్ల చివరి దశ యోగిస్తుంది. భాగ్యరేఖ లేనట్లయితే సుఖం దక్కదు. కష్టం మాత్రం మిగులుతుంది. ఈ రేఖ గల వ్యక్తికి ఆలస్యంగా వివాహం జరుగుతుంది. అనేక చిక్కులు, దుర్ఘటనలు ఎదురైనా పుష్కలంగా సుఖిస్తాడు. రవిరేఖ ప్రభావం వల్ల తన లక్ష్యాన్ని చేరగలడు. చివరకు కీర్తిప్రతిష్టలు, ధనసంపదలు గడిస్తాడు, అనుభవిస్తాడు.

## విశేష ఫలాలు

1. భాగ్యరేఖకు సమాంతరంగా రవిరేఖ స్పష్టంగా ఉన్న వ్యక్తి ఐశ్వర్యం, సంపదలు, భోగాలు, సుఖాలు పొందుతాడు. స్వంతకార్లు , మేడలు ఉంటాయి. మహా మేధావి, ప్రజ్ఞావంతుడై స్వతంత్ర జీవనం వాంఛిస్తాడు. నీతి నియమాలు, క్రమశిక్షణ పాటిస్తాడు. రోజుకు 24 గంటలు పనిచేసినా అలసిపోడు. ఏ రంగంలోనైనా అలాంటివారు ప్రథమస్థానంలో ఉంటారు.

2. రవిరేఖ హృదయరేఖ నుండి బయలుదేరిన వ్యక్తి సౌమ్యంగా ఉంటాడు. అందరికీ సహాయం చేసి మంచివాడనిపించుకుంటాడు.

3. జీవిత, హృదయ రేఖలు చక్కగా ఉండి, రవిరేఖ మణిబంధన రేఖ నుండి బయలుదేరితే ఆ వ్యక్తి మహా ఐశ్వర్యవంతుడు, మహర్జాతకుడు అవుతాడు. అతని సంతానం సుఖసంపదలు, విద్యాబుద్ధులు కలిగి ఉంటారు. సమాజంలో, బంధువులలో మంచి పేరు ప్రతిష్టలుంటాయి. అందరూ ఉన్నత పదవుల్లోకి వస్తారు. ఏ రంగంలోనైనా ప్రథమస్థానం వీరికే దక్కుతుంది. ఎక్జిక్యూటివ్‌లుగా రాణిస్తారు, పదుగురిని శాసించగలరు.

4. రవిరేఖ చంద్రమండలం నుండి బయలుదేరి రవిక్షేత్రానికి వెళ్ళితే, మస్తిష్కరేఖ చంద్రమండలం లోకి వెళ్లితే ఆ వ్యక్తి రచయిత లేదా కవి అవుతాడు. సంగీతం పట్ల ఆసక్తి ఉంటుంది.

5. రవిరేఖ మస్తిష్కరేఖ రెండూ చక్కగా, స్పష్టంగా ఉన్న వ్యక్తి మేధా సంపన్నుడవుతాడు. ఆలోచన ఎక్కువ. దయా ధర్మగుణాలు అధికం. సహృదయుడు, నీతిపరుడు, వ్యవహారవేత్త అవుతాడు. ఈ రేఖలు రెండూ స్పష్టంగా లేకపోతే దరిద్రుడు, కుటిలుడు, వ్యసనపరుడు అవుతాడు.

6. రవి భాగ్యరేఖలు మధ్యలో కలిసిపోయి తర్వాత మరల విడిపోయి రవి, శని క్షేత్రాలకు పోతే అంటే రవి, భాగ్యరేఖలు పెనవేసుకున్న వ్యక్తి మహోన్నత కళాకారుడవు తాడు. కళల ద్వారా తన జీవిత లక్ష్యాన్ని నెరవేర్చుకుంటాడు. అనేక బిరుదులు, సన్మానాలు పొంది విదేశాలలో పర్యటిస్తాడు. అతనికి అంతర్జాతీయంగా ఖ్యాతి లభిస్తుంది. విపరీత రాజయోగం పడుతుంది. మొదట ఎంత దరిద్రు డుగా ఉంటాడో, తర్వాత అంత కులీనుడవుతాడు. సకల సుఖాలు అనుభవిస్తాడు. అయితే రవిరేఖ, భాగ్యరేఖ కలిసి ఒకటిగా ప్రయాణించినంత కాలం గుర్తింపు ఉండదు. కష్టాలు తప్పనిసరి. అవి విడిపోయిన తర్వాత రెండింటి ఫలితాలు పుష్కలంగా అనుభవానికి వస్తాయి.




## రవిరేఖ : మిశ్రమఫలాలు

1. రవిమండలంలో ఒక్క రవిరేఖ కాక అనేక చిన్నరేఖలు నిలువుగా ఉన్న వ్యక్తి బహుముఖ ప్రజ్ఞావంతుడవుతాడు. అతను అనేక రంగాలలో ప్రతిభ చూపిస్తాడు. అనేక మార్గాల ధనం సంపా దిస్తాడు. ఈ రేఖల్ని ఏవైనా అడ్డురేఖలు ఖండిస్తే కొన్ని అవరోధాలు, ఆటంకాలు ఏర్పడు తుంటాయి. ఫలితం కొంత మేర తగ్గినా విజయం తథ్యం.

2. రవిమండలంలో రవిరేఖ చివరన రెండు, మూడు కోరలుగా చీలితే ఆ వ్యక్తి అకస్మాత్తుగా ప్రతిభావంతుడనిపించుకుంటాడు. అతని ప్రతిభకు గుర్తింపు వస్తుంది. కానీ సంపన్నుడు కాలేడు. ఏకాగ్రత లోపం వల్ల డబ్బు గడించడు కానీ భవిష్యత్తు ఉజ్వలంగా ఉంటుంది.



3. ఆరంభంలో రవి, భాగ్యరేఖలు కలిసి ఉండి, భాగ్యరేఖపైన ఎక్కడా ఒక ద్వీపచిహ్నం లేకుంటే, అతని ప్రయత్నాలకు ఎలాంటి ఆటంకం కలగదు. అనుకున్నవి సాధిస్తాడు. రవిరేఖ భాగ్యరేఖ నుండి వేరైన వయస్సులో అతని కోర్కెలు నెరవేరడం మొదలవుతాయి. అక్కడి నుండి అతనికి మహారాజయోగం పడుతుంది.

4. రవిరేఖ శాఖ ఏ క్షేత్రంలోకి వెళితే, ఆ క్షేత్రానికి సంబంధించిన వృత్తులలో రాణించడం జరుగుతుంది. ప్రతిభ ఉపయోగిస్తుంది. ఆ రంగంలో ధన సంపాదన, కీర్తి లభిస్తాయి. ఆ శాఖ రవిరేఖ నుండి విడిపోయే వయసులో అదృష్టం వరిస్తుంది. ఎన్ని శాఖలు క్షేత్రాలకు పోతే అంత మంచిది. అన్ని విశేష ఫలాలను, సంపదలను అనుగ్రహిస్తాయి. అందులోనూ ఏ గ్రహం బలంగా ఉంటే దానికి సంబంధించిన ఫలితాలు ఎక్కువగా పొందడం జరుగుతుంది.

ఎ) రవిరేఖ శాఖ బుధ మండలంలోకి పోతే, అతడు వ్యాపారం, వాణిజ్యం, పరిశ్రమలు, వైజ్ఞానిక శాస్త్రం, సాహిత్య వ్యాపారాల్లో రాణిస్తాడు. ప్రతిభను వాణిజ్య పరంగా, కమ్మర్షియలైజ్ చేయడం జరుగుతుంది.

బి) రవిరేఖ శాఖ కుజ మండలంలోకి వెడితే, ఆ వ్యక్తి విదేశాలలో, అన్యరాష్ట్రాలలో జీవిస్తాడు. లేదా ఎప్పుడూ ప్రయాణాలు చేసే ఉద్యోగం చేస్తాడు. టూరిజం, రైల్వే, నావిగేషన్ నౌకా శాఖలలో ఉద్యోగం లభిస్తుంది. కష్టపడి పదవులు సంపాదిస్తాడు.

సి) రవిరేఖ శాఖ చంద్రమండలానికి వెళ్లిన వ్యక్తి ప్రేమికుడవుతాడు. భావనా లోకంలో, కలల్లో బ్రతుకుతాడు. తన ప్రేమను, విరహాన్ని ఊహలలోకి అనువదించి తృప్తి పడతాడు. ఏ పనీ సవ్యంగా చేయడు.

డి) రవిరేఖ శాఖ శుక్రమండలంలోకి వెళ్లిన వ్యక్తి సంగీతం లేదా చిత్రలేఖనంలో రాణిస్తాడు. అయితే కళాకారుడై బహు స్త్రీ సంగమం కాంక్షిస్తుంటాడు.

ఇ) రవిరేఖ శాఖ ఒకటి శని క్షేత్రానికి వెళ్లిన, అతని అదృష్టం రెట్టింపు అవుతుంది. ఇలాంటి వారి చేతిలో అదృష్టరేఖ అతి చిన్నదిగా ఉంటుంది. భాగ్యరేఖ బలంగా, స్పష్టంగా ఉంటే అతడు కోట్లు సంపాదిస్తాడు.

ఎఫ్) రవిరేఖ శాఖ గురు క్షేత్రానికి వెళ్లిన వ్యక్తి ప్రజా నాయకుడు, శాసనకర్త, జడ్జి, మంత్రి అవుతాడు. ఉద్యోగాలలో ఉన్న వారైతే ప్రధాన కార్యదర్శి పదవి వరకు చేరుకుంటారు.

5. అరచేయి మధ్య నుండి బయలుదేరిన అనేక రేఖలు రవిక్షేత్రానికి పోయిన, అవి అన్నీ శుభ ఫలితాలనే యిస్తాయి. అందులో స్పష్టమైన రేఖ ప్రస్తుతాన్ని సూచిస్తుంది. శని మండలానికి వెళ్లిన రేఖలు సంపదలు, సౌభాగ్యాలు యిస్తాయి.

6. రవిరేఖ స్పష్టంగా, బలంగా ఉండి, అదృష్టరేఖ అస్పష్టంగా, చిందర వందరగా ఉంటే, ఆ వ్యక్తి ఎన్ని కష్టనష్టాలు సంభవించినా నిరాశపడడు. అన్ని కష్టాల లోనూ ఆనందంగా, నవ్వుతూ, నిండుగా జీవిస్తాడు.




7. రవిరేఖకు సమాంతరంగా, రవి క్షేత్రానికి పోయే రేఖలు ఏవైనా రవిరేఖల ఫలాలనే యిస్తాయి. అంటే ఆ వ్యక్తి అనేక రంగాలలో బహుముఖ ప్రజ్ఞావంతు డవు తాడు. అనేక మార్గాల ధనార్జన చేస్తాడు.

శుక్రమండలం నుండి వచ్చిన రేఖలు రవిరేఖను ఖండించినా, తాకినా, ఆ వ్యక్తి బంధువుల విషయంలో, అయినవారి విషయంలో పెద్దగా అభిమానం చూపించడు. బయటివారు అతనిని విమర్శిస్తారు. అతని ప్రయత్నాలకు అవరోధాలు ఏర్పడుతుంటాయి. శత్రువులు పెద్ద సంఖ్యలోనే ఉంటారు.

8. రవిరేఖ రవి మండలానికి కాక, శని మండలంలోకి వెళితే, అనుకోని విధంగా అదృష్టం కలసి వస్తుంది. వృత్తి ఉద్యోగాలలో ఆకస్మిక మార్పులు వస్తాయి. జీవితం ఊహించని మలుపులు తిరుగు తుంది. ఎంత డబ్బు ఉన్నా, ఎంత సంపా దించినా తృప్తి ఉండదు. సుఖం అనిపిం చదు. అలాంటి వారికి సుఖం ఎండమావి.




9. రవిరేఖ శని మండలంలోకి పోయి, దాని శాఖ ఒకటి గురుక్షేత్రానికి పయనిస్తే ఆ వ్యక్తి విచిత్రంగా ప్రభుత్వంలో ఉన్నతాధి కారి అవుతాడు. దానికి తోడు భాగ్యరేఖ తర్జని మూలస్థానం వరకు పోతే అతని

అదృష్టం, ప్రగతి వర్ణనాతీతం. లక్షలు, కోట్లు సునాయాసంగా సంపాదించి సర్వ భోగాలు అనుభవిస్తాడు. జీవితంలో అతను పొందని సుఖం ఉండదు.

10. అనామిక తర్జని కన్న పొడవుగా ఉన్నా, లేక మధ్యవ్రేలంత పొడవుగా ఉన్నా, రవి, భాగ్య రేఖలు స్పష్టంగా ఉంటే ఆ వ్యక్తి జూదగాడవుతాడు. లాటరీలు, స్పెక్యులేషన్, స్టాక్‌మార్కెట్ వ్యాపారాలలో కోట్లు గడిస్తాడు.

మస్తిష్కరేఖ క్రింది వైపుకు వాలిన, అతను చెడు ఆలోచనలు చేసి, ప్రజల్ని మోసం చేసి, అన్యాయంగా సంపాదిస్తాడు. క్లబ్బులు, పేకాట, రేసులు ఇష్టపడతాడు. కష్టపడకుండా డబ్బు సంపాదించడం అతనికి ఇష్టం.

11. రవిరేఖ కొంతమేర స్పష్టంగా, కొంత అస్పష్టంగా, కొంతమేర అసలు కనిపించకుండా ఉంటే, అది కనిపించని కాలంలో ఆ వ్యక్తి నానా యాతనలు అనుభవిస్తాడు. అనేక ఆపదలు సంభవిస్తాయి. ఓటమి వల్ల నిరాశ ఏర్పడుతుంది. వైరాగ్యం వల్లిస్తాడు. మనస్సులో తీరని వేదన.

రవిరేఖ స్పష్టంగా కనిపించిన వయస్సులో తిరిగి రాణింపు, గుర్తింపు వస్తుంది. ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆ తర్వాత జీవితంలో అపజయం, పలాయనం ఉండవు.

12. అరచేయి మధ్యభాగం పల్లంగా, గుంటగా ఉంటే – రవిరేఖ సైతం ఇవ్వవలసిన ఫలితాలనివ్వదు. కొంతకాలం దరిద్రం అనుభవించక తప్పదు. ఎంతగా కష్టపడినా సంపాదన చాలదు. జీవితం సుఖంగా, తృప్తిగా అనిపించదు. కాని ఆశ చావదు. కొంతకాలం ఆరోగ్యం దుర్భరంగా ఉంటుంది.




13. రవి మండలానికి పోయే రవిరేఖ సన్నగా, సరళంగా, స్పష్టంగా ఉంటే జాతకుడు కీర్తి గడిస్తాడు. తన విద్యను, వివేకాన్ని, ప్రతిభను సకాలంలో సద్వి నియోగం చేసి డబ్బు, పేరు సంపాదిస్తాడు.

14. అనామిక మధ్యవేలంత పొడవుంటే, రవిరేఖ ఎంత చిన్నదిగా, బలహీనంగా ఉన్నా ఫరవాలేదు. – ఆ వ్యక్తి వృత్తిలో, వ్యాపారంలో అమి

తంగా సంపాదించి ఐశ్వర్య భోగాలు అనుభవిస్తాడు. ఏ కొంచెం శ్రద్ధ చూపినా చదువు అబ్బుతుంది. కాని అతనికి చదువు పైన శ్రద్ధ ఉండదు. జూదం, జల్సాగా తిరగడం చిన్నతనంలో యిష్టం. ఎప్పుడూ సులభంగా డబ్బు సంపాదించే మార్గాలు వెతుకుతుంటాడు.

15. అనామిక మధ్యవేలు కన్న చిన్నగా ఉండి రవిరేఖ చక్కగా స్పష్టంగా ఉన్న వ్యక్తి పవిత్రంగా జీవిస్తాడు. నీతి నియమాలు పాటిస్తాడు. బహుగ్రంథ పఠనంతో జ్ఞానం సంపాదిస్తాడు. డిగ్రీలు లేకపోయినా అతను విజ్ఞానఖని, సరస్వతీ పుత్రుడు కాగలడు. మహా విద్వాంసులు సైతం అతని ముందు తలవంచుతారు.



16. రవిరేఖ హృదయరేఖను తాకకుండా అనామిక మూలస్థానం వరకు ఉంటే ఆ వ్యక్తి ఉత్తమ గుణ సంపన్నుడవుతాడు. వాని స్వభావం, ప్రవర్తన ఉత్తమంగా ఉంటుంది. అందరికీ ఆదర్శంగా నడుచు కుంటాడు. అనేక సన్మానాలు, సత్కారాలు, బిరుదులు సంపాదిస్తాడు. అకాడమీలు, పరిషత్తులు వానిని గౌరవిస్తాయి. పద్మశ్రీ లాంటి బిరుదులు, విదేశీయుల ప్రశంసలు పొందగలడు.

17. రవిరేఖ రవి మండలం నుండి బయలుదేరి, హృదయ మస్తిష్క రేఖల్ని దాటి జీవితరేఖతో కలిసిన, ఆ వ్యక్తి అఖండకీర్తి ప్రతిష్ట లార్జిస్తాడు. ఉన్నత స్థితికి వస్తాడు. కాని పరిస్థితులకు తలవంచి, ఇంటి బాధలు భరించలేక, గృహత్యాగం చేసి సన్యాసి అవుతాడు. కానీ భార్యాబిడ్డలపై అనురాగం వదలుకోలేక మెట్ట వేదాంతం చెబుతుంటాడు. సన్యాసం స్వీకరించినా స్త్రీ వాంఛ తీరక, మరొక స్త్రీని చేరదీసి తిరిగి సంసారి అవుతాడు.

18. రవిరేఖ తిన్నగా, వెడల్పుగా ఉన్నవ్యక్తి ఎంతటి ధనవంతుడైనా చివరకు దరిద్రుడవుతాడు. రవిరేఖ ఉన్నా అనామిక చిన్నదైన కారణంగా, అరచేయి మధ్యభాగం పల్లంగా ఉన్నందున సకల సంపదలు కోల్పోయి పరమ దరిద్రం అనుభవిస్తాడు. పేరు ప్రతిష్టలు అతనికి తిండి పెట్టవు.

19. రవి మండలం ఉన్నతంగా వుండి, అందులో రవిరేఖకు తోడు ఇతర రేఖలున్న (వాటిని ఏ ఇతర రేఖలు ఖండించకూడదు) ఆ వ్యక్తి అనేక రంగాలలో రాణిస్తాడు. ప్రతిభావంతుడవుతాడు. ఇతర రేఖలు రవి రేఖను ఖండిస్తే అతనిలో దుర్గుణాలు ప్రవేశిస్తాయి. ఒకటి రెండు అడ్డు రేఖలైతే పెద్దగా అపకారం జరగకపోవచ్చు. అయితే ఎంత ఉన్నతస్థితికి వెళ్లినా మనశ్శాంతి, సుఖం ఉండవు. ఇంట్లో ఈగల మోత బయట పల్లకీల మోత బ్రతుకంతా.

20. రవిరేఖ నుండి బయలుదేరిన రేఖలు, లేక దాని శాఖలు హృదయరేఖ సమీపంగా వచ్చి దానిని స్పృశించక ఆగిపోతే అతనికి అనేక వ్యాపారాలు చేయాలన్న కోరిక ఉంటుంది గానీ, చేసేది చిన్నపాటి ఉద్యోగం. ఏ స్వంత వ్యాపారం సరిగా నిర్వహించలేడు. బుద్ధి స్థిరత్వం లేక నష్టపడుతుంటాడు. ఆ రేఖలు ఛిద్రంగా, ఛిన్నాభిన్నంగా ఉంటే అతని స్వభావం మరీ చంచలంగా ఉంటుంది. అపకీర్తి పాలవుతుంటాడు. పనిదొంగ, కలహ ప్రియుడు, భ్రష్టుడు అవుతాడు. పైగా నీచులతో సాంగత్యం చేసి చరిత్రహీను డవుతాడు.




21. రవిరేఖ జీవితరేఖ నుండి బయలుదేరితే ఆ వ్యక్తి స్వయం కృషితో, స్వీయ ప్రతిభతో మంచి సాహితీవేత్త, కళాకారుడు అవుతాడు. ఆ రేఖ జీవితరేఖ నుండి బయలుదేరిన వయస్సులో అతని ప్రతిభకు గుర్తింపు లభిస్తుంది.

22. అంగుష్ట మూలస్థానం నుండి ఒక రేఖ బయలుదేరి జీవితరేఖను దాటి రవిక్షేత్రం వైపు వెళితే, దానిని రవిరేఖ అనే చెప్పాలి. అలాంటి రేఖ గల వ్యక్తి మహా ప్రతిభావంతుడవుతాడు. సాధు వర్తన వల్ల మహాత్ముడుగా పరిగణింపబడతాడు. పిల్లలలో పిల్లవాడుగా, పండితులలో మహా పండితుడుగా కలిసి పోగలడు. సర్వత్ర అతను పూజనీయుడు.



23. రవిరేఖ మొదటి కుజమండలం నుండి బయలుదేరినా లేక రవిక్షేత్రం నుండి బయలుదేరి కుజక్షేత్రంలోకి వెళ్లినా ఆ వ్యక్తి గొప్ప పరిశ్రమ చేస్తాడు. అన్ని ఆటంకాలు అధిగమించి, విజయం సాధించగలడు. కాని అనవసరంగా ఇతరులను ద్వేషిస్తాడు. అది కుజ ప్రభావం. అయినా నియమనిష్టలు, క్రమశిక్షణ పాటించి వృత్తిలో, వ్యాపారంలో అభివృద్ధి సాధించగలడు.

24. మస్తిష్కరేఖ నుండి రవిరేఖ ప్రారంభమై, దానికి తోడు మరొకరేఖ వుండి, ఆ రెండు రేఖలపై ఒకటి రెండు ద్వీపచిహ్నాలుంటే, ఆ వ్యక్తి ఇతరుల కారణంగా తన భవిష్యత్తు నాశనం చేసుకుంటాడు. ఆ చిహ్నం ఉన్నవారు ఎప్పుడూ ఇతరుల సలహా పాటించకూడదు. స్వయం నిర్ణయమే మంచిది. భార్య సలహా తీసుకోవడం కూడా మంచిది కాదు.

25. రవిరేఖ ముక్కలుగా తెగి, స్పష్టంగా లేకపోయినా, దానిని అడ్డురేఖలు ఖండించినా, ఆ వ్యక్తి జన్మలో బాగుపడడు. ఏ పనిలోనూ రాణించడు. పైగా చెడ్డవారితో స్నేహం చేసి దొంగ, వ్యభిచారి, తాగుబోతు అని నింద పడతాడు.

26. భాగ్యరేఖ నుండి చీలిన ఒక రేఖ, లేదా దాని శాఖ ఒకటి రవిరేఖను ఖండిస్తే ఆ వ్యక్తి భార్యతో వివాదపడి విడాకులు పొందుతాడు. కలిసి కాపురం చేయడు. అతనికి బంధువుల వల్ల అపకారం, నష్టం కలుగుతుంది.

27. రవిరేఖతో కలిసి భాగ్యరేఖ గానీ, దాని శాఖగానీ ఒక కోణంగా ఏర్పడితే ఆ వ్యక్తి విజయానికి, ఔన్నత్యానికి అనేక మంది సహాయం లభిస్తుంది. మిత్రుల సహాయంతో తన పనులు చక్కబెట్టుకుంటాడు. బాగా డబ్బు సంపాదిస్తాడు. కాని మిత్రులు ఆ సంపదను హరిస్తారు. ఆ కోణానికి తోడు రవి మండలం ఉన్నతమైతే తన డబ్బును తానే వృధాగా ఖర్చు చేస్తాడు. తన హితవు కోరే స్నేహితులను దూరం చేసుకుని, దుష్టుల్ని దగ్గరకు చేర్చుకుంటాడు. వారి కోసం అనవసరంగా ధనం వ్యయం చేస్తాడు. రవి మండలం



బలహీనపడితే అతను అపఖ్యాతి పాలవుతాడు. డబ్బు ఖర్చుచేసి విచారిస్తాడు, బయట జల్సాగా తిరిగినా ఇంటివరకు పొదుపు పాటిస్తూ, కుటుంబ గౌరవం నిలుపుకుంటాడు.

28. రవిరేఖ నుండి ఒక శాఖ శని మండలానికి వెళితే ఆ వ్యక్తి లోహ సంబంధిత వ్యాపారాలలో రాణిస్తాడు. మైన్స్, బొగ్గు, కలప, మినరల్స్, మెటల్స్ మొదలైన అన్ని భూగర్భ సంపదలు అతని వ్యాపారాభివృద్ధికి సహాయపడతాయి.

29. రవిరేఖపైన నక్షత్రం అత్యంత శుభప్రదం. అది వున్న వానికి వద్దన్నా బంధుమిత్రులు సహాయం చేస్తుంటారు. అతని ఔన్నత్యం తమదిగా భావించి సహకరించేవారు చాలా ఎక్కువ. అలాంటి వ్యక్తి అన్ని విధాల అదృష్టవంతుడు.

30. రవిరేఖ పైన గుణకచిహ్నం ఉన్న వ్యక్తికి అకస్మాత్ ధనలాభం కలుగుతుంది. అది గుప్త నిధి కావచ్చు, లాటరీ కావచ్చు.

31. రవిరేఖ పైన ద్వీపచిహ్నం మంచిది కాదు. అది ధననష్టం, అపఖ్యాతిని సూచిస్తుంది. అది కుడిచేతిలో ఉంటే తన పరువు పోతుంది. ఎడమచేతిలో ఉంటే కుటుంబం అపఖ్యాతి పాలవుతుంది.

32. రవిరేఖ వెడల్పుగా, ఎర్రగా ఉన్న వ్యక్తికి కోపతాపాలు ఎక్కువగా ఉంటాయి. అతను స్వభావరీత్యా కపటి, మోసగాడు అవుతాడు. అతనిని ఎవరూ ఆదరించి, దగ్గరకు చేరనీయరు. దొంగతనం, అన్యాయ సంపాదన వల్ల ఎంత సంపాదించినా సుఖపడడు, గౌరవంగా బ్రతకలేడు. రవి రేఖ వెడల్పుగా ఉండి, దానికి దగ్గరగా అనేక అడ్డురేఖలుంటే ధననష్టం, అవమానం, గౌరవభంగం సూచితం. ఎప్పుడూ కోర్టుల చుట్టూ తిరగవలసి వస్తుంది. దరిద్రం భరించలేక చివరకు ఆత్మహత్యకు పాల్పడతాడు.




33. రవిరేఖను బుధక్షేత్రం నుండి వచ్చే వివాహరేఖ ఖండిస్తే ఆ వివాహం అతని అభివృద్ధికి ఆటంకమవుతుంది. భార్యాభర్తల మధ్య అన్యోన్యత లేక విడిపోతారు. ఈ లక్షణం స్త్రీ హస్తంలో ఉంటే ఆమె భర్త వ్యసనపరుడు, స్త్రీ

లోలుడు, వ్యభిచారి అవుతాడు. అతనిని సన్మార్గంలో పెట్టడానికి ఆమె ప్రయత్నించి, విఫలమై విడిచిపెడుతుంది.

శనిక్షేత్రం నుండి వచ్చినరేఖ రవిరేఖను ఖండిస్తే అది వాని పతనానికి సూచన. చర స్థిరాస్తులు కోల్పోయి బికారి అవుతాడు. తగువులతో, మనస్పర్ధలతో అతని ఇల్లు నరకంగా మారుతుంది.

34. రవిరేఖపైన ఒక నక్షత్రచిహ్నం ఉండి, శని క్షేత్రం నుండి వచ్చిన అడ్డరేఖ రవిరేఖను స్పృశిస్తే ఆటంకాలు తొలగిపోతాయి. పైగా సంపూర్ణ సుఖం, విపరీత అఆదృష్టం పడుతుంది.

35. శని క్షేత్రం నుండి వచ్చిన అడ్డరేఖపై ఒక ద్వీపచిహ్నం ఉండి, ఆ రేఖ రవిరేఖను ఖండిస్తే ఆ వ్యక్తి కారాగార శిక్ష అనుభవిస్తాడు. అయినా గొప్ప సాహితీ వేత్త, విద్యావంతుడు, గ్రంథకర్త అవుతాడు. ప్రభుత్వ ధిక్కారనేరానికి 52వ ఏట జైలు పాలవుతాడు. అంతవరకు అతనికి జీవితంలో అపజయం ఉండదు.

36. రవిరేఖ రవిక్షేత్రంలో పాము కోరలవలె రెండుగా చీలిన, అతడు మహాప్రసిద్ధుడై కీర్తి సంపాదిస్తాడు. అనేక సన్మానాలు, సత్కారాలు పొందుతాడు. రవిరేఖపైన ద్వీప చిహ్నం ఉండి, దాని నుండి బయలుదేరిన ఒక రేఖ హృదయరేఖతో కలిస్తే ఆ వ్యక్తి జీవితాంతం ఒక మహత్కార్య నిమగ్నుడై ఉంటాడు. బంధువులు అతనికి అవరోధాలు కల్పిస్తారు.

37. హృదయరేఖ సమీపంలో రవిరేఖ పైన ఒక మచ్చ ఉంటే అతనికి కంటికి సంబంధించిన రోగం వస్తుంది. దృష్టి దోషం కావచ్చు. కంటికి ఆపరేషన్ జరుగుతుంది. రవి కారణంగా అనేక బాధలు, విచారాలు ఏర్పడతాయి.




ఎ) రవిక్షేత్రానికి దిగువన హృదయరేఖ పైగా రవిరేఖ పైన పుట్టుమచ్చ ఉంటే పైన చెప్పిన చెడు కొంతవరకు తగ్గుతుంది.

బి) రవిరేఖ, హృదయ రేఖ కలిసిన చోట ఈ మచ్చ ఉంటే, ఆ వయస్సులో ప్రాణాపాయం తప్పదు.

38. రవి మండలంలో రవిరేఖకు సమాంతరంగా మరికొన్ని రేఖలున్న వ్యక్తి అకస్మాత్తుగా ప్రయోజకుడై, కీర్తి ప్రతిష్టలు, సంపదలు ఆర్జిస్తాడు. అంతర్జాతీయ

ఖ్యాతి వస్తుంది. మహాగుణ సంపన్నుడైనందున, ఉన్నత కార్యాలు చేసి తన కీర్తిని సుస్థిరం చేసుకుంటాడు.

39. రవిరేఖ చంద్ర మండలం నుండి బయలుదేరితే అతడు ఎంత ప్రతిభ కలవాడైనా, పరులను ఆశ్రయించి బ్రతుకుతాడు. అలాంటివారు నటులు, నర్తకులు, సంగీతజ్ఞులు అవుతారు.

40. రవిరేఖ హృదయరేఖ నుండి బయలుదేరితే ఆ వ్యక్తి తంత్ర, మంత్ర, యోగాలలో ప్రావీణ్యం సంపాదిస్తాడు.




41. అనామిక, కనిష్ఠాంగుళి సంధి స్థానం నుండి బయలుదేరిన రేఖ అరచేయి మధ్య వరకు పోతే ఆ వ్యక్తి బ్రహ్మజ్ఞాని, మర్మయోగి, విద్వాంసుడు, రచయిత అవుతాడు.

42. రవిరేఖ నుండి చీలిన రేఖ క్రిందికి సాగితే అతడు ఎంతటి పండితుడైనా, ప్రతిభావంతుడైనా పరమదరిద్రం అనుభవిస్తాడు. వాని ఆలోచనలు, కోరికలు వికృతంగా, జుగుప్సాకరంగా ఉంటాయి.

రవి, గురు మండలాలు బలంగా వుంటే బంధుమిత్రులు అతనిని అవసరానికి ఆదుకుంటారు. ఆర్థికంగా సహాయం చేస్తుంటారు.




43. రవిరేఖ ఛిన్నాభిన్నంగా ఉండి, ఎర్రగా ఉంటే రవిక్షేత్రం నీచమై, అదృష్టరేఖ బలహీనంగా ఉంటే, హృదయరేఖ మీద ఒక ద్వీపచిహ్నం ఉండి, శనిక్షేత్రం రవి వైపు వాలితే ఆ వ్యక్తి అంగవికలు డవుతాడు. స్త్రీలోలుడు, వ్యసన పరుడై, సంపదలు హరించిపోగా, మధ్య వయస్సులో అంధుడవుతాడు. భాగ్యరేఖ స్పష్టంగా శనిక్షేత్రం వరకు సాగితే అతనికి ప్రాణహాని కలగదు. పైగా ఆ వయస్సు నుండి ఉన్నతస్థితికి చేరి, కీర్తి ప్రతిష్టలు సంపాదిస్తాడు. విశేషంగా ధనసంపదలు ఆర్జించగలుగుతాడు.

44. రవి, భాగ్య రేఖలు ఒకటిగా పయనించి, కొంతదూరం తర్వాత విడిపోతే అతని భాగ్య సంపదలు గణనీయంగా ఉంటాయి. అతను స్వశక్తితో ఉన్నత పదవులు పొందుతాడు. రవిరేఖ భాగ్యరేఖ నుండి విడివడిన వయస్సున విపరీత రాజయోగం పడుతుంది. ఐశ్వర్యంతో తులతూగుతాడు.

45. రవిరేఖ అరచేయి మధ్యనుండి బయలుదేరితే, ఇతర రేఖలు ఎన్ని వున్నా అదృష్టమే. అలాగే మణి బంధం నుండి బయలుదేరిన భాగ్యరేఖ సరాసరి శనిక్షేత్రానికి పోతే వాని సిరిసంపదలు, అదృష్టం వర్ణనాతీతం. మహారాజ భోగాలు అనుభవిస్తాడు.

46. రవిరేఖ పైన ద్వీపచిహ్నం ఉన్న వ్యక్తి ఆ వయస్సులో అపవాదులు, అవమానాలు భరించవలసి ఉంటుంది. అయినా ప్రమాదం ఉండదు. రవిరేఖ ఛిద్రమైతే ఫలితం బాధాకరమవుతుంది. ద్వీపం కారణంగా అపవాదులు వచ్చినా అపకారం జరగదు.

47. రవిరేఖ మొదటి కుజమండలం నుండి బయలుదేరి కొంత దూరం అసలు కన్పించకుండా ఉండి, తర్వాత స్పష్టంగా ఉంటే అతనికి జీవితం ద్వితీయార్ధంలో యోగిస్తుంది. అంతవరకు అతని జీవితం అతి సామా న్యంగా, సీదాసాదాగా సాగుతుంది. మధ్య వయస్సులో సడెన్‌గా అతనికి యోగం పడుతుంది.

48. రవిరేఖ ఆగిపోయినా లేక రెండుగా చీలినా ఆ వయసులో అశుభం జరుగుతుంది. అది అతని వ్యక్తిగతం కావచ్చు, కుటుంబ వ్యవహారం కావచ్చు, ఆర్థిక పతనం కావచ్చు.




49. రవిరేఖ పైన ద్వీపచిహ్నం అశుభ సూచన. దానికి సమీపంగా ఒక చతుష్కోణం ఉంటే అపఖ్యాతి తొలగిపోతుంది. కొంతవరకు కష్టం, నష్టం కలగవచ్చు.

50. రవిరేఖ పైన నక్షత్రం, గుణకచిహ్నం శుభం. రవిరేఖ స్పష్టంగా ఉండి, చంద్ర, శుక్ర క్షేత్రాలు ఉన్నతంగా కలవారు సాహితీవేత్తలు, కళాకారులై గొప్పగా కీర్తి ప్రతిష్టలు, సంపదలు గడించి, భోగభాగ్యాలతో సుఖిస్తారు.

# 12. బుధక్షేత్రం

పై వరుసలో వేళ్ల క్రింద ఉండే గ్రహక్షేత్రాలు గురు, శని, రవి, బుధులు. కనిష్ఠాంగుళి దిగువన, రవిక్షేత్రం ప్రక్కగా ఉన్నది బుధక్షేత్రం. అది కనిష్ఠాంగుళి మూలస్థానం నుండి హృదయరేఖ వరకు ఉంటుంది. బుధప్రభావం గల వ్యక్తి అయిదున్నర అడుగులు దాటి ఉండడు. మనిషి మంచిగా, వినమ్రుడుగా, ప్రతిభావంతుడుగా కనిపిస్తాడు. ముఖం గుండ్రంగా ఆకర్షణీయంగా, ముక్కు పొడవుగా పలుచగా, పెదవులు పలుచగా గట్టిగా, కళ్లు తెలుపు పసుపు రంగులు కలిపినట్లు ఉంటాయి. ఏ పనిచేసినా శ్రద్ధ కనబరుస్తాడు. పళ్లు చిన్నవిగా, పదునుగా ఉంటాయి. సౌందర్యవంతులు కాకపోయినా బలంగా, ఆకర్షణీయంగా ఉంటారు. అతిగా మాట్లాడినా పనిలో ఉన్నప్పుడు నిశ్శబ్దం, ఏకాగ్రత పాటిస్తారు. వీరి ఆలోచనలు డబ్బు చుట్టూ తిరుగుతుంటాయి. చక్కగా వాదించగలరు, ఉపన్యసించగలరు. ఎదుటివారి బలహీనతల్ని క్షణంలో పసికట్టగలుగుతారు. పెద్ద పెద్ద కోరికలు, ఆశయాలు ఉంటాయి. తగిన బుద్ధి బలం, చాతుర్యం ఉంటాయి. లాయర్లు, డాక్టర్లు, జర్నలిస్టులు, వ్యాపారులు, నటులు, కమెడియన్స్ ఈ కోవకు చెందుతారు.

## బుధ మండలం : ఉన్నతం

బుధక్షేత్రం బలంగా, ఉన్నతంగా ఉన్న వ్యక్తిలో సహజాకర్షణ ఉంటుంది. మేధస్సు చురుకుగా పనిచేయడం వల్ల లేని అందం కనిపిస్తుంది. మేధావంతుడు, ప్రాజ్ఞుడు. కార్య నిర్వహణ, పట్టుదల ఎక్కువ. జీవితాన్ని వినోదంగా భావిస్తాడు. అధిక ప్రసంగం చేస్తాడు. ప్రతిభ ఉన్నా గర్వం కనిపించదు. చిన్న వయస్సులోనే వివాహం జరుగుతుంది. సాధారణంగా విజ్ఞాన, వ్యాపార రంగాలలో రాణిస్తాడు.

భార్య సహజ సౌందర్యవతి అయి ఉంటుంది. అన్ని సుఖ సంపదలు అనుభవించడం వీరికి యిష్టం. తమ సుఖ, సంతోషాలే వీరికి ముఖ్యం.

## నీచ బుధ మండలం

జాతకరీత్యా బుధుడు నీచమైతే, చేతిలో నీచ బుధస్థితి ఏర్పడుతుంది. బుధక్షేత్రం నీచమైతే ఎవరికీ యోగం పట్టదు, ఏదీ కలసిరాదు. అపజయాల వల్ల అందరితో కలహిస్తుంటారు. బాల్యంలో చదువుపై శ్రద్ధ ఉండదు. కొందరు అవరోధాలు ఏర్పడినా పట్టుదలతో విద్యాభ్యాసం పూర్తి చేస్తారు. వారిని పేదరికం క్రుంగదీస్తుంది.

## అత్యుచ్ఛ బుధ మండలం

బుధక్షేత్రం మిగిలిన క్షేత్రాలన్నిటికన్న ఎత్తుగా, కొట్టొచ్చినట్లు కనిపిస్తే, లేక గట్టిగా, మొరటుగా ఉంటే అది అత్యుచ్ఛం. అలాంటి వ్యక్తి మిధ్యావాది, డాంబికుడు, విశ్వాసఘాతుకుడు, అనవసర ప్రసంగి అవుతాడు. కాని గొప్ప విద్యావంతు డవుతాడు. మోసాలు, కలహాలు ఇష్టం. మాటతీరు, ప్రవర్తన అసభ్యంగా, జుగుప్సాకరంగా ఉంటాయి. వానికి జూదాలంటే ఇష్టం.

అత్యుచ్ఛ బుధక్షేత్రంలో గుణకచిహ్నం ఉన్న వ్యక్తి జూదాలలో సర్వం పోగొట్టుకుంటాడు. చతుష్కోణ చిహ్నం ఉంటే జూదంలో సంపాదించి, వ్యసనాలకు ఖర్చు చేస్తాడు. విద్యావంతుడైనా ఈ వ్యసనాలకు బానిస కాక తప్పదు.

## బుధ, రవి మండలాలు

బుధక్షేత్రం రవిక్షేత్రం వైపు వాలి ఉన్న వ్యక్తి వ్యాపార కుశలుడై ధనం సంపాదిస్తాడు. డాక్టర్లు, లాయర్లు అయి అన్యాయంగా జనాల్ని దోచుకుంటారు. వారికి నిజాయితీ ఉండదు. మామగారి ఆస్తిపాస్తులు వచ్చి కలుస్తాయి. భార్య అనుకూలంగా ఉండి, గృహ నిర్వహణ బాగా చేస్తుంది. ఆమె భర్త కన్న ముందుగా చనిపోతుంది.

## బుధ, కుజ మండలాలు

బుధమండలం కుజక్షేత్రం వైపు చూచిన, అనగా బుధక్షేత్రం క్రింది భాగం ఎత్తుగా, బలంగా ఉంటే, ఆ వ్యక్తి ప్రశాంతంగా, ప్రసన్నంగా జీవిస్తాడు. కాని ఇతరుల కష్టనష్టాలను పట్టించుకోడు. బంధువులు, ఆత్మీయులు మరణించినా విచారించడు. సహాయం అర్థించిన వారికి విపరీతంగా సహాయం చేస్తుంటాడు.

## బుధ, గురు మండలాలు

బుధ గురు క్షేత్రాలు ఉన్నతంగా కల వ్యక్తి ఎప్పుడూ తన గురించే ఆలోచిస్తాడు. తన మంచికోసమే తపిస్తాడు. సమాజాన్ని, మిత్రుల్ని తన ప్రయోజనాలకు వాడుకుంటాడు. కార్యదీక్ష, పట్టుదల అధికం. అతనిలో జనాకర్షణ ఉంటుంది. ఎలాంటి వారినైనా తనవైపు ఆకర్షిస్తాడు. ఏ రంగంలోనైనా తాను ముందుంటాడు. అతి సామాన్యంగా జీవించడం ఇష్టముండదు. ఎప్పుడూ చదవడం, రాయడం, ఆలోచించడం యిష్టం. జర్నలిస్టులు, రచయితలు ఈ కోవలోకి వస్తారు. వీరు అనతికాలంలో సుఖభోగాల పట్ల వైరాగ్యం కలిగి తాత్వికులవుతారు. సత్యాన్వేషణ, జ్ఞాన సముపార్జన వీరి అంతిమ లక్ష్యం. వీరు యోగులుగా మారతారు.

## బుధ, ప్రథమ కుజ మండలాలు

మొదటి కుజ మండలం బుధక్షేత్రం అంత ఉన్నతంగా వుంటే, ఆ వ్యక్తి అందరికీ ఇష్టుడు, ఆప్తుడు అవుతాడు. పిల్లలతో, వృద్ధులతో కలిసిపోతాడు. సాటి వారిలో మేటి వ్యక్తిగా రాణిస్తాడు. స్త్రీలను సైతం నిమిషంలో ఆకర్షించి, తనవైపు తిప్పుకోగలడు. ఎదుటివారి ఇష్టాలే తనకూ ఇష్టమని నమ్మిస్తాడు. మహాజ్ఞాని, రసికుడు, సౌందర్యారాధకుడు. ఇన్ని భిన్న లక్షణాలకు తోడుగా అతని నీతి నియమాలు, క్రమశిక్షణ ప్రశంసనీయంగా ఉంటాయి. దేవాలయాలు కట్టించడం, ఆశ్రమాలు నెలకొల్పడం లాంటి ధర్మకార్యాలు చేస్తాడు.

## బుధ, శుక్ర మండలాలు

బుధ, శుక్ర మండలాలు ఉన్నతంగా ఉన్న వానికి మాతామహుని ప్రేమ, ధన సహాయం అందుతుంది. అతనికి దైవ భక్తి, ఆధ్యాత్మిక చింతన ఎక్కువ. మిత్రులతో వినోదంగా గడుపుతాడు. శత్రువు లుండరు. నవ్వుతూ, నవ్విస్తూ ఆనందంగా జీవిస్తాడు. ఎవరెంత రెచ్చగొట్టినా అతనికి కోపం రాదు.

## బుధ, ద్వితీయ కుజ మండలం

బుధ మండలం అంత ఉన్నతంగా ద్వితీయ కుజమండలం ఉంటే ఆ వ్యక్తికి ఉదార స్వభావం ఎక్కువ. ఆశ్రితుల పాలిట కల్పవృక్షం అవుతాడు. బుద్ధిమంతుడు, ధనవంతుడు అయినందున సత్పురుషుడుగా, మంచి మనిషిగా పేరు గడిస్తాడు. బుధ మండలాన్ని బట్టి విద్య, వివేకం, బుద్ధి, ఇచ్ఛాశక్తి, వ్యాపార

కుశలత, వ్యవహార జ్ఞానం, వాక్శుద్ధి, కవితాశక్తి, బంధు మిత్ర మైత్రి, అర్ధాంగి స్వభావం గ్రహించవచ్చు.

## బుధ, చంద్ర మండలాలు

చేతిలో బుధ, చంద్ర క్షేత్రాలు మాత్రమే బలంగా, ఉన్నతంగా ఉంటే, ఆ వ్యక్తి జీవితంలో అనేక విలక్షణ కార్యాలు చేసి, చివరకు భయంకరంగా మృతి చెందుతాడు

## బుధ మండలం : నీచం

బుధ మండలం నీచమై, అనగా పీలగా, పల్లంగా ఉంటే, అతనికి ఆలోచనాశక్తి ఉండదు. మూర్ఖంగా ప్రవర్తిస్తాడు. పరమశుంఠ, విశ్వాస హీనుడవుతాడు. అతనికి గుండె బలం తక్కువ. ప్రతిదానికి భయపడుతుంటాడు. తన మంచి కోరే వారిని సైతం అనుమానిస్తుంటాడు. కష్ట సమయంలో ఎవరూ అతనికి సాయం చేయరు. దొంగగా, ద్రోహిగా, మూర్ఖంగా జీవితం గడుపు తుంటాడు.

బుధ మండలం నీచమైనా, బలహీనపడినా, దాని పైన ఏవైనా శుభచిహ్నాలుంటే శుభ ఫలితాలు కలుగుతాయి.

## అనారోగ్య లక్షణాలు

1. బుధక్షేత్రం మాత్రం ఉన్నతంగా వుండి దానిపైన అనేక రేఖలు నిలువుగా, అడ్డంగా, జల్లెడగా వుంటే ఆ వ్యక్తి ప్లీహ, వాయు రోగాలతో బాధపడుతూ, జీవితాంతం మందులపై ఆధార పడి బ్రతుకుతుంటాడు.




2. బుధమండలం అత్యున్నతమై, చంద్ర మండలంలో ఒక నక్షత్రం వుంటే, అది అపెండిసిటిస్ సూచిస్తుంది. అది కుడివైపుగా ఉంటే బాధ ఎక్కువ. వెంటనే ఆపరేషన్ చేయక పోతే మృత్యువు తప్పదు. బుధ మండలం ఉన్నతంగా ఉంటే శస్త్రచికిత్స విజయవంత మవుతుంది. చంద్రమండలం కూడా ఉన్నతంగా ఉంటే ఆపరేషన్ జరిగినా అతను బ్రతకడు.

3. బుధ క్షేత్రం అత్యున్నతం అయి, ఆరోగ్యరేఖ బుధ మండలం చివరి వరకు ఉండి, హృదయ మస్తిష్క రేఖల నడుమ ఆరోగ్యరేఖ పైన ఒక ద్వీప చిహ్నం ఉంటే అతని జీర్ణకోశం దెబ్బతిని, మనిషి క్షీణిస్తూ, ఏమీ తినలేని స్థితిలో మరణిస్తాడు.

4. బుధక్షేత్రం అత్యున్నతమై, జీవిత మస్తిష్క రేఖల నడుమ ఆరోగ్యరేఖ పైన ద్వీప చిహ్నమున్న వ్యక్తి కడుపులో పుండుతో బాధపడతాడు. దానికి దగ్గరగా నక్షత్రంగాని, మచ్చగానీ వుంటే అతను చాలాకాలం ఉదరకోశ వ్యాధితో బాధ పడతాడు. అపత్యం వల్ల రోగం తిరగబడుతుంది. బాధ భరించలేక ఆత్మహత్య చేసుకుంటాడు.

5. మస్తిష్క రేఖ పైగా ఆరోగ్య రేఖ మీద ఒక ద్వీప చిహ్నం ఉన్న వ్యక్తి క్షయవ్యాధిగ్రస్తు డవుతాడు. గోళ్లు వంకరగా ఉంటే అల్పాయుష్కుడని చెప్పవచ్చు.

స్త్రీ హస్తంలో అలాంటి ద్వీపం ఉంటే ఆమె ప్రసవ సమయంలో మరణిస్తుంది. ఆరోగ్య రేఖ మస్తిష్కరేఖను ఖండించే చోట ఈ ద్వీపచిహ్నం ఉంటే ప్రమాదం తప్పదు.

## బుధక్షేత్రంపై చిహ్నాలు

1. బుధక్షేత్రం పైభాగంలో, అనగా కనిష్టాంగుళి దిగువన చిన్న చిన్న రేఖలు సాలెపురుగులా ఏర్పడితే, ఆ వ్యక్తి బహు భాషావేత్త అయి, సకలభోగాలు, భాగ్యాలు పుష్కలంగా అనుభవిస్తాడు. నృత్యకళలో, నటనలో నిష్ణాతుడవుతాడు. కీర్తి దాహం ఎక్కువ. ఉదారంగా అందరికీ సాయపడు తుంటాడు. వ్యాపార, వ్యవహార కుశలు డవుతాడు. అనేక మంది స్త్రీలతో పరిచయం ఏర్పడుతుంది.




ఈ చిహ్నం బుధ మండలం మధ్యన ఉంటే, వ్యవసాయ వ్యాపారాలలో నష్టం సూచిస్తుంది. ప్రతి పనిలోనూ తొందర పాటు వల్ల నష్టపోతుంటాడు. చివరకు పూర్తిగా పతనం చెందుతాడు.

వివాహ, హృదయరేఖల నడుమ, బుధక్షేత్రంలో ఈ చిహ్నం ఉంటే, అతడు తగవులమారి అవుతాడు. ఎప్పుడూ ఎవరో ఒకరితో దెబ్బలాడుతుంటాడు. అందరిని

ద్వేషిస్తుంటాడు. అతని భార్య సుఖభోగాలు ఆశించి వ్యభిచరిస్తుంది. యవ్వనంలోనే రోగాలతో మరణిస్తుంది. అతను తిరిగి వివాహం చేసుకోవాలని ప్రయత్నించినా ఫలితం ఉండదు. ఒకవేళ మళ్ళీ పెళ్ళి చేసుకున్నా సుఖపడలేడు.

2. బుధ మండలంలో అర్ధచంద్రాకార చిహ్నం ఉన్న వ్యక్తి మహామొండివాడు, మూర్ఖుడు, బుద్ధిహీనుడు అవుతాడు. ఇతరులకు నష్టం కలిగించడం అతనికి ఆనందం. దొంగతనాలు చేస్తాడు. బాధపడే వారిని చూచి సంతోషిస్తాడు. తను మాత్రం పరమనీచుడుగా జీవిస్తాడు.

ఈ గుర్తు గల స్త్రీ కులట అవుతుంది. ఎందరో పురుషులతో స్నేహం చేస్తుంది. భర్తను వదిలిపెట్టి ప్రియుడితో లేచిపోతుంది. తను ఎందరితో వ్యభిచరించినా పతివ్రతలా నీతులు చెబుతుంది.

ఈ అర్ధ చంద్రాకార చిహ్నం కొనలు రవిక్షేత్రం వైపుగా వాలిన, ఆ వ్యక్తి పరమదయాళువు, శాంతస్వభావుడు, ధనవంతుడు అవుతాడు.

ఆ కొనలు కనిష్టకాంగుళి వైపు చూస్తే అతను అన్ని పనులు ప్రతిభావంతంగా, విజయవంతంగా నిర్వహించగలుగుతాడు.

ఆ కొనలు క్రింది వైపుగా తిరిగితే ఆ వ్యక్తి విపరీతంగా ధననష్టం పొందుతాడు.

3. బుధక్షేత్రంలో ఒక వృత్త చిహ్నం ఉండి, దానిని ఒక చిన్న నిలువు రేఖ ఖండిస్తే, ఆ వ్యక్తి బుద్ధిహీనుడై అనేక సుఖరోగాలు అనుభవిస్తాడు. పచ్చిగా వ్యభిచరించి జీవితాంతం కుళ్ళి కృషిస్తాడు. వానికి బిడ్డలుండరు. ఉంటే, తండ్రి సుఖ రోగాలకు వారసులవుతారు. కుటుంబ పోషణకు అతడనేక అకృత్యాలు చేస్తుంటాడు. వృత్తాన్ని ఖండించే రేఖ వక్రంగా పాముచలె ఉంటే అతనికి మరణదండన తప్పదు. బుధక్షేత్రం బలంగా వుంటే మరణశిక్ష తప్పుతుంది. కాని యావజ్జీవ కారాగారం అనుభవిస్తాడు. బుధక్షేత్రం మరీ బలంగా, ఎత్తుగా, ఉబ్బుగా ఉంటే అతడు కారాగారంలోనే మరణిస్తాడు. ఒక్క స్త్రీల విషయంలో తప్ప అతడు సాధువుగా ఉంటాడు.



4. బుధక్షేత్రంలో ఒక స్పష్టమైన త్రిభుజ చిహ్నం ఉన్న వ్యక్తి గొప్ప పరిశ్రమ శీలుడవుతాడు. సన్మానాలు, సత్కారాలు, ప్రభుత్వ మన్ననలు పొందుతాడు. తన సంపాదన తాను అనుభవించడు. కీర్తి దాహం ఎక్కువ. లక్షలు ఖర్చుపెట్టి సన్మానాలు చేయించుకుంటాడు. అతని ఔన్నత్యం చూచి అసూయ చెందినవారు శత్రువు లవుతారు. వాహన ప్రమాదం ఉంటుంది. పరస్త్రీలంటే భయం. భార్య ప్రసవ సమయంలో మరణిస్తుంది. అతను లోకనింద భరించవలసి వస్తుంది. అతనికి చట్టం, న్యాయం అంటే గౌరవం, భయం. మంచి వక్తగా రాణిస్తాడు.

5. బుధక్షేత్రంలో నాలుగు నిలువు రేఖలు, మూడు అడ్డరేఖలు ఖండించుకుంటే ఆ వ్యక్తి స్త్రీలోలుడు, వ్యసనపరుడు అవుతాడు. స్త్రీల పొందుకై విపరీతంగా ఖర్చు చేస్తాడు. కొంతకాలం మానసికంగా క్రుంగిపోయి కడకు మంచిగా మారతాడు. అయినా మనసు స్త్రీ సాంగత్యం పైకి పోతుంది. అతను చివరకు పరమ నీచుడుగా మారిపోతాడు. బంధుమిత్రులు తక్కువ, మూత్రవ్యాధులతో బాధపడతాడు. పెండ్లి అయినా 30 ఏళ్ల లోపే భార్యా వియోగం ప్రాప్తిస్తుంది. ఆ తర్వాత మళ్లీ పెళ్లి కాదు. బుధక్షేత్రం బలంగా ఉంటే 40వ ఏట భార్యా వియోగం తప్పదు. ఆ తర్వాత ఒక కులట సాంగత్యం వల్ల అకాల మరణం సంభవిస్తుంది. శత్రువులే అతనిని దారుణంగా హత్య చేస్తారు.

6. బుధ మండలంలో హృదయరేఖ సమీపంగా ఒక నల్లని మచ్చ వున్న వ్యక్తి నీచుడు, వ్యభిచారి, హంతకుడు అవుతాడు. అతను దారుణంగా మరణిస్తాడు. ఆ మచ్చ హృదయరేఖను తాకితే, ఆ గుణాలకు తోడు అతనికి గుండె జబ్బు వస్తుంది. బంధు మిత్రులు దగ్గరకు రానీయరు. డబ్బు చేజారిపోతుంది.

7. రవి, బుధ క్షేత్రాల మధ్య ఒక త్రిభుజ చిహ్నముంటే ఆ వ్యక్తి ఉత్తమ వైజ్ఞానికుడు, శాస్త్రవేత్త లేక పారిశ్రామికవేత్త లేక వ్యాపారి అవుతాడు. ధనవంతుడై ధయా ధర్మగుణాలు కలిగి ఉంటాడు.

ఆ త్రిభుజం రవిక్షేత్రం అంచున ఉంటే అతడి ప్రయత్నాలకు ఆటంకం కలుగుతుంది.

రవి, బుధ మండలాలు బలంగా ఉండి, త్రిభుజ చిహ్నం స్పష్టంగా ఉంటే, ఇతర రేఖలు దానిని ఖండించకపోతే అది శుభఫలితాల నిస్తుంది. క్షేత్రాలు అత్యుచ్ఛమైతే అశుభాలు కలుగుతాయి.

బుధమండలం మాత్రం ఉచ్ఛలో వుండి, రవిక్షేత్రం నీచమై రెండింటి నడుమ ఒక త్రిభుజ చిహ్నం ఉంటే, అది ధన, కనక, వస్తు, వాహన యోగాల నిస్తుంది. ఆ వ్యక్తి ఐశ్వర్య సంపన్నుడవు తాడు. గొప్ప పేరు సంపాదిస్తాడు. శానస ధిక్కార నేరానికి కారాగార శిక్ష అనుభవిస్తాడు.




బుధక్షేత్రం నీచమై రవి ఉచ్ఛమైన వ్యక్తి వ్యాపార, వ్యవసాయ రంగాలలో కష్టనష్టాలు పొందుతాడు. అయితే ధైర్య సాహసాలు అధికం. తిరిగి పూర్వ వైభవం పొందుతాడు.

8. ఉన్నత బుధమండలం పైన ఒక నక్షత్ర చిహ్నం గల వ్యక్తి సాహిత్య, విద్యా రంగాలలో అకస్మాత్తుగా గుర్తింపు పొందుతాడు. వీరు రచయితలు, గ్రంథకర్తలు అవుతారు. బహుమతులు పొంది ప్రజాదరణ సంపాదిస్తారు. వీరిలో విపరీతమైన స్వార్థం, గర్వం, అసూయ ఉంటాయి. అవినీతిపరులై వ్యభిచరిస్తారు.

9. బుధ మండలంలో వృత్తాకార చిహ్నం గల వ్యక్తి విషప్రయోగం వల్ల మరణిస్తాడు. అది హృదయరేఖకు సమీపంగా ఉంటే మితిమీరిన మద్యపానం అతని ప్రాణం తీస్తుంది.

10. బుధ మండలంలో గుణక చిహ్నం అవిశ్వాసానికి చిహ్నం. ఆ చిహ్నం గల వ్యక్తి మొండివాడు, అబద్దాలకోరు, దగాకోరు, మోసగాడు అవుతాడు. అతను న్యాయస్థానాన్ని సైతం మోసగిస్తాడు. అవసరాల కోసం దొంగతనాలు చేస్తాడు.

ఈ గుణక చిహ్నం వివాహరేఖపైన ఉంటే అతని ఇల్లాలు అకస్మాత్తుగా మరణిస్తుంది.

గుణకచిహ్నం కనిష్టకాంగుళి మూడవ పర్వంలో ఉంటే అతనికి పెళ్లిపెటాకు లుండవు. ఆజన్మబ్రహ్మచారిగా ఉండిపోతాడు. దానికితోడు కనిష్టకాంగుళి లావుగా, చిన్నదిగా ఉంటే అతడు దరిద్రుడు, దొంగ అవుతాడు. బుధకేత్రంపైన ఎన్ని గుణక చిహ్నాలుంటే అంత ఎక్కువ చెడు జరుగుతుంది.

బుధక్షేత్రం ఉన్నతంగా ఉండి, దానిపైన గుణకచిహ్నం ఉండి, చేతిలో ఇతర శుభచిహ్నాలు, లక్షణాలు ఉంటే అతడు హాస్య నటుడు, వ్యవహారవేత్త, కార్యనిర్వాహకుడు అవుతాడు. అతనికి ప్రాపంచిక సుఖాలపై ఆసక్తి ఎక్కువ. దైవచింతన శూన్యం. కడకు సుఖరోగాల పాలవుతాడు.

11. బుధమండలంలో ద్వీపచిహ్నం ఉన్న వ్యక్తి మోసంతో, కపటంతో ఇతరుల సంపదలు హరిస్తాడు. దగ్గర బంధువుల అమ్మాయిని పెళ్లాడి కష్టాల పాలవుతాడు. అవినీతి పనులు ఎక్కువ. అహంభావం, అహంకారం వల్ల బాధలు పడతాడు.




12. వివాహరేఖ పైన ద్వీపచిహ్నమున్న, దంపతులు విడిపోయి ఎవరికి వారుగా జీవిస్తారు. వియోగం కారణంగా అతని భార్య మృతి చెందుతుంది.

13. బుధ మండలంలో దిగువగా, హృదయరేఖకు పైగా ద్వీపచిహ్నం ఉన్న వ్యక్తి జీవితం దుర్భరమవుతుంది. భార్య ప్రేమ నటించి తర్వాత అతన్ని వదలి వెళ్లిపోతుంది. జీవితాంతం అతడు భగ్న ప్రేమికుడుగా విలపిస్తాడు.

14. బుధక్షేత్రంలో మూడు నిలువు రేఖలు, నాలుగు అడ్డరేఖలు ఖండించుకుని వలలా ఏర్పడితే అతను దొంగ, అవినీతిపరుడు అయి, అవమానాలు భరించలేక ఆత్మహత్య చేసుకుంటాడు. అది వల వలె కాక చిన్న చిన్న రేఖలు విడివిడిగా ఖండించుకుంటే ఎన్ని దుర్గుణాలున్నా అతని మేధ చురుగ్గా పనిచేస్తుంది. ఎన్ని పాపాలు చేసినా బయటపడకుండా జాగ్రత్త పడతాడు.

15. మూడు నిలువురేఖలు, నాలుగు అడ్డరేఖలు ఖండించుకొనగా ఏర్పడిన వల వివాహరేఖను, హృదయరేఖను స్పృశిస్తే ఆ వ్యక్తి అవివాహితుడుగా ఉండిపోతాడు. ఆ చిహ్నం స్త్రీ హస్తంలో ఉంటే ఆమె వివాహిత అయినా శృంగార జీవితం గడుపుతుంది.

16. బుధక్షేత్రంలోని మూడు నిలువురేఖల్ని మూడు అడ్డరేఖలు ఖండిస్తే ఆ వ్యక్తి అభిమానవంతుడవుతాడు. భోగవిలాసాలు ఎక్కువ. మహాక్రూరంగా,

రాక్షసంగా, శాడిస్టుగా ప్రవర్తిస్తాడు. స్త్రీల కోసం ఎంతటి సాహస కార్యాలైనా చేస్తాడు. అతిభోగంతో కృశించి పోతాడు.

## బుధ రేఖలు

భాగ్యరేఖ, రవిరేఖల వలె బుధరేఖలకు సైతం విశేషప్రాధాన్యముంది. చాలామంది సాముద్రిక వేత్తలు ప్రధానమైన జీవిత, మస్తిష్క, హృదయ రేఖల్ని అదృష్టరేఖను మాత్రమే పరిశీలిస్తారు. అవి యిచ్చే ఫలితాలను చెడగొట్టే గుర్తులు చేతిలో చాలా ఉంటాయి. అందుకు బుధరేఖల పరిశీలన చాలా ముఖ్యం.

1. బుధ మండలం పై భాగంలో లేక కనిష్టకాంగుళి మూలస్థానంలో స్పష్టమైన ఒక నిలువురేఖను రెండు అడ్డరేఖలు ఖండిస్తే అతడు ఇంద్రియలోలుడు, వ్యభిచారి అయి అపకీర్తి పాలవుతాడు. వానికి సంతానాపేక్ష ఎక్కువ. దూరప్రాంతాలకు వెళ్లి అనేక బాధలు అనుభవిస్తాడు. పరస్త్రీ వ్యామోహం వల్ల పతనం చెందుతాడు. ఈ లక్షణం స్త్రీ చేతిలో ఉంటే ఆమె వ్యభిచారి అవుతుంది. పొట్టకోసం పడుపు వృత్తి స్వీకరిస్తుంది. సుఖరోగాలతో మరణిస్తుంది.




నిలువు రేఖను ఖండించే రేఖలు వంకరగా ఉంటే వానికి భార్యాబిడ్డల వల్ల సుఖం ఉండదు. అతడు అవివేకి, విద్యావిహీనుడు అవుతాడు. జీవితంలో ఒక్క మంచి పనీ చేయడు. ఉన్న డబ్బును జల్సాలకు ఖర్చుపెడతాడు. చెడ్డవారితో స్నేహాలు చేసి వారికోసం ధనవ్యయం చేస్తాడు. సమాజం అతనిని నీచునిగా ముద్ర వేస్తుంది.

2. బుధక్షేత్రం పైభాగంలో గానీ, కనిష్టకాంగుళి మూలస్థానంలో గాని సమాంతరంగా ఉన్న రెండు నిలువు రేఖల్ని, ఒక అడ్డురేఖ ఖండిస్తే అతడు జననాంగ సంబంధమైన లోపం లేదా జబ్బులు కలిగి



ఉంటాడు. అతని భార్య సదా రోగగ్రస్థ అవుతుంది. అవి వారసత్వపు సుఖ సంకటాలు కావచ్చు.

3. బుధ మండలంలో పైభాగాన ఒక నిలువు రేఖను అనేక అడ్డరేఖలు ఖండిస్తే, అతనికి జననాంగ సంబంధ వ్యాధులే కాక అనేక ఇతర దీర్ఘ వ్యాధులుంటాయి. మధుమేహం, మూత్రాశయ వ్యాధులు, మొలల వ్యాధి ఉంటాయి. వాటికి తోడు ఇల్లాలి అవినీతి ప్రవర్తన అతనిని క్రుంగదీస్తుంది. ఆమె సంతానం కొరకు పరపురుష సాంగత్యం కోరుతుంది.

ఆ చిన్న రేఖలు వంకరగా ఉంటే అతనికి వివాహం కాదు. రేఖలు మరీ వక్రంగా ఉంటే అతను పరస్త్రీలతో, వ్యభిచారులతో సంగమిస్తుంటాడు. వ్యాపారంలో బాగా సంపాదించి వ్యసనాలకు వెచ్చిస్తుంటాడు.

దానికి తోడు రవిక్షేత్రం ఉన్నతంగా ఉండి, బుధ మండలాన్ని చూస్తే, జీవితరేఖ స్పష్టంగా ఉంటే, పైన చెప్పిన చెడు జరగదు. పరస్త్రీ వ్యామోహం మాత్రం ఉంటుంది. వ్యాపారంలో గానీ, ఉద్యోగంలో గానీ ధన సంపాదన బాగా ఉంటుంది. మధ్య వయస్సులో ఆకస్మిక ధనలాభం.

4. బుధ మండలం ఊర్ధ్వభాగంలో మూడు నిలువురేఖలు సరళంగా, స్పష్టంగా ఉన్న వ్యక్తి ఉన్నత పదవులు పొంది ప్రభుత్వ సత్కారాలు అందుకుంటాడు. బాగా డబ్బు గడించి, ధన సంపన్నుడవుతాడు. వాద వివాదాలలో విజయం పొందుతాడు. పరోపకారగుణం ఉంటుంది. అతనికి స్త్రీ మూలంగా ధనం, ఆస్తి, సంపదలు వస్తాయి. మంత్ర, తంత్ర, యోగ విద్యలలో ప్రావీణ్యం ఉంటుంది. యజ్ఞయాగాలు చేసి విశ్వకళ్యాణం కాంక్షిస్తాడు. మౌనంగా యోగసాధన చేస్తాడు. నిష్ట, నియమం ఎక్కువ.




5. బుధక్షేత్రం నుండి బయలుదేరిన రెండు రేఖలు కనిష్టకాంగుళి మొదటి పర్వంలోకి పోయిన, ఆ వ్యక్తి అలంకార ప్రియుడవుతాడు. తన అందచందాలతో ఆడవారిని ఆకర్షిస్తాడు. అతని మేధా సంపద, ప్రజ్ఞ ఎవరినైనా వశం చేస్తుంది. సరస సంభాషణ అతని ఆకర్షణ.

అతనికి ఐశ్వర్యానికి లోటు ఉండదు. బిడ్డలు ఉన్నతస్థితికి వస్తారు. భార్య సౌందర్యవతి, అనుకూలంగా ఉంటుంది. ఈ రేఖ గల వారు వైద్య రంగంలో పెద్ద సర్జన్స్ అవుతారు.

6. బుధక్షేత్రం నుండి బయలుదేరిన రెండు రేఖలలో ఒకటి కనిష్టకాంగుళి అధోపర్వం వరకు పోయి, రెండవది చిటికిన వేలు మూలరేఖను తాకినట్లున్న ఆ వ్యక్తి గవర్నరు, మినిస్టర్ లేక గొప్ప పరిపాలనా దక్షుడు అవుతాడు. సెక్రటరీ, చీఫ్ సెక్రటరీ అవుతాడు. రాయబారిగా విదేశాలకు వెళ్లే వీలుంది. ఇతరత్రా అడ్డరేఖలు ఖండించకుండా వుంటే విశేషఫలం.

ఈ చిహ్నం స్త్రీ హస్తంలో అంటే ఆమె గొప్ప అధికార పదవి పొంది రాణిస్తుంది. గృహిణిగా ఉంటే ఆమె భర్త, పిల్లలు ఉన్నత స్థితికి వస్తారు. ఆ కుటుంబం అష్టవిధ ఐశ్వర్యాలు అనుభవిస్తారు. వారిది ఉన్నత కుటుంబం అనిపించుకుంటుంది. వారికి కార్లు, బంగళాలు, హోదా అన్నీ ఉంటాయి.

7. రవి బుధ క్షేత్రాల మధ్య నుండి ప్రారంభమైన రవిరేఖ అనామిక మూలస్థానం వరకు పోయి, కనిష్టకాంగుళి మూలస్థానం నుండి బయలుదేరి వచ్చిన రేఖతో కోణంగా ఏర్పడితే ఆ వ్యక్తి మహాత్ముడు, మహాపురుషుడు అవుతాడు. సత్కర్మ లాచరిస్తాడు. ఆశ్రమాలు నెలకొల్పి, ఆధ్యాత్మిక విద్యా ప్రబోధం చేస్తాడు. అతనికి దానధర్మాలు అధికం. అతను జీవితంలో కష్టనష్టాలు ఎదుర్కోవలసిన అవసరం కలగదు.

8. రవిక్షేత్రంలో, లేదా బుధమండలం చివర, రవిరేఖను కనిష్టకాంగుళి మూలస్థానం నుండి వచ్చిన రేఖ ఒకటి ఖండిస్తే అశుభసూచన. అతడు మతి చలించి బుద్ధిహీనుడవుతాడు. భార్యాబిడ్డలవల్ల బంధువుల వల్ల ఆపదల పాలవుతాడు. ఆస్తి చిక్కులు, ఆర్థిక చిక్కులు ఏర్పడతాయి. చదువుకున్నవాడై నందున ఉద్యోగంలో చేరి కొంత ఉపశమనం పొందుతాడు. పట్టుదలతో తన బాధల్ని మరచి, కుటుంబాన్ని చక్కదిద్దుకుంటాడు. చదువులేనివాడైతే విధికి తలవంచి బాధ పడతాడు.

9. బుధమండలం నుండి బయలుదేరిన ఒక రేఖ వక్రంగా గురుక్షేత్రం వరకు వెళితే, అతను తన బాధ్యతలను విస్మరించి, మతిస్థిమితం లేక, ఇల్లు వదలిపోతాడు. కొంతకాలం యాచనతో జీవిస్తాడు. ఆస్థిపాస్తులు అన్నీ వదలి పారిపోయినా తాను స్థితిమంతుడననే భావిస్తాడు.

ఈ రేఖ గురుక్షేత్రం పైన రెండుగా చీలి సమకోణం ఏర్పడితే, అతను స్వార్థ పరుడు, మొండివాడు అవుతాడు. సిగ్గు, లజ్జ, అభిమానం ఉండవు. ఏదో చెడ్డపని చేసి అకాల మృత్యువాతపడతాడు. చిన్న వయస్సులో ఈ లక్షణం ఉంటే చదువు పూర్తి అయ్యేసరికి ఆ చెడు పోతుంది. కానీ ఒక ప్రేమ వ్యవహారంలో ఆత్మహత్యకు పూనుకుంటాడు.




10. బుధమండలం నుండి బయలు దేరిన రేఖ సరళంగా గురుక్షేత్రాన్ని చేరి రెండుగా చీలి సమకోణంగా ఏర్పడితే అతడు అనేక రంగాలలో ప్రజ్ఞా వంతుడవుతాడు. అతనికి విశేష ప్రజ్ఞా ప్రతిభ లుంటాయి. పెద్దలను గౌరవిస్తాడు. కోణం చక్కగా ఏర్పడితే మంత్రి అవుతాడు. ఐశ్వర్యాలు పుష్కలంగా అనుభవిస్తాడు. వ్యాపారాలలో బాగా లాభిస్తుంది. చివరకు ఒక పుణ్యక్షేత్రంలో మరణిస్తాడు.




11. బుధమండలం నుండి బయలు దేరిన రేఖ చాపంగా (ధనుషాకారం) శని మండలానికి పోతే, అది దురదృష్టం. పాపకార్యాలు చేసి అపకీర్తి సంపాదిస్తాడు. చివరకు దరిద్రుడు, వ్యభిచారి అవుతాడు. కుతంత్రంగా, వ్యాపారంలో ధనం సంపాదించినా, ఇంట్లో పోరు వల్ల మనశ్శాంతి ఉండదు. చివరకు దీర్ఘరోగాలతో మరణిస్తాడు. ఆ చాపం కొనలు పైకి, వేళ్ల వైపు తిరిగి ఉంటే, అన్నీ మంచి ఫలితాలే కలుగుతాయి. అప్పుడది శుక్రచాపం (గర్డిల్ ఆఫ్ వీనస్) అవుతుంది. శుక్ర చాపం క్రిందికి వంగితే అన్నీ అనర్థాలే కలుగుతాయి.

12. బుధక్షేత్రం నుండి బయలుదేరిన రేఖ సరళంగా, తికమకగా శనిక్షేత్రానికి చేరితే ఆ వ్యక్తి విదేశాలలో వాణిజ్యం చేస్తాడు. ఎగుమతి, దిగుమతి (ఫారిన్‌ట్రేడ్)



ఎక్కువ కాలం విదేశాలలో గడుపుతాడు. పెద్ద పరిశ్రమలు, వ్యాపారసంస్థలు నెలకొల్పుతాడు. ఇతర దేశాల సహకారంతో కోట్లు సంపాదిస్తాడు. ఈ రేఖ ఛిన్నాభిన్నంగా ఉంటే వ్యాపారంలో అవరోధాలు ఏర్పడతాయి. మామూలు ఉద్యోగం చేసి జీవిస్తాడు గానీ, పెద్ద పరిశ్రమలు స్థాపించలేడు. పారిశ్రామికవేత్త కావాలన్న ఆశలు కలలుగా మిగిలిపోతాయి. అతనికి బంధు మిత్రులు సహకరించకపోగా అతని ప్రయత్నాలకు అవరోధాలు కల్పిస్తుంటారు.

వివాహరేఖ చక్కగా ఉంటే, అతనికి భార్య కాక మరొక స్త్రీతో సంబంధం ఉంటుంది. ఆమె వల్ల సంతానం పొందుతాడు.

13. కనిష్టకాంగుళి అధోపర్వం నుండి బయలుదేరిన రేఖ బుధక్షేత్రం దాటి రవిక్షేత్రానికి చేరితే ఆ వ్యక్తి అప్రతిష్ట పాలవుతాడు. ఎప్పుడూ చెడు ఆలోచనలు, చెడ్డ పనులు చేస్తాడు. మంచి వారిని అవమానిస్తాడు. దొంగవ్యాపారాలు ఇష్టం. స్మగుల్డ్ బిజినెస్, భార్యపై అనుమానంతో ఆమెను హింసిస్తుంటాడు. ఈ రేఖ ఛిన్నాభిన్నమైతే ఫలితాలు మరీ దారుణంగా ఉంటాయి.

ఆ రేఖ సరళంగా ఉండి తిన్నగా పోయి హృదయరేఖను తాకితే శుభ ఫలితాలు కలుగుతాయి. అలాంటివారు కళాకారులు, మంచి వ్యాపార దక్షత కలవారు, ఉదారగుణం కలవారు అయి వుంటారు. ఐశ్వర్యంతో పాటు సన్మానాలు పొందగలరు. చిత్రకారులైనా, రచయితలైనా, కళాకారులైనా బాగా ధనం సంపాదిస్తారు.



14. బుధక్షేత్రంలో లేదా కనిష్టకాంగుళి దిగువన మూడు ఏటవాలు రేఖలు స్పష్టంగా ఉంటే అతను భార్యాలోలుడు, స్త్రీ వ్యసనపరుడు అవుతాడు. పిల్లలు కలగరు. ఉద్యోగం సద్యోగం చేయకుండా పెళ్లాం ఎదురుగా కూర్చుని కాలం గడుపుతాడు. అతని భార్యకు అతనంటే అయిష్టం. భార్యకు యావదాస్తులు రాసి యిస్తాడు. ఆమె తన ప్రియులకు డబ్బు

యిస్తుంటుంది. రేఖలు వంకరగా ఉంటే ఆ ఫలితం తప్పదు. రేఖ స్పష్టంగా ఉంటే ఆమె శీలవతిగా ఉంటుంది. అతను మాత్రం పరస్త్రీ సంగమం వాంఛిస్తుంటాడు. వారికై ధనం వెచ్చిస్తుంటాడు. వారికి సంతానం ఉండదు. ఒకరు కలిగినా సుఖం ఉండదు.

బుధక్షేత్రం పైన ఒకరేఖ స్పష్టంగా వుంటే అతడు గొప్ప విద్యావంతుడు, ధనవంతుడు అవుతాడు. ఆతని తండ్రికి దీర్ఘాయుర్దాయం. భార్య సౌందర్యవతి, గుణవతి అవుతుంది. భర్తతో పాటు అన్ని గౌరవాలు, సన్మానాలు పొందగలుగు తుంది. భర్త కీర్తి ప్రతిష్టలలో సగభాగం ఆమెకు దక్కుతుంది. ఈ రేఖ గలవారు అవిశ్రాంతంగా శ్రమిస్తుంటారు. ఈ రేఖ చిన్నదిగా ఉంటే మంచి ఫలితాలనిస్తుంది. అయితే దీని ప్రభావం కొంతకాలమే ఉంటుంది.

15. బుధక్షేత్రంలో ఉన్న ఆ ఒక్క రేఖ కనిష్టకాంగుళి మూలస్థానాన్ని తాకితే, అతనికి ఒక్కడే కుమారుడు ఉంటాడు. అతడు జాతి రత్నం వలె ప్రకాశిస్తాడు. గొప్ప స్థితికి చేరతాడు.

16. బుధక్షేత్రంపైన మూడు స్పష్టమైన చిన్నరేఖలున్న వ్యక్తి మనస్సు చంచలంగా ఉంటుంది. అయినా విద్యావంతుడు, బుద్ధిమంతుడు అవుతాడు. సాధారణంగా వైద్యవృత్తిని కోరతాడు. మనస్సు ఎప్పుడూ ధన సంపాదన పైనే ఉంటుంది.

అందులో మూడవరేఖ వంకరగా, పాము వలె మెలికలు తిరిగినట్లున్న వ్యక్తి జీవితం కష్టాలకడలి. అనేక బాధలు అనుభవిస్తాడు. రక్తదోషం వల్ల తరచు జబ్బు చేస్తుంది. ఈ రేఖ ద్వీపంలా ఉంటే అకాలమరణం సంభవం. నీటిలో పడి ఆత్మహత్య చేసుకుంటాడు.



స్త్రీ హస్తంలో ఈ మూడు రేఖలు స్పష్టంగా, చిన్నవిగా ఉంటే ఆమె నర్సు, లేదా నన్ అవుతుంది. వివాహం కాకపోయినా అనేక మంది పురుషులతో సుఖిస్తుంది. సంతానాపేక్ష ఉండదు. ఆమె మనస్సు కోమలం. ఆమెలో దయ, కరుణ ఎక్కువ. తన పురుషాసక్తిని ఆమె అపవిత్రం అనుకోదు, పైగా గర్వపడుతుంది.

17. బుధక్షేత్రంలో రెండు నిలువు రేఖలు మాత్రమే ఉంటే అతడు విద్యా, వివేక

సంపన్నుడవుతాడు. తను సంపాదించిన ధనం బంధుమిత్రులకు ఖర్చు చేస్తాడు. సమాజంలో గౌరవం పొంది మంచివాడుగా ఉంటాడు.

18. పై రెండు రేఖలలో ఒకటి కనిష్టకాంగుళి మూలస్థానాన్ని తాకితే అది రెండవరేఖ కన్న చిన్నదైతే అతనికి ఒక కుమారుడు, ఒక కుమార్తె ఉంటారు. కుమారుడు మహా గుణవంతుడు, విద్యావంతుడు, ప్రయోజకుడు అవుతాడు. కుమార్తె సౌందర్యవతి, శీలవతి అవుతుంది.

ఆ రేఖలలో ఒకదానిని వివాహరేఖ తాకగా సమకోణం ఏర్పడితే ముందు కుమారుని వివాహం చేస్తాడు. 50వ సంవత్సరంలో సంసారం వదలిపెట్టి తీర్థయాత్రలు చేసి, ఆశ్రమ జీవితం గడుపుతాడు. సంసార పక్షంగా ఉన్నా, మమకారాలు తగ్గించుకుని యోగసాధన చేస్తూ సత్యాన్వేషి అవుతాడు.

ఆ రెండు రేఖలు వివాహరేఖను స్పృశిస్తే అతను భార్యాబిడ్డల్ని పోషించలేక సంసారం వదలిపారిపోయినా, తిరిగి సంసార బాధ్యతలు స్వీకరించి రాజర్షివలె జీవిస్తాడు.

ఆ రెండు రేఖలు సమానమైన పొడవుండి, బుధక్షేత్రం ఉన్నతంగా ఉంటే ఆ వ్యక్తి డాక్టర్ లేదా ఇంజనీర్ అవుతాడు. తన రంగంలో మంచి పేరు సంపాదిస్తాడు. విపరీతంగా ధనం, ఐశ్వర్యం కూడబెట్టగలుగుతాడు.

19. చక్కని భాగ్యరేఖ ఉండి దాని నుండి ఒక శాఖ బుధక్షేత్రం వరకు పోతే ఆ వ్యక్తి అంతర్జాతీయ ఖ్యాతి గడిస్తాడు. స్వదేశంలో గానీ, స్వరాష్ట్రంలో గానీ రాణించడు. ఆ రేఖ బుధక్షేత్రం మధ్య వరకు పోతే, దానిని ఇతర చిన్నరేఖలేవీ ఖండించకుంటే అతడు గొప్ప పారిశ్రామిక వేత్త అవుతాడు. విపరీతంగా ధనార్జన చేస్తాడు. ఆ రేఖ ఆరంభంలో చీలితే అతను ప్రభుత్వానికి, చట్టానికి భయపడు తుంటాడు. సంపాదించిన సొమ్ము ప్రభుత్వం పాలవుతుంది లేదా అన్యాక్రాంత మవుతుంది.




భాగ్యరేఖ ఒక శాఖపై ద్వీప చిహ్నం వుంటే అతనిని బంధువులు

పీడించుకు తింటారు. కోర్టు వ్యవహారాలలో ఆస్తినష్టం, ధననష్టం అవుతుంది. దాని పైన చతుష్కోణం ఉంటే విజయం అతని పక్షమే అవుతుంది. అతనికి ఐశ్వర్య సంపదలకన్న ఆధ్యాత్మిక చింతన అధికం. లోక కళ్యాణమే తన లక్ష్యం అనుకొని, విపరీతంగా సంపాదించి, దానధర్మాలు చేస్తుంటాడు.

20. బుధక్షేత్రం నుండి బయలుదేరిన ఆరోగ్య రేఖ గానీ, దాని శాఖ గానీ, జీవితరేఖతో కలిస్తే ఆ వ్యక్తి జీవితాంతం దీర్ఘరోగాలతో బాధపడతాడు. అది జీవితరేఖను దాటిపోతే అతని ఆరోగ్యం క్షీణించి గుండె జబ్బులకు మార్గం చూపిస్తుంది. అది జీవిత రేఖను ఖండించే వయస్సులో గుండె జబ్బు వస్తుంది. అకస్మాత్తుగా హార్టు ఫెయిల్ అయి మరణించవచ్చు. బుధరేఖ చిన్న చిన్న ముక్కలై అస్తవ్యస్తంగా ఉంటే అతని జీవితమే కారాగార జీవితంలా మారుతుంది. ఎప్పుడూ కష్టాలు, మానసిక వేదనలు తప్పవు.

బుధరేఖ స్పష్టంగా ఉండి, మస్తిష్క, భాగ్యరేఖల్ని దాటి జీవితరేఖతో కలిస్తే మస్తిష్క జీవితరేఖల మధ్య అనేక చిన్న రేఖలు దానిని ఖండిస్తే అతను మంచి కోసం అనేక మార్లు కారాగార శిక్ష అనుభవిస్తాడు. జైలులో మరణించవచ్చు.

21. బుధక్షేత్రం నుండి బయలుదేరిన ఒక రేఖ జీవితరేఖను తాకిన చోటు నుండి మరొక రేఖ బయలుదేరి ఏదైనా ఒక వ్రేలువైపుగా వెళితే, అతను మృత్యుంజయుడవుతాడు. ఆ వయస్సులో ఉన్నత స్థితికి వస్తాడు. అనుకోని అదృష్టం వరిస్తుంది.

బుధరేఖ జీవితరేఖను తాకిన చోట, దిగువగా జీవితరేఖ నుండి అదృష్టరేఖ బయలుదేరితే, ఆ వయస్సులో ఒక దుర్ఘటన జరుగుతుంది.




భాగ్యరేఖ బుధరేఖ నుండి బయలు దేరితే అతనికి అకాల మరణం సంభ విస్తుంది. అతను అంతవరకు గొప్ప పారిశ్రామిక వేత్తగా రాణిస్తాడు.

22. బుధక్షేత్రంలో ఒక రేఖ సర్పాకారంలో మందంగా ఉంటే అతను బంధు విరోధి అవుతాడు. దైవాన్ని, తల్లిదండ్రుల్ని ద్వేషిస్తాడు. అవినీతిగా చరించి, దొంగగా బ్రతుకుతాడు. సుఖం ఉండదు.

ఆ రేఖ సన్నగా ఉంటే దొంగగా మారడు, తల్లిదండ్రుల్ని ప్రేమిస్తాడు కానీ వ్యభిచారి అవుతాడు. అతని భార్య రోగిష్టి అవుతుంది. సంతాన నష్టం జరుగుతుంది.

23. బుధక్షేత్రం నుండి బయలుదేరిన ఆరోగ్య రేఖ కొంత కనిపించి, కొంత కనిపించకుండా వుంటే, అతను దీర్ఘకాలం రోగాలతో బాధపడతాడు. బుద్ధి సరిగా ఉండదు. శనిక్షేత్రం బలంగావుంటే దంతక్షయ మవుతుంది.

బుధరేఖ స్పష్టంగా ఉన్న వ్యక్తికి అన్ని సుఖాలు ఉంటాయి. స్వంత ఇల్లు, కారు, సంపదలు ఉంటాయి. జీవితం విలాసవంతంగా గడుస్తుంది. విపరీతంగా సంపాదిస్తాడు. క్రయవిక్రయ వ్యాపారం చేసి కోట్లు గడిస్తాడు. రియల్ ఎస్టేట్ వ్యాపారం, షేర్ల వ్యాపారం లేదా బ్రోకరుపని చేస్తాడు. దైవచింతన ఉంటుంది. యజ్ఞయాగాలు, క్రతువులంటే ఇష్టం.

ఈ బుధరేఖ మస్తిష్కరేఖను ఖండించకుండా ఆ లోపునే ఆగిపోతే అనేక శుభ ఫలితాలు కలుగుతాయి. అది మస్తిష్కరేఖను ఖండిస్తే మృత్యువాత పడి బ్రతకడం అవుతుంది. అతనికి ఎలాంటి మంచిపేరు ఉండదు.

బుధరేఖను ఇతర చిన్నాచితక రేఖలు ఖండిస్తే ఆ వ్యక్తికి ఉదర, శిరోసంబంధమైన రోగాలు వస్తాయి. వ్యసనాలకు బానిసై బ్రతుకుతుంటాడు. అడ్డురేఖలచే ఖండించబడిన బుధరేఖ మస్తిష్కరేఖతో ఆగినా అతని మెదడు చెడిపోతుంది. ఉన్మాదిగా, పిచ్చివాడుగా జీవిస్తాడు. అది భాగ్యరేఖతో ఆగితే అతను చపలచిత్తుడవుతాడు. ఏ పనీ స్థిరంగా, సమర్థవంతంగా చేయడు. అతనికి కోపం, అసూయ ఎక్కువ.

స్పష్టంగా, సరళంగా ఉన్న బుధరేఖ ఏ ఇతర అడ్డురేఖలు లేక భాగ్యరేఖను ఖండిస్తే అతను ఆరోగ్యవంతుడు, దీర్ఘాయుష్మంతుడు అవుతాడు. అతనిని శత్రువులు ఏమీ చేయలేరు. అకస్మాత్తుగా ధనలాభం. బుధరేఖ జీవితరేఖను స్పృశించిన వయస్సులో మరణం ప్రాప్తిస్తుంది.

శనిక్షేత్రం ఉన్నతంగా ఉండి బుధరేఖ చిన్నచిన్న ముక్కలుగా ఏర్పడిన వ్యక్తికి దంతక్షయం ఉంటుంది. త్వరగా పళ్లు ఊడిపోతాయి. నోరు ఎప్పుడూ కంపు కొడుతుంటుంది.

25. గురుక్షేత్రం ఉన్నతంగా వుండి, చిన్న ముక్కలతో బుధరేఖ ఏర్పడితే అతనికి భయంకర శిరోరోగం వస్తుంది. బ్రెయిన్ హేమరేజ్, ట్యూమర్‌లు కారణంగా తలకు ఆపరేషన్ జరుగుతుంది.

26. కుజమండలం ఉన్నతంగా ఉండి, చిన్నముక్కలు బుధరేఖగా ఏర్పడిన వ్యక్తికి ఇంద్రియ సంబంధమైన భయంకర వ్యాధులు సంక్రమిస్తాయి. ఆపరేషన్ జరిగి తీరుతుంది. అవి ముదిరితే సుఖవ్యాధులు కావచ్చు.

27. బుధక్షేత్రం ఉన్నతంగా వుండి, బుధరేఖ అస్తవ్యస్తంగా ఉంటే, ఆ వ్యక్తి వ్యాపారాలలో, వ్యవహారాలలో రాణించడు.

28. శుక్రమండలం ఉన్నతంగా ఉండి, బుధరేఖ సరిగా లేకపోతే అతని కాలికి ఆపరేషన్ జరుగుతుంది.

29. రవిమండలం బలంగా వుండి, బుధరేఖ దరిద్రంగా ఉంటే కంఠరోగాల వల్ల శస్త్ర చికిత్స జరుగుతుంది.

30. చంద్రమండలం బాగుండి, బుధరేఖ సరిగా లేకపోతే, కంటి జబ్బులు అనివార్యం. కళ్లకు ఆపరేషన్ అవసరమవుతుంది.

31. బుధక్షేత్రంలో వివాహరేఖ పై భాగంలో మూడు స్పష్టమైన నిలువు రేఖలుండి, అవి కనిష్టకాంగుళి మూలస్థానాన్ని తాకితే, ఆ వ్యక్తి సకల సద్గుణ సంపన్ను డవుతాడు. మంచి ఆచారపరుడై భార్యను అమితంగా ప్రేమిస్తాడు.

ఆ మూడు రేఖలలో ఒకటి పాములాగా వంకరగా ఉండి ఆ రేఖపైన ఒక మచ్చ ఉంటే అతను దొంగ, అబద్ధాల కోరు, కామాంధుడు అవు తాడు. తన శక్తి సామర్థ్యాలపై అతనికి అంతులేని విశ్వాసం ఉంటుంది. ఈ వంకరరేఖ వివాహరేఖను తాకితే అతని కుమారుడు అంధుడవుతాడు. అది వివాహరేఖను తాకే చోట మచ్చ ఉంటే అతని భార్య ఒక వికలాంగుని ప్రసవించి చని పోతుంది. కొద్దిరోజులలో ఆ బిడ్డ మరణిస్తుంది.




32. బుధక్షేత్రం నుండి స్పష్టమైన రెండు రేఖలు సమాంతరంగా రవిక్షేత్రం పైన అనామిక మూలస్థానం వరకు వెళితే, ఆ వ్యక్తి మహాజ్ఞాని, తపస్సంపన్నుడు, తత్వవేత్త అవుతాడు. అతనికి

త్రికాల జ్ఞానం ఉంటుంది. యోగశక్తులు, సిద్ధులు ఉంటాయి. తన జ్ఞానం గానీ, శక్తుల్ని గానీ బయట పెట్టడానికి ఇష్టపడడు. అరణ్యాలకో, గుహలకో వెళ్లి రహస్యంగా తపస్సు కొనసాగిస్తాడు. నిరాడంబరంగా జీవించడం అతని కిష్టం.

కనిష్టకాంగుళి, అనామికల మూలస్థానాల మధ్య చదరం విశాలంగా ఉంటే అతను మహాగుణవంతుడు, సదాచారపరుడు అవుతాడు. పెద్దలను పూజిస్తాడు. ఆ ప్రదేశంలో ఒక చతుష్కోణం, లేక త్రిభుజం, లేక గుణకచిహ్నం ఉంటే అతను గొప్ప కీర్తి సంపాదిస్తాడు. సమాజాభివృద్ధికి కృషి చేస్తాడు. నటులు, జర్నలిస్టులు, సాహితీపరులు, రచయితలు ఈ లక్షణం కలిగి ఉంటారు.

33. కనిష్టకాంగుళి మూలస్థాన రేఖను మూడు స్పష్టమైన నిలువురేఖలు ఖండిస్తే అతను విద్యావంతుడయినా, నీచ సాంగత్యం వాంఛిస్తాడు. మధుమాంసాలంటే ఇష్టం. నాలుగు రేఖలుంటే కీర్తి ప్రతిష్టలు సంపాదిస్తాడు. సన్మానాలు పొందుతాడు. రెండు రేఖలు మాత్రమే ఉన్న వ్యక్తి లంపటుడు, దుర్మార్గుడవుతాడు. ఒక్క రేఖ ఉన్న వ్యక్తి ఉత్తముడు, గుణ వంతుడు, పరోపకారి, దైవజ్ఞుడు అవుతాడు. అతనికి జ్యోతిష, సాము ద్రిక విషయాలు తెలుస్తాయి. నాలుగు రేఖలుండి, అవి ఒక వైపు లావుగా ఉంటే అతను పాతిక సంవత్సరాలు వచ్చే వరకు చెడుసావాసాలు చేస్తూ, చెడు తిరుగుళ్లు సాగిస్తాడు. ఒక భయంకర సంఘటన కారణంగా అతను మారిపోయి తర్వాత మంచిగా జీవిస్తాడు.




34. బుధక్షేత్రం నుండి ఒక రేఖ కనిష్టకాంగుళి రెండవ పర్వంలోకి వెళితే, అక్కడ దానిని మూడు అడ్డురేఖలు ఖండిస్తే అతనికి భార్యాబిడ్డల సుఖం ఉండదు. పరస్త్రీ సాంగత్యం చేసి చివరకు ఒక పుణ్యతీర్థంలో దిక్కులేని చావు చస్తాడు.

35. వివాహరేఖ చిన్నదిగా ఉండి, కనిష్టకాంగుళి వైపు వాలితే దాని ప్రక్కన ఒక పుట్టుమచ్చ ఉంటే, అతనికి పెళ్లి కాదు. ఒక ధనవంతురాలు అతనిని

ప్రేమించి, తన సర్వస్వం అర్పిస్తుంది. అతడు ఆమెను నిర్లక్ష్యం చేసి, అన్యస్త్రీ సాంగత్యం కోరుతుంటాడు. జీవితాంతం మానసికంగా వేదన చెందుతాడు.

36. వివాహరేఖ చిన్నదిగా ఉన్నా, లేక దానిపైన ఆరంభంలో ఒక త్రిభుజం ఉన్నా అతను బుద్ధిశాలి అవుతాడు. మధ్య వయస్సు వరకు అతనికి స్త్రీ సుఖం ఉండదు. అతని భార్య తన రహస్యాల్ని భర్తకు తెలియనివ్వదు. ఆమె రహస్య ప్రేమ కలాపాలు సాగిస్తుంది, లేదా ఒక అనాథ అయి ఉంటుంది. లేదా కులట కూతురై ఉంటుంది.

37. వివాహరేఖ ఆరంభంలో చీలి, శనిక్షేత్రం వరకు పోతే, అతను వివాహానికి పూర్వమే ప్రతిభావంతుడై ఉంటాడు. బుధక్షేత్రం ఉన్నతంగా ఉంటే అతను విద్యార్థి దశలోనే ప్రేమలో పడతాడు.

వివాహరేఖ క్రింది భాగం తెగినట్లున్న లేక హృదయరేఖ పైన వాలినా అతని భార్య తనకన్న ముందే మరణిస్తుంది. స్త్రీ హస్తంలో అలా ఉంటే భర్త ముందుగా మరణిస్తాడు.

వివాహరేఖపై అడ్డు రేఖలు భార్యాభర్తల మధ్య అనైక్యతకు, కలహాలకు చిహ్నాలు.

38. బుధక్షేత్రంలో మూడు స్పష్టమైన నిలువురేఖలు విశేషప్రతిభకు, ఉద్యోగ, విజయానికి సూచన. దానికి తోడు రవి క్షేత్రం ఉన్నతంగా ఉంటే అతను పట్టిందల్లా బంగార మవుతుంది. ఏ రంగంలోనూ అపజయం ఉండదు. జీవితంలో ఒక్కొక్క మెట్టు పైకి పోతాడు. అతనికి సోదరులుండరు. ఇది గమనార్హం. ఎప్పుడూ ఉన్నతులతో స్నేహం చేస్తుంటాడు.




ఈ మూడు రేఖలు కనిష్టకాంగుళి మూలస్థానాన్ని స్పృశిస్తే ఫలం ఇంకా అధికం. అవి వ్రేలు మూడవపర్వంలోకి పోతే ఫలితాలు తగ్గుతాయి. అవి హృదయరేఖకు దగ్గరగా వెళ్లినా, ఫలితాలు తగ్గుతాయి. అవి హృదయ రేఖను తాకితే పిల్లలు ఒకరిద్దరు మించి కలగరు. కాని కార్యనిర్వహణా చాతుర్యం ఎక్కువ. గొప్పగా సంపదలార్జిస్తాడు.

కనిష్టకాంగుళి మూలస్థానాన్ని తాకకుండా, ఇటు హృదయరేఖను దాటి ప్రథమ కుజస్థానానికి చేరితే ఫలితాలు మహాద్భుతంగా ఉంటాయి. అవి కుజ క్షేత్రంలో ఎక్కువ దూరం పోతే బి.పి ఎక్కువగా ఉంటుంది.

ఆ రేఖలు పైకిపోయి చిటికిన వేలు మూలస్థానాన్ని తాకినా ఇటు కుజస్థానంలోకి చేరితే ఆ వ్యక్తి భయంకర సుఖరోగాలతో అకాలమృతి చెందుతాడు. ఆ రేఖలు కనిష్టకాంగుళి మూడవ పర్వం లోకి పోతే అశుభ ఫలాలు కలగవు. అతని భార్య ఉత్తమ గృహిణి అవుతుంది.



39. బుధక్షేత్రంలో ఒక స్పష్టమైన అడ్డురేఖ ఉండి, దాని పైన ఒక నిలువురేఖ ఉంటే అతను ప్రతిభా సంపన్నుడైనా చంచల స్వభావం కలవాడవుతాడు. పిత్రార్జితం వ్యయం చేస్తాడు. బంధుమిత్రులతో అనవసరంగా తగవులాడుతుంటాడు. స్త్రీ హస్తంలో ఈ రేఖ ఉంటే ఆమె రెండవ కాన్పులో మరణిస్తుంది. పిల్లలు అల్పాయుష్కులవుతారు. ఆమె భర్త నాలుగేళ్ల తర్వాత చనిపోతాడు.

40. బుధక్షేత్రం నుండి రెండు ఏటవాలు రేఖలు రవిక్షేత్రానికి పోతే, అతను భార్యా వియోగం చెంది, తర్వాత అవినీతిగా జీవిస్తాడు. మోసంతో డబ్బు సంపాదిస్తాడు. అలాంటి వారు రాజకీయ నాయకులై కోట్లు గడిస్తారు.

ఆ రెండు రేఖలు వక్రంగా ఉంటే మానసిక వేదన, అసంతృప్తి ఏర్పడతాయి. అవి రవిక్షేత్రం చివరివరకు సాగితే అతడు ప్రభుత్వ గుర్తింపు పొంది, ధనసంపాదన చేస్తాడు. అవి హృదయరేఖను స్పృశిస్తే మరీ మంచిది. ఆ రేఖలు వంకర టింకరగా ఉంటే ఫలితం తగ్గుతుంది. అపనిందలు భరించవలసి వస్తుంది.

41. బుధక్షేత్రంలో ఒక అడ్డరేఖ ఉన్న వ్యక్తి ధర్మపరుడవుతాడు. జ్యోతిష, ఖగోళ శాస్త్ర పండితుడవుతాడు. అతనికి ఆడ సంతతి అధికం. తల్లి తరఫు వారితో వైరం ఉంటుంది. ఆ రేఖ అటు వివాహరేఖను గానీ, ఇటు కనిష్టకాంగుళి మూలస్థానాన్ని గాని తాకకూడదు. రెంటికి మధ్యగా ఉంటే ప్రతిభ, సంపద పెరుగుతాయి.

బుధమండలం అత్యుచ్ఛం అయితే అతడు దొంగ వ్యాపారి అవుతాడు. ఉద్యోగి అయితే లంచగొండి అవుతాడు. బుధమండలం సమంగా ఉండటం శ్రేయస్కరం.

ఈ రేఖ బుధక్షేత్రంలో హృదయరేఖకు దగ్గరగా, సమాంతరంగా ఉంటే అతను పాతికేళ్ల వయస్సులో గొప్ప గుర్తింపు పొంది కీర్తి సంపాదిస్తాడు. ఉన్నత పదవి పొంది, ఐశ్వర్యాలు, అధికారం అనుభవిస్తాడు. ఐ.ఎ.ఎస్ లాంటి పరీక్షలు పాసై ఉన్నత పదవులు పొందుతాడు. ఆ రేఖ కొనలు వంగి హృదయరేఖను తాకితే, అది ద్వీపం కావడం వల్ల దుష్పరిణామాలు ఏర్పడ తాయి.



42. బుధక్షేత్రం మధ్య నుండి రవి క్షేత్రం వరకు ఒక అడ్డరేఖ గొలుసువలె ఏర్పడితే, అతని మతి సరిగా ఉండదు. భార్యా వియోగం కలుగుతుంది. పిల్లల వల్ల సుఖం ఉండదు. నీచమైన పనులు చేసి బ్రతుకుతుంటాడు. బుధక్షేత్రం ఉన్నతంగా ఉన్నా, హృదయరేఖ చక్కగా ఉన్నా, చెడు నివారణ అవుతుంది. భార్యాబిడ్డలతో సుఖంగా జీవించగలుగుతాడు.

43. బుధక్షేత్రం పైన ఏటవాలుగా వున్న రేఖను మరొక చిన్నరేఖ ఖండిస్తే ఆ వ్యక్తి వ్యసనపరుడు, జూదగాడు అయి చట్టానికి, న్యాయానికి భయపడుతుంటాడు. నికృష్టంగా బ్రతుకుతాడు. కొందరు వర్ణాంతర వివాహం చేసుకుని, అయిన వారందరికీ దూరమవుతారు. వారికి సంతానం కలగదు. చివరకు జైలు శిక్ష ప్రాప్తిస్తుంది.

44. బుధక్షేత్రం నుండి బయలుదేరిన గొలుసువంటి రేఖ శుక్రక్షేత్రం లోకి పోతే అతను పాషాణ హృదయం కలవాడవుతాడు. తల్లిని ద్వేషిస్తాడు. అతని భార్యకు కామవాంఛ ఎక్కువై ఎప్పుడూ పోట్లాడుతుంది. ఆమె మహా అందగత్తె, సంతానవతి అవుతుంది.

బుధక్షేత్రం బలహీనపడితే అతను పితృద్వేషి అయి, హింసా ప్రవృత్తి పెంపొందించు కుంటాడు. పరస్త్రీ సాంగత్యం విపరీతంగా కోరుతుంటాడు. డబ్బు సంపాదించి, డబ్బుతోనే ప్రపంచాన్ని చూస్తాడు. అయినవారు, ఆత్మీయులు ఎవరూ అతనికి అవసరం ఉండదు.

బుధ, శుక్ర క్షేత్రాలు సమాన బలంగా వుంటే అతను సైంటిస్టు, కెమిస్టు అవుతాడు. రసాయన సంబంధిత శాఖలలో పరిశోధన చేసి లక్షలు, కోట్లు సంపాదిస్తాడు. క్షేత్ర బలం వల్ల గొలుసురేఖ చెడు తొలగి పోతుంది.



45. బుధ, చంద్ర క్షేత్రాలు రెండూ సమాన బలంగా ఉండి, బుధక్షేత్రంపైన రేఖలవల ఏర్పడితే చంద్రక్షేత్రంలో ఒక గుణకచిహ్నం ఉంటే, మస్తిష్కరేఖ చివరన రెండుగా చీలితే, ఆ వ్యక్తి ఉన్నత ఆధ్యాత్మిక శక్తి కలిగి ఉంటాడు. యోగి, తపస్వి అవుతాడు. అతనికి అనేక సిద్ధులు, శక్తులు ఉంటాయి. మహాజ్ఞాని, తాత్వికుడు అవుతాడు. తన తపోశక్తిని విశ్వ కళ్యాణానికి వినియోగిస్తాడు. అతని దర్శనం వల్లనే ప్రజలకు మనశ్శాంతి, ఆత్మశాంతి లభిస్తుంది. తమ పాపం హరిస్తుందని జన విశ్వాసం.

46. బుధక్షేత్రంపైన ఒక స్పష్టమైన నిలువురేఖ, ఒక అడ్డరేఖ ఉండి వాటి కొనల్ని మరొక రేఖ కలుపుతూ త్రిభుజం ఏర్పడితే, కనిష్టకాంగుళి అనామిక కన్న పొడవుగా ఉంటే అతను వక్త, తాంత్రికుడు, జ్యోతిష సాముద్రిక విశారదుడు అవుతాడు. బ్రహ్మ జిజ్ఞాసా పరుడై యోగి కాగలడు. అతనిలో ఒక దివ్య తేజస్సు కనిపిస్తుంది.



బుధక్షేత్రం బలహీనంగా ఉంటే భ్రష్టయోగి, దొంగసన్యాసి, దొంగస్వామి అయి గారడీలు చేసి తాను అవతార

పురుషుడని ప్రచారం చేసుకుంటాడు. స్వంతంగా ఒక పీఠం పెట్టుకుని పీఠాధిపతి అవుతాడు.

47. బుధక్షేత్రం ఉన్నతంగా ఉండి, చిటికిన వేలి గోరు చిన్నదిగా ఉండి, మస్తిష్కరేఖ జీవితరేఖకు దూరంగా ప్రారంభమై బుధక్షేత్రం వైపు పోతే ఆ వ్యక్తి సంగీత, నృత్య, గాన విశారదుడవుతాడు. స్వతంత్రంగా జీవించడం అతనికి ఇష్టం.

48. మస్తిష్కరేఖ శాఖ ఒకటి బుధక్షేత్రానికి వెళితే, ఆ వ్యక్తి వేశ్యాప్రియుడవుతాడు. విలాసభోగ జీవితం వాంఛిస్తాడు. పర ధనాకాంక్ష ఎక్కువ. సంతానం కలగదు. నీచ సాంగత్యంతో పరువు పోగొట్టుకుంటాడు. బుధక్షేత్రం అత్యుచ్ఛమైతే అతడు నటుడవుతాడు. విషాద పాత్రల పోషణపట్ల వానికి ఆసక్తి హెచ్చుగా ఉంటుంది.




49. బుధక్షేత్రం ఉన్నతంగా ఉండి దానిపైన శుభచిహ్నాలుంటే, కనిష్ట కాంగులి అనామిక అంత పొడవుగా ఉంటే, అతడు విదేశాలలో రాయబారిగా, ఉద్యోగిగా లేక వ్యాపారిగా రాణిస్తాడు.

బుధక్షేత్రంలో నక్షత్రచిహ్నాం కీర్తి ప్రతిష్టలను, అతుల సంపదలను, సుఖాలను ఇస్తుంది. అతనికి భార్య తరఫు ఆస్తి వచ్చి కలుస్తుంది.

50. బుధక్షేత్రంలో ద్వీపచిహ్నాం మంచిది కాదు. ఆ ద్వీపం నుండి ఒక గొలుసు వంటి రేఖ శుక్రక్షేత్రం వరకు ఉంటే, అతడు జీవితాంతం ఏదో ఒక రోగంతో పీడింపబడుతుంటాడు. శాపగ్రస్థుని వలె జీవిస్తాడు.

# 13. ఆరోగ్యరేఖలు

**బు**ధక్షేత్రం నుండి బయలుదేరి క్రింది వైపుగా అంటే కంకణ రేఖల వైపు వెళ్లే రేఖను బుధరేఖ లేక ఆరోగ్యరేఖ అంటారు. అది జీవితరేఖతో చేరి ఆగిపోవచ్చు లేదా జీవితరేఖను దాటి శుక్రక్షేత్రానికి పోవచ్చు. ఇది ప్రధానంగా మనిషి ఆరోగ్యానికి సంబంధించిన విషయాలను సూచిస్తుంది. ఆరోగ్యరేఖ అసలు చేతిలో లేకపోయిన వ్యక్తి మంచి ఆరోగ్యవంతుడని, ఆరోగ్యరేఖ స్పష్టంగా, సరళంగా వున్నా మంచి ఆరోగ్యవంతుడని చెప్పవచ్చు. ఈ రేఖ ఎంత చెడితే ఆరోగ్యం అంతగా చెడుతుంది.

1. ఆరోగ్యరేఖ బుధక్షేత్రం మధ్య నుండి బయలుదేరి చంద్ర, శుక్రక్షేత్రాల మధ్య ప్రదేశానికి పోతే, అది స్పష్టంగా సరళంగా ఉంటే, ఆ వ్యక్తి రహస్య విద్యలలో దిట్ట అవుతాడు. అతనికి జ్యోతిష, సాముద్రిక పరిజ్ఞానంతోపాటు అతీంద్రియ విషయాల పట్ల అభిరుచి ఉంటుంది. మంత్ర, తంత్ర, యోగాలలో నిధి. అతను అన్ని సుఖ సంతోషాలు పుష్కలంగా పొందగలుగుతాడు.

2. బుధరేఖ స్పష్టంగా, పేలవంగా ఉండి, అక్కడక్కడ తెగినట్లుగా ఉంటే అతని ఆరోగ్యం దుర్బలంగా ఉండి ఎప్పుడూ రోగాలతో బాధపడుతుంటాడు. చిన్న వయస్సులో ఈ బుధరేఖ అసలు లేకపోవడం మంచిది.



25 సంవత్సరాల తర్వాత బుధరేఖ ఏర్పడితే అతను మహా అదృష్టవంతు డవుతాడు. క్రమంగా జీవితంలో ఉన్నత స్థితికి చేరి, సకల సంపదలు అనుభ విస్తాడు. అపజయం ఉండదు. అతని జీవితాశయం నెరవేరుతుంది.

3. బుధరేఖ పైన ఒక ద్వీపచిహ్నం ఉండి, దానికి దగ్గరగా ప్లస్ గుర్తు ఉన్న వ్యక్తి కలల్లో బ్రతుకుతుంటాడు. చిత్ర విచిత్రమైన కలలు కంటూ అవి యదార్థం కానందువల్ల దిగులు పడతాడు. మానసిక, శారీరక దౌర్బల్యం వల్ల ఏ పనీ చేయలేక దరిద్రం అనుభవిస్తాడు.




4. బుధరేఖ పైన బుధక్షేత్రంలో ఒక ద్వీప చిహ్నం ఉంటే అతని ప్రతిష్టకు భంగం కలుగుతుంది. మాన మర్యాదలు పోతాయి. తిరిగి తన పూర్వ వైభవం పొందగలుగుతాడు.

5. బుధరేఖ హృదయరేఖ నుండి బయలుదేరిన వ్యక్తి మహాభయస్థుడు, పిరికివాడు అవుతాడు. అతనికి గుండె జబ్బు, ఊపిరితిత్తుల బలహీనత ఉంటుంది. ఎలాంటి సుఖాలు అనుభవించ లేడు. సంపాదన విషయంలో అనేక కష్టనష్టాలు అనుభవిస్తాడు, సంసార సుఖానికి నోచుకోడు.




హృదయ రేఖ నుండి బయలు దేరిన బుధరేఖ మస్తిష్కరేఖతో కలిసి కొంత దూరం ప్రయాణం చేస్తే అతనికి శిరోసంబంధమైన బాధలు, మెదడు జబ్బులు వస్తాయి. ఆర్థికంగా పతనం చెందుతాడు. ప్రమాదవశాత్తు తల పగలవచ్చు.

6. ఆరోగ్యరేఖకు సమాంతరంగా చిన్నచిన్న ముక్కలతో ఏర్పడిన మరొక రేఖ బుధక్షేత్రం నుండి బయలుదేరితే అతడు సంపూర్ణ ఆరోగ్యవంతుడుగా ఉండి కీర్తి, ప్రతిష్టలు ఆర్జిస్తాడు. ధన సంపాదన బాగా ఉంటుంది. అతని మెదడు చురుకుగా పనిచేస్తుంది. వ్యాపారంలో, ఉద్యోగంలో గొప్పగా రాణిస్తాడు.

బుధరేఖ వక్రంగా ఉంటే అతను ఆత్మజ్ఞానం పొంది నాస్తికుడవుతాడు. యోగసాధన చేస్తాడు.




7. ఆరోగ్యరేఖ ప్రారంభంలో అనగా బుధక్షేత్రం పైన మూడు పాయలుగా చీలి త్రిశూలంగా ఏర్పడితే అతను వేదాంతి, తాత్వికుడు, మహాజ్ఞాని అవుతాడు. దేశ విదేశాలలో స్వామిగా, తత్వవేత్తగా గౌరవించబడతాడు. అతని కుటుంబం ఐశ్వర్యంతో తులతూగుతుంది. పిల్లలు గుణవంతులు, విద్యావంతులు, అదృష్టవంతులు అవుతారు.

ఆ చీలిక హృదయరేఖ పైన ఏర్పడితే అతను ఎంత మేధా సంపన్నుడైనా, ఎంత కీర్తి సంపాదించినా ధనార్జన చేయలేడు. అతనికి ప్రాపంచిక సుఖభోగాల పట్ల ఆసక్తి ఉండదు. మంత్ర, తంత్ర విద్యలు అభ్యసిస్తాడు.

8. బుధరేఖ ధనుషాకారంగా వంగి చంద్రమండలానికి పోతే ఆ వ్యక్తి స్థిరమతి కాలేడు. పిచ్చి పిచ్చిగా ఆలోచిస్తుంటాడు. గొప్ప కోసం దానధర్మాలు చేస్తాడు.

బుధరేఖ స్పష్టంగా, వివాహరేఖకు దిగువన ప్రారంభం కావడం మంచిది.

9. బుధరేఖ వివాహరేఖను తాకి, హృదయరేఖను ఖండిస్తూ మొదటి కుజమండలంలోకి పోతే, ఆ వ్యక్తి అయినవారితో, కానివారితో దెబ్బలాడుతుంటాడు. డాంబికంగా కోతలు కోస్తాడు. స్త్రీ వ్యసనం ఎక్కువ. మంచివారంటే మంట. భార్యాభర్త లిద్దరిదీ ఒకే ప్రవృత్తి. ఆమె పరపురుష సాంగత్యం కోరుతుంది.

ఈ రేఖ స్పష్టంగా ఉంటే గుండె జబ్బులు వస్తాయి. కానీ మంచి ప్రవర్తన ఉంటుంది. అతని మనస్సు, హృదయం పవిత్రంగా ఉంటాయి. అలాంటి రేఖ

ఉన్న స్త్రీ ఆచారపరాయణురా లవుతుంది. కానీ బలవంతంగా వ్యభిచరించవలసి వస్తుంది. భర్త తిరుగుబోతు, తాగుబోతుగా ఉన్నంత కాలం ఆమెకు కష్టాలు తప్పవు. అతనిని మార్చడానికై ఆమె తన శీలం కోల్పోతుంది. దానిపై ఒక ద్వీప చిహ్నం ఉంటే ఆమె శీలం కోల్పోయిన అవమానంతో ఆత్మహత్య చేసుకుంటుంది.




10. బుధరేఖ కుజమండలం దాటి చంద్రక్షేత్రం లోకి వెడితే అది సర్పం వలె ఉంటే ఆ వ్యక్తి పశువువలె ప్రవర్తిస్తాడు. యుక్తాయుక్త విచక్షణ ఉండదు. అహంకారం ఎక్కువ. శిరోవేదన అనుభవిస్తాడు. ఆ రేఖ నల్లగా ఉంటే వృద్ధాప్యంలో నరకయాతన పడవలసి వస్తుంది. దాని పైన ద్వీపచిహ్నం గానీ, నక్షత్ర చిహ్నం గానీ ఉంటే ఉద్యోగానికి రాజీనామా చేయవలసి వస్తుంది. లేదా సస్పెండ్ అయి, మానసికంగా క్రుంగిపోయి, ఆర్థికంగా కష్టపడవలసి వస్తుంది.

11. బుధమండలం నుండి బయలుదేరిన రేఖ స్పష్టంగా సరళంగా పోయి రవిరేఖతో కలిసి కోణంగా ఏర్పడితే, ఆ వ్యక్తి అమిత ధనవంతుడవుతాడు. కార్లు, మేడలు, ఐశ్వర్యం అన్నీ ఏర్పడతాయి. అతని కీర్తి నలుదిశలా వ్యాపిస్తుంది. అనేక సన్మానాలు పొందుతాడు.

ఆ రేఖ రవిరేఖను ఖండిస్తే అంతటి విద్యావైభవాలు, కీర్తి ప్రతిష్టలు ఉంటాయి కానీ, అతడు వ్యభిచారి, వ్యసనపరుడు అవుతాడు. పలువురు స్త్రీలను వశపరచుకుంటాడు. చివరకు భ్రష్ట జీవితం గడిపి, అవమానాల పాలవుతాడు. అతనిని అందరూ అసహ్యించుకుంటారు.

బుధరేఖ రవి రేఖను దాటి శనిక్షేత్రం వరకు పోతే అతని సంపదలను కన్నబిడ్డలు, అయినవారు హరిస్తారు. అతను జడ్జి కావచ్చు. అతనికి మంత్రి పదవి దక్కవచ్చు. కొందరు గొప్ప రచయితలై కీర్తి సంపాదిస్తారు.

12. రెండు బుధరేఖలు సమాంతరంగా పోయి రవిరేఖను ఖండిస్తే, అతను గొప్ప పరిశ్రమశీలి అవుతాడు. విద్యావేత్త, వివేకవంతుడై ధనసంపదలు పొంది

సుఖిస్తాడు. ఎప్పుడూ ప్రయాణాలు చేస్తుంటాడు. దేశ విదేశాలలో అనేకమంది మిత్రులను సంపాదిస్తాడు.



ఈ రేఖలు వంకర టింకరగా వుంటే శత్రువులు అధికంగా ఉంటారు. అతని ప్రవర్తన బావుండదు. అనేక అకృత్యాలు చేసి శిక్షలు పొందుతాడు. ఈ రేఖలు వివాహరేఖను తాకితే, అతనికి భార్యాబిడ్డల వల్ల సుఖం ఉండదు. ఒంటరిగా జీవిస్తాడు.

13. ఈ సమాంతరరేఖల్ని రెండు చిన్న రేఖలు ఖండిస్తూ వాటిలో ఒకటి శనిక్షేత్రంలోకి వెళితే అతను పరమలోభి, దుర్మార్గుడు, కుటిలుడు అవుతాడు. అతనికి అగ్నిభయం, సర్పదోషం, శత్రుభయం అధికం. భార్యను వదిలి వేస్తాడు. పుత్రశోకం అనుభవిస్తాడు.

14. ఈ సమాంతర బుధరేఖల్ని ఖండించే రేఖలు హృదయరేఖపై వాలితే రవిరేఖ హృదయరేఖను స్పృశించగా ఏర్పడిన చతుర్భుజం అతనిని ఆపదల నుండి, కష్టాల నుండి రక్షిస్తుంది. 35 సంవత్సరాల లోపునే అతడు ఉన్నత స్థితికి చేరతాడు. ఉద్యోగం చేసినా, వాణిజ్యం చేసినా రాణింపుకు వస్తాడు. చతుష్కోణ ప్రభావం వల్ల తన చేతుల మీదుగా అనేక శుభకార్యాలు చేస్తాడు.



15. బుధరేఖ ప్రక్కన మస్తిష్కరేఖ పైన ఒక నక్షత్ర చిహ్నం ఉంటే, ఆ వ్యక్తి పాండురోగంతో నపుంసకుడవుతాడు. తలకు, ముక్కుకు సంబంధించిన రోగాలు తరచు వస్తుంటాయి. స్వార్థపరుడు, పిసినారి. ఆ నక్షత్రాన్ని మస్తిష్కరేఖ ఖండించకుండా దూరంగా ఉంటే అన్ని దుష్పరిణామాలు కలగవు.

16. బుధరేఖ శుక్రమండలం వరకు పోయి ఒక ద్వీప చిహ్నంతో ఆగిపోతే అతనికి శ్వాసకోశంలో పుండు ఏర్పడు తుంది. బుధరేఖ జీవితరేఖను దాటే వయస్సు వరకు జీవించి తర్వాత మరణి స్తాడు.




17. బుధరేఖ ఆరంభంలో ద్వీప చిహ్నం ఉండి రవి, బుధ, గురుక్షేత్రాలు నీచమైనా లేదా బలహీనపడినా అతనిని వంశ పారంపర్య రోగాలు, కర్మశేషాలు విప రీతంగా బాధిస్తాయి. శని నీచమైన కారణంగా ఆ రోగంతో చనిపోతాడు.

# 14. వివాహరేఖలు

**బు**ధక్షేత్రం అంచునుండి బుధమండలం మధ్యకు వచ్చే రేఖల్ని వివాహరేఖ లంటారు. అవి ఒకటి కన్నా ఎక్కువ ఉండవచ్చు. సరళంగా, పొడవుగా ఉన్న దానిని మాత్రమే ప్రధానంగా తీసు కోవాలి. మిగిలినవి ప్రేమ వ్యవహారా లకు సంబంధించినవిగా చెబుతారు. కాని అనుభవంలో ఒకటి కన్న ఎక్కువ రేఖలు వైవాహిక బంధాన్ని పటిష్టంగా, పవిత్రంగా ఉంచుతాయని చెప్పవచ్చు. చంద్రక్షేత్రం నుండి బయలుదేరి అదృష్టరేఖను చేరే రేఖ కూడా దీనికి సహకరిస్తుంది. అది భాగ్యరేఖను కలిసే వయస్సులో వివాహం జరుగుతుంది.




జీవితరేఖకు సమాంత రంగా శుక్రక్షేత్రంలోని రేఖను వివాహరేఖగా పరిగణించ వచ్చు. బుధ క్షేత్రంలోని వివాహరేఖ, హృదయరేఖకు దగ్గరగా ఉంటే 20 ఏళ్ళలోపునే పెళ్లి అవుతుంది. మధ్యగా ఉంటే 30 వయసులో, మరీ చివరన ఉంటే 40 తర్వాత పెళ్లి జరిగే అవకాశం ఉంటుంది.

1. బుధక్షేత్రంలో వివాహరేఖ స్పష్టంగా, సన్నగా, తిన్నగా ఉండటం మంచిది. దాని నుండి ఒక శాఖ హృదయ రేఖ వైపు వెళ్లిన – అది హృదయరేఖను తాక కూడదు – అతని భార్య రోగిష్టి అవుతుంది. స్త్రీ హస్తంలో అలాంటి చిహ్నం, భర్త దీర్ఘ వ్యాధిని సూచిస్తుంది.

2. బుధక్షేత్రంలోని వివాహరేఖ రెండవ కొస హృదయరేఖపైన వాలిన, లేదా హృదయరేఖను తాకిన, అతని కన్న భార్య ముందుగా మరణిస్తుంది. కాని ఆ గుర్తు అనుకూల దాంపత్యాన్ని, పూర్ణాయుర్దాయాన్ని సూచిస్తుంది.

3. వివాహరేఖ కనిష్టకాంగుళి వైపు తిరిగిన వారికి వివాహం కావటం కష్టం. ఒక వేళ పెళ్లి అయినా భార్య అతనితో కలిసి కాపురం చేయదు. అతనికి సంసార సుఖం ఉండదు. స్త్రీ హస్తంలో అలా వుంటే ఆమె భర్తను పరిత్యజించి, స్వతంత్రంగా జీవిస్తుంది.




4. వివాహరేఖ హృదయరేఖ వైపు వంగి, చివరన రెండుగా చీలితే అతనికి నిశ్చయించిన సంబంధం చివరి నిమిషంలో రద్దయిపోతుంది లేదా పెళ్లి అయిన కొద్దిరోజులలోనే భార్యా భర్తలు విడిపోవడం జరుగుతుంది. ఆ చీలినచోటు నుండి మరొకరేఖ బయలుదేరి అరచేయి అంచువరకు పోతే వారిరువురు కలిసి కాపురం చేయరు.

5. వివాహరేఖ సమీపంలో ఒక ద్వీపచిహ్నం ఉంటే, వివాహ సమయంలో ఆప్తులొకరు మరణించిన కారణంగా నవ వధూవరులు విడిపోవడం జరుగుతుంది. వారి మధ్య అపోహలు, అపార్థాలు ఏర్పడి, ద్వేషంతో జీవిస్తారు. ఒక ఇంట్లో జీవించినా అన్యోన్యత ఉండదు. ఇద్దరి మధ్య మాటా మంతీ ఉండదు.

6. వివాహరేఖ నుండి బయలుదేరిన ఒక రేఖ, లేదా శాఖ రవిక్షేత్రం వరకు పోతే, అతని వివాహం తన కన్న అన్నివిధాలా ఉన్నతురాలైనా స్త్రీతో జరుగుతుంది లేదా భార్య ఉన్నత విద్యావతి, ధనవంతురాలు, అధికారిని, కులీన స్త్రీ అవుతుంది.

7. వివాహరేఖకు సమాంతరంగా, దానిని తాకుతూ మరొక రేఖ ఉంటే అతని వివాహనంతరం ఉన్నత స్థితిలో వున్న ధనవంతురాలైన ఒక స్త్రీతో సంబంధం ఏర్పడుతుంది. అది వివాహం కాకపోవచ్చు. మొదటిరేఖలో దోషం ఉంటే, ఆమెను వదలి రెండవ పెళ్లి చేసుకుంటాడు. అతనికి ప్రేమకలాపాలు అధికంగా ఉంటాయి.

8. వివాహరేఖ నుండి ఒక శాఖ హృదయరేఖను తాకినట్లున్న – అతను ఒక స్త్రీతో రహస్య సంబంధం ఏర్పరచుకుని ఆమెనే భార్యగా చూచుకుంటాడు. అలాంటి శాఖలు రెండుగాని, ఎక్కువ గాని ఉంటే ఎక్కువ మంది స్త్రీలతో లైంగిక సంబంధం ఏర్పడుతుంది. స్త్రీ హస్తంలో అలాంటి రేఖ ఉంటే, ఆమె భర్తను వదలి మరొకరిని వివాహం చేసుకుంటుంది.

9. వివాహరేఖపై ఒక నక్షత్రచిహ్నం ఉన్న వ్యక్తి భార్య ప్రసవ సమయంలో మరణిస్తుంది. స్త్రీ హస్తంలో అలాంటి నక్షత్రం ఉంటే ఆమె భర్త ప్రయాణంలో ఒక ప్రమాదంలో మరణిస్తాడు.




10. వివాహరేఖపైన ఒక నక్షత్రం ఉండి, కనిష్టకాంగుళి అనామికల మధ్య నుండి బయలుదేరి హృదయరేఖను చేరే మరొక రేఖను స్పృశిస్తే పుత్రశోకం కలుగుతుంది. అది బుధక్షేత్రం మీద నక్షత్రం కావడం వల్ల, పుత్రశోకం తర్వాత అతనిని అదృష్టం వరిస్తుంది. ఐశ్వర్యం, సంపదలు, భోగభాగ్యాలు జతపడతాయి.

11. వివాహరేఖపైన నక్షత్ర చిహ్నం గొప్ప అదృష్టానికి సూచన. అలాంటి వివాహరేఖను, అనామిక, కనిష్టకాంగుళి మధ్య నుండి బయలుదేరి హృదయరేఖను కలిసే రేఖ ఖండిస్తే అతని భార్య మహా సౌందర్యవతి అయి వుంటుంది. స్త్రీ చేతిలో అలాంటి రేఖ ఉంటే ఆస్తి, అంతస్థు, సంపద, హోదా కలిగిన వ్యక్తిని ఆమె ప్రేమిస్తుంది.

12. నక్షత్ర చిహ్నం గల వివాహరేఖను ఇతర నిలువురేఖలు ఖండిస్తే, అతడొక స్త్రీని ప్రేమించి, ఆమెతో లేచిపోతాడు. అది పెళ్లి వరకు సాగదు. ఇద్దరి మధ్య స్పర్థలు ఏర్పడి ఎవరికి వారు విడిపోవడం జరుగుతుంది. ఆమెను వదలిపెట్టి అతను ఇంటికి తిరిగి వస్తాడు.

అదే స్త్రీ హస్తంలో ఉంటే ఆమె మీది మోహంతో ప్రేమించిన వ్యక్తి ఆమె భర్తను హత్య చేస్తాడు. తర్వాత ఆమె హంతకుని ఉంపుడుగత్తెగా ఉంటుంది. చివరకు పశ్చాత్తాపంతో దైవభక్తి పెంపొందించుకుని భక్తురాలవుతుంది.

13. వివాహరేఖ ఆకువలె ఉండి, దాని నుండి చిన్న చిన్న రేఖలు హృదయ రేఖ వైపు వెళ్లి, దానిని స్పృశించక ఆగి పోయిన, అతని భార్య రోగిష్టి అవుతుంది. వారికి సంతానం కలగదు.

వాటిలో ఒకటి హృదయరేఖను తాకినట్లున్న అతనికి వివాహానంతరం మరో స్త్రీతో సంబంధం ఏర్పడుతుంది. ఆ అక్రమ సంబంధం అతని పాలిట మృత్యువవుతుంది.

స్త్రీ చేతిలో అలాంటి రేఖ ఉంటే ఆమె వ్యభిచారి అయి ఒక విటుని చేతిలో హతమవుతుంది. ఆమె కూతురు అందగత్తె, గుణశీల అయి విద్యావంతుడైన ఒక యువకుని పెళ్లాడుతుంది.




మరొక శాఖ కనిష్ఠకాంగుళి మూల స్థానం చేరితే ఆమె వ్యభిచారం కారణంగా జైలుపాలవుతుంది. తన కళంకం తన బిడ్డకు అంటనీయదు.

14. వివాహరేఖ చివరన ఒక ద్వీప చిహ్నం ఉండి ఆ ద్వీపం పైభాగాన్ని ఒక నిలువురేఖ స్పృశిస్తే అతని ఆలోచనలు భయంకరంగా ఉంటాయి. రాక్షసంగా భార్యను హత్యచేస్తాడు. దానికి తోడు బుధక్షేత్రం పల్లంగా ఉండి, రెండవ కుజక్షేత్రం బలంగా, ఎత్తుగా ఉంటే, అతనికి మరణదండన లేదా యావజ్జీవ కారాగారం తప్పదు. బుధక్షేత్రం సమోన్నతంగా ఉంటే హత్య చేసి తప్పించుకుంటాడు.




15. వివాహరేఖ చివరన మూడు పాయలుగా చీలడం అనర్థం, అనారోగ్య సూచకం. అలాంటి వాడు జీవితాంతం ఏదో రోగంతో బాధపడుతుంటాడు. పరమ లోభి, వ్యసనాలకు బానిస, వ్యభిచారి అవుతాడు. అతని భార్య పతివ్రత, ఉత్తమ గృహిణి అవుతుంది.

స్త్రీ చేతిలో అలాంటి రేఖ ఉంటే ఆమె కులట, వ్యభిచారిని అవుతుంది. సంతానం కోసం నీచులతో సాంగత్యం చేస్తుంది. ఆమె భర్త నపుంసకుడై ఉంటాడు.

16. చంద్రమండలం నుండి వచ్చి భాగ్య రేఖను కలిసే రేఖలు ప్రేమ వ్యవహారాలను సూచిస్తాయి. జీవితరేఖకు సమాంతరంగా పోయే కుజ, శుక్ర రేఖలు రెండూ ప్రేమకు, పెళ్లికి సూచికలే.

17. చంద్రమండలం నుండి వచ్చిన రేఖ భాగ్యరేఖతో కలిస్తే, వానికి భార్య మూలంగా ఐశ్వర్యం జతపడుతుంది. పెళ్లి అయిన తర్వాత అదృష్టం కలిసి వస్తుంది. ఉద్యోగం లభిస్తుంది, స్థిరత్వం ఏర్పడుతుంది. సంసారంలో భార్యది పై చేయిగా ఉంటుంది. అతను భార్య చెప్పినట్లు విని మంచిభర్తగా ఉంటాడు. భార్య పట్ల ప్రేమ, అభిమానం విపరీతంగా పెంచుకుంటాడు.




18. ఈ సహాయరేఖ మీద ఒక ద్వీప చిహ్నం ఉంటే జీవిత సహచరి ఘోర విపత్తులో చిక్కుకుంటుంది. అదే వయస్సులో రవిరేఖపైన ద్వీపచిహ్నం ఉంటే అనేక అవమానాలు, దూషణలు భరించవలసి వస్తుంది.

19. ఈ సహాయరేఖ భాగ్యరేఖను దాటి గురుక్షేత్రం వరకు వెళితే, అతను భార్యపై ప్రేమతో తన సర్వస్వం ఆమె పరం చేస్తాడు. ఆస్తి, డబ్బు, పెత్తనం మొత్తం ఆమెకు సమర్పించుకుంటాడు లేదా ఆమెపై ప్రేమ కారణంగా తన పిత్రార్జితాన్ని సర్వం వదులుకుని ఆమెను పెళ్లి చేసుకుని, ఆదర్శ పురుష డవుతాడు.

20. బుధక్షేత్రంపై వివాహరేఖ చివర రెండు పాయలుగా చీలిన, అందులో ఒక శాఖను కుజక్షేత్రం నుండి వచ్చిన మరొక శాఖ ఖండిస్తే, ఆ దంపతులు వివాహం అయిన తర్వాత కలిసి ఉండరు.

బుధమండలం లోని వివాహరేఖ సాగి సాగి కుజస్థానంలోకి వెళ్తే, వైవాహిక జీవితం దుఃఖపూర్ణమవుతుంది.

ఆ రేఖపైన ద్వీపచిహ్నం ఉంటే ఆ సంసారం వీధిన పడి, నవ్వులపాలవుతుంది. భార్యాభర్తలు అపఖ్యాతికి గురవుతారు.

ఆ రేఖ చివర, కుజక్షేత్రంలో గుణకచిహ్నం ఒకటి ఉంటే భార్యాభర్తల మధ్య కలహాలు హత్యకు దారి తీస్తాయి.

21. వివాహరేఖ శనిక్షేత్రం వరకు సాగి ఒక గుణకచిహ్నంతో ఆగితే అతడు స్వార్థంతో, స్వలాభం కోసం భార్యను హత్య చేస్తాడు. ఆ గుణకచిహ్నం దగ్గర అదృష్ట రేఖ ఆగిపోతే, ఆ హత్య కారణంగా అతనికి ఉరిశిక్ష పడుతుంది లేదా తానే ఆత్మహత్య చేసుకుంటాడు.




22. వివాహరేఖపైన ఒక ద్వీప చిహ్నం ఉంటే భార్యాభర్తలుగా కొంత కాలం పాటు వేరువేరుగా ఉంటారు. ద్వీప చిహ్నాలు ఎక్కువగా ఉంటే వివాహ రేఖ గొలుసులా ఉంటే, అలాంటి వ్యక్తి వివాహం చేసుకోక పోవడమే మంచిది.

23. వివాహరేఖ రెండుగా చీలిన, పై చీలిక సరళంగా, తిన్నగా ఉంటే వివాహం ఆగి పోతుంది. కొంతకాలం తర్వాత తిరిగి ఆమెనే పెళ్లి చేసుకోవడం జరుగుతుంది లేదా వివాహం కాగానే ఏవో కారణాల వల్ల విడిగా ఉంటూ కొంతకాలం తర్వాత గానీ భార్యాభర్తలుగా కలిసి జీవించడం జరగదు.




24. వివాహరేఖ గానీ, దాని నుండి బయలుదేరిన ఒక శాఖ గానీ రవిక్షేత్రంలోకి పోతే అతను తన కన్న అన్నివిధాల ఉన్నతురాలైన స్త్రీని వివాహం చేసుకుంటాడు. అది రవి రేఖను ఖండిస్తే ఆ వివాహం అతని పతనానికి హేతువు అవు తుంది.

25. శుక్రరేఖ జీవితరేఖ నుండి గానీ, దానికి సమీపంగా గానీ బయలుదేరి, జీవితరేఖకు దూరంగా జరిగితే భార్యా భర్తల మధ్య అనురాగం, ప్రేమ క్రమక్రమంగా

పెరుగుతాయి. ఆ శుక్రరేఖ మీద ద్వీపచిహ్నం ఉంటే అనుమానాలు, అవమానాలు తప్పవు.

26. శుక్రరేఖ లేదా దాని శాఖ జీవితరేఖతో కలిస్తే లేదా ఖండిస్తే అతని ఇల్లు స్వర్గమవుతుంది. భార్యాభర్తలు మిక్కిలి అన్యోన్యంగా ఉంటారు.

27. శుక్రరేఖ లేదా దాని శాఖ దాటి అదృష్టరేఖను ఖండిస్తే, భార్య రాకతో అతని అదృష్టం హరించి పోతుంది. ఆమెను పెళ్లి చేసుకోవడం వల్ల అయినవారు శత్రువులవుతారు. అదృష్టం వెనక్కిపోతుంది.

28. శుక్రరేఖ గానీ దాని శాఖగానీ రవిరేఖను ఖండిస్తే భార్య కారణంగా అతని కీర్తి ప్రతిష్ఠలు గంగపాలవుతాయి. అన్నివిధాల అతను అప్రతిష్ఠకు గురవుతాడు.

# 15. కుజక్షేత్రం

**కు**జక్షేత్రాలు రెండు. బుధ, చంద్ర క్షేత్రాల మధ్య హృదయరేఖకు క్రిందగా ఉన్నది ఒకటి. గురు, శుక్ర క్షేత్రాల మధ్య, జీవితరేఖకు దిగువన ఉన్నది రెండవది. మొదటి కుజక్షేత్రం పరాక్రమానికి, పౌరుషానికి, తీవ్రతకు గుర్తు. రెండవ కుజక్షేత్రం ఓర్పు, సహనం, ప్రతిఘటన, సామర్థ్యం సూచిస్తుంది.

మొదటి కుజక్షేత్రంలో నక్షత్రం, త్రిభుజం, వలయం, చతుష్కోణ చిహ్నం, చిన్న నిలువురేఖలు ఆ క్షేత్రం యొక్క బలాన్ని, శక్తిని ఇనుమడింపచేస్తాయి. అడ్డరేఖలు, గుణక చిహ్నం, మచ్చలు దాని బలాన్ని తగ్గిస్తాయి. కుజ ప్రభావం గల వ్యక్తికి ఉద్రేకం, ఉద్వేగం, ఓర్పు, సహనం చిత్రంగా ఉంటాయి. రెండు కుజక్షేత్రాల ప్రభావం మనిషిపైన ఉంటుంది. కుజప్రభావం గలవారు సాహసకార్యాలు చేస్తారు. ఓర్పు కలిగి ఉంటారు. వారిలో సహనం, ఉదారగుణం ఉంటాయి. విజయం సాధించే వరకు ఓర్పుగా శ్రమిస్తారు. కుజబలం లేనివారు జీవితంలో రాణించలేరు.

కుజప్రభావం కలవారు రెండు రకాలు : ఉద్రేకం చెంది, విచక్షణలేక, సమస్యల్ని సృష్టించుకునేవారు ఒక రకం. ఓర్పు, సహనం వహించి ఎంతటి జటిల సమస్యనైనా పరిష్కరించుకునేవారు రెండవ రకం. రెండవ కుజక్షేత్రం బలంగా ఉన్న వారికి ప్రతిఘటన శక్తి ఎక్కువ.

మొదటి కుజమండలం బలంగా ఉన్న వారికి ఉద్రేకం ఎక్కువ. రెండు కుజమండలాల మధ్యభాగం ఎత్తుగా ఉన్న వ్యక్తి అనవసరంగా, అకస్మాత్తుగా ఉద్రేకం చెందుతాడు. ఓర్పు, సహనం, ప్రతిఘటించే శక్తి లేకపోతే కార్యనిర్వహణ సామర్థ్యం కొరవడుతుంది. రెండు క్షేత్రాల మధ్య మరీ పల్లంగా ఉంటే అపజయం, ధననష్టం కలుగుతుంది. ప్రతిఘటించే శక్తి లేకపోవడం ఒక కారణం, మృదువుగా

ప్రవర్తించడం రెండవ కారణం. ప్రథమ కుజ మండలం ఉన్నతంగా ఉన్న వ్యక్తిలో కార్యదీక్ష, పట్టుదల ఎక్కువ. ఓటమిని అంగీకరించడు. సహనంతో, ఓర్పుతో ఎన్ని కష్టాలైనా ఎదుర్కొని విజయం సాధిస్తాడు. ఎంత క్లిష్ట పరిస్థితిలోనూ బెదరడు, బెంబేలు పడడు. సమయానుకూలంగా ప్రవర్తిస్తాడు. ఒకవేళ తాత్కాలికంగా ఓడినా, విజయం సాధించే వరకు పట్టు వదలడు.

ప్రథమ కుజస్థానం బలహీనంగా వుంటే అతను నిరాశా నిస్పృహలకు లోనై ఏ మాత్రం అవరోధం ఏర్పడినా వెనుకంజ వేస్తాడు. అతనికి ప్రతిఘటించే శక్తి బొత్తిగా ఉండదు. ఉద్రేకాలకు లోనై పని చెడగొట్టుకుంటాడు. ఎప్పుడూ ఆత్మహత్య గురించి ఆలోచిస్తుంటాడు.

ద్వితీయ కుజక్షేత్రం ఉన్నతంగా గల వ్యక్తి తన పథకాలు, ప్రణాళికలు ముందుకు తెచ్చి, వాటి విజయానికి కృషి చేస్తాడు. ఎవరి సహాయం, సలహా తీసుకోడు. ఎన్ని అవరోధాలు వచ్చినా, ధైర్యంగా పోరాడగలడు.

ద్వితీయ కుజమండలం బలంగా ఉండి, మొదటి కుజమండలం బలహీనంగా వుంటే అతను ప్లాన్లు వేస్తాడు గానీ వాటిని అమలు పరచడు. మానసిక బలహీనత ఎక్కువ. ఆందోళన అధికం. కార్యదీక్ష ఉంటుంది కానీ దక్షత ఉండదు.

కుజ ప్రభావం గల వ్యక్తి పొడవుగా, బలంగా, ఆరోగ్యంగా ఉంటాడు. మేధ గొప్పగా ఉంటుంది. తల ప్రమాణం చిన్నది. ముఖం గుండ్రంగా, చర్మం మందంగా ఉంటుంది. జుత్తు కురచగా గిరజాలు తిరిగి ఉంటుంది. పెదవులు పలచన, కనుబొమలు దట్టంగా ఉంటాయి. ముక్కు పొడవు, చెవులు చిన్నవి.

స్వభావరీత్యా సచ్ఛీలుడు. వితరణ, దయా ధర్మ గుణాలుంటాయి. ఈ వ్యక్తికి విపరీత ధన వ్యామోహం ఉంటుంది. మిత్రుల కోసం, ఆడంబరాల కోసం ఎంతయినా ఖర్చు చేస్తాడు. అతని ఆచార వ్యవహారాలు, అలవాట్లు మెరటుగా ఉంటాయి. తనను కాదన్న వారితో కలహానికి దిగుతాడు. స్త్రీలను ఆకర్షించే లక్షణం ఎక్కువ. తమను ద్వేషించే వారి ప్రాణం తీసే స్వభావం.

## కుజక్షేత్రంలో చిహ్నాలు

1. మొదటి కుజక్షేత్రంలో ఒక చిన్న నిలువురేఖ ఉన్న వ్యక్తికి ధైర్యసాహసాలు, సహనం, సౌశీల్యం ఉంటాయి. అతనిలో నిగ్రహం, ప్రతిఘటించే శక్తి అధికం.

2. ప్రథమ కుజక్షేత్రంలో అనేక అడ్డదిడ్డ మైన రేఖలున్నవాని ప్రవృత్తి ఉద్రేకంగా, నైజం క్రూరంగా ఉంటుంది. విలాస జీవితం కాం క్షిస్తాడు. సంభోగ విషయంలో రాక్షసంగా, శాడిస్టుగా ఉంటాడు. ఏ రంగంలోనూ రాణించలేడు.




3. అంచు నుండి అడ్డగీతలు మొదటి కుజక్షేత్రంలోకి వెళితే అవి శత్రువుల్ని, అపజయాల్ని సూచిస్తాయి. ఆ గీతల్ని బట్టి ఇంతమంది శత్రువులని చెప్పకూడదు. ఆ రేఖలు ఎక్కువగా, బలంగా ఉంటే శత్రువులు, వారి బలం ఎక్కువగా ఉంటుందని అర్థం. ఈ రేఖలు పొడవుగా, దుర్బలంగా ఉంటే ఆ శత్రువులు ఏమీచేయలేరు. అసలు అలాంటి రేఖలు లేకపోవడం మంచిది.

4. ఈ అడ్డరేఖలు బుధరేఖను ఖండిస్తే, కార్యభంగం, శత్రువిజయం, అనారోగ్యం. రవిరేఖను ఖండిస్తే గౌరవ భంగం, ధననష్టం. అవి అదృష్టరేఖను ఖండిస్తే ఉద్యోగం, వ్యాపార, వృత్తులలో మార్పు, నష్టం. అవి జీవితరేఖను ఖండిస్తే ఆప్తబంధువులే శత్రువు లవుతారు.

5. ఈ రేఖలు లోతుగా ఉండి, చివరన పాయలుగా చీలితే గొంతుకు సంబంధించిన వ్యాధులు వస్తాయి.




6. మొదటి కుజక్షేత్రంలో పుట్టు మచ్చ వున్న వ్యక్తికి తగవులు, పోట్లాటలంటే ఇష్టం. ఇలాంటి వారు మిలిటరీలో చేరతారు. యుద్ధాలలో గాయపడుతుంటారు. తగవులలో దెబ్బలు తింటారు. కుజమండలం ఎత్తుగా ఉన్న వ్యక్తి ఇతరులను చావగొడుతుంటాడు.

7. ప్రథమ కుజక్షేత్రం ఉన్నతంగాఉండి, దానిపైన ఒక నక్షత్రం ఉన్న వ్యక్తి అసూయా ద్వేషాలు, ఎక్కువై ఆత్మహత్యకు పూనుకుంటాడు. కుజక్షేత్రం సాధారణంగా ఉండి, దానిపైన నక్షత్రం ఉంటే అతను పిరికితనంతో ఆత్మహత్య చేసుకుంటాడు.

8. ప్రథమ కుజమండలం అత్యున్న తంగా వుండి, దానిపైన ఒక గుణక చిహ్నం ఉన్న వ్యక్తి పరమమూర్ఖుడు, మొండి అవుతాడు. కయ్యానికి కాలు దువ్వి ప్రమాదాలలో చిక్కుకుంటాడు. కుజ క్షేత్రం సాధారణ బలంగా వుండి, దానిపైన గుణకచిహ్నం ఉంటే పెద్ద ప్రమాదాలు జరగవు.



9. ఉన్నత కుజమండలంలో చతు ష్కోణ చిహ్నం గల వ్యక్తి స్వభావరీత్యా ఉద్రేకపరుడైనా, న్యాయాన్యాయ విచారణ కలిగి అకృత్యాలకు, అన్యాయాలకు పాల్పడడు. కుజమండలం నీచమై, దానిపైన చతుష్కోణం ఉంటే, అతడు ప్రమాదాలలో చిక్కినా, చతుష్కోణం వల్ల రక్షింప బడతాడు.

10. ప్రథమ కుజస్థానంలో వృత్తాకార చిహ్నం గలవానికి తరచు కంటి ప్రమాదం, జబ్బులు వస్తుం టాయి.



11. ప్రథమ కుజక్షేత్రంలో త్రిభుజచిహ్నం ఉన్న వారు పెద్ద పోలీసు అధికారులు అవుతారు. లేదా మిలిటరీలో ఉన్నత పదవిని పొందగలరు. ధైర్య సాహసాలు అవసరమైన అన్ని రంగాలలో వీరుం టారు.

12. కుజక్షేత్రంలో అనేక రేఖలు ఖండించుకున్నట్లు ఉంటే అతను విషాద మరణం చెందుతాడు. ప్రథమ కుజక్షేత్రం అత్యున్నతమైతే అది ఆత్మహత్య అవుతుంది.

13. మొదటి కుజమండలంలో అర్ధచంద్రాకార చిహ్నం గల వ్యక్తి మతి చలించి పిచ్చివాడవుతాడు.

14. ద్వితీయ కుజమండలంలో ఒక సరళరేఖ, దానిపైన ఒక నక్షత్రం ఉంటే అతను ప్రేమించిన స్త్రీ మరణిస్తుంది లేదా దగ్గరివారిలో ఒకరు మరణిస్తారు. దానివల్ల అతనికి మానసిక వేదన కలుగుతుంది.

# 16. కుజరేఖ

**ద్వి**తీయ కుజక్షేత్రం నుండి బయలుదేరి జీవితరేఖకు సమాంతరంగా శుక్రక్షేత్రంలోకి వెళ్లే రేఖను కుజరేఖ అంటారు. ఇది ముఖ్యంగా జీవితరేఖ లోపాలను పూరిస్తుంది. జీవితరేఖకు అండగా నిలుస్తుంది. జీవితంలో అండగా నిలిచే జీవిత భాగస్వామిని ఈ రేఖను బట్టి కొంత పరిశీలించ వచ్చు. అందరికీ కుజరేఖ ఉండక పోవచ్చు. కుజరేఖ గల వ్యక్తికి ఆత్మ శక్తిపైన, స్వయంకృషిపైన విశ్వాసం ఎక్కువ. భవిష్యత్తుపైన, అదృష్టంపైన నమ్మకం ఉంటుంది. తన లక్ష్యం నెరవేరాలన్న పట్టుదల, ఆశ ఉంటుంది. దీనికి తోడుగా గురుక్షేత్రం ఉన్నతంగా గల వ్యక్తి తన ఆశయాలను నెరవేర్చుకోగలడు. సమాజంలో గౌరవ ప్రతిష్టలు సంపాదించగలుగుతాడు.




1. కుజరేఖ జీవితరేఖకు సహాయంగా ఉంటుంది. కనక కుజరేఖ గల వ్యక్తి స్వజన, బంధు, మిత్రుల ఆదరణ బాగా పొందగలడు. అవసరాలకు బంధుమిత్రుల సహాయం పొందగలడు. ఈ రేఖలు ఎన్ని వుంటే అంత మంచిది. అతని అభివృద్ధికి అనేక విధాల సహాయ సహకారాలు, బంధుమిత్రుల ఆదరణ, ప్రోత్సాహం లభిస్తుంటాయి.

జీవితరేఖ రెండవ కొనకు అతి దగ్గరగా ఉన్న రేఖ తల్లికి, తర్వాతది తండ్రికి, ఆ తర్వాతది సోదర వర్గానికి చెందినవై ఉంటాయి. కొందరు జీవిత రేఖ ఆరంభంలో ప్రక్కగా ఉన్న కుజరేఖలను పై విధంగా అన్వయిస్తారు. 20 సంవత్సరాలు దాటిన తర్వాత కుజరేఖ ప్రారంభమైతే అది జీవిత భాగస్వామికి ప్రతినిధి అవుతుంది. అది జీవితరేఖ నుండి బయలుదేరితే ఆ వ్యక్తి మేనరికం గానీ, దగ్గర బంధువుల అమ్మాయిని గానీ వివాహం చేసుకుంటాడు. ఆ రేఖ జీవితరేఖకు దూరంగా ప్రారంభమైతే కొత్త సంబంధం, దూరపు సంబంధం అని చెప్పవచ్చు. అనుభవరీత్యా ఇవి అంత ఖచ్చితంగా చెప్పడానికి వీలు  కలగడం లేదు.




2. కుజరేఖ, జీవితరేఖ సగం తర్వాత ప్రారంభమైన జీవితరేఖకు సమాంతరంగా పోతే ఆ వ్యక్తి దూరప్రదేశాలకు, లేదా విదేశాలకు వెళ్లి అక్కడ స్థిరపడతాడు.

3. కుజరేఖ ప్రారంభంలో రెండుగా చీలి ఉంటే అతను ప్రేమించిన అమ్మాయిని పెళ్లి చేసుకుంటాడు. చివర రెండుగా చీలితే ఆ వ్యక్తి ఉద్రేక స్వభావి అవుతాడు.

ఆ చీలిక రేఖలలో ఒకటి చంద్రక్షేత్రానికి వెడితే ఆ వ్యక్తి పశువులా ప్రవర్తిస్తాడు. వివేకశూన్యుడై రాక్షసంగా ఉంటాడు.

ఆరేఖ చివరన ఒక నక్షత్ర చిహ్నం ఉంటే అతను పెద్ద తాగుబోతు అవుతాడు. ఉద్రేకం పొందడానికి తాగుతాడు. దానికి తోడు మస్తిష్క రేఖపైన నల్లని మచ్చ ఉంటే అతడు అతిగా మద్యపానం చేసి మరణిస్తాడు.

4. కుజరేఖ చివరన నక్షత్రం ఒక ఆత్మీయుని మరణం సూచిస్తుంది లేదా అయిన వారితో అనుబంధం పూర్తిగా తెగిపోవడాన్ని తెలియచేస్తుంది. వారు తల్లిదండ్రులు, సోదరులు, భార్య ఎవరైనా కావచ్చు. సాధారణంగా ఈ గుర్తుగల వారు భార్యతో సంబంధాన్ని త్రెంచుకుంటారు. నక్షత్రం ఉన్న వయస్సులో భార్య మరణించడం సంభవం.

కుజరేఖ చిన్నదిగా ఉండి, దాని కొనలో నక్షత్రం ఉంటే, దాని ప్రక్కన మరొక రేఖ వుంటే ఆ వయస్సులో తల్లిదండ్రులలో ఒకరు చనిపోతారు లేదా భార్య మరణించిన వెంటనే మరొకరిని పెళ్లాడటమో, మరొక స్త్రీని చేరదీయడమో జరుగుతుంది.

5. జీవితరేఖ నుండి బయలుదేరి పైకి వెళ్లే రేఖల్ని కుజక్షేత్రంతో సంబంధం వున్న రేఖలు ఏవైనా ఖండిస్తే ఆ వ్యక్తి ప్రగతికి, విజయానికి అయినవారే ఆటంకాలు కలిగిస్తారు. ఆస్తి చిక్కులు వచ్చి పడతాయి.



6. కుజక్షేత్రం నుండి బయలుదేరిన రేఖ జీవితరేఖను దాటి, వివాహరేఖ వరకు పోయి దానిని ఖండిస్తే, వివాహరేఖ చివరన రెండుగా చీలి ఉంటే, భార్యా భర్తల వియోగం తప్పదు. అది జీవితరేఖ నుండి పైకి వెళ్లే రేఖను ఖండిస్తే గృహ విషయాల్లో, స్వవిషయాల్లో ఇతరులు జోక్యం కలిగించుకుని అతని అభివృద్ధికి ఆటంకాలు కలిగిస్తారు. కుజరేఖ చివరన ఉన్న నక్షత్రం నుండి మరొకరేఖ బయలుదేరితే, ఒక ఆత్మీయుని లేదా భార్య మరణం తథ్యం.

7. జీవితరేఖకు దూరంగా కుజమండలం నుండి బయలుదేరి క్రమంగా జీవితరేఖకు దగ్గరగా వచ్చిన కుజరేఖ, ఒకసారి ప్రేమించి దూరమైన స్త్రీకి తిరిగి సన్నిహితం కావడాన్ని సూచిస్తుంది లేదా విడిపోయిన బంధువులు ఆత్మీయులవుతారు.



8 శుక్రక్షేత్రం నుండి బయలుదేరిన అడ్డరేఖలు కుజరేఖను, జీవితరేఖను ఖండిస్తే – ఖండించిన వయస్సులో అనేక కుటుంబ సమస్యలు, ఆర్థిక చిక్కులు ఏర్పడతాయి. అడ్డరేఖను కుజరేఖ ఒక్కటే ఖండిస్తే ఆ చిక్కులు అపరిమితంగా ఉంటాయి. ఆ

రేఖ చివరన ఒక నక్షత్రం ఉంటే బాధలు భరించలేక అతను ఆత్మహత్య చేసుకుంటాడు.

9. కుజరేఖను ఖండించే రేఖపైన ఒక ద్వీపచిహ్నం ఉంటే, ఆ వ్యక్తి ఒక భయంకర సంఘటనకు గురవుతాడు. అది కుజరేఖను మాత్రం ఖండిస్తే ఆత్మీయులకు, జీవితరేఖను సైతం ఖండిస్తే తనకు ప్రమాదం కలుగుతుంది.

10. కుజరేఖపైన ఒక ద్వీపచిహ్నం ఉండి ఆ ద్వీపం నుండి బయలుదేరిన రేఖలు అడ్డంగా పోయి జీవితరేఖను ఖండిస్తే, ఆ వ్యక్తి అనారోగ్య కారణంగా నరకం అనుభవిస్తాడు. అడ్డరేఖ ఖండించిన తర్వాత జీవితరేఖ పైన ద్వీపచిహ్నం ఉంటే అతని భార్య రోగగ్రస్థ అవుతుంది.

11. కుజరేఖ చివరన ఒక నక్షత్రం, మస్తిష్కరేఖ పైన ఒక మచ్చ ఉండి ఆ నక్షత్రాన్ని మచ్చను ఒకరేఖ కలిపితే ఒక ఆత్మీయుని మరణం అతని మనస్సును వికలం చేస్తుంది. మస్తిష్కరేఖ మీద మచ్చకు బదులు ద్వీపచిహ్నం ఉంటే అతనికి మతి భ్రమించి, కొంతకాలం పిచ్చివాడవుతాడు.

12. కుజరేఖ నుండి ఒకరేఖ గురుక్షేత్రంలోకి వెడితే, అతని భార్య గొప్పగా పేరు ప్రతిష్టలు సంపాదిస్తుంది. అన్నివిధాల భర్తను మించిపోతుంది. ఆశలు, ఆశయాలు ఆమెకు అధికం.

# 17. చంద్రమండలం

**చే**తిలో అన్ని క్షేత్రాలకన్న విశాలంగా, ప్రస్ఫుటంగా కనిపించేది చంద్ర మండలం. మిగిలిన క్షేత్రాల వలె ఇది పల్లంగా బలహీనంగా కనిపించదు కనుక బలనిరూపణ కష్టమవుతుంది. ఒక నక్షత్రచిహ్నం, వృత్తం, త్రిభుజం, చిన్న నిలువురేఖలు – వీటిలో ఏ ఒక్కటి ఉన్నా చంద్రక్షేత్రం బలం కలిగినట్లు, మంచి ఫలితాలు ఇస్తున్నట్లు గుర్తు. దీనిపైన గుణక చిహ్నం, వల, ద్వీపం ఏవైనా ఉంటే అది బలహీనం అనీ, చంద్రక్షేత్రంలో సగం వరకు ఒక నిలువురేఖ ఉంటే అది అత్యున్నత చంద్రక్షేత్రం అని గ్రహించాలి.

ఆరోగ్య విషయాలు నిర్ధారించేటప్పుడు, చంద్రక్షేత్రం పైన గల చిహ్నాలనే కాక బుధరేఖను, జీవితరేఖను సైతం జాగ్రత్తగా పరిశీలించాలి. చంద్రక్షేత్రం మనిషి మనస్సుకు, ఆలోచనలకు అద్దం పడుతుంది. చంద్రక్షేత్రం బలంగాగల వ్యక్తి తన ఆలోచనలన్నీ అద్భుతం అనే నమ్మకంతో ఉంటాడు. చంద్రక్షేత్రం బలహీనపడిన వ్యక్తి తన ఆలోచనల్ని తానే నమ్మడు. అసలు పెద్దగా ఆలోచించడు. చంద్రక్షేత్రం అత్యున్నతమైన వ్యక్తి అతిగా, విపరీతంగా ఆలోచించి పిచ్చివాడవుతాడు. ఆలోచనలతో జీవించే వారికి, ఆలోచనలు అవసరమైన వృత్తి వ్యాపారాలలో ఉండే వారికి, ఎగ్జిక్యూటివ్‌లకు, ఉద్యోగులకు చంద్రక్షేత్రం చక్కగా ఉండాలి.

చంద్ర స్వభావం గల వ్యక్తి పొడవుగా, కోమలంగా ఉంటాడు. లావుగా, బలంగా ఉన్నా అతనిలో అందం, ఆకర్షణ ఉంటాయి. మనిషి తెల్లగా ఉంటాడు. హృదయం కోమలం అయితే బలహీనం, తల గుండ్రంగా ఉంటుంది. నుదురు చిన్నదిగా, కనుబొమ్మలు నెలవంక వలె ఉండి ముడివేసినట్లు ఉంటాయి. చిన్న ముక్కు, పళ్లు పెద్దవిగా ఉంటాయి. గొంతు సన్నగా ఉంటుంది. తీయగా, ఆకర్షణీయంగా మాట్లాడతాడు.

చంద్ర ప్రభావం కలవారు ఎప్పుడూ ఆలోచిస్తుంటారు. అందని వాటికై అర్రులు చాచడం వారి నైజం. పదిమంది మెప్పు పొందాలనీ, ఆదర్శంగా జీవించాలనీ కోరిక. డబ్బు మీద మమకారం ఉండదు. చివరి రూపాయి వరకు ముందు వెనుకలు చూడకుండా ఖర్చు పెడతారు. ఎప్పుడూ ప్రయాణాలు చేస్తుంటారు. జ్యోతిషం పైన, సాముద్రికం పైన నమ్మకం సౌందర్యారాధన, రసాస్వాదన ఎక్కువ. దయాదాక్షిణ్యగుణాలతో పాటు స్వార్థం కూడా ఎక్కువగానే ఉంటుంది.

చంద్రక్షేత్రం బలంగా ఉన్నవారు రచయితలు, కళాకారులు అవుతారు. ఆలోచనాశక్తి, స్వతంత్రత ఎక్కువ. వీరికి లో బి.పి., నరాల బలహీనత ఏర్పడు తుంది.

చంద్రమండలం పైభాగం లోపభూయిష్టంగా, క్రింది భాగం బలంగా ఉండి బుధమండలంలో అడ్డురేఖలుండి, బుధరేఖ మస్తిష్కరేఖను ఖండిస్తే, అతనికి నీచస్త్రీ సంభోగం వలన సుఖరోగాలు సంక్రమిస్తాయి.

చంద్రక్షేత్రం బలంగా ఉన్న వ్యక్తి అధిక ప్రసంగం చేస్తాడు. కాస్త పొట్టి అనిపించినా గట్టివాడనిపిస్తాడు. తేలికగా అబద్ధాలాడగలడు. ఇతరుల్ని మాయ చేయగలడు. కాస్త కుచ్చిత బుద్ధి ఉంటుంది. స్వార్థం, పిరికితనం ఉంటాయి. తన సుఖాన్ని మాత్రం చూచుకుంటాడు. కులటలతో సాంగత్యం చేస్తాడు. పతితలంటే అతనికి వల్లమాలిన ప్రేమ.

చంద్రమండలం బలహీనమైన వ్యక్తి మోసగాడు, ఆత్మస్తుతి, పరనింద చేసేవాడవుతాడు అయివుంటాడు. మరీ ఉచ్ఛగా ఉంటే అతనికి పిచ్చి పడుతుంది. దానిపైన నక్షత్రం గానీ, నిలువు రేఖ గానీ ఉంటే మనస్సు చంచలమవుతుంది. చంద్ర మండలం అథోభాగంలో ఆ చిహ్నాలున్న వ్యక్తి ఆత్మహత్యకు సిద్ధపడతాడు.

చంద్రమండలం ఉన్నతమైన వ్యక్తి మహామేధావి, ఆలోచనాపరుడు అవుతాడు. అతనికి కార్యదీక్ష, పట్టుదల అధికం. ఏ పనిచేసినా ఆర్టిస్టిక్‌గా చేస్తాడు. కోరకపోయినా అతనికి అన్ని సుఖాలు, సంపదలు లభిస్తుంటాయి. అదృష్టంతో పాటు అవకాశాలూ అందివస్తాయి. మృదుస్వభావి. కాకపోతే స్వార్థం, కుచ్ఛితం ఎక్కువై నీచపు పనులు చేస్తాడు. మృదుస్వభావం కారణంగా తీయగా, ఆకర్షణీ యంగా మాట్లాడి అన్ని పనులలో విజయం సాధిస్తాడు. కళల్లో, సాహిత్యంలో, ఉద్యోగంలో, వ్యాపారంలో రాణిస్తాడు. ఎంత సంపాదించినా అతనికి తృప్తి ఉండదు.

చంద్రక్షేత్రం ఉన్నతంగా ఉండి, వేళ్లు పొడవుగా ఉన్న వ్యక్తికి అనేక భాషలతో పరిచయం ఉంటుంది. అనేక భాషలు మాట్లాడగలడు. సైంటిస్టు అవుతాడు. లెక్చరర్ ఉద్యోగంలో రాణిస్తాడు. చంద్రక్షేత్రం ఉన్నతంగా ఉండి, అరచేయి మధ్యభాగం ఎత్తుగా, బలంగా ఉంటే పబ్లిషర్, ప్రింటర్ లేదా ప్రొఫెసర్ అవుతాడు.

మొత్తంమీద అరచేయి క్రింది సగం బలంగా ఉంటే భౌతిక సుఖాలకు దాసుడవుతాడు. చంద్రక్షేత్రాన్ని మూడు సమభాగాలు చేస్తే, పై రెండు భాగాలు ఎక్కువ బలంగా ఉన్న వ్యక్తి తన శక్తి సామర్థ్యాలతో బాగా డబ్బు సంపాదించగలడు. చంద్రక్షేత్రం మూడవభాగం (అనగా క్రిందిభాగం) నీచంగా ఉన్న అతని ఆలోచనలు పరమనీచంగా ఉంటాయి. దానికి తోడు శుక్ర క్షేత్రం నీచమై, రెండు మూడు శుక్రవలయాలున్నా, హృదయరేఖ గొలుసువలె వున్నా అతను పరమ కుత్సితంగా, నీచంగా జీవిస్తాడు. మూర్ఛరోగి అవుతాడు.

మొత్తం చంద్రక్షేత్రం ఉన్నతంగా ఉండి, వేళ్లు మొనతేలి ఉంటే ఎంతటి మేధావి, విద్యావంతుడైనా సహనం లేనివాడవుతాడు. మూఢ విశ్వాసాలు ఎక్కువ. మూర్ఖత్వంతో, మొండితనంతో తన జీవితం నాశనం చేసుకుంటాడు.

చంద్రమండలం మెత్తగా, పట్టు పరుపువలె ఉండి, మస్తిష్కరేఖ చక్కగా ఉంటే, వేళ్ల చివరలు సమకోణంగా ఉంటే, వారు సంగీతజ్ఞులు, గాయకులు, రచయితలు అవుతారు. వీరికి తాత్విక దృష్టి, వేదాంత ధోరణి ఎక్కువ. వేళ్లు మృదువుగా ఉన్న వ్యక్తి గొప్ప భావుకుడు, స్వాప్నికుడు, కవి అవుతాడు. కల్పనా చాతుర్యం ఎక్కువ. సినిమా దర్శకులు, టి.వి. ప్రొడ్యూసర్స్, కంప్యూటర్ నిపుణులు ఈ లక్షణాలు కలిగి ఉంటారు. సౌందర్యారాధన, రమణీయ దృశ్యాలను ఇష్టపడడం, సూక్ష్మ పరిశీలనా శక్తి అలవడుతుంది. మస్తిష్కరేఖ తిన్నగా ఉన్న వ్యక్తి తన ఆలోచనలను వ్యాపారపరంగా ఉపయోగించి బాగా సంపాదిస్తాడు. సినిమా ప్రొడ్యూసర్ కాగలడు. మస్తిష్కరేఖ లోపభూయిష్టంగా ఉంటే అతను పతనం అవుతాడు. తెలివితేటలు రాణింపుకు రావు.

## చంద్రక్షేత్రంలో చిహ్నాలు

1. చంద్రక్షేత్రంలో ఒక చిన్న నిలువు రేఖ అరిష్టదాయకం.

2. చంద్రక్షేత్రం మధ్య నుండి క్రింది వరకు ఒక పెద్ద నిలువురేఖ ఉండి, దానిని ఒక అడ్డరేఖ ఖండిస్తే, అతనికి కీళ్ల నొప్పులు, రూమాటిజం, నడుం నొప్పి ఉంటాయి.

3. ఎడమ అంచునుండి బయలుదేరిన రెండు రేఖలు చంద్రమండలంలో ఖండించు కున్న, హృదయరేఖ రెండుగా చీలివున్న, అతనికి ఆశ ఎక్కువ. అధిక శ్రమ ఆలోచనల వల్ల బి.పి. ఎక్కువవుతుంది.




4. చంద్రక్షేత్రంలో అనేకమైన చిందర వందర రేఖలు గల వ్యక్తి పిచ్చి ఆలోచనలతో కలలు కంటుంటాడు. చూచే వారికి ఉన్మాదిలా, పిచ్చివానిలా కనిపిస్తాడు. మణి బంధం నుండి ఒక రేఖ నిలువుగా చంద్ర మండలం మధ్య వరకు వెళ్లిన, ఆ వ్యక్తి దూర దేశంలో లేక విదేశాలలో స్థిరపడతాడు.

5. హృదయరేఖ క్రిందగా అంచు నుండి బయలుదేరి చంద్రమండలంలోకి వెళ్లే రేఖలు ప్రయాణాన్ని సూచిస్తాయి. ఆ రేఖలపై ద్వీపచిహ్నాలు, గుణక చిహ్నాలు ప్రయాణాలలో ప్రమాదాలను సూచిస్తాయి. కష్ట నష్టాలకు అవి సంకేతాలు.

6. ఒక ప్రయాణరేఖ హృదయ రేఖను చేరి, నక్షత్ర చిహ్నంతో అంతమైతే ఆ వ్యక్తి ఒక స్త్రీని ప్రేమించి, ఆమెను తీసుకుని దూరప్రాంతాలకో, విదేశాలకో వెళ్లిపోతాడు.




7. మస్తిష్కరేఖ గొలుసులా వుండి, చంద్రమండలం లోకి వాలుగా వంగితే ఆ వ్యక్తి ఉన్మాది, పిచ్చివాడు అవుతాడు.

8. జీవితరేఖపైన ఒక నల్లని మచ్చ ఉండి, మస్తిష్కరేఖ గొలుసువలె చంద్ర మండలంలోకి వాలితే, శుక్ర చాపానికి చివరగా, గురు మండలంపైన ఒక నక్షత్ర చిహ్నం ఉంటే, చంద్రమండలంలో మరొక నక్షత్ర చిహ్నం ఉంటే, ఆ వ్యక్తిని ఎప్పుడూ దయ్యాలు, భూత, ప్రేతాలు పీడిస్తుంటాయి.

మస్తిష్కరేఖ నిలువుగా ఉండి, శనిక్షేత్రం ఉన్నతంగా వుంటే, అతను మంత్రవేత్త అవుతాడు. భూత వైద్యుడు కాగలడు. తంత్ర, మంత్ర విద్యలలో గొప్పగా రాణిస్తాడు.

9. హృదయరేఖ చిన్న చిన్న ద్వీపాలతో గొలుసులా ఏర్పడితే, చంద్రమండలం పైన అనేక రేఖలు వల వలె ఏర్పడితే అతను విఫల ప్రేమికుడవుతాడు. మనశ్శాంతికోసం వ్యభిచార స్త్రీలతో స్నేహం చేస్తాడు.

10. చంద్రమండలం పైసగభాగంలో ఛిన్నాభిన్నంగా రేఖలు వల వలె ఏర్పడితే అతనికి డయేరియా, ఇంటెస్టయిన్ వ్యాధులు వస్తుంటాయి. ఆ వల చంద్రక్షేత్రం క్రింది సగంలో ఏర్పడితే బ్లాడర్, చక్కెరవ్యాధి, కిడ్నీస్ జబ్బులు వస్తాయి.

స్త్రీ హస్తంలో పై లక్షణాలకుతోడు బుధ, మస్తిష్క రేఖలు కలిసే చోట మచ్చ ఉంటే ఆమెకు గర్భకోశ వ్యాధులు, యుటారిస్ ఇన్‌ఫెక్షన్ లాంటి వ్యాధులు వస్తాయి. యుటారిస్ కాన్సర్ రావచ్చును.

11. చంద్రమండలంలో ఒక పుట్టు మచ్చ ఉన్నవారికి ఇన్‌టస్టయిన్ రుగ్మతలు ప్రాప్తిస్తాయి.

12. చంద్రక్షేత్రంలో ఒక గుణకచిహ్నం ఉన్న వ్యక్తి ఆలోచనలు, విశ్వాసాలు పరమనీచంగా, మూర్ఖంగా ఉంటాయి. ఆ గుణకచిహ్నం పెద్దదిగా ఉంటే మోసం ఎక్కువవుతుంది. చంద్రమండలం పైభాగంలో గుణకచిహ్నం ఉంటే ఇన్‌టెస్టయిన్, మధ్య భాగంలో ఉంటే బ్లాడర్, క్రిందభాగంలో ఉంటే కిడ్నీ, ఉదర సంబంధమైన జబ్బులు వస్తాయి.




13. చంద్రమండలంలో రెండు చిన్న రేఖలు కోణంగా ఏర్పడితే జల గండాన్ని సూచిస్తుంది. అక్కడ ఒక నక్షత్రం ఉంటే మరణం తప్పదు. ఆ నక్షత్రం ప్రయాణరేఖ పైన ఉంటే ప్రయాణంలో ప్రమాదం తప్పదు.

14. చంద్రమండలం దిగువ భాగంలో నక్షత్ర చిహ్నం లివర్ వ్యాధులకు, డ్రాప్సికి సూచికలు.

15. చంద్రమండలం అత్యున్నతమై, మస్తిష్కరేఖ దానిపైన వాలితే శని మండలం నీచమై, బలహీనంగా ఉంటే, ఆ వ్యక్తి నీటిలో పడి ఆత్మహత్య చేసుకుంటాడు.




16. చంద్రక్షేత్రంలో నక్షత్రచిహ్నం, దాని నుండి బయలుదేరిన రేఖ జీవితరేఖవరకు లేదా శుక్రమండలంలోకి వెళితే ఆ వ్యక్తి మూర్ఛరోగంతో పిచ్చివాడవుతాడు.

17. చంద్రమండలంలో త్రిభుజచిహ్నం విశేష ఫలాలనిస్తుంది. ఆ త్రిభుజం గల వ్యక్తికి విశేష ప్రతిభ, వ్యక్తిత్వం ఉండి, కీర్తి సంపాదిస్తాడు. మంచి రచయిత, నటుడు, మేధావి అవుతాడు.




18. చంద్రమండలంలో వల వంటి రేఖలు, శనిక్షేత్రంలో ఒక నక్షత్ర చిహ్నం ఉంటే అతనికి పక్షవాత రోగం వస్తుంది.

19. చంద్రమండలంలో వల వలె రేఖలుండి, రవిరేఖ ప్రభావ యుక్తంగా ఉంటే అతను కవి అవుతాడు.

20. చంద్రమండలంలో 'వలయం' జలగండాన్ని సూచిస్తుంది.

21. చంద్రునిపై చతుష్కోణ చిహ్నం అనేక బాధలు కలిగించినా, ప్రాణ హాని కలగదు.

# 18. శుక్రక్షేత్రం

**బొ**టనవ్రేలి క్రింద నుండి జీవితరేఖ వరకు ఉన్న దానిని శుక్రక్షేత్రం అంటారు. దీనిని బొటనవ్రేలి మూడవ పర్వంగా కొందరు పరిగణిస్తారు. శుక్రమండలం ప్రేమ, దయ, దాక్షిణ్యం, అనురాగం, అందం, మమత, అలంకరణ, ఆకర్షణ చెబుతుంది. శుక్రమండలంలో త్రిభుజం, వలయం, చతుష్కోణం, చిన్న నిలువురేఖలు దాని బలాన్ని అధికం చేస్తాయి. ఉన్న లోపాల్ని పూరిస్తాయి. గుణకం, వల, ద్వీపం, మచ్చ దానిని బలహీనపరచి, లోపాలను ఎత్తిచూపిస్తాయి.

శుక్రమండలం లావుగా, ఎత్తుగా, బాగా ఉబ్బరించినట్లుండి దాని పైన వలవంటి రేఖలు మంచి రంగులో ఉంటే అత్యున్నత క్షేత్రమని గుర్తించవచ్చు. పలచగా, పల్లంగా ఉంటే నీచ శుక్ర క్షేత్రమని గుర్తించాలి. ఉన్నత శుక్రక్షేత్రం గల వ్యక్తి అందంగా, ఆకర్షణీయంగా, నిర్విచారంగా, ఆనందంగా జీవిస్తాడు. నీతి నియమాల విషయంలో పెద్ద పట్టుదల ఉండదు. అతని మాటలు, చేష్టలు జనాల్ని ఆకర్షిస్తాయి. ప్రేమ, శారీరక వాంఛలు, సుఖాలు, దీని బలాన్ని బట్టి నిర్ణయించాలి. శుక్ర ప్రభావం గల వ్యక్తి ఆరోగ్యంగా, అందంగా, చలాకీగా, ఆకర్షణీయంగా ఉంటాడు. అతనిలో స్వార్థం, కుత్సిత స్వభావం, ద్వేషం మచ్చుకైనా కనిపించవు. హృదయం అతి కోమలం, సున్నితం. మానసికంగా ఉద్రేకాలకు లోనైనా బయటపడనీయడు. ఆడ, మగ ఎవరినైనా తన వైపు ఆకర్షిస్తాడు. శుక్రక్షేత్రం మెత్తగా ఉంటే ఆ వ్యక్తి సంగీత ప్రియుడవుతాడు. శుక్రమండలంలో వలవలె అనేక రేఖలుంటే అతనిని అనేక మంది అందగత్తెలు ప్రేమిస్తారు. అతని పొందు అభిలషిస్తారు. ఉత్తి స్నేహంతో తృప్తి పడరు. శుక్రజాతకులు పాతిక సంవత్సరాల లోపునే పెళ్లి చేసుకుంటారు. వీరికి కామ తృష్ణ అధికంగా ఉంటుంది.

శుక్రమండలం ఉన్నతంగా గల వ్యక్తి ముఖం గుండ్రంగా, లేదా కోలగా ఉంటుంది. నుదురు ముడతలు పడకుండా విశాలంగా, ప్రశాంతంగా, నున్నగా ఉంటుంది. జుత్తు మృదువుగా, పట్టులా ఉంటుంది. కనుబొమలు సన్నగా, అందంగా ఉంటాయి. కళ్లలో కరుణ, ప్రేమ జాలువారుతుంది. మెడ పొడవుగా దృఢంగా ఉంటుంది. విశాల వక్షం, అరచేయి తెలుపు, స్వరం మృదుమధురం. శుక్రజాతకులు ఎవరినీ ద్వేషించరు. ప్రేమానురాగాలతో అందరినీ ఆకర్షిస్తారు. అందరినీ వశపరచుకుంటారు. వీరిలో మానవత్వం, మమకారం ఎక్కువ. అభిమానం అధికం. ఎన్ని కష్టాలనైనా ఆనందంగా భరిస్తారు. పెదవులపైన, కళ్లలో ఎప్పుడూ చిరునవ్వు చిందుతుంది. స్వార్థం తక్కువ, సౌందర్యారాధన అధికం. శత్రువులను క్షణంలో క్షమిస్తారు. సత్యం, ధర్మం, చట్టం, నీతి అంటే గౌరవం. తమను అందరూ గుర్తించాలన్న తాపత్రయం ఉంటుంది. తాము పైకి రావాలని శ్రమిస్తారు. సంగీత, సాహిత్య, నృత్య రంగాలలో వీరు రాణిస్తారు. శుక్రజాతకులకు భార్య, ఇల్లు అంటే చాలా ఇష్టం. భార్య అందగత్తె, గుణవతి అయి ఉంటుంది. సంసార విషయంలో భార్యాభర్త లిరువురు అదృష్టవంతులే.

## శుక్రక్షేత్రంలో చిహ్నాలు

1. శుక్రక్షేత్రంలో రెండు, మూడు నిలువు రేఖలున్న వ్యక్తి కృతఘ్నుడు, చపల చిత్తుడు అవుతాడు.

2. శుక్రమండలంలో జీవితరేఖకు సమీపంగా ప్రారంభమైన రేఖలు జీవిత రేఖతో కలిస్తే అవి ప్రేమ వ్యవహారాలకు గుర్తులు. అప్రయత్నంగా స్త్రీల వలలో చిక్కుపడతాడు. వారి ఆకర్షణను నిరోధించలేడు.




3. బొటనవేలి మూలస్థానం నుండి బయలుదేరి జీవితరేఖ వైపుగా పోయే రేఖలు స్పష్టంగాఉంటే, అతని జీవితంపై స్త్రీల ప్రభావం ఎక్కువగా ఉంటుంది. వాని అభివృద్ధికి స్త్రీల సహాయం అవసరం. ఆ స్త్రీలే అతని పతనానికి కారణమవుతారు. ఈ రేఖలపై ద్వీప చిహ్నం ఉంటే ప్రేమ కారణంగానే అతను అపఖ్యాతి చెందడం జరుగుతుంది.

4. శుక్రక్షేత్రంలో అనేక రేఖలు ఖండించుకున్నట్లుగా గజిబిజిగా ఉంటే అతను సుఖభోగాలకు, స్త్రీ సుఖాలకు వెంపర్లాడుతుంటాడు. అతనిలో భోగలాలసత్వం, వ్యసనం అధికం. శుక్రమండలం బలహీనమైతే వ్యభిచారి అవుతాడు. నీచస్త్రీల సంపర్కం కోరుతుంటాడు.



5. శుక్రమండలంలో ఒక నల్లని మచ్చ వుంటే అతను ప్రేమ వ్యవహారంలో చిక్కుకుని సుఖరోగాలు సంపాదిస్తాడు లేదా చిక్కుల్లో పడతాడు.

6. శుక్రమండలంలో చిన్న చిన్న అడ్డరేఖలు శరీరానికి తగిలే గాయాలను, చిన్న ప్రమాదాలను సూచిస్తాయి.

7. శుక్రక్షేత్రంలో ఒకే ఒక గుణక చిహ్నం పెద్దది ఉంటే, అతను ఒక గొప్ప స్త్రీని ప్రేమించి, ఆమె పొందుకోసం తన సర్వస్వం త్యాగం చేస్తాడు. గురుక్షేత్రంలో వేరొక గుణచిహ్నం ఉంటే అతను ప్రేమించిన స్త్రీ చాలా ఉన్నత కుటుంబీకురాలు, గుణవతి అయి వుంటుంది. వారి ప్రేమ పవిత్రంగా ఉంటుంది.

8. శుక్రమండలంలో నక్షత్రచిహ్నం ఆత్మీయ బంధువు వియోగాన్ని సూచిస్తుంది.

అది అంగుష్టం మూలస్థానంలో ఉంటే ఆ వ్యక్తి అత్యంత ఆప్తుడు, సన్నిహితుడు అయి వుంటాడు.

అంగుష్టం మూలస్థానం వద్ద శుక్రమండలం పైన నిలువురేఖలుండి, వాటి మధ్య ఒక గుణకచిహ్నం ఉంటే అతను వివాహానికి ముందు అనేక మంది స్త్రీలను అనుభవించి ఉంటాడు.

స్త్రీ హస్తంలో అలాంటి గుర్తు ఉంటే పెళ్లికి ముందే ఆమె ఒకసారి మానభంగానికి గురిఅయి ఉంటుందని చెప్పవచ్చు.

9. జీవితరేఖ సమీపంలో, శుక్రక్షేత్రం వైపున మూడు నక్షత్రాలుంటే, అతనిని ఒకస్త్రీ అమితంగా కోరుతుంది. కానీ అతనిని పొందలేదు. లేదా అతని కుటుంబంలో ముగ్గురు వ్యక్తులు వెంటవెంటనే మరణిస్తారు.

10. జీవితరేఖ దిగువ భాగంలో ఒక నక్షత్రం ఉంటే, అతడొక స్త్రీని ప్రేమించి భగ్న ప్రేమికుడవుతాడు.

11. శుక్రక్షేత్రంలో వల ఆకారంలో రేఖలున్న వ్యక్తి అనేక భయంకర రోగాలకు గురవుతాడు.




12. జీవితరేఖ దిగువ, జీవితరేఖకు సమీపంగా ఒక చతుష్కోణమున్న వ్యక్తి కొంతకాలం కటకటాల వెనుక కాలం గడపవలసి వస్తుంది లేదా పారిపోయి అజ్ఞాతంగా జీవించవలసి వస్తుంది.

13. శుక్రమండలంలో త్రిభుజచిహ్నం ఉన్న వ్యక్తి ఎల్లప్పుడు తన భార్య శీలాన్ని అనుమానిస్తుంటాడు. ఆమెను హింసిస్తుంటాడు. అతని ప్రవర్తన భార్యకూ అనుమానం కలిగిస్తుంది. అపోహలు, అనుమానాలు కారణంగా వారు విడిపోతారు.

14. శుక్రమండలంలో ఏటవాలుగా ఒక ద్వీప చిహ్నం ఉన్న వ్యక్తి వివాహం కారణంగా తనకు రావలసిన సంపదలు, అదృష్టాన్ని వదులుకుంటాడు.

15. శుక్రక్షేత్రంలో రేఖలు వల వలె ఏర్పడిన వ్యక్తికి శృంగార ప్రియత్వం ఎక్కువ.

# 19. కంకణ రేఖలు

**మ**ణికట్టు పైన సహజ కంకణాల వలె ఉన్న రేఖల్ని కంకణరేఖలు అంటారు. ఇవి ఒకటి నుండి నాలుగు వరకు ఉంటాయి. నాలుగు కంకణరేఖలున్న వ్యక్తి నూరు సంవత్సరాలు జీవిస్తాడు. మూడున్నర రేఖలుంటే సహస్రమాస జీవి, పూర్ణ పురుషుడు అవుతాడు. ఒక్కొక్క కంకణరేఖకు 25 సంవత్సరాల ఆయుర్దాయం లెక్కించవచ్చు. వీటిని బట్టి మనిషి ఆయుర్దాయం గుణించవీలుంది.

మొదటి కంకణరేఖ ఆరోగాన్ని సూచిస్తుంది. ఇది స్వచ్ఛంగా, చక్కగా ఉన్న వారికి ఆరోగ్యలోపం ఉండదు. సగమో, ముప్పాతికో, గొలుసులాగా, వెడల్పుగా ఉంటే ఆరోగ్య లోపం ఉన్నట్లు. కంకణ రేఖల నుండి ఏవైనా రేఖలు బయలుదేరి అరచేతిలోకి వెళితే, ఆవ్యక్తి ఉన్నతాశయాలు కలవాడని చెప్పవచ్చు. జీవితంలో అతను సాధించవలసింది ఉంటుంది. సాదా సీదాగా బ్రతుకు సాగించడు. తన జీవిత లక్ష్యం నెరవేరడానికి కృషి చేస్తాడు.

మొదటి కంకణరేఖ చాపం వలె వంపుగా ఉండి, దాని మధ్య భాగం అరచేయి వైపుకు వంగితే ఆ వ్యక్తికి జననేంద్రియ సంబంధమైన ఒక లోపం ఉంటుంది లేదా రతిక్రీడలో అతి సున్నితంగా ప్రవర్తిస్తాడు. అంటే అతనిలో శాడిస్టు లక్షణాలు, మొరటు ప్రవర్తన ఉండవు. స్త్రీ ఇష్ట ప్రకారం నడుచుకుంటాడు. అతిగా ప్రవర్తించడు.

స్త్రీ హస్తంలో ఈ లక్షణం ఉంటే ఆమెకు గర్భకోశ సంబంధమైన ఒక లోపం ఉంటుంది. గర్భసంచి తొలగించవలసి వస్తుంది. ప్రసవం కష్టమవుతుంది. సహజ శిశుజననం జరగదు. ఆపరేషన్ తప్పనిసరి అవుతుంది.

1. జీవితరేఖ ఎంత లోపభూయిష్టంగా వున్నా, మూడు కంకణ రేఖలున్న వ్యక్తి మహా అదృష్టవంతుడవుతాడు. సుఖ సంపదలు, భోగభాగ్యాలు అనుభవిస్తాడు. ఉన్నత పదవి పొందిన తర్వాత అతని ఆరోగ్యం చెడిపోతుంది.

2. మొదటి కంకణరేఖ మధ్యభాగం అరచేయి వైపు వంగితే అతనికి ఇంద్రియ బలహీనత ఏర్పడుతుంది. శీఘ్రస్ఖలనం వలన తృప్తి చెందలేడు.

3. మూడు కంకణరేఖలు పూర్ణాయుర్దాయానికి, పూర్ణారోగ్యానికి, ఐశ్వర్యానికి ప్రాతినిధ్యం వహిస్తాయి. నాలుగు కంకణరేఖలు మహారాజ యోగం కలిగిస్తాయి.




4. ఈ కంకణరేఖలు అస్తవ్యస్థంగా ఉన్న వ్యక్తి భోగలాలసుడై, సుఖాల కోసం ధనాన్ని, సంపదల్ని వ్యయం చేస్తాడు. అయినా అతనికి తృప్తి, సుఖం ఉండవు.

5. మొదటి కంకణరేఖ గొలుసు వలె ఉన్న వ్యక్తి ఎంతో శ్రమ, పరిశ్రమ చేస్తే గాని జీవితంలో పైకి రాలేడు, రాణించడు. అతనికి శ్రమ ఎక్కువ, ఫలితం తక్కువ. చివరి దశలో తన కష్టానికి తగిన ఫలితాన్ని బిడ్డలద్వారా అనుభవిస్తాడు. ఇతని కృషి ఫలితాలు పిల్లలు అనుభవిస్తారు. వారు ఉన్నతికి వస్తారు.




6. కంకణరేఖ నుండి బయలు దేరిన ఒక రేఖ శుక్రక్షేత్రం దాటి గురు మండలంలోకి వెళితే, అతను తరచు విదేశాలకు వెళుతుంటాడు. కీర్తి ప్రతిష్టలతో పాటు కోట్లు సంపాదిస్తాడు. ఆ రేఖ చంద్ర మండలం ద్వారా గురుక్షేత్రానికి వెళ్లినా అదే ఫలితం. అయితే విదేశాలలో స్థిరపడి ఉన్నత స్థితికి రావడం జరుగుతుంది.

7. కంకణరేఖ నుండి బయలు దేరిన రెండు రేఖలు శని మండలం

లోకి వెళ్లి, అక్కడ ఖండించు కుంటే అతడు విదేశాలలో స్థిరపడి, తిరిగి స్వదేశం రాడు. అక్కడే ఒక ఆపదలో మరణిస్తాడు.

8. కంకణరేఖ నుండి బయలుదేరిన రేఖ రవిక్షేత్రానికి వెళ్లిన, అతడు ఐ.ఎ.ఎస్ లాంటి ఉన్నత విద్యతో పరరాష్ట్రాలలో జీవిస్తాడు. లేదా విదేశీయులతో స్నేహం చేసి విదేశాలకు వెళ్లి అక్కడే స్థిరపడడం జరుగుతుంది. విపరీత రాజయోగం పట్టి కోట్లు గడిస్తాడు.




9. కంకణరేఖ నుండి బయలు దేరిన రేఖ బుధక్షేత్రానికి పోతే, ఆ వ్యక్తికి ఆకస్మాత్తుగా ధనం, ఐశ్వర్యం, పరపతి ఏర్పడతాయి. విదేశాలలో పరిశ్రమలు స్థాపించి, గొప్ప పారిశ్రామిక వేత్త అవుతాడు. లెక్కకు మించిన సంపద సమకూరుతుంది.

10. కంకణరేఖ నుండి బయలుదేరిన రెండు రేఖలు సమాంతరంగా చంద్ర మండలానికి పోతే ఆ వ్యక్తి దూర ప్రాంతాలలో, పర రాష్ట్రాలలో ప్రసిద్ధుడై, ఐశ్వర్యవంతుడవుతాడు, కాని ఒక ప్రమాదంలో మరణిస్తాడు.




11. శని మండలం క్రిందగా, మూడు కంకణరేఖలు తెగితే, ఆ వ్యక్తి పచ్చి స్వార్థపరుడు, అబద్దాలకోరు అవుతాడు. ఎప్పుడూ ఒకరికి అపకారం చేయడమే అతని ప్రవృత్తి.

12. కంకణరేఖ నుండి బయలు దేరిన రేఖ చంద్రక్షేత్రం ద్వారా పోయి జీవితరేఖతో కలిస్తే అతను ప్రయాణంలో ప్రమాదంలో మరణిస్తాడు.

13. కంకణరేఖ నుండి బయలుదేరిన రేఖ వక్రంగా, పాములా మెలికలు తిరుగుతూ వెళ్లి బుధరేఖను ఖండిస్తే, అతను రోగపీడితుడవుతాడు. ధననష్టం, వ్యాపార నష్టం, ఉద్యోగ భంగం కలుగుతుంది.




14. మొదటి కంకణరేఖపైన గుణక చిహ్నం అనేక అవరోధాలు కలిగించి, చివరకు విజయం పొందేలా చేస్తుంది.

15. కంకణరేఖపైన ఒక గుణక చిహ్నం, ఒక త్రికోణం ఉండి అక్కడ నుండి ఒక రేఖ గురుక్షేత్రానికి పోతే ప్రయాణం వల్ల అదృష్టం కలసి వస్తుంది.

16. కంకణ రేఖ మధ్యన కోణం ఏర్పడితే అతను వృద్ధాప్యంలో బాగా డబ్బు గడించి సుఖపడతాడు. విపరీత రాజయోగం పడుతుంది. తన ప్రతిభతో రాణించి, బాగా డబ్బు గడించగలుగుతాడు. స్పెక్యులేషన్ వల్ల, సన్మానాల వల్ల ధనవంతుడవుతాడు.

17. మొదటి కంకణరేఖ పైన ఒక త్రిభుజం, దాని మధ్యన ఒక గుణకచిహ్నం గల వ్యక్తి విపరీతంగా సంపాదిస్తాడు, కుబేరు డనిపించుకుంటాడు, కులీనుడుగా జీవిస్తాడు.

18. చేతిలో మిగిలిన రేఖలు బావుండి, క్షేత్రాలు బలంగా ఉంటే కంకణరేఖ పైనఉన్న నక్షత్రం, వారసత్వ సంపదలు, అకస్మాత్ ధనలాభం సూచిస్తుంది. ఇతర అవలక్షణాలుంటే అతడు అవినీతి పరుడవుతాడు.

# 20. శుక్రరేఖలు

**శు**క్ర క్షేత్రం నుండి బయలుదేరే రేఖల్ని శుక్రరేఖలు అంటారు. ఇవి చేతిలో ఎన్ని అయినా ఉండవచ్చు. ఆరంభస్థానం నుండి అంతమయ్యే స్థానాల్ని బట్టి ఫలితాలు మారుతుంటాయి.

1. శుక్ర క్షేత్రం నుండి గాని, రెండవ కుజక్షేత్రం నుండి గానీ బయలుదేరిన రేఖ, లేదా రేఖలు జీవితరేఖను మాత్రమే ఖండిస్తే అతని విషయంలో బంధువుల జోక్యం ఎక్కువగా ఉంటుంది. అతని ప్రగతికి వారు అవరోధాలు కల్పిస్తుంటారు. వారి కారణంగా అతనికి మనశ్శాంతి లేకుండా పోతుంది.

2. అంగుష్టం రెండవ పర్వం నుండి బయలుదేరిన ఒక రేఖ శుక్రక్షేత్రం దాటి జీవితరేఖను మాత్రమే ఖండిస్తే ఆ వ్యక్తి ఒక ఆత్మీయుని మరణం వల్ల చాలాకష్ట నష్టాలకు గురవుతాడు. లేదా నమ్మిన బంధువు, మిత్రుడు ఒకడు ఘోరంగా మోసం చేస్తాడు.




ఆ రేఖ అంగుష్టం మొదటి పర్వం నుండి బయలుదేరితే, అలా మోసం చేసిన వాడు హత్య చేయబడతాడు.

3. జీవితరేఖను ఒక చిన్న అర్ధ చంద్రాకార రేఖ ఖండిస్తే, అతనికి అకస్మాత్తుగా ప్రమాదకరమైన జబ్బు చేస్తుంది. సమయంలో తగిన చికిత్స జరగకపోతే మరణం తధ్యం. అయిదారు సంవత్సరాలకు గానీ స్వస్థత చిక్కదు.

4. శుక్ర క్షేత్రం నుండి లేదా రెండవ కుజ మండలం నుండి ఒక రేఖ గురుక్షేత్రానికి పోతే, అతని అభిరుచులు, ఆశయాలు ఉత్తమంగా ఉంటాయి. అతను గర్వం, అహంకారం మరింత పెంచుకుని తన ఆశయాలు నెరవేర్చుకుంటాడు.




ఆ రేఖ చివరన, గురు మండలం పైన ఒక నక్షత్ర చిహ్నం ఉంటే అతని ఆశయాలు అనతికాలంలోనే నెరవేరి సంపన్నుడవుతాడు, ధనార్జన చేస్తాడు. ఆ రేఖను వేరొక అడ్డురేఖ ఖండిస్తే అతని ప్రయత్నాలకు అవరోధాలు ఏర్పడతాయి. అవి అతని ప్రగతికి, భవిష్యత్తుకు ఆటంకాలవుతాయి.

5. శుక్రక్షేత్రం నుండి బయలుదేరిన ఒక రేఖ శనిక్షేత్రానికి పోతే ఆ వ్యక్తి జంతువుల వలన, లేదా వాహన ప్రయాణంలో గాయపడడం జరుగుతుంది. ఆ రేఖ చివరన రెండు పాయలుగా చీలితే అతనికి ప్రాణాపాయం ఉంటుంది.

అది మధ్యవ్రేలి మూడవపర్వంలోకి వెళితే ఆపరేషన్ అనివార్యం. స్త్రీ హస్తంలో అలాంటిరేఖ ఉంటే ప్రసవ సమయంలో శస్త్ర చికిత్స జరుగుతుంది.

ఆ రేఖ శని మండలంలోకి వెళ్లి అది భాగ్యరేఖకు సమాంతరంగా ఉంటే, అదే మరొక అదృష్ట రేఖగా మారి అతుల సంపదలు, సౌభాగ్యాలు ప్రసాదిస్తుంది. అతను స్వశక్తితో విపరీతంగా ధన, కనక, వస్తు, వాహనాలు, భవనాలు సమకూర్చుకుంటాడు. వానికి బంధు మిత్రుల సహాయం లభిస్తుంది.

6. జీవితరేఖ నుండి బయలుదేరిన రేఖ గురుమండలం చేరి, అక్కడ వంపు తిరిగి శనిక్షేత్రంలోకి వెళ్లితే అతనికి చిన్నతనం నుండి మతావేశమెక్కువ. మనస్సు మార్చుకుని సన్యాసిగా మారి మతానికి సేవ చేస్తాడు.

7. శుక్రమండలం నుండి బయలుదేరిన రేఖ నేరుగా శనిక్షేత్రానికి పోయి, అక్కడ రెండుగా చీలితే అతని వివాహం ఒక విషాదగాథ అవుతుంది.

8. శుక్రమండలం నుండి బయలుదేరిన రేఖ, జీవితరేఖ నుండి బయలుదేరి ఊర్ధ్వ దిశగా పోయే రేఖను ఖండిస్తూ శనిక్షేత్రానికి వెళితే, అతని సంసారం ముక్కలై, భార్యాభర్తలు విడిపోతారు.

9. శుక్రమండలం నుండి బయలు దేరిన రేఖ సరాసరి రవిక్షేత్రానికి వెళితే, ఆ వ్యక్తి ఐశ్వర్యవంతుడై, పేరు ప్రఖ్యాతులు గడించి గొప్పవాడవుతాడు. అతనికి సంపదలు స్వంత ప్రతిభ వల్ల సమకూరుతాయి. బంధువులు, మిత్రులు అతనిని చూచి గర్విస్తారు. ఆ రేఖ పాము నడక నడిస్తే సంపాదించిన ధనం, కీర్తి, గౌరవాలు కొంతకాలానికి సన్నగిల్లి పోతాయి.




10. శుక్రమండలం నుండి బయలు దేరిన రేఖ నేరుగా బుధమండలానికి చేరితే, ఆ వ్యక్తి వైజ్ఞానిక రంగంలో వ్యాపార, వాణిజ్యాలలో, పరిశ్రమల్లో రాణిస్తాడు. విశేష ప్రతిభ కనబరచి, సంపన్ను డవుతాడు. అది తెగిపోయి, అస్తవ్యస్తంగా వుంటే అతని ప్రతిభను ప్రదర్శించడానికి అవకాశం రాదు.

అది జీవితరేఖ నుండి బయలుదేరి ఊర్ధ్వంగా పోయే రేఖను ఖండిస్తే భార్యాభర్తలు కలసి జీవించరు. ఎవరికీ సంసార సుఖం ఉండదు.

11. శుక్రరేఖ జీవిత, భాగ్య, మస్తిష్క, రవి రేఖల్ని దాటి ప్రథమ కుజ స్థానంలోకి వెళితే – అది జీవితరేఖను ఖండించిన వయస్సులో ఒక ప్రమాదం జరుగుతుంది. స్కూటరు యాక్సిడెంట్ లేక మరేదైనా వాహన ప్రమాదం కావచ్చు. ఒక స్నేహితుని కారణంగా ఆ ప్రమాదం సంభవిస్తుంది.

ప్రథమ కుజమండలం బాగా బలంగా ఉంటే ఆ ప్రమాదం తన తొందరపాటు వల్ల సంభవిస్తుంది.

12. శుక్రమండలం నుండి బయలుదేరిన రేఖ భాగ్యరేఖను దాటి చంద్రమండలానికి పోతే, ఆ వ్యక్తి తన భార్య కారణంగా, లేక ప్రేమించిన ఒక స్త్రీ కారణంగా, లేక వారి జోక్యం వల్ల అదృష్టం చేజారిపోతుంది. ధననష్టం జరగడమే కాక పరమ దరిద్రుడవుతాడు. ఉద్యోగ, వ్యాపారాలలో భంగం, అపజయం సూచితం.

13. శుక్రమండలం నుండి బయలుదేరిన రేఖ జీవితరేఖను దాటి భాగ్యరేఖతో కలిస్తే, బంధుమిత్రులు అతని వ్యవహారాలలో జోక్యం కలిగించుకోవడం వల్ల

అపకారం జరుగుతుంది. అతనికి దాంపత్య సుఖం ఉండదు. భార్య ప్రతి కూలంగా ప్రవర్తిస్తుంది.

అది భాగ్యరేఖను ఖండిస్తే బంధుమిత్రులే అతనికి వ్యతిరేకంగా పనిచేసి, వానికి రావలసిన అవకాశాలు రాకుండా చేస్తారు.




14. అది మస్తిష్కరేఖను చేరితే అతని స్వతంత్ర ఆలోచనలు ఫలించవు. ప్రతికూలత ఎక్కువగా ఉంటుంది. ఎవరూ అతనిని గౌరవించరు. అతని ఆలోచనలు, పథకాలు ఫలించవు.

అది వివాహరేఖను ఖండిస్తే, శిరోవేదన తప్పదు.

15. శుక్రమండలం నుండి బయలుదేరిన రేఖ హృదయరేఖతో కలిస్తే, సంసారంలో కష్టాలు, బాధలు తప్పవు. భార్య విడాకులు తీసుకుంటుంది.

అది వివాహరేఖను ఖండిస్తే కొంతకాలం ఇద్దరికీ ఎడబాటు తప్పదు.

హృదయరేఖను చేరినపుడు చివర రెండు పాయలుగా చీలితే భార్యాభర్తల ఎడబాటు తప్పనిసరి.

భాగ్యరేఖపై ద్వీపచిహ్నం ఉంటే లోకాపవాదం భరించలేక భార్యను వదలివేయవలసి వస్తుంది.

ఆ శుక్ర రేఖపై ఒక ద్వీపచిహ్నం ఉంటే ప్రేమ వ్యవహారాలలో అనేక బాధలు, అవరోధాలు ఏర్పడతాయి. శుక్రరేఖ హృదయరేఖను ఖండిస్తే ఆ పరిణామాలు మరీ భయంకరంగా ఉంటాయి.

16. శుక్రమండలం నుండి బయలుదేరిన శుక్రరేఖ మస్తిష్క, హృదయ రేఖల్ని ఖండిస్తే, ఆర్థిక చిక్కులు ఏర్పడతాయి. ధననష్టం, అపజయాలు సూచితాలు. అది చిన్న వయస్సులో అయితే ఆ ఫలితాలు తండ్రి పరంగా ఉంటాయి. ఫలితం తనూ అనుభవించవలసి వస్తుంది.

17. శుక్రమండలం నుండి బయలుదేరిన శుక్రరేఖ రవిరేఖతో కలిస్తే, అతనికి బంధువుల సహాయం లభిస్తుంది. అతని గౌరవ ప్రతిష్టలకు అందరూ సహాయం

చేస్తారు. ఉద్యోగాభివృద్ధికి, ధనార్జనకు బంధుమిత్రుల సహాయం ఎప్పుడూ ఉంటుంది. అతని అవసరం గుర్తించి ఎవరైనా సహాయం చేస్తారు.

18. శుక్రమండలం నుండి వచ్చిన రేఖ రవి రేఖను ఖండిస్తే, దురదృష్టం. అతనికి వచ్చే అవకాశాలను బంధువులు చెడగొడతారు. అతనికి పరాభవాలు, అవమానాలు తప్పవు.




19. జీవితరేఖ నుండి బయలుదేరి పైకి వెళ్లే రేఖల్ని శుక్రరేఖ ఖండించి రవిరేఖతో కలిస్తే కోర్టు వ్యవహారాలు లాభిస్తాయి. అది రవిరేఖను ఖండిస్తే ఓటమి తప్పదు.

20. శుక్రక్షేత్రం నుండి బయలుదేరిన రేఖ వివాహరేఖను ఖండిస్తే భార్యాభర్తల ఎడబాటు తప్పదు. ఆ రేఖపై ద్వీప చిహ్నం ఉంటే ఇతని ప్రవర్తన నచ్చక భార్య వెళ్లి పోతుంది.

అది జీవితరేఖ నుండి పైకి వెళ్లే ఊర్ధ్వరేఖను ఖండించి, చివరన రెండు పాయలుగా చీలితే, భార్యాభర్తల ఎడబాటు అనివార్యం.

21. శుక్రక్షేత్రంలో ఒక మచ్చ ఉండి, అక్కడ నుండి బయలుదేరిన శుక్రరేఖ జీవితరేఖ నుండి బయలుదేరి పైకి వెళ్లే రేఖను మాత్రం ఖండిస్తే, గురుక్షేత్రంలో ఒక గుణకచిహ్నం ఉంటే, అతనిది ప్రేమ వివాహం అవుతుంది. అయితే ఆ ప్రేమ జంట ఎంతో కాలం కలిసి ఉండరు.




22. శుక్రక్షేత్రం నుండి బయలు దేరిన శుక్రరేఖ జీవితరేఖను ఖండిస్తే, జీవితరేఖను ఖండించిన వయస్సులో ఒక ఆప్తుని మరణం సంభవం. వివాహరేఖ పైన పుట్టుమచ్చ ఉంటే అది కళత్ర వియోగాన్ని సూచిస్తుంది.

23. శుక్రక్షేత్రంలో ఒక నక్షత్రం నుండి బయలుదేరిన శుక్రరేఖ, శని క్షేత్రంలో రెండు పాయలుగా చీలితే అతని వైవాహిక జీవితం దుర్భరంగా మారుతుంది. అతని భార్య మతిచెడి పిచ్చిదవుతుంది.

24. శుక్రక్షేత్రంలో ఒక నక్షత్రం నుండి బయలుదేరిన శుక్రరేఖ, రవిక్షేత్రానికి పోతే బంధుమిత్రులతో విభేదాలు ఏర్పడతాయి. ఆ వివాదం వల్ల అవతలి వారికి నష్టం కలుగుతుంది.

అది భాగ్యరేఖతో కలిస్తే వివాదాల వల్ల, విభేదాల వల్ల ధనసంపదలు ప్రాప్తిస్తాయి.

అది భాగ్యరేఖను ఖండిస్తే, ఆప్తుని మరణం వలన మనస్తాపం, ధననష్టం కలుగుతుంది.

25. శుక్రక్షేత్రంలో ఒక నక్షత్రం నుండి బయలుదేరిన శుక్రరేఖ రవిరేఖతో కలిస్తే ఒక ఆత్మీయుని మరణం అతనికి అదృష్టాన్నిస్తుంది, ధనం వచ్చి చేరుతుంది. లేదా వివాహం వల్ల ధనవంతుడు కావచ్చు.

అది రవిరేఖను ఖండిస్తే, ఒక మిత్రుని మరణం వల్ల తాను నష్టపోవలసి వస్తుంది.

అది జీవితరేఖ నుండి పైకి వెళ్లే రేఖను ఖండిస్తే బంధువులు కారణంగా కోర్టుకు వెళ్లి అపజయం, నష్టం పొందడం జరుగుతుంది.

అది రవిరేఖతో కలిసిపోతే కోర్టు వ్యవహార విజయం, ధనలాభం, వారసత్వ తగవుల్లో విజయం సమకూరుతాయి.

26. శుక్రమండలంలో ఒక ద్వీపచిహ్నం నుండి బయలుదేరిన శుక్రరేఖ బుధక్షేత్రానికి వెళితే ఒక దురదృష్ట వంతురాలైన స్త్రీకి సహాయం చేయబోయి తన పరువు, సంపద పోగొట్టుకుంటాడు. లేదా తాను ప్రేమించిన స్త్రీ వ్యామోహంలో సర్వం కోల్పోవడం జరగవచ్చు. అతని అభివృద్ధికి అన్నివిధాల ఆమె ప్రేమ ఆటంక మవుతుంది.



27. శుక్రమండలంలోని ఒక ద్వీపచిహ్నం నుండి బయలుదేరిన శుక్రరేఖ జీవితరేఖ నుండి పైకి వెళ్లే రేఖను ఖండించి, రవిరేఖను కలిస్తే ఆ వ్యక్తి ఒక స్త్రీ ప్రేమలో పడి అదృష్టానికి దూరమవుతాడు. అయితే ఆ ప్రేమ వల నుండి బయటపడి, తన పూర్వస్థితిని చేరుకోగలడు. ఐశ్వర్యం పొందగలడు.

28. శుక్రమండలం నుండి బయలుదేరిన శుక్రరేఖ గురు మండలంలో ఒక నక్షత్ర చిహ్నంతో ఆగితే అతని జీవితం సుసంపన్నం అవుతుంది. ఆశయాలు నెర వేరతాయి. ఉన్నత పదవులు సంపాదిస్తాడు. అది ద్వీపచిహ్నంతో నిలిచిపోతే అతనిని శ్వాసకోశ వ్యాధులు బాధిస్తాయి.




29. శుక్రమండలం నుండి బయలుదేరిన శుక్రరేఖ భాగ్యరేఖను దాటిన తర్వాత ఒక నక్షత్రంతో గానీ, త్రిభుజ చిహ్నంతోగానీ ఆగిపోతే విపరీత ధననష్టం సంభవిస్తుంది.

ఆ త్రిభుజంలో ఒక నక్షత్రం ఉన్నా, లేక చతుష్కోణంతో అంతమైనా అతను భయంకర సుఖవ్యాధులు పొంది అనారోగ్య వంతుడవుతాడు. ఒక కళంకితను చేరదీసి అప్రతిష్ట పాలవుతాడు.




30. శుక్రక్షేత్రం నుండి బయలు దేరిన శుక్రరేఖ జీవిత, హృదయ రేఖల మధ్య భాగ్యరేఖను స్పృశించి ఒక ద్వీపంగా ఏర్పడితే, అతను శాడిస్టుగా ప్రవర్తిస్తాడు, మానభంగాలు చేస్తాడు. స్త్రీ హస్తంలో అలాంటి ద్వీపం ఉంటే ఆమె ఒక వివాహం అయిన మగవాడి చేత మానభంగం చేయబడుతుంది.

31. రెండు శుక్రరేఖలు భాగ్యరేఖ పైన ఒక నక్షత్రంతో కలిస్తే, బంధు మిత్రులు కారణంగా అనేక మనస్తా పాలు, బాధలు ఏర్పడతాయి.

32. శుక్రరేఖపై మస్తిష్కరేఖ, రవిరేఖలు కలిసేచోట ఒక నల్లని మచ్చ ఉంటే అతనికి దృష్టిదోషం ఏర్పడుతుంది.

33. శుక్రరేఖ, హృదయరేఖపైన గల ఒక పుట్టుమచ్చతోగాని, నక్షత్ర చిహ్నంతోగాని అంతమైతే బంధువులు కారణంగా ఏర్పడిన బాధలకు క్రుంగి పోయి గుండె జబ్బులకు గురి అవుతాడు.

34. శుక్ర మండలం నుండి బయలుదేరిన శుక్రరేఖ, రవిరేఖను ఖండించి, హృదయ, మస్తిష్క రేఖల మధ్య ఒక ద్వీపచిహ్నంతో ఆగిపోతే అతడు అనేక అవమానాలు పొందుతాడు. అతని ప్రేమ వ్యవహారం విషాదాంతమవుతుంది.

35. శుక్రరేఖ జీవితరేఖ నుండి పైకి వెళ్లే రేఖను ఖండించి, రవిరేఖ పైనగల నక్షత్ర చిహ్నంతో అంతమైతే, ఆస్తి వ్యవహారాలలో కోర్టుకెక్కి పూర్తిగా పతనం చెందుతాడు. ఆర్థిక దుస్థితికి తోడు అపనిందలు భరించవలసి వస్తుంది.

36. శుక్రక్షేత్రంలో ఒక నక్షత్రం నుండి బయలుదేరిన శుక్రరేఖ, జీవితరేఖను దాటిన తర్వాత మరొక నక్షత్రంతో అంతమైతే, అతడు అయినవారి మరణంతో విపరీతంగా నష్టపడతాడు. అతని సౌభాగ్యాలు నశిస్తాయి. జీవితంలో సుఖం లేకుండా పోతుంది.

37. శుక్రమండలంలో ఒక నక్షత్ర చిహ్నం నుండి బయలుదేరిన శుక్రరేఖ భాగ్యరేఖ పైన ఒక మచ్చతో ఆగితే అతని ఉద్యోగ వ్యాపారాలు ఒక ఆప్తుని మరణంతో నష్టమవుతాయి.

38. శుక్రమండలం పైన నక్షత్ర చిహ్నం నుండి బయలుదేరిన శుక్రరేఖ మస్తిష్క రేఖ పై గల పుట్టు మచ్చతో ఆగితే ఒక మిత్రుడు లేదా బంధువు మనో వ్యాధితో మరణిస్తాడు. అతని మరణం జాతకునికి మనస్తాపం కలిగిస్తుంది.

శుక్రక్షేత్రంపైన ఒక నక్షత్రం ఉండి, అక్కడ నుండి బయలుదేరిన శుక్ర రేఖ మస్తిష్కరేఖ పైన గల మరొక నక్షత్రంతో ఆగితే ఒక దగ్గిరబంధువు పిచ్చిపట్టి మరణిస్తాడు.



అది ద్వీపచిహ్నంతో ఆఖరైతే ఇతడే ఉన్మాదంతో మతిభ్రమించి మరణిస్తాడు.

39. శుక్రక్షేత్రం పైన ఒక నక్షత్రచిహ్నం నుండి బయలుదేరిన శుక్రరేఖ, భాగ్యరేఖ పై నున్న నక్షత్రంతో ఆగితే ఆ ఆప్తుని మరణం వల్ల తాను ఆర్థికంగా నష్టపోవడం జరుగుతుంది. అది ఉద్యోగ భంగం లేదా వ్యాపార పతనం సూచిస్తుంది. శుక్రరేఖ జీవితరేఖను ఖండించే వయస్సుతో ఈ విపత్తు సంభవిస్తుంది.

అది రవిరేఖపైన నక్షత్ర చిహ్నంతో అంతమైతే ఆ ఆప్తుని మరణం అతని ఆర్థిక పతనానికి కారణమవుతుంది. అది ద్వీప చిహ్నమైతే కేవలం ధననష్టం సూచిస్తుంది.

40. శుక్రక్షేత్రంలో ఒక ద్వీపచిహ్నం నుండి బయలుదేరిన శుక్రరేఖ భాగ్యరేఖపైన గల నక్షత్రంతో ఆగితే అతను ప్రేమ వ్యవహారాలలో అపఖ్యాతి పాలవుతాడు. ధన నష్టం, పరువు నష్టం కలుగుతుంది.

అది మస్తిష్కరేఖ మీద నల్లని మచ్చతో గానీ, నక్షత్ర చిహ్నంతో గానీ ఆగితే, ప్రేమ వ్యవహారంలో వైఫల్యంవల్ల మతి చెడుతుంది.

41. జీవితరేఖ మీద ఒక మచ్చ నుండి ప్రారంభమైన శుక్రరేఖ, మస్తిష్క హృదయరేఖల నడుమ మొదటి కుజ మండలం పైన గల నక్షత్ర చిహ్నంతో ఆగితే రక్తపోటు ఎక్కువవుతుంది.

42. శుక్రమండలంలోని నక్షత్ర చిహ్నం నుండి బయలుదేరిన శుక్రరేఖ, చంద్ర మండలం మీది మరొక నక్షత్ర చిహ్నంతో అంతమైతే అతడు పిచ్చివాడవుతాడు. కారణం ఒక ఆత్మీయ బంధువు మరణం లేదా విషాద ప్రేమ వ్యవహారం.

# 21. జీవితరేఖ

**గు**రు, కుజ మండలాల మధ్య, కుడి అరచేయి కుడి అంచు నుండి బయలుదేరి కుజ, శుక్ర మండలాలను అర్ధవలయంగా చుట్టి వచ్చే రేఖ జీవితరేఖ. దీనినిబట్టి మనిషి ఆయుర్దాయం, ఆరోగ్యం, శరీర సౌష్టవం, జీవన విధానం తెలుస్తుంది. మొత్తం మీద మనిషి జీవితాన్ని ఈ జీవితరేఖను బట్టి అంచనా వేయ వీలుంది.

కొందరి చేతిలో జీవితరేఖ అసలు ఉండకపోవచ్చు. వారికి కండపుష్టి, శరీరబలం ఎక్కువగా ఉంటుంది, ఉద్రేకం ఎక్కువ. వారు జీవితంలో సాధించే ఘనకార్యం ఏదీ ఉండదు. అలాంటి వారి ఆయుర్దాయం జీవితరేఖను బట్టి నిర్ణయించ వీలుండదు. మిగిలిన రేఖల్ని చూచి ఆయుర్దాయం నిర్ణయించవచ్చు. కొందరి చేతిలో జీవితరేఖ చాలా చిన్నదిగా ఉంటుంది. అలాంటప్పుడు అదృష్టరేఖను జీవితరేఖగా పరిగణించాలి. జీవితరేఖ ఉన్నంత వరకు దానిని బట్టి, ఆ తర్వాత భాగ్యరేఖను బట్టి ఆయుర్దాయ ఫలితాలు చెప్పాలి.

జీవితరేఖ గురుక్షేత్రం నుండి బయలుదేరితే, ఆ వ్యక్తికి జీవితంలో గొప్ప ఆశయాలుంటాయి. సాధించవలసిన విజయాలుంటాయి. జీవితాన్ని ఎంచుకున్న రంగంలో ప్రయోజనాత్మకంగా మలచుకోవాలన్న పట్టుదల, ఆశయం ఉంటాయి. సిరిసంపదలు, ఐశ్వర్యం, ఐహికసుఖాలు, భోగాలు అనుభవించాలన్న తపన, ప్రయత్నం ఉంటాయి. ప్రతి అవకాశాన్ని ఉపయోగించుకుంటూ, తనకన్న పైస్థాయి వారితో కలసి ఉండడం జరుగుతుంది. దానికి తోడు శనిక్షేత్రం బలంగా ఉంటే పరిశోధనా రంగంలో ఆసక్తి, ప్రతిభ ఉంటుంది. రహస్య విద్యల పట్ల ఇష్టం. జ్యోతిషం, సాముద్రికంపట్ల నమ్మకం ఉంటుంది. వైద్యం, సైన్సు, అస్ట్రానమీ – అతనికి అభిమాన విషయాలవుతాయి.

రవిక్షేత్రం ఉన్నతంగా ఉంటే అతడు మంచి కళాకారుడు, లేదా ధనార్జన ధ్యేయంగా కళలతో వ్యాపారం చేసేవాడు అవుతాడు. సినిమా ప్రొడ్యూసర్ల లాంటి వాడవుతాడు.

బుధక్షేత్రం ఉన్నతంగా ఉంటే సైంటిస్టు, పారిశ్రామికుడు, లెక్చరర్, ప్రొఫెసర్ అవుతాడు. పెద్ద వ్యాపారవేత్త అవుతాడు. లేదా సైన్సుతో, సాహిత్యంతో వ్యాపారం చేస్తాడు.

జీవితరేఖ అంగుష్టం దగ్గరగా, అంటే శుక్రక్షేత్రం అతి చిన్నదిగా ఉంటే, ఆ వ్యక్తి పరమ సాత్వికుడు, సౌమ్యుడు, ఉదారుడు అవుతాడు. అతనిలో దయ, కరుణ ఎక్కువ. అతనికి భోగప్రియత్వం చాలా తక్కువ. అతనికి పిల్లలు కలగరు. అతనికి జీవితం పట్ల ఆసక్తి, అనురక్తి లేనందువల్ల వైరాగ్యం ఎక్కువై, అల్పజీవి అవుతాడు. సుఖాలపట్ల అసలు ఆసక్తి ఉండదు.

జీవితరేఖ పొడవుగా ఉన్నంత మాత్రాన ఆయుర్దాయం ఎక్కువని, పొట్టిగా, చిన్నదిగా ఉంటే తక్కువ ఆయుర్దాయమని నిర్ణయించకూడదు. జీవితరేఖతో పాటు మస్తిష్క, హృదయరేఖల్ని, అదృష్ట, భాగ్యరేఖల్ని పరిగణించవలసి ఉంటుంది. జీవితరేఖ సన్నగా, లోతుగా, ఏ అడ్డురేఖలు, అవరోధాలు లేకుండా ఉంటే చక్కని ఆరోగ్యంతో కూడిన పూర్ణాయుర్దాయం చెప్పవచ్చు. వెడల్పుగా, గొలుసులా ఉంటే అనారోగ్యం, అల్పాయుష్షు సూచించవచ్చు. జీవితరేఖ సన్నగా ఉండి చిన్నచిన్న రేఖలతో ఏర్పడితే జీవితంలో అడుగడుగునా గండాలు, బలహీనత, జబ్బులు సూచించవచ్చు.




1. జీవితరేఖ బొటనవేలుకు దగ్గరగా ఉంటే, అనగా శుక్ర మండలం కుంచించుకుపోయినట్లు చిన్నదిగా ఉంటే, బుధ మస్తిష్క రేఖలు కలిసే చోట ఒక నక్షత్రం ఉంటే సంతానం కలగదు. స్త్రీ చేతిలో అలా వుంటే ఆమెకు ప్రసవ సమయంలో ప్రమాదం సంభవిస్తుంది.

2. జీవితరేఖ శుక్రమండలాన్ని అర్ధవలయంగా చుట్టి మొదటి కంకణ రేఖను తాకినచో ఆ వ్యక్తి శతా యుష్మంతుడవుతాడు. 95 సంవత్సరాలు పైగా జీవిస్తాడు.

3. జీవితరేఖ సగంవరకు వలయంగా ఉండి, ఆ తర్వాత తిన్నగా చంద్ర మండలానికి వెళితే అతని జీవితం రెండవ సగంలో మహోజ్వలంగా రాణిస్తుంది. అదే స్త్రీ హస్తంలో అయితే ఆమె జననాంగ సంబంధమైన రోగాలతో బాధపడి, సంసారసుఖానికి దూరమవుతుంది. ఎప్పుడూ రోగిష్టిగా బ్రతుకుతుంది.




4. జీవితరేఖ చిన్నదిగా ఉన్నా, బొటనవేలు బలంగా వుండి, మస్తిష్కరేఖ లోపరహితంగా, తిన్నగా ఉంటే ఆ వ్యక్తి స్వశక్తితో, మనోధైర్యంతో జీవిస్తాడు. అతనికి ఆత్మవిశ్వాసం, మనోనిబ్బరం అధికం. జీవితరేఖ చిన్నదిగా ఉండి, బుధరేఖ స్పష్టంగా ఉండి బుధక్షేత్రం వరకు వెళితే, అది జీవితరేఖ లోపాల్ని పూరిస్తుంది.

రెండు చేతులలో జీవితరేఖలు ఒకే నిడివిగా ఉంటే అతని ఆయుర్దాయం అంతవరకే. ఏ ఇతర రేఖలు ఆయుర్దాయాన్ని పెంచవని తెలుసుకోవాలి.

5. జీవితరేఖ ఒక క్రమం లేకుండా కొంతమేరకు సన్నగా, లోతుగా, కొంతమేర వెడల్పుగా, పల్లంగా ఉంటే అతని జీవితం ఒక క్రమంలో సాగదు. విజయాలు, అపజయాలు, సుఖాలు, బాధలు మిశ్రమంగా ఉంటాయి.

6. జీవితరేఖ ప్రారంభంలో గొలుసులా ఉంటే, అలా ఉన్నంతకాలం బాలారిష్ట దోషాలుంటాయి. లేదా కుటుంబం ఆర్థికంగా చాలా కష్టాలు పడవలసి వస్తుంది.




7. జీవితరేఖ ఆరంభంలో చీలి ఉంటే, లేదా ఒక ద్వీపచిహ్నం నుండి బయలు దేరితే, అతని జన్మ ఒక రహస్యంగా ఉండిపోతుంది. అతనికి తల్లిదండ్రులు ఎవరో, తనను కన్నవారెవరో తెలియదు.

8. జీవితరేఖ, మస్తిష్కరేఖ ఒకే బిందువు నుండికాక దూరదూరంగా ప్రారంభమైతే, అతను బాల్యంనుండి స్వతంత్రంగా ఉంటాడు.

తల్లిదండ్రులకు, కుటుంబానికి దూరంగా పెరుగుతాడు లేదా పెద్దవాడైన కొద్దీ అయినవారందరికీ దూరం అవుతాడు. ఎవరిమాట వినడు, సంప్రదాయాన్ని మన్నించడు.

9. జీవితరేఖ గురుక్షేత్రం నుండి ప్రారంభమైతే, అది మస్తిష్కరేఖను దాటి పోయేవరకు ఆ వ్యక్తి రాణించడు. అది బాల్యంలో విషయం. తర్వాత స్వయం కృషితో, స్వయంప్రతిభతో మేధావంతుడై ఉన్నత స్థితికి వస్తాడు, సంపన్నుడవుతాడు.




10. జీవితరేఖ యధాస్థానంలో ప్రారంభమై గురుక్షేత్రం నుండి వచ్చిన మరొకరేఖ జీవితరేఖతో కలిస్తే అతను గొప్పగా సంపాదిస్తాడు. సంపదలు దిన దినాభివృద్ధి చెందుతాయి. అది జీవితరేఖను తాకే వయస్సులో అతని అదృష్టం మలుపు తిరుగుతుంది.

11. జీవితరేఖ చివరవరకు పోకుండా మధ్యలో ఆగిన లేదా అక్కడ దానిని ఒకటి రెండు రేఖలు అడ్డగించిన, అతనికి అకస్మాత్తుగా మరణం సంభవిస్తుంది. అలా ఆగిపోయిన జీవితరేఖ చివరన పుట్టుమచ్చ ఉంటే, ఒక ప్రమాదంలో మరణించడం జరుగుతుంది.

12. జీవితరేఖ చివరన రెండుగా చీలితే అది అనారోగ్యాన్ని, సాధారణ బలహీనతను, తక్కువ అదృష్టాన్ని సూచిస్తుంది. ఆ వ్యక్తి విపరీతంగా కష్టపడి, శ్రమచేస్తే తప్ప పొట్ట నిండదు, ఇల్లు గడవదు. చివరి దశలో దుర్భర దరిద్రం అనుభవిస్తాడు.

అలా చీలిన జీవితరేఖ పాయలు ఎక్కువ దూరం పోతే నరాల బలహీనత, కీళ్ల నొప్పులు, నడుం, వెన్నునొప్పి ఏర్పడుతుంది. జీవితాంతం దరిద్రం, అనా రోగ్యం, బాధలు తప్పవు. ఆ చీలిన శాఖలలో ఒకటి పోయి కంకణరేఖను తాకితే, రెండవ శాఖ చంద్రమండలానికి పోతే, అతను ఉద్యోగ నిమిత్తం, లేదా వ్యాపారం కోసం దూర ప్రాంతాలలో స్థిరపడతాడు, లేదా విదేశాలలో ఉండిపోతాడు.

జీవితరేఖ చివరలు చిన్న రేఖలతో కుచ్చులా ఉంటే, వృద్ధాప్యంలో ధననష్టం వల్ల పరమ దరిద్రుడవుతాడు, ఆరోగ్యం క్షీణిస్తుంది.

ఆ కుచ్చు నుండి ఒక శాఖ చంద్రమండలానికి పోతే మతిభ్రమించి పిచ్చివాడవుతాడు. అయితే అది ప్రమాదకరమైన పిచ్చి కాదు.

13. జీవితరేఖను చివర అనేక అడ్డు రేఖలు ఖండిస్తే అతడెంత ప్రతిభావంతుడు, విద్యాసంపన్నుడు అయినా ఏ రంగంలోనూ రాణించ లేడు.

జీవితరేఖ చివరలు చిన్న రేఖలతో కుచ్చులా ఉంటే, వృద్ధాప్యంలో ధననష్టం వల్ల పరమ దరిద్రుడవుతాడు, ఆరోగ్యం క్షీణిస్తుంది.




ఆ కుచ్చు నుండి ఒక శాఖ చంద్ర మండలానికి పోతే మతిభ్రమించి పిచ్చివాడవు తాడు. అది ప్రమాదకరమైన పిచ్చి కాదు.

14. జీవితరేఖ నుండి బయలు దేరిన ఒక శాఖ గురుక్షేత్రానికి చేరితే, అతని ఆశయాలు ఫలవంతం అవు తాయి. ఉన్నతస్థితికి వస్తాడు. కానీ అతనికి అహంకారం, అతిశయం, డాబుసరి ఎక్కువ.

జీవితరేఖ నుండి బయలుదేరి పైకి పోయే రేఖలు మస్తిష్కరేఖను మధ్య భాగంలో కలిస్తే అతను విపరీతంగా సంపాదిస్తాడు. గొప్ప పదవులు పొంది సత్కారాలు, సన్మానాలు అందుకుంటాడు.

15. జీవితరేఖకు రెండు వైపులా చిన్న రేఖలు ఊర్ధ్వదిశగా వెళితే అవి జీవితంలో ఉన్నతస్థితికి సోపానాలు. ఆయా వయస్సులో పదోన్నతి పొంది, సంపద గడించడానికి సహాయ పడుతుంటాయి.




16. జీవితరేఖకు రెండు వైపులా బయలుదేరిన రేఖలు అధోముఖంగా పయనిస్తే, అవి పతనాన్ని సూచి స్తాయి. ఆరోగ్యభంగం, ధననష్టం, అవమానం కలిగిస్తాయి.

17. జీవితరేఖ ఆరంభస్థానం నుండి బయలుదేరిన మరొకరేఖ కంకణరేఖను తాకితే, అతను విప రీతంగా శిరోభారంతో

బాధపడతాడు. బ్రెయిన్ ట్యూమర్, బ్రెయిన్ హేమరేజ్ లాంటి జబ్బులు వస్తాయి. మస్తిష్క హృదయరేఖలు చక్కగా ఉంటే ఎలాంటి ప్రమాదం కలగదు. వ్యాధి నివారణ అవుతుంది. ఆపరేషన్ జరిగినా, ప్రమాదం ఉండదు.

18. జీవితరేఖ మధ్య నుండి ఒక రేఖ బయలుదేరి చంద్రక్షేత్రానికి వెళితే అతను నిరంతర పరిశ్రమ చేసి, శ్రమజీవి అవుతాడు. విశ్రాంతి లేకుండా ప్రయాణాలు చేయవలసి ఉంటుంది. అలాంటి ఉద్యోగం చేస్తాడు. నిత్య శ్రామికుడుగా జీవిస్తాడు. ఇంజనీరు, సూపర్ వైజర్, రైల్వే ఉద్యోగాల్లాంటివి. లేదా విమానాలు, నౌకలు, టూరిస్టు ఉద్యోగాలు కావచ్చు.




19. జీవితరేఖపైన ఒక నల్లని మచ్చ నుండి బయలుదేరిన రేఖ క్రింది వైపుగా వెళితే అతడు సదా రోగపీడితుడుగా ఉంటాడు.

20. జీవితరేఖ ఒకచేతిలో మాత్రమే తెగి ఉంటే, ఆ వయసులో భయంకర వ్యాధిగ్రస్తుడయి, బయటపడతాడు. అలా జీవితరేఖ రెండు ముక్కలుగా తెగినా మరొక శాఖ ఆ రెంటిని కలిపినా లేక అక్కడ ఒక చతుష్కోణం ఉన్నా రక్షణ కలుగుతుంది.




21. అలా చీలిన రేఖ రెండవ కొన భాగ్యరేఖతో కలిస్తే గొప్ప అదృష్టం వరిస్తుంది. వానిని అకస్మాత్తుగా సిరిసంపదలు వస్తాయి. కానీ వెంటనే మృత్యువు పొంచి ఉంటుంది.

22. జీవిత, మస్తిష్క రేఖలు ఆరంభంలో చక్కని కోణంగా ఏర్పడితే అతనికి లోకజ్ఞానం బహు స్వల్పం.

23. జీవిత, మస్తిష్క రేఖలు కొంత దూరం కలిసి ఉండి, ఆ తర్వాత విడిపోతే

అతను మహాభయస్తుడు, పిరికివాడు అవుతాడు. అతి జాగ్రత్తగా మసలు కుంటాడు. మహామూఢంగా, మూర్ఖంగా, చాదస్తంగా ప్రవర్తిస్తాడు.

24. జీవిత, మస్తిష్క, హృదయ రేఖలు ఒకే బిందువు నుండి ప్రారంభమైతే ఆ వ్యక్తి అకస్మాత్తుగా మరణిస్తాడు.




25. జీవిత, మస్తిష్క రేఖలు ఆరంభంలో కలిసి ఉండి, మస్తిష్కరేఖ అతి చిన్నదిగా ఉంటే, అతను దూరదేశంలో ప్రమాదంలో మరణిస్తాడు. దానికి తోడు గురు మండలం ఉన్నతమైతే హైబిపి, శని మండలం ఉన్నతమైతే కంటి జబ్బులు, బుధుడు బలంగా ఉంటే లివర్, కిడ్నీలు, కుజుడు బలంగా ఉంటే శ్వాసకోశ వ్యాధులు వస్తాయి. చంద్రమండలం ఉచ్ఛంగా ఉంటే పక్షవాతం, శుక్ర మండలం ఉన్నతంగా ఉంటే లైంగిక వ్యాధులు, బాధలు ఏర్పడతాయి.

26. భాగ్యరేఖ ఆరంభంలో కొంతదూరం జీవితరేఖతో కలిసివచ్చి, మధ్యలో విడిపోతే, అతని జీవితంలో వైవిధ్యం ఉండదు. పెద్దల జీవితాల వలె అతని జీవితం సాగుతుంది. చెప్పుకోదగిన విశేషం ఏమీ ఉండదు.




27. జీవితరేఖ చివరి భాగం ఛిద్రంగా ఉండి భాగ్యరేఖతో కలిస్తే అతనికి ధనం కారణంగా ప్రమాదం కలుగుతుంది.

28. రవిరేఖ జీవితరేఖ నుండి బయలుదేరితే ఆ వ్యక్తి కళలలో, సాహిత్యంలో ప్రతిభావంతుడై సకల సంపదలు, సౌఖ్యాలు అనుభవిస్తాడు. కళలపైన జీవిస్తాడు.

29. జీవితరేఖను ఎన్ని అడ్డరేఖలు ఖండిస్తే అన్నిసార్లు ఆరోగ్యభంగం కలుగుతుంది.

30. జీవితరేఖపైన మచ్చలు ఆరోగ్య భంగాన్ని సూచిస్తాయి. మచ్చ నీలంగా ఉంటే విషజ్వరం, ఎర్రగా ఉంటే ఉష్ణ జ్వరం, నల్లగా ఉంటే సుఖరోగాలు. నల్ల మచ్చ జీవితరేఖ చివరన ఉంటే వ్యాధి మూలంగా మరణం అనివార్యం. తెల్లని మచ్చ కంటికి, తలకు గాయాలను సూచిస్తుంది.




31. జీవితరేఖ ఆరంభంలోని త్రిభుజ చిహ్నం మనిషి దుష్ప్రవర్తన సూచిస్తుంది. హృదయ మస్తిష్క రేఖలు చక్కగా ఉంటే కార్యకుశలత, విజయం సూచితాలు.

32. జీవితరేఖ ఆరంభంలో ఒక గుణకచిహ్నం ఉంటే, అతను బాల్యంలో ఒక పెద్ద ప్రమాదం నుండి బయటపడి ఉంటాడు.

ఆరంభంలో రెండు గుణక చిహ్నాలు గల వ్యక్తి వ్యసనపరుడై వ్యభిచారిగా జీవిస్తాడు.

33. జీవితరేఖ చివరన గుణకచిహ్నాలు ఎన్ని ఉన్నా, అవి అతని ప్రజ్ఞకు, ప్రతిభకు పదును పెడతాయి.

34. జీవితరేఖ చివరన ఒక గుణకచిహ్నంతో ఆగితే అతనెంతటి ప్రతిభా పాటవాలు కలవాడైనా, ఎంత కీర్తి ప్రతిష్టలు సంపాదించినా చివరకు అనారోగ్యం, దరిద్రం, మతిలేమితో అనామకుడవుతాడు. అజ్ఞాతంగా జీవించవలసి వస్తుంది.

35. జీవితరేఖపై మధ్యభాగంలో ఎక్కడైనా ఒక గుణకచిహ్నం ఉండి, అక్కడి నుండి ఒక రేఖ క్రిందికి పోతే, ఆ వయస్సులో జబ్బు చేస్తుంది. తిరిగి పూర్వపు ఆరోగ్యం పొందలేడు.

36. జీవితరేఖపైన నక్షత్రం ఉన్న వయస్సులో ప్రమాదం, ఉద్యోగభంగం, ఆర్థిక, కుటుంబ సమస్యలు తప్పవు.




37. జీవితరేఖపైన చతుష్కోణం – ఆ వయస్సులో వచ్చే కష్టాల నుండి గట్టెక్కిస్తుంది.

38. జీవితరేఖ లోపలిభాగంలో శుక్రమండలంపైన చతుష్కోణం కారా గారాన్ని లేదా అజ్ఞాత జీవితాన్ని సూచిస్తుంది.

39. జీవితరేఖ మీద రెండు వృత్తా లుంటే ఆ వయస్సులో చూపు పోయి అంధత్వం వస్తుంది. ఒక వృత్తం ఒక కంటికి ప్రమాదం సూచిస్తుంది.

40. జీవితరేఖపై ద్వీపచిహ్నం గర్భా శయ రోగాలను సూచిస్తుంది. బుధరేఖ అస్తవ్యస్తంగా ఉంటే అది దీర్ఘకాలికం అవుతుంది. మస్తిష్కరేఖపైన నక్షత్రం అనారోగ్య సూచకం. అది శనిక్షేత్రం క్రింద ఉంటే కాళ్లు చేతులకు సంబంధించిన రోగాలు వస్తాయి.

# 22. మస్తిష్కరేఖ

**మ**స్తిష్కరేఖ మనిషి బుద్ధి బలాన్ని, మేధా సంపదను తెలియచేస్తుంది. దీనినిబట్టి ధైర్య సాహసాలు, విద్య, వివేకం, సిరిసంపదలు అంచనా వేయవచ్చు. మనోబలాన్ని బట్టి మనిషి ఆలోచనలు, ఆలోచనలను బట్టి అదృష్టం మారుతుంది. మనస్సు నిర్మలంగా ఉంటే ఆలోచనలు ఆరోగ్యకరంగా ఉంటాయి. మనిషి శీల స్వభావాలను నిర్దేశించేది మస్తిష్కరేఖ.

కొందరి చేతులలో ఒకే రేఖ అరచేయి ఈ చివర నుండి ఆ చివర వరకు అడ్డగీతలా ఉంటుంది. అది మస్తిష్కరేఖో, హృదయరేఖో చెప్పడం కుదరదు. దానిని మస్తిష్కరేఖగా తీసుకుంటేనే మంచిది. మనిషికి హృదయం లేకపోయినా, ఫరవాలేదు, బుర్రలేకపోతే బ్రతకడం కష్టం. హృదయ, మస్తిష్కరేఖలు రెంటి ఫలితాలు దానిని బట్టి చెప్పవచ్చు.




1. సాధారణంగా మస్తిష్కరేఖ జీవిత రేఖ ఆరంభస్థానం నుండి బయలుదేరి అరచేతి మధ్యగా పోయి కుజ, చంద్ర స్థానాల మధ్య ఆగి పోతుంది. అలా వున్న వ్యక్తికి మేధాశక్తి, తెలివితేటలు, ప్రతిభ గణనీయంగా ఉంటాయి. మస్తిష్కరేఖ ఉండవలసిన తీరు అది.

2. జీవితరేఖ ఆరంభస్థానం నుండి బయలుదేరిన మస్తిష్కరేఖ

తిన్నగా, స్కేలుతో గీత గీసినట్లు, అరచేయి ఆ చివరివరకు పోతే అతను పచ్చి స్వార్థ పరుడవుతాడు.

3. మస్తిష్కరేఖ కొంత దూరం జీవితరేఖకు అతిదగ్గరగా పోతే, అతనికి అత్యుష్ణం వల్ల శిరోవేదన ఏర్పడుతుంది. బాల్యంలో అతనిలో ప్రతిభ కనిపించదు.




4. మస్తిష్కరేఖ హృదయరేఖకు దగ్గరగా ఉంటే అతనికి 'అస్మా' లక్షణా లుంటాయి లేదా హైఫీవర్ వస్తుంటుంది.

5. మస్తిష్కరేఖ కొంచెంగా చంద్ర మండలంలోకి వాలితే, అతడు గొప్ప విద్యావంతుడవుతాడు. మహామేధావి, విద్యావేత్త అవుతాడు. అతని ఆలోచనలు ఉన్నతంగా ఉంటాయి.

6. మస్తిష్కరేఖ చంద్రమండలం మధ్య వరకు పోతే, అతడు ఉన్నత శ్రేణికి చెందిన ఆధ్యాత్మికవేత్త అవుతాడు. కాని అతనికి నరాల బలహీనత ఉంటుంది. అసహనం, ఓర్వలేనితనం, కోపం ఎక్కువ.

7. మస్తిష్కరేఖ వంకరటింకరగా పోయి బుధరేఖను ఖండిస్తే అతనికి మెదడుకు సంబంధించిన జబ్బు చేస్తుంది. ఎప్పుడూ దిగులుగా, విచారంగా ఉంటాడు. మనస్సుతో పాటు శరీరం క్రమంగా బలహీన పడుతుంది.




8. మస్తిష్కరేఖ జీవితరేఖ నుండి బయలుదేరి హృదయరేఖకు దగ్గరగా వెళితే, ఆరోగ్యరేఖ జీవితరేఖ నుండి బయలుదేరి మస్తిష్క, హృదయ రేఖల్ని ఖండిస్తే, అతను మూర్ఛ రోగంతో బాధపడతాడు. మనస్సు సరిగా పని చేయదు. అజీర్తి కారణంగా 'అపోప్లెక్స్' వ్యాధికి గురవుతాడు.

9. మస్తిష్కరేఖ శనిక్షేత్రం దిగువన హృదయరేఖ వైపు వంగి, తర్వాత తిన్నగా పోతే ఆ వ్యక్తి అతిగా విచారాలకు లోనవుతుంటాడు. ప్రతి చిన్న పనికి పెద్దగా బాధపడతాడు. అతడు ప్రేమించిన స్త్రీని పొందలేక పిచ్చివాడవుతాడు.

10. జీవితరేఖ ఆరంభస్థానం నుండి మస్తిష్కరేఖ బయలుదేరి తిన్నగా చంద్ర మండలంలోకి పోతే, తర్జని ద్వితీయ పర్వంలో ఒక నక్షత్రం ఉంటే అతను మతిలేనివాడవుతాడు.

11. మస్తిష్కరేఖ వంపు తిరిగి వాలుగా చంద్రక్షేత్రం మధ్య వరకు వెళితే, ద్వితీయ పర్వం పైన చిన్నచిన్న నిలువు రేఖలుంటే, ఆ వ్యక్తి తంత్ర, మంత్ర, రస, రహస్య విద్యలలో ఆసక్తి పెంచు కుంటాడు.




12. ఎ) మస్తిష్కరేఖ అసలు లేక పోతే ఆ వ్యక్తి మందబుద్ధి కలవాడు, వివేకశూన్యుడు అవుతాడు. అతనికి ఆలోచనలు, తెలివితేటలు ఉండవు. బండగా పని చేయడం తప్ప బుర్రకు పనిచెప్పడు.

బి) మస్తిష్కరేఖ పొడవుగా, తిన్నగా, ఎగుడు దిగుళ్లు లేకుండా ఉంటే అతను బుద్ధిమంతుడు, జ్ఞాని అవుతాడు.

సి) మస్తిష్కరేఖ మరీ కురచగా వున్నా, పొడవుగా ఉండి అస్పష్టంగా వున్నా, అతను చంచలుడు, స్థిరత్వం లేనివాడు అవుతాడు.

డి) మస్తిష్కరేఖ వంకర టింకరగా, ఎత్తు పల్లాలతో ఉంటే నరాల బలహీనత ఏర్పడి, ఉద్రేకం లేని కారణంగా ఎప్పుడూ నిరుత్సాహంగా, దిగులుగా ఉంటాడు. పైగా మనిషిలో పిసినారితనం, లోభత్వం ఎక్కువవుతుంది.

ఎఫ్) మస్తిష్కరేఖ గొలుసువలె ఏర్పడితే అతని ఆలోచనలు స్థిరంగా ఉండవు. ఎప్పుడూ తలనొప్పి, శిరోభారం, శిరోవేదన కలుగుతుంటాయి.

13. ఎ) చేతి వేళ్లు పొడవుగా ఉండి, మస్తిష్కరేఖ పొడవుగా ఉంటే అతను సూక్ష్మ గ్రాహి, చురుకైన బుద్ధి కలవాడు అవుతాడు. ఎంతటి విషయాన్నయినా క్షణంలో గ్రహించ గలుగుతాడు.

బి) మస్తిష్కరేఖ పొడవుగా ఉండి, కనిష్టకాంగుళి చిన్నదిగా వుంటే అతనికి ప్రపంచజ్ఞానం, లౌకికం ఉండవు. కనిష్టకాంగుళి పొడవుగా ఉన్న వ్యక్తి వ్యాపార విషయాలలో చురుకుగా ఉంటాడు. అతనికి సూక్ష్మజ్ఞానం ఉంటుంది.

సి) మస్తిష్కరేఖ స్వచ్ఛంగా, సరళంగా, చేయి చివరి వరకు ఉంటే, బుధరేఖ సన్నగా ఉన్న వ్యక్తికి జ్ఞాపకశక్తి ఎక్కువగా ఉంటుంది.

డి) మస్తిష్కరేఖ తిన్నగా, అడ్డంగా ఉండి, బుధరేఖ సరిగా లేకపోతే అతడు స్వార్థపరుడు, కుచ్చిత బుద్ధి కలవాడు అవుతాడు.

ఇ) మస్తిష్కరేఖ స్వచ్ఛంగా ఉండి, తర్జని నిటారుగా ఉంటే గురు, రవి క్షేత్రాలు సమోన్నతంగా, బలంగా ఉంటే అతను గొప్ప విద్యావంతుడవుతాడు అతనికి విజ్ఞానాభిలాష ఎక్కువ.

ఎఫ్) మస్తిష్క, హృదయ రేఖల మధ్యప్రదేశం చక్కని దీర్ఘచతురస్రంగా వుంటే తర్జనిపై శంఖువున్న అతని మేధాశక్తి అపూర్వం, ప్రతిభా విశేషాలు అమోఘం, గొప్ప అదృష్టం అని చెప్పవచ్చు.

జి) హృదయ, మస్తిష్క రేఖలు చక్కగా ఉండి, జీవితరేఖ ఆరంభంలో అనగా గురుమండలం క్రిందిభాగంలో ఒక త్రిభుజ చిహ్నం ఉంటే – అతని ప్రతిభ, లౌకిక జ్ఞానం, వివేకం అద్భుతం, అపారం.

హెచ్) మస్తిష్కరేఖ పొడవుగా ఉండి, హృదయరేఖ చక్కగా, లోపరహితంగా ఉంటే, తర్జని పొడవుగా ఉంటే – అతనికి బంధుమిత్రులంటే ప్రేమాదరాలు ఎక్కువగా ఉంటాయి.

ఐ) మస్తిష్కరేఖ తిన్నగా ఉండి, హృదయరేఖ సరిగా లేకపోతే అతని ప్రేమాభిమానాలు ఒకే వ్యక్తిపై కేంద్రీకృత మవుతాయి. ఆ వ్యక్తి ఉన్నతికి ఎంతయినా సహాయపడడం జరుగుతుంది.

జె) మస్తిష్కరేఖ చంద్రమండలంలోకి వాలి, గురుక్షేత్రం ఉన్నతంగా ఉండి, దానిపైన ఒక వల చిహ్నం ఉంటే, అతడు రాజకీయాలలో రాణిస్తాడు. అతనికి తిమ్మిని బమ్మిని చేయగల ప్రావీణ్యం ఉంటుంది. ప్రజాసేవలో, రాజకీయాలలో ప్రసిద్ధుడవుతాడు.

కె) మస్తిష్కరేఖ పొడవుగా ఉండి, శుక్రమండలం సామాన్య బలంగా ఉంటే, అతనికి మతిస్థిమితం తక్కువ. ఆలోచనలు నిరుపయోగంగా ఉంటాయి. ఆచరణకు పనికి రాని ఆలోచన చేస్తుంటాడు.

ఎల్) మస్తిష్కరేఖ పొడవుగా ఉండి కుజ, గురు, బుధ మండలాలు ఉన్నతంగా ఉంటే అతని శక్తి సామర్థ్యాలు, తెలివితేటలు అమోఘంగా ఉంటాయి.

ఎం) రెండు చేతులలో మస్తిష్కరేఖ పొడవుగా ఉండి చంద్రమండలంలోకి వాలితే, మధ్యవేలు, అనామిక ఒకే పొడవున్న అతను జూదప్రియుడవుతాడు. స్పెక్యులేషన్, స్టాక్‌మార్కెట్, షేర్ల వ్యాపారాలు చేస్తాడు. ఎలాంటి క్లిష్టసమస్యలనైనా సునాయాసంగా పరిష్కరించుకోగలడు.

ఎన్) దానికి తోడు రవిరేఖ పొడవుగా, స్పష్టంగా వుంటే పరిశోధనలు, ప్రయోగాలు చేస్తాడు. అందుకై ప్రాణాలను సైతం తెగిస్తాడు. అడ్వెంచర్స్ అంటే ఇష్టం. సాహసకార్యాలు చేయడానికి వెనుదీయడు.

ఒ) మస్తిష్కరేఖ చిన్నదిగా ఉండి, హృదయరేఖ లోప భూయిష్టంగా ఉండి జీవితరేఖ చివరన ఒక త్రిభుజచిహ్నం ఉంటే, ఆ వ్యక్తి భయంకరమైన అపవాదు భరించవలసి వస్తుంది. అది ప్రేమ విషయం లేదా కుంభకోణాల విషయం కావచ్చు.

పి) మస్తిష్కరేఖ చిన్నదై, గురుక్షేత్రం నిమ్నమై, చంద్ర, శుక్ర మండలాలు అత్యున్నతమైన వ్యక్తి సోమరిగా జీవిస్తాడు. జీవితంలో ఏ ఆశయం ఉండదు.

క్యూ) మస్తిష్కరేఖ చిన్నదిగా ఉండి, మస్తిష్క హృదయరేఖల మధ్య దూరం తక్కువగా ఉంటే, శుక్రమండలం బలహీనంగా ఉంటే, ఆ వ్యక్తి సంకుచిత స్వభావం కలవాడై ఉంటాడు. అతనిలో దయాదాక్షిణ్యాలుండవు. చంద్రమండలం చిన్నదిగా ఉంటే ఇతరుల కష్టసుఖాల గురించి ఆలోచిస్తుంటాడు.




14. మస్తిష్కరేఖ వక్రంగా, పామువలె ఉండి, రవి, బుధక్షేత్రాల క్రింద హృదయరేఖకు దగ్గరగా పోతే అతను మతిభ్రమించి పిచ్చివాడవుతాడు. బుధమండలం అత్యున్నతంగా ఉంటే అవినీతి పరుడవుతాడు. కుతంత్రం, వ్యభిచారం, దొంగతనం అతనికి యిష్టం.

15. మస్తిష్కరేఖ చిన్న చిన్న ద్వీపాలతో గొలుసువలె ఏర్పడి, గోళ్లు వెనక్కి వంకర తిరిగితే అతనికి క్షయ వస్తుంది.

16. మస్తిష్కరేఖ బాగా లేక, హృదయరేఖ అసలు కనిపించకపోతే, బుధరేఖ పాములా ఉంటే, హృదయ బలహీనత సూచిస్తుంది. అతనికి దయాదాక్షిణ్యాలుండవు. ఏ పనీ సమర్థవంతంగా చేయలేడు.

17. మస్తిష్కరేఖ చిన్నదిగా వుండి, అంగుష్టం మరీ చిన్నదిగా ఉంటే అతడు పరమమూర్ఖుడు, కిరాతకుడు, హంతకుడు అవుతాడు.

18. చేతిలో గ్రహక్షేత్రాలు, రేఖలు చక్కగా ఉండి, మంచి చేయి అనిపించినపుడు ....

మస్తిష్కరేఖ జీవితరేఖకు దూరంగా ప్రారంభమైతే అతనికి స్వశక్తిపై విశ్వాసం ఎక్కువ. స్వతంత్రంగా జీవించాలనుకుంటాడు. ఒకరిపై ఆధారపడడం జరగదు. ఒకరి పెత్తనాన్ని అంగీకరించడు. అయినా అతనికి అన్ని విధాలా ప్రోత్సాహం లభిస్తుంది.

గురు, కుజ మండలాలు అత్యున్నతమైతే అది స్వార్థంగా, స్వాభిమానంగా, దురభిమానంగా మారుతుంది.

హృదయ, మస్తిష్క రేఖల మధ్య ఒక గుణకచిహ్నం ఉంటే ఆధ్యాత్మిక విషయాలపై ఆసక్తి కలిగి అతడు యోగి అవుతాడు, జ్ఞాని అవుతాడు.

బుధమండలం పల్లంగా ఉండి, కుజ, గురు మండలాలు అత్యున్నతంగా ఉంటే అతడు మోసగాడవుతాడు. వ్యాపారాలు మోసంతో చేస్తాడు.

మస్తిష్కరేఖ చిన్నదిగా ఉంటే వివేకం, విచక్షణా జ్ఞానం ఉండవు. లౌక్యం అసలు ఉండదు.

మస్తిష్కరేఖ గురుమండలాన్ని వలయంగా చుట్టి అరచేయి మధ్యకు పోయిన, అతడు పరమ కిరాతకుడు, మోసగాడు అవుతాడు.

19. మస్తిష్కరేఖ జీవితరేఖ లోపలనుండి, అనగా శుక్రక్షేత్రం నుండి గాని, రెండవ కుజక్షేత్రం నుండి గాని బయలుదేరితే, ఆ వ్యక్తికి స్థిరత్వం ఉండదు. అనవసరంగా ఉద్రేకాలకు లోనై దెబ్బలాడుతుంటాడు.

20. మస్తిష్కరేఖ గురుక్షేత్రం నుండి ప్రారంభమైతే హృదయరేఖ చిన్నదిగా ఉండి, అంగుష్ట ప్రథమ పర్వం వెడల్పుగా ఉన్న వ్యక్తి సదా కయ్యానికి కాలు దువ్వుతుంటాడు.

మస్తిష్కరేఖ జీవితరేఖకు దూరంగా ఉన్న వ్యక్తికి చిన్నతనంలోనే దృష్టిదోషం ఏర్పడుతుంది.

21. మస్తిష్కరేఖ ఆరంభంలో రెండు పాయలుగా చీలి అందులో ఒక శాఖ జీవితరేఖతో కలిస్తే, రెండవశాఖ గురుక్షేత్రానికి వెళితే హృదయరేఖ ఆరంభంలో రెండు పాయలుగా చీలి జీవిత మస్తిష్కరేఖలకు దూరంగా ఉంటే ఆ వ్యక్తి మహా అదృష్టవంతుడవుతాడు. అపరిమితంగా భోగభాగ్యాలు అనుభవిస్తాడు. కార్లు, మేడలు సంపాదిస్తాడు.




మస్తిష్కరేఖ గురుమండలం నుండి బయలుదేరినా, లేక జీవితరేఖను తాకుతూ పోయినా, అతను గొప్ప కార్యశీలి అవుతాడు. తన ఆశయాలను నెరవేర్చుకొని ఉన్నతస్థితికి వస్తాడు. గొప్ప సంపన్నుడవుతాడు. గొప్ప అడ్మినిస్ట్రేటర్ కావచ్చు, జడ్జి కావచ్చు.

22. మస్తిష్కరేఖ తిన్నగా ఉండి, కొన కుజక్షేత్రం వైపుకు తిరిగితే అతను వ్యాపారంలో, వ్యవహారాల్లో సమర్థుడవుతాడు. కోట్ల విలువ చేసే ఆస్తులు సంపాదిస్తాడు. అతనికి మట్టిని బంగారంగా మార్చగల ప్రతిభ ఉంటుంది.




23. మస్తిష్కరేఖ చిన్నదిగా, అరచేయి మధ్యవరకు మాత్రమే ఉంటే – అతనికి భౌతిక వాంఛలు, భోగ లాలస ఎక్కువ. పెద్దగా ఆలోచించి, జీనియస్ అనిపించు కోలేడు. కానీ, అనుభవంతో ఏ పనిపైనా చక్కగా నిర్వహిస్తాడు.

24. మస్తిష్కరేఖ మరీ చిన్నదిగా వున్న వ్యక్తి మానసికంగా క్రుంగిపోయి మరణిస్తాడు.

25. శని మండలం దిగువన మస్తిష్క రేఖ చీలితే, చిన్న వయస్సులోనే ఒక ప్రమాదంలో మరణిస్తాడు.

26. మస్తిష్కరేఖ చివరి భాగం, లేదా దాని శాఖ చంద్రమండలంలోకి చొచ్చుకుపోతే, ఆ వ్యక్తికి భావనాబలం ఎక్కువ. చదువుపట్ల ఆసక్తి హెచ్చు. రహస్య తాంత్రిక విద్యల పట్ల మక్కువ. యోగసాధన చేసి సత్య శోధన చేస్తాడు. ఒక శాఖ బుధమండలం వైపు వెళ్లిన, వాణిజ్యం, సైన్సు, మెడిసిన్ లేదా పరిశ్రమల వైపు ఆకర్షింపబడతాడు.

ఆ శాఖ రవిక్షేత్రం వైపు తిరిగితే, కీర్తి ప్రతిష్టలకై ఆరాటపడతాడు. తన ప్రతిభకు గుర్తింపు ఆశిస్తాడు.

శని మండలం వైపు తిరిగితే సంగీతంలో ప్రావీణ్యం, తత్త్వశాస్త్రంలో ఆసక్తి ఉంటుంది. గురు మండలం వైపు చూస్తే పదవీకాంక్ష, ప్రజా నాయకత్వం పై మక్కువ ఉంటుంది.

27. మస్తిష్కరేఖ నుండి ఒక శాఖ హృదయరేఖ వైపు వెళ్లినా, లేక హృదయరేఖను తాకినా, అతనికి న్యాయాన్యాయ విచక్షణ ఉండదు. మూర్ఖంగా రంగంలోకి దిగుతాడు. ప్రమాదాలను లెక్కించడు.

రెండు మస్తిష్కరేఖలు గల వ్యక్తి ద్వంద్వ ప్రవృత్తి కలిగి ఉంటాడు. అతనికి నీతి, శీలం, ధర్మం అన్నీ ద్వంద్వ విలువలతోనే ఉంటాయి. తన అవినీతిని, అధర్మాన్ని సమర్థించుకోగలడు.

28. మస్తిష్కరేఖ నుండి బయలుదేరిన ఒక శాఖ గురు మండలం చేరితే, అక్కడ ఒక నక్షత్రం ఉంటే, అతను ఏ రంగంలోనైనా ప్రథముడుగా నిలిచి విజయాలు సాధిస్తాడు.

29. మస్తిష్కరేఖ నుండి బయలుదేరిన చిన్నచిన్న రేఖలు హృదయరేఖ వైపు వెళితే అతను విలాస జీవితం గడుపుతాడు. అనేక మంది స్త్రీలతో శారీరక సంబంధం ఏర్పరచుకుంటాడు.




30. జీవిత, మస్తిష్క రేఖల నడుమ జాగా సామాన్యంగా ఉంటే ఆ వ్యక్తికి ఆత్మ విశ్వాసం, సామర్థ్యం ఎక్కువ. న్యాయదృష్టి, విచక్షణ చక్కగా ఉంటాయి.

31. జీవితరేఖ మూలస్థానం నుండి

ఆరంభమైన మస్తిష్కరేఖ, శనిక్షేత్రం దిగువగా ఆగిపోతే ఆ వ్యక్తి అల్పాయుష్కుడవుతాడు లేదా మతిచెడి పిచ్చివాడవుతాడు.

32. మస్తిష్కరేఖ మధ్యంతరంగా ఆగిపోయి గురు శని క్షేత్రాలు బలహీనంగా ఉంటే అతను వివేకభ్రష్టు డవుతాడు. బొత్తిగా బుద్ధిలేని వాడుగా ప్రవర్తిస్తాడు. కుజక్షేత్రం బలహీనమైతే ఉద్రేకం, ఉత్సాహం లేని కారణంగా నిరుత్సాహంగా, నీరసంగా బ్రతుకుతాడు.

33. మస్తిష్కరేఖ భాగ్యరేఖను ఖండించక మునుపే ఆగిపోతే అతడు అల్పజీవి అవుతాడు. బ్రతికి ఉన్నంత కాలం సుఖపడడు.

34. మస్తిష్కరేఖ కుజమండలానికి పోయి అక్కడ వెనుతిరిగి జీవితరేఖను చూస్తే ఆ వ్యక్తి అభిమానం దురభిమానంగా మారి, అనేక కష్టాలకు గురిచేస్తుంది.

35. మస్తిష్కరేఖ మధ్యన వంపు తిరిగి శనిక్షేత్రానికి వెళితే అతను ప్రమాదంలో తల పగిలి చనిపోతాడు. మూర్ఖత్వం, మొండితనం ప్రమాదానికి కారణం.

36. అలా శనిక్షేత్రం వైపు తిరిగిన మస్తిష్కరేఖ హృదయరేఖతో ఆగిపోతే ఆ ప్రమాదం ప్రాణాపాయం కాదు. చిన్న గాయాలతో సరిపోతుంది.

37. మస్తిష్కరేఖ రవిక్షేత్రం దిగువన పైకి వంగి, హృదయరేఖను ఖండిస్తూ రవిక్షేత్రానికి వెళితే అతను కళాకారుడవుతాడు. తాను అభిమానించే కళలో, సాహిత్యంలో ప్రజ్ఞావంతుడవుతాడు.

38. అలా రవిక్షేత్రానికి పోవలసిన మస్తిష్కరేఖ హృదయరేఖను చేరేలోగా ఆగిపోతే, ఆ వ్యక్తి కళాసాహిత్య రంగాలలో గొప్ప పేరు ప్రతిష్టలు సంపాదిస్తాడు. ఇతర శుభ చిహ్నాలుంటే ధనవంతుడు కాగలడు. ఐశ్వర్య భోగాలు అనుభవిస్తాడు.




39. మస్తిష్కరేఖ చివరి కొన పైకి తిరిగి, అనామిక, కనిష్టకాంగుళుల మధ్యన క్రిందగా, హృదయరేఖవరకు పోతే (దానిని ఖండించరాదు) ఆ వ్యక్తి శాస్త్రీయ సంగీత, నృత్యాలలో ఏదో ఒకటి నేర్చి కీర్తి గడిస్తాడు. అతని ప్రతిభ వాణిజ్య, పరిశోధనా రంగాలలో రాణింపుకు వస్తుంది.

40. మస్తిష్కరేఖ చివరన పైకి వంగి హృదయరేఖను తాకితే అతని మనస్సు వికలమవుతుంది. ఆలోచనలు హిస్టీరికల్‌గా ఉంటాయి.

41. బుధమండలం దిగువన మస్తిష్కరేఖ పైకి వంగి హృదయరేఖ వరకు పోయి, దానిని ఖండించకున్న అతడు హాస్యనటుడవుతాడు.

42. అది హృదయరేఖను ఖండిస్తూ బుధక్షేత్రంలోకి వెళితే, అతను స్వార్థ ప్రయోజనాలకు ఎందరినైనా మోసం చేస్తాడు. అయితే గొప్ప వ్యాపారి, పారిశ్రామిక వేత్త, సినిమా ప్రొడ్యూసర్ అవుతాడు.

43. మస్తిష్కరేఖ అరచేయి చివరి అంచువరకు తిన్నగా పోయి, బుధరేఖ చక్కగా ఉంటే, అతడు మహామేధావి అవుతాడు. అతనికి జ్ఞాపకశక్తి, ఆలోచన అద్భుతంగా ఉంటాయి.

44. మస్తిష్కరేఖ అరచేయి రెండవ అంచు వరకు పోయి, గురు శుక్ర మండలాలు నీచమై బలహీనంగా ఉంటే, బొటనవేలు లోపలివైపుకు వంగి ఉంటే, మిగిలిన వేళ్లు ఒకదాని కొకటి అంటుకుని, ముడుచుకుని ఉంటే అతగాడు పరమ లోభి, పచ్చి స్వార్థపరుడు అవుతాడు. ఎన్ని చెత్తపనులైనా అవలీలగా చేయగలుగుతాడు.

45. మస్తిష్కరేఖ చివరన రెండుగా చీలితే అతనికి భావనాబలం చాలా ఎక్కువ. తెలివితేటలు అమోఘం. విద్య, వినయం, లౌకికజ్ఞానం హెచ్చుగా ఉంటాయి.

46. మస్తిష్కరేఖ చివరన రెండుగా చీలి, అందొక శాఖ చంద్రమండలానికి వెళితే, అరచేయి మెత్తగా ఉండి వేళ్ల మొదటి పర్వాలు లావుగా ఉంటే అతను విశ్వాస ఘాతకుడవుతాడు. అలాంటి వారిని నమ్మి దగ్గరకు చేరనివ్వకూడదు. దయాదాక్షిణ్య రహితంగా ప్రవర్తించి, ఎంతటి నష్టం కలిగినా పశ్చాత్తాపపడడు. ఆవుతోలు కప్పుకున్న పులివంటి మనస్తత్వం వీరిది.




47. అరచేయి మధ్యలో మస్తిష్కరేఖ రెండుగా చీలి, అందులో ఒక శాఖ చంద్రమండలం చివర వరకు పోతే ఆ వ్యక్తి ఇతరుల్ని మోసగిస్తాడు. తనను తాను మోసగించుకుంటాడు. ఈ లక్షణం

చదువుకున్న వారి చేతిలో, ఉద్యోగుల చేతిలో ఉంటే వారు తెలివిగా అవినీతి పనులు చేసి డబ్బు గడిస్తారు.

48. మస్తిష్కరేఖ వాలుగాపోయి రెండు శాఖలుగా చీలి, ఒక శాఖ చంద్ర మండలానికి, రెండవ శాఖ కుజ మండలానికి పోతే అతడు మహా మాయగాడవు తాడు. ఉద్యోగంలో, వ్యాపారంలో మాయచేసి బ్రతుకుతాడు. విపరీతంగా ధనం కూడబెడతాడు.

49. మస్తిష్కరేఖ చివరన రెండుగా చీలి, ఒక శాఖ చంద్రమండలానికి పోతూ, రెండవది పైకి పోయి హృదయరేఖను ఖండిస్తే ఆ వ్యక్తి తాను ప్రేమించిన స్త్రీ కోసం కన్నవారిని, సంపదలను వదులుకుంటాడు. తన సర్వస్వం ఆమెకు అంకితం చేసి ఆదర్శప్రియుడవుతాడు.

50. దానికి తోడు భాగ్యరేఖ హృదయరేఖతో ఆగిపోతే తాను ప్రేమించిన స్త్రీ కారణంగా సర్వనాశనం అవుతాడు. చివరకు ఆ ప్రేయసి సైతం అతనిని మోసగిస్తుంది.

51. మస్తిష్కరేఖ పూర్తిగా చంద్రమండలం చివరకు వెళ్లిన అతని వాదనాపటిమ అమోఘం. న్యాయవాదిగా లేదా రాజకీయ నాయకుడిగా రాణిస్తాడు.

52. మస్తిష్కరేఖ చివరన రెండు శాఖలుగా చీలి, అందులో ఒక శాఖ చంద్ర మండలం చివర వరకు పోతే అతను గొప్ప పరిపాలనా సామర్థ్యం కలవాడవుతాడు. మేనేజర్, పి. ఆర్.ఓ., ఎం.డి. కావచ్చును.




53. మస్తిష్కరేఖ చివర మూడు శాఖలుగా చీలి, ఒక శాఖ తిన్నగా, ఒకటి చంద్రమండలానికి, ఒకటి బుధమండలానికి వెళితే అతని మేధ, ప్రావీణ్యం, కళా సాహిత్య చాతుర్యం అద్భుతం. అతను గొప్పగా సంపాదించి సంపన్నుడు, కులీనుడు అవుతాడు. కళలు, సాహిత్యం అతనికి లాభిస్తాయి. గొప్ప గొప్ప సన్మానాలు, సత్కారాలు పొందుతాడు.

54. మస్తిష్కరేఖ చివరన రెండుగా చీలి, ఒక శాఖ తిన్నగాపోయిన, రెండవ శాఖ కొంచెం చంద్రమండలానికి పోతే అతడు గొప్ప వ్యాపారస్తుడవుతాడు. వ్యవహార చాతుర్యం ఎక్కువ. వీరు న్యాయవాదులుగా, నటులుగా రాణి స్తారు.




55. మస్తిష్కరేఖ ఆరంభంలో ఒక శాఖ గురుక్షేత్రంలో తర్జని మూలస్థానం వరకు వెళ్లి, మూలరేఖను ఖండించకుండా ముందుగానే ఆగిపోతే ఆ వ్యక్తి గొప్ప ఆశయాలతో జీవించి, విజయం సాధి స్తాడు.

56. గురు మండలానికి పోయే మస్తిష్కరేఖ శాఖను ఒక చిన్న అడ్డురేఖ ఖండిస్తే లేదా అది గుణకచిహ్నంతో అంతమైతే, అతని ప్రయత్నాలకు అవరోధం ఏర్పడి అపజయాలు ఎదుర్కోవలసి వస్తుంది.




57. అప్పుడు కంకణరేఖపై ఒక గుణకచిహ్నం ఉంటే అపజయాలు కలగవు. విపరీతంగా ధనం, ఐశ్వర్యం కూడబెట్టి సంపన్నుడవుతాడు.

58. మస్తిష్కరేఖ నుండి బయలుదేరిన రెండు మూడు రేఖలు గురు మండ లానికి పోతే, అతడు అష్ట ఐశ్వర్యాలు అనుభవిస్తాడు. విపరీత రాజయోగం పడుతుంది. జీవితంలో ఆశించినవన్నీ సాధిస్తాడు.

59. మస్తిష్కరేఖ నుండి బయలుదేరి గురుక్షేత్రానికి పోయే రేఖ అక్కడ వంపు తిరిగి శనిక్షేత్రానికి పోతే, అతను మహా గర్విష్ఠి, మత చాందసుడు అవుతాడు.

60. మస్తిష్కరేఖ నుండి ఒక శాఖ రవిమండలానికి పోయి భాగ్యరేఖ సవ్యంగా చక్కగా ఉంటే, ఆ వ్యక్తి మంచి సంపాదనాపరు డవుతాడు. అదే కళాహస్తంలో అయితే అభిమాన కళలో రాణించి ధనవంతుడవుతాడు.

61. మస్తిష్కరేఖ నుండి ఒక శాఖ అనామిక, కనిష్టకాంగుళుల మధ్య వరకు పోయిన, ఆ వ్యక్తి కళారంగంలో, వ్యాపార రంగంలో, పరిశ్రమలలో, వైజ్ఞానిక రంగంలో రాణిస్తాడు. గొప్ప పరిశోధన చేయగలడు. ప్రతిభావంతంగా పరిశ్రమలు నెలకొల్పగలడు, కోట్లు సంపాదిస్తాడు.

62. మస్తిష్కరేఖ నుండి రెండుగానీ, అంతకు మించిగానీ రేఖలు బయలుదేరి, బుధక్షేత్రానికి పోతే, అతడు అనేక కంపెనీలలో, వ్యాపారాలలో భాగస్థుడై ఉంటాడు. అనేక విధాల సంపాదన ఉంటుంది. షేర్ల వ్యాపారం చేస్తాడు.

63. మస్తిష్కరేఖ ఒక చోట తెగితే ఆ వయస్సులో తలకు గాయం అవుతుంది లేదా తలకు సంబంధించిన జబ్బు చేస్తుంది. అనేక చోట్ల తెగితే అతను తరచు తలపోటుచే బాధపడుతుంటాడు. మస్తిష్క రేఖ రెండు ముక్కలుగా తెగి, ఒకటి అంతమయ్యే లోపున రెండవది బయలుదేరితే ఆ వ్యక్తి తలకు ఆపరేషన్ జరిగిన తర్వాత ఆరోగ్యవంతుడవుతాడు.

64. మస్తిష్కరేఖ శనిక్షేత్రం దిగువన తెగి, తర్వాత చంద్రమండలం వైపు వాలితే ఆ వ్యక్తి మతిచలించి పిచ్చివాడవు తాడు. అది తెగిన చోట ముందుగానే రెండవది ప్రారంభమైతే, పరిణామం అంత భయంకరంగా ఉండదు.




65. మస్తిష్కరేఖ చక్కగా, తిన్నగా పోయి, శని మండలం దిగువన తెగితే – తలకు, కాళ్లకు ప్రమాదంలో బలమైన గాయాలు తగులుతాయి. ఆ తెగినచోట ఒక గుణకచిహ్నం ఉంటే అతనికి ఉరిశిక్ష గానీ, యావ జ్జీవ కారాగార శిక్ష గానీ తప్పదు. ఆ తెగిన చోట రేఖలు ఒక దానిపైన ఒకటి ఏర్పడితే ప్రాణాపాయం ఉండదు.

66. శని మండలం క్రిందగా మస్తిష్కరేఖ తెగి, జీవితరేఖ చివరన ఒక అడ్డు రేఖతో ఖండించబడి ఆగిపోతే, మస్తిష్క, జీవితరేఖల నడుమ గుణక చిహ్నం ఉన్న వ్యక్తి ఉరిశిక్షకు పాత్రుడవుతాడు.




67. మస్తిష్కరేఖ రవి క్షేత్రం దిగువన తెగి వున్న వ్యక్తి అగ్ని ప్రమాదంలోగానీ, వేసవి గాడ్పువల్ల గాని మరణిస్తాడు. అతనికి ప్రమాదంలో చూపుపోతుంది.

68. మస్తిష్కరేఖ భాగ్యరేఖను దాటిన తర్వాత తెగితే హృదయరేఖ నుండి దిగి వచ్చిన ఒక రేఖ భాగ్యరేఖతో చేరితే అతనికి కళత్ర వియోగం కలుగుతుంది. లేదా ఒక దగ్గర బంధువు మరణం మనశ్శాంతి లేకుండా చేస్తుంది.

69. మస్తిష్కరేఖ ఆద్యంతం చిన్న ముక్కలుగా తెగి ఉంటే జ్ఞాపకశక్తి నశించి, క్రమంగా మెదడు మొద్దుబారుతుంది. తరచు తలపోటు వస్తుంది.

70. మస్తిష్కరేఖ చివరవరకు ముక్కలుగా ఉండి, మస్తిష్క, జీవిత రేఖల నడుమ ఒక గుణకచిహ్నం ఉంటే, ఆ రేఖ చివరన నల్లని మచ్చ లున్న అతనికి మూర్ఛవ్యాధి వస్తుంది, ఉన్మాదిగా జీవిస్తాడు.




71. మస్తిష్క, జీవిత రేఖలు ఒకే బిందువు నుండి ప్రారంభమై వాటి నడుమ చక్కని కోణం ఏర్పడితే అతడు మహా మేధావి అవుతాడు. వాక్చాతుర్యం మెండుగా ఉంటుంది. బుద్ధి కుశలత అధికం. ఏ రంగంలోనైనా రాణిస్తాడు.

72. మస్తిష్కరేఖ జీవితరేఖతో కలిసి కొంతదూరం పయనించి విడిపోతే అతని ఆలోచనలు తిన్నగా, సక్రమంగా ఉండవు. వానికి ఆత్మ విశ్వాసం ఉండదు. అన్నింటిని, అందరినీ అనుమానిస్తుంటాడు.

73. బొటనవ్రేలి మొదటి కణుపు బలంగా ఉండి, మస్తిష్కరేఖ స్వచ్ఛంగా, చక్కగా ఉంటే గురు మండలం ఉన్నతం అయిన వ్యక్తికి స్వతంత్ర ఆలోచనలు ఎక్కువ, గొప్ప కార్యనిర్వాహకుడవుతాడు. అధికార పదవులు చక్కగా నిర్వహిస్తాడు.

74. జీవితరేఖ ప్రారంభస్థానం నుండి బయలుదేరిన మస్తిష్కరేఖ ముందు హృదయరేఖకు దగ్గరగా పోయి తర్వాత కుజ, చంద్ర క్షేత్రాల మధ్యకు పోతే ఆ వ్యక్తి పట్టుదల మూర్ఖంగా ఉంటుంది. పెళ్లి కాకుండా ఒక స్త్రీతో చాలా సంవత్సరాలు కలిసి జీవిస్తాడు.

75. మస్తిష్క , హృదయ రేఖలు ఒకే బిందువు నుండి బయలుదేరిన వ్యక్తి ఆకస్మాత్తుగా మరణిస్తాడు. అయినవారు ఎవరూ దగ్గర ఉండరు.

76. శనిక్షేత్రం దిగువన జీవితరేఖ నుండి మస్తిష్కరేఖ ప్రారంభమైతే ఆ వ్యక్తి బాల్యంలో చదువులు అలక్ష్యం చేస్తాడు లేదా మందబుద్ధి వల్ల చదువు అబ్బదు. కొంత వయస్సు వచ్చిన తర్వాత బుద్ధి వికాసం కలుగుతుంది.

77. దానికి తోడు జీవితరేఖ, హృదయరేఖ చిన్నగా ఉంటే ఆ వ్యక్తి ఎప్పుడో అకస్మాత్తుగా మరణిస్తాడు.




78. జీవితరేఖ నుండి మస్తిష్కరేఖ ప్రారంభమైతే అది గురుక్షేత్రం దిగువ భాగంలో జరిగితే, ఆ వ్యక్తి జీవితంలో మహోజ్వలంగా రాణిస్తాడు. అన్ని సుఖాలు అనుభవిస్తాడు. కాని ప్రేమ వైఫల్యం మనస్సును బాధిస్తుంది.

79. మస్తిష్కరేఖ, జీవితరేఖ ఒకే బిందువు నుండి బయలుదేరిన, అదృష్ట రేఖ జీవితరేఖ నుండి ప్రారంభమైన అతను స్వయం ప్రతిభతో పైకి వస్తాడు. భావనాబలం, దూరదృష్టి అధికం.

80. జీవితరేఖనుండి బయలుదేరిన మస్తిష్కరేఖ శని మండలం దిగువన హృదయరేఖతో ఆగిపోతే అతనికి ఆలోచన తక్కువ, ఆవేశం ఎక్కువ. ఉద్రేక స్వభావం వల్ల అనేక కష్టాలు కొని తెచ్చుకుంటాడు.




81. చంద్రమండలం పైకి వాలిన మస్తిష్కరేఖ బుధరేఖను మధ్యభాగంలో తాకి ఆగిపోతే జీవితరేఖను అనేక రేఖలు ఖండిస్తే భాగ్యరేఖ స్పష్టంగా లేనప్పుడు ఆ వ్యక్తి ఆత్మహత్య చేసుకుంటాడు. బుధరేఖ అస్తవ్యస్తంగా ఉన్నందువల్ల ఎప్పుడూ ఏవో సమస్యలు వస్తుంటాయి. జీవితరేఖ అనేక చోట్ల ఖండించబడి నందున తరచు అనారోగ్యం. భాగ్యరేఖ స్పష్టంగా లేనందున ధనలేమి, నిత్య దరిద్రం, గురు బలం వల్ల అత్యాశ, అభిజాత్యం ఆత్మహత్యకు దారి తీస్తాయి.

82. జీవితరేఖ ఆరంభించిన చోటుండే మస్తిష్కరేఖ ప్రారంభమై, బుధరేఖ మధ్య భాగాన్ని తాకి ఆగిపోతే ఆ వ్యక్తి మెదడుకు సంబంధించిన బాధలతో ఎప్పుడూ విచారంగా ఉంటాడు. అతనికి ఉన్నవన్నీ దీర్ఘకాల రోగాలే.




83. చంద్రమండలానికి పోయే మస్తిష్క రేఖ బుధరేఖను ఖండిస్తే అతని ఆలోచనలు వికృతంగా, నిరుపయోగంగా ఉంటాయి.

84. మస్తిష్కరేఖ, జీవితరేఖ ఆరంభంలో సరాసరి కలవక వేరే చిన్న రేఖలతో కలప బడిన వ్యక్తికి ఉద్రేకం, ఆవేశం ఎక్కువ. కోపంతో, విచక్షణ కోల్పోయి ఏ రాక్షస కృత్యానికైనా పూనుకుంటాడు.

85. మస్తిష్క, జీవిత రేఖలు ఆరంభంలో దూరంగా ఉండి ఆ రెంటిని ఒక గుణక చిహ్నం కలిపితే, ఆ వ్యక్తి ప్రగతికి కుటుంబ చిక్కులు అవరోధంగా

ఉంటాయి. అతని చదువులకు దరిద్రం ఆటంక మవుతుంది. కోర్టు వ్యవహారా లలో పిత్రార్జితం నష్టమవుతుంది. అతను ఏకాంతంగా, దిగులుగా జీవిస్తాడు.

86. శుక్రమండలం నుండి నిలు వుగా పైకి పోయిన రేఖలు జీవిత, మస్తిష్క రేఖల్ని ఖండిస్తే అతనిని అనూహ్య రీతిలో కుటుంబ సమస్యలు వేధిస్తుం టాయి.




87. జీవితరేఖ మూలస్థానం నుండి మస్తిష్కరేఖ బయలుదేరి వంకర టింకరగా పోయి హృదయరేఖ వద్ద ఆగిపోయిన, ఆ వ్యక్తి తన అవివేకం వల్ల, పొరపాట్ల వల్ల కష్టాల పాలవుతుంటాడు.

88. మస్తిష్కరేఖ నుండి బయలు దేరిన రేఖలు హృదయరేఖ వద్ద ఆగితే, అతనిపైన పరుల ప్రభావం ఎక్కువ. ఇత రుల పరపతిపై ఆధారపడి జీవిస్తుంటాడు.

89. మస్తిష్కరేఖ చివర నుండి ఒక శాఖ వెళ్లి హృదయరేఖతో ఆగితే అతను స్త్రీల విషయంలో, ప్రేమ విషయంలో అతి జాగ్రత్తగా వ్యవహరిస్తాడు. పట్టుబడకుండా కోర్కెలు తీర్చుకుంటాడు.




90. శుక్రక్షేత్రం నుండి బయలు దేరిన ఒక రేఖ జీవితరేఖ, మస్తిష్కరేఖ హృదయరేఖను దాటి వివాహరేఖను ఖండిస్తే అతను వివాహం చేసుకున్న స్త్రీ వల్ల నరకం అనుభవిస్తాడు లేదా ఒక స్త్రీని ప్రేమించి రహస్యంగా ఆమెతో ప్రణయం సాగిస్తుంటాడు.

91. మస్తిష్కరేఖ చంద్రమండలం పైకి వాలి అనేక అడ్డురేఖలతో ఖండించబడిన వ్యక్తి విపరీతంగా శిరో వేదన అనుభవిస్తాడు లేదా పిచ్చివాడ వుతాడు.

92. మస్తిష్కరేఖ మొదటినుండి చివరి వరకు ముడులు, ముడులుగా ఉంటే అతనికి హత్యలు చేయాలన్న కోరిక ఉంటుంది. రేఖ రంగు పేలవంగా ఉంటే అప్పటికే హత్యచేసి, తప్పించుకుని తిరుగుతున్నాడని చెప్పవచ్చు. ఎర్రగా ఉంటే త్వరలో హత్యచేస్తాడని చెప్పవచ్చు.

93. మస్తిష్కరేఖ కొంత లోతుగా, బలంగా ఉంటే అతడు కొంతకాలం తలనరాల బాధలు అనుభవిస్తాడు.

94. మస్తిష్కరేఖపై తెల్లని మచ్చ శాస్త్ర పరిశోధనలకు గుర్తు. ఆ వ్యక్తి వైజ్ఞానిక రంగంలో పరిశోధనలు చేసి గొప్ప శాస్త్రజ్ఞు డవుతాడు.

95. అది శనిక్షేత్రం దిగువన ఉంటే వృత్తి, ఉద్యోగాలలో గొప్ప స్థితికి రావడం జరుగుతుంది. తెల్ల మచ్చ అభివృద్ధికి సంకేతం.

96. అది రవిక్షేత్రం దిగువన ఉండి, హృదయరేఖ పైన అడ్డురేఖలుంటే ఆ వ్యక్తికి సాహిత్య, సారస్వత రంగాలలో గుర్తింపు లభిస్తుంది. సన్మానాలు, బహుమతులు పొందవీలుంది.

97. అది బుధమండలం దిగువన ఉంటే వైద్య, వైజ్ఞానిక రంగాలలో ఉన్నతశ్రేణి పరిశోధనలు చేస్తాడు. అతని ప్రవర్తన ఉత్తమంగా ఉంటుంది. గొప్పగా గౌరవించ బడతాడు.

98. మస్తిష్కరేఖపై నల్లని మచ్చ ఉండి, జీవిత, ఆరోగ్య రేఖలు నలుపు ఎరుపు కలిసిన రంగులో ఉంటే విషజ్వరాలు వస్తాయి.

99. మస్తిష్కరేఖ వెడల్పుగా వుండి, నల్లని మచ్చలతో వుండి, జీవితరేఖ ఆరంభంలో రెండుగా చీలితే ఆ వ్యక్తి శిరోరోగాలతో బాధపడతాడు.

100. కుజమండలం ఉన్నతంగా ఉండి, మస్తిష్కరేఖ పైన నీలం మచ్చలుంటే, ఆ వ్యక్తి హంతకుడవుతాడు. ఎప్పుడూ హత్యలను గురించి ఆలోచిస్తుంటాడు.

101. మస్తిష్క, ఆరోగ్య రేఖలు రెండూ ఎగుడు దిగుడుగా ఉండి ఆరోగ్యరేఖపై నీలి మచ్చలుంటే మలేరియా సూచన.

102. మస్తిష్కరేఖపై నల్లని మచ్చలు, నీలిరంగు మచ్చలు టైఫాయిడ్ లేక శిరోజ్వరాన్ని సూచిస్తాయి.

103. మస్తిష్కరేఖపై నల్లని మచ్చ ఉండి, బుధరేఖ జీవితరేఖనుండి గానీ లేక అరచేయి క్రిందిభాగం నుండి గాని బయలుదేరి చంద్రమండలంలోకి వెళితే ఒక

నక్షత్ర చిహ్నంతో ఆగిపోతే అతడు విపరీతంగా మద్యపానం చేసి, కిడ్నీ చెడి మరణిస్తాడు.

104. మస్తిష్కరేఖపై నల్లని మచ్చలకు తోడు శని మండలం అత్యున్నతమైతే, అతనికి దంత సంబంధ బాధలు ఏర్పడతాయి.

105. మస్తిష్కరేఖపై నల్లని మచ్చలకు తోడు, శుక్రమండలం అత్యున్నతంగా ఉంటే చెవుడు వస్తుంది.

106. మస్తిష్కరేఖపై నల్లని మచ్చలుండి, రవిక్షేత్రం అత్యున్నతంగా వుంటే కంటి జబ్బులు వస్తాయి. అనామిక మూలస్థానంలో నక్షత్ర చిహ్నం ఉంటే కంటికి ప్రమాదం తప్పదు.

107. శుక్రమండలంలో ఒక నక్షత్రం నుండి బయలుదేరిన శుక్రరేఖ, మస్తిష్క రేఖపై నున్న నల్లని మచ్చతో కలిస్తే ఒక భయంకర సంఘటన వల్ల మతి భ్రమిస్తుంది. ఒక ఆప్తుని మరణం ఆ దుర్ఘటనకు కారణం కావచ్చు.




108. మస్తిష్కరేఖపైన ఒక అడ్డరేఖ గానీ, గుణకచిహ్నం గానీ ఉంటే ప్రమాదంలో తల పగులుతుంది. కుజుడు అత్యుచ్ఛం అయితే దెబ్బలాటలలో తల పగులుతుంది.

109. మస్తిష్కరేఖ వంకర టింకరగా ఉండి, దానిపైన ఒక గుణకచిహ్నం ఉంటే తలకు గానీ, కాలికి గానీ గాయం అవుతుంది.

110. మస్తిష్కరేఖ నుండి బయలుదేరి గురుమండలానికి చేరే రేఖ చివరన ఒక గుణకచిహ్నం ఉండి, చేతిలో ఇతర మంచి చిహ్నాలు లేకపోతే ఆ ప్రమాదం అనివార్యం.

111. మస్తిష్కరేఖపై గుణకచిహ్నం ఉండి, ఆ రేఖ భాగ్యరేఖతో ఆగి, హృదయరేఖ ఆ దగ్గరగా వచ్చి ఆగితే అతనికి ఆ వయస్సులో అకాల మరణం సంభవిస్తుంది.

112. మస్తిష్కరేఖపై నక్షత్ర చిహ్నం తలకు తగిలే ప్రమాదానికి సంకేతం. ఆ గుర్తు రెండు చేతులలో ఉంటే ప్రమాదం వల్ల మరణం తప్పదు.

113. మస్తిష్కరేఖ చంద్రమండలంపై వాలి ఉండి దాని చివరన ఒక నక్షత్ర చిహ్నం ఉంటే అతడు జల ప్రమాదంలో మరణిస్తాడు. లేదా మతిలేక నీటిలో పడి మరణించవచ్చు.




114. మస్తిష్కరేఖ దాదాపు కంకణ రేఖ వరకు పోయి అక్కడ ఒక నక్షత్ర చిహ్నంతో ఆగితే అతనికి అనూహ్యంగా ధన, సంపదలు చేకూరి, గొప్ప అదృష్ట వంతుడవుతాడు.

115. భాగ్యరేఖ, మస్తిష్కరేఖ కలిసే చోటు నుండి బయలుదేరిన ఒక రేఖ గురుమండలానికి పోయి ఒక నక్షత్రంతో ఆగితే ఆ వ్యక్తి గర్వం, అహంకారంవల్ల పతనం చెందుతాడు. పొగరు వల్ల సర్వనాశనమవుతాడు.

116. మస్తిష్కరేఖ నుండి బయలుదేరిన రేఖ తర్జని మూలస్థానం వరకు వెళ్లి నక్షత్రచిహ్నంతో ఆగితే, అతని జీవితలక్ష్యం నెరవేరి, సంపదలు గడిస్తాడు.

117. మస్తిష్కరేఖపై వర్తులాకార చిహ్నం, మస్తిష్క, హృదయరేఖల నడుమ ఆరోగ్య రేఖపై గుణకచిహ్నం ఉన్నవాడు అంధుడవుతాడు.




118. బుధక్షేత్రం క్రిందగా మస్తిష్క రేఖ పైన త్రిభుజచిహ్నం ఉన్న వ్యక్తి శాస్త్ర పరిశోధనలు చేసి సైంటిస్టు అవుతాడు లేదా పెద్ద వ్యాపారి, పారిశ్రామికవేత్త అవుతాడు.

119. మస్తిష్కరేఖ ప్రారంభంలో ద్వీప చిహ్నం ఉన్న వ్యక్తి పారంపర్య రోగాలు అనుభవిస్తాడు. అతనికి శిరోవేదన ఎక్కువగా ఉంటుంది.

120. మస్తిష్కరేఖ మధ్యభాగంలో ద్వీపచిహ్నం గల వ్యక్తి క్రానిక్ న్యూరాల్జియా బాధితుడవుతాడు.

121. మస్తిష్కరేఖపై ద్వీపచిహ్నానికి తోడు బుధరేఖ మస్తిష్కరేఖను సమీపిస్తున్న కొద్దీ ఎర్రగా మారితే అతని తలకు సంబంధించిన జ్వరాలు వస్తుంటాయి.

122. శని మండలం దిగువన మస్తిష్క రేఖపై ద్వీపచిహ్నాం ఉన్న వ్యక్తి బధిరుడవుతాడు. అది ఆరంభంలో చిన్న మచ్చగా వుండి తర్వాత ద్వీపంగా మారుతుంది. ఆరంభదశలో చికిత్స మేలు చేస్తుంది.

123. మస్తిష్కరేఖపై అనేక ద్వీపచిహ్నాలున్న వ్యక్తి విపరీత విద్యా వ్యాసంగంతో ఉన్మాదిగా మారతాడు. అతని ప్రతిభ ఎందుకూ పనికిరాని దవుతుంది.

124. మస్తిష్కరేఖపై చివరన ద్వీప చిహ్నాం కలవానికి వృషణ బాధ లుంటాయి. హెర్నియా వస్తుంది.

125. మస్తిష్కరేఖపై చతుష్కోణం గల వ్యక్తి ఆపదల నుండి, ప్రమాదాల నుండి తనను తాను రక్షించుకోగలడు.

126. మస్తిష్కరేఖ ప్రక్కన మరొక రేఖ ఉండి, అది మస్తిష్కరేఖను తాకితే, అతని మనోవికారం వంశపారంపర్యం. కానీ పిత్రార్జిత సంపదలు, భోగాలు అనుభవించగలడు.




127. రవిరేఖ, భాగ్యరేఖలు అసలు లేకపోయినా – మస్తిష్కరేఖ శనిక్షేత్రం క్రింద నిలువుగా ఉన్న వ్యక్తి మహాజ్ఞాని, మహాయోగి అవుతాడు. రవి, భాగ్యరేఖ లుండి, గురు, శని మండలాలు బాగుంటే అతడు మహాయోగి, మహర్షి అవుతాడు.

128. హృదయ మస్తిష్కరేఖలు ఒకే బిందువు నుండి బయలుదేరి హృదయ రేఖ చివరన చీలితే మస్తిష్కరేఖ మధ్య శనివైపు వంగితే అతనికి అంగవైకల్యం తప్పదు. ఒక చేయి, ఒక కాలు పోతుంది.

129. హృదయరేఖ గొలుసు వలె ఉండి, శనిక్షేత్రం దిగువన హృదయరేఖ నుండి మస్తిష్కరేఖ బయలుదేరిన, బుధరేఖ ఛిద్రమైన, అతడు అతి సంభోగం వల్ల కృశించి మరణిస్తాడు.

# 23. హృదయరేఖ

**అ**తి ప్రధానమైన రేఖలలో హృదయరేఖ ఒకటి. జీవితరేఖ, మస్తిష్కరేఖల తర్వాత ముఖ్యమైనది ఇదే. శరీరానికి కావలసిన శక్తిని, మనస్సుకు సంబంధించిన ప్రేమను అందించేది హృదయం. గురుక్షేత్రం వద్ద బయలుదేరి శని, రవి, బుధ క్షేత్రాల క్రిందగా చేయి అంచువరకు పోతుంది. అయితే ఇది గురు మండలం నుండి మాత్రమే బయలుదేరాలన్న నియమం లేదు. ఎక్కడ నుండి బయలుదేరినా మంచి ఫలితాలుంటాయి. అసలు హృదయరేఖ లేనివాడు హృదయం లేనివాడితో సమానం. అతనిలో ప్రేమ, కరుణ, దయ ఉండకపోగా కాఠిన్యం, స్వార్థం, మోసం గూడు కట్టుకుని ఉంటాయి.

1. హృదయరేఖ గురుక్షేత్రం నుండి బయలుదేరితే ఆ వ్యక్తి ఆదర్శ జీవితం గడుపుతాడు. జీవితంలో ఉన్నత ప్రమాణాలను సాధిస్తాడు. క్రమ శిక్షణతో పెరిగి, ప్రేమతో జీవిస్తాడు. దరిద్రాన్ని, కష్టాన్ని సైతం ఆనందంగా అనుభవించ గలడు.




2. హృదయరేఖ శనిక్షేత్రం నుండి బయలుదేరితే ఆ వ్యక్తికి ప్రేమ, ఆదర్శం, ఆరాధన ఉండవు. ఉన్నంత వరకు సుఖించడమే తెలుసు. ప్రపంచ జ్ఞానం, వివేకం అన్నీ ఉంటాయి.

ఉద్రేక స్వభావి కాదు. దరిద్రం అంటే రోత. లేమిని తన ఛాయలకు రానీయడు. కామం ఎక్కువ. ధన సంపాదనపై, సుఖభోగాలపై కోరిక అధికం.

3. పై లక్షణాలకు తోడు శుక్రమండలం బలంగా ఉంటే అతడు భోగలాలసుడు, విలాసప్రియుడు అవుతాడు. సుఖ భోగాలకై ఏమైనా చేయగలడు. ప్రేమ అనే పదానికి బదులు 'కామం' అని ప్రయోగిస్తాడు.

4. హృదయరేఖ గురుక్షేత్రం సమీపంగా ప్రారంభమై అరచేయి ఆ చివర వరకు తిన్నగా, చక్కగా పోతే ఆ వ్యక్తి ప్రియభాషణతో జనాన్ని తనవైపు ఆకర్షిస్తాడు. అతనిలో వశీకరణం, ఆకర్షణ ఎక్కువగా ఉంటాయి.




5. హృదయరేఖ వేళ్ల మూల స్థానానికి దగ్గరగా ఉంటే, అనగా శని, రవి, బుధ క్షేత్రాలు కుదించుకు పోయి నట్లు ఉంటే ఆ వ్యక్తి సుఖభోగాలు విపరీతంగా కాంక్షిస్తాడు తప్ప ప్రపంచంలో ఏ విషయం పట్టించుకోడు. అతనిది అసూయా స్వభావం.

6. హృదయరేఖ ఈ కొస నుండి ఆ కొస వరకు అడ్డంగా, స్ఫుటంగా ఉన్న వ్యక్తికి కామవాంఛ విపరీతం. వ్యసనాలకు బానిస అవుతాడు. గురు క్షేత్రం అత్యున్నతం అయితే అసూయా ద్వేషాలు అదనంగా ఏర్పడతాయి.

7. హృదయరేఖ చంద్రరేఖ వలె వంగి ఉన్న వ్యక్తి వ్యాపార, ఉద్యోగ, వ్యవహార రంగాలలో పరమనీచంగా, కుచ్ఛితంగా ప్రవర్తిస్తాడు. ఆడవారి విషయంలో నీచంగా, జుగుప్సాకరంగా ప్రవర్తిస్తాడు. దానికితోడు వేళ్లు కోమలంగా, మృదువుగా ఉంటే స్వార్థం ఎక్కువ.

8. హృదయరేఖ ధనుస్సు వలె వంగినపుడు హృదయ, మస్తిష్కరేఖల మధ్య జాగా తగ్గిపోతుంది, అయినా చంద్రమండలం ఉన్నతంగా ఉంటే ఆ లోపం పూరించబడి, ఆ వ్యక్తి విద్యావంతుడు, మేధావి, ప్రయోజకుడు కాగలడు. ఎంత పెద్ద ఉద్యోగి అయినా అతనిలో మోసం, అవినీతి ఉంటాయి.

9. మస్తిష్కరేఖ జీవితరేఖతో పాటు ఒకే బిందువు నుండి ఆరంభమై హృదయరేఖ వలె ధనుస్సులా వంగితే అతనికి పట్టుదల, దీక్ష ఎక్కువ. ఎక్కడా అభిమానం చంపుకోడు. తన గౌరవానికి లోపం రానివ్వడు.

10. బుధరేఖ వంకరటింకరగా పాము వలె ఉంటే ఆరోగ్యభంగం కలుగుతుంది. ఆస్మా, హై ఫీవర్ వస్తుం టాయి.




11. హృదయరేఖ అసలు లేని మనిషిలో ఉత్సాహం ఉండదు. ఏ విషయంలోను ఆసక్తి, అనురక్తి ఉండవు. ప్రథమ కుజ మండలం ఉన్నతమైతే, అతను క్రూరంగా బ్రతుకుతాడు.

12. హృదయరేఖ వికారంగా వున్న వ్యక్తి భగ్నప్రేమికుడై, ప్రేమ విషయంలో అపజయాలతో క్రుంగిపోతాడు. హృదయ రేఖ గురుక్షేత్రం నుండి ఆరంభమైతే వాని ప్రేమ ఫలిస్తుంది. భార్యాభర్తలు ఆదర్శ దంపతులవుతారు.

13. హృదయరేఖ ఎరుపురంగులో ఉంటే ఆ మనిషి ఆలోచనలు, చర్యలు ఉద్రేకపూరితంగా ఉంటాయి. అతను స్త్రీల విషయంలో కర్కశంగా, అమానుషంగా ప్రవర్తిస్తాడు. ఎంతటి నీచానికైనా వెనుకాడడు.

14. హృదయరేఖ పసుపు రంగులో ఉంటే గుండె జబ్బులు వస్తాయి.

15. బాగా లోతుగా వుంటే అపోప్లక్స్.

16. వెడల్పుగా, కాంతిహీనంగా ఉంటే హృదయరోగాలు, గుండె బలహీనత, రక్తహీనత, రక్త ప్రసార లోపం, రక్తపోటు వస్తాయి.

17. హృదయరేఖ మరీ సన్నగా, పొడవుగా ఉంటే హత్యాకాంక్ష కలుగుతుంది.

18. హృదయరేఖ బలహీనంగా, పేలవంగా ఉండి దాని చివరన చిన్నరేఖలు కుచ్చులా ఏర్పడితే అతను సంతానహీనుడవుతాడు.

19. హృదయరేఖ ఆరంభం నుండి ఆఖరు వరకు గొలుసువలె ఉంటే గుండె బలహీనత వల్ల గుండె జబ్బు వస్తుంది.

20. హృదయరేఖ గొలుసులా వెడల్పుగా, కళాకాంతులు లేకుండా ఉంటే కామం ఎక్కువ. తన భోగానికి, తృప్తికి నీచపు పనులు ఏవైనా చేయగలడు.




21. గొలుసులా వున్న హృదయరేఖ శనిక్షేత్రానికి పోయి తర్వాత బుధ మండలం క్రిందగా పోతే ఆ వ్యక్తి స్త్రీ ద్వేషి అవుతాడు. అతనికి ఆడవారంటే అసహ్యం. స్త్రీ సుఖం అంటే జగుప్స, ఏవగింపు ఏర్పడతాయి.

22. హృదయరేఖ చక్కగా ఉండి అంగుష్ట ప్రథమపర్వం గట్టిగా, బలంగా ఉంటే అతను స్థిరచిత్తుడు, స్థితప్రజ్ఞుడు, జ్ఞాని అవుతాడు. అంగుష్ట ప్రథమపర్వం బలహీనంగా ఉంటే, అతనిలో ఎంత ఇష్టం, ప్రేమ ఉన్నా బయటకు చెప్పడు.

23. హృదయరేఖ స్వచ్ఛంగా, మస్తిష్కరేఖ దోషరహితంగా ఉండి, జీవితరేఖ చివరన ఒక త్రిభుజచిహ్నం ఉంటే - అతడు పరమ లౌకికుడు, ప్రజ్ఞాశాలి, కార్యశూరుడు అవుతాడు.




24. జీవితరేఖ చివరన ఒక త్రిభుజ చిహ్నం ఉండి, మస్తిష్క, హృదయరేఖలు పేలవంగా ఉంటే అతను చపలచిత్తు డవుతాడు. మాట, పలుకు కఠినం. అతనివల్ల అందరికి ప్రమాదమే. అతనితో మాట్లాడినా ప్రమాదం ముంచుకొస్తుంది.

25. హృదయరేఖ పొడవుగా ఉండి చంద్రమండలం అత్యున్నతమైనా లేదా చంద్రమండలంలో అనేక రేఖలు అస్త వ్యస్తంగా ఉన్నా, శుక్రవలయం బలంగా ఉంటే, ఆ వ్యక్తికి

అసూయాద్వేషాలు అధికం. ఇతరులను నిందిస్తుంటాడు, పైగా స్వాభిమానం ఎక్కువ.

26. మస్తిష్క, హృదయ రేఖలు అస్పష్టంగా ఉండి అంగుష్ట ప్రథమపర్వం చిన్నదిగా ఉంటే బుద్ధి స్థిరంగా ఉండదు. అతను చేసే పనులు అడ్డదిడ్డంగా ఉంటాయి.

27. మస్తిష్కరేఖ జీవితరేఖను తాకకుండా గురుక్షేత్రం నుండి బయలుదేరితే హృదయరేఖ చాపం వలె వంగి బుధ మండలం క్రింద ఛిద్రమైతే–అతని అత్యాశ వల్ల వివాహం జరగదు. తనకన్నా గొప్ప స్త్రీని వాంఛించి, పొందలేక భంగపడతాడు. తర్వాత అతని ప్రవర్తన నీచంగా మారుతుంది.




28. హృదయ, మస్తిష్క రేఖలు లోతుగా, ఎర్రరంగులో ఉండి, రెండు కుజక్షేత్రాలు అత్యున్నతమైతే ఆ వ్యక్తి హంతకుడవుతాడు.

ఆ రేఖలు వెడల్పుగా ఉండి కళాకాంతులు లేకున్న, శుక్రమండలం నుండి బయలుదేరిన రేఖ హృదయ, మస్తిష్క రేఖల్ని ఖండించి బుధక్షేత్రానికి పోయిన, అతను స్వప్రయోజనాలకై హత్యలు చేస్తుంటాడు.

శుక్రవలయం అస్పష్టంగా ఉంటే కామోద్రేకం ఎక్కువై, తను భోగించిన స్త్రీని హత్య చేస్తాడు.

29. శుక్రవలయం స్పష్టంగా ఉండి, హృదయరేఖ స్పష్టంగా లోతుగా ఉండి, చంద్రమండలంపై అస్తవ్యస్త రేఖలున్న వ్యక్తికి అకారణంగా ఇతరులపై ద్వేషం కలుగుతుంది. అది వాని పతనానికి హేతువు అవుతుంది.

30. హృదయరేఖ బలహీనంగా ఉండి, దానికి తోడు మస్తిష్కరేఖ అయోగ్యంగా ఉంటే అతడు విశ్వాసహీనుడు, నమ్మకద్రోహి అవుతాడు.

31. హృదయరేఖ అస్పష్టంగా ఉన్నా, గొలుసువలె ఉన్నా, మస్తిష్కరేఖ కూడా అలా అస్పష్టంగా ఉంటే శుక్రమండలం అత్యున్నతంగా ఉంటే లేక అనేక అడ్డ

రేఖలు శుక్రునిపై ఉన్నా, ఆ వ్యక్తి ప్రతి విషయంలో ఇతరుల్ని అనుమానిస్తుంటాడు. ఇతరుల్ని అవమానించడం, అపనిందలు వేయడం అతనికి సరదా.

32. హృదయరేఖ భాగ్యరేఖను దాటే చోట గొలుసువలె ఉన్న, అతని ప్రేమ వ్యవహారం భవిష్యత్తుకు ఆటంక మవుతుంది. ఆ ప్రేమించిన వ్యక్తి కారణంగా తన బంగారు భవిష్యత్తును పాడుచేసుకుంటాడు.




33. హృదయరేఖ తర్జని మూడవపర్వం నుండి బయలుదేరితే అతను ఏ రంగంలోనూ విజయం సాధించలేడు. వేళ్ల పర్వాల నుండి ప్రారంభమైన రేఖలు ఏవీ మంచి ఫలితాలనివ్వవు. అలాగే గ్రహక్షేత్రాలు, వేళ్లు మరీ బలంగా, లావుగా ఉంటే మంచి ఫలితాలనివ్వవు.

34. హృదయరేఖ గురుక్షేత్రం నుండి ప్రారంభమై ఆరంభంలో రెండు శాఖలుగా చీలి ఉన్న వ్యక్తి ప్రేమ పవిత్రంగా, నిష్కళంకంగా ఉంటుంది. అతని దాంపత్య జీవితం సుఖమయం.

35. హృదయరేఖ మొదట గురుక్షేత్రాన్ని వలయంగా చుట్టి తర్వాత సజావుగా వెళితే ఆ వ్యక్తి అసూయాపరు డవుతాడు. కానీ స్త్రీల విషయంలో, ప్రేమ విషయంలో పవిత్రంగా, ఆదర్శ ప్రాయంగా ఉంటాడు. దానికితోడు శని వలయం ఉంటే అతడు రహస్య, మార్మిక, తంత్ర విద్యలలో నైపుణ్యం సంపాదిస్తాడు.




36. హృదయరేఖ గురు, శనిక్షేత్రాల మధ్య నుండి ప్రారంభమైతే, ఆ వ్యక్తి సుఖపడలేడు. ఆశ బారెడు, అనుభవం మూరెడు. అన్నీ అందినట్లే అంది చేజారిపోతుంటాయి. అతనికి సంసారంలోనూ సుఖశాంతులుండవు.

37. హృదయరేఖ తర్జని, మధ్యమాంగుళి మధ్య నుండి ప్రారంభమైతే ఆ వ్యక్తి అధిక శ్రమలను ఓర్చుకోగలడు. ఎన్ని బాధలనైనా కడుపులో దాచుకుని కష్టించి పనిచేస్తాడు. తన కోరికలు, ఇష్టాలు బయటపెట్టడు. తను ప్రేమించిన వారికి గాని, తనను ప్రేమించిన వారికి గాని తన మనస్సు విప్పి చెప్పలేడు.




38. హృదయరేఖ శనిక్షేత్రం నుండి బయలుదేరిన వ్యక్తికి కామోద్రేకం, భోగలాలస ఎక్కువ. అయినా అధికంగా అనుభవించలేడు. మొత్తం మీద సుఖం తక్కువ. భార్య వలన సుఖపడలేడు, పరస్త్రీ సాంగత్యం దొరకదు.

39. గురుక్షేత్రంపైన ఆరంభంలో హృదయరేఖ మూడు శాఖలుగా చీలి వుంటే అతడు అపూర్వసంపదలు పొంది గొప్ప అదృష్టవంతుడనిపించుకుంటాడు.

40. ఆ మూడు శాఖలలో ఒకటి గురుక్షేత్రం పైవరకు వెళితే అతని ప్రేమ ఫలిస్తుంది. శుక్రక్షేత్రంలో ఒక గుణక చిహ్నం ఉంటే అతనికి ఒక సౌందర్యవతితో సంబంధం ఏర్పడుతుంది.

41. ఆరంభంలో హృదయరేఖ రెండు శాఖలుగా చీలి అందులో ఒక శాఖ గురుక్షేత్రం పైవరకు వెళితే, రెండవది మస్తిష్కరేఖ పైకి వంగిన దానిని తాకకున్న, ఆ వ్యక్తి ఎప్పుడూ ఆత్మవంచన చేసుకుంటాడు. తనను తానే మోసగించుకుంటాడు.




42. ఆరంభంలో రెండుగా చీలిన హృదయరేఖ ఒక శాఖ గురు మండలానికి, రెండవశాఖ తర్జని మధ్యమాంగుళి సంధి స్థానం వైపుగా వెళితే, ఆ వ్యక్తికి కుటుంబ నిర్వహణ చాతుర్యం

ఎక్కువ. భార్యాబిడ్డలను, కుటుంబాన్ని అమితంగా ప్రేమిస్తాడు. ఇతరులు ఆ వ్యక్తిని గౌరవిస్తారు. ఉత్తమ గృహస్తుకు ఇది మంచి లక్షణం.

43. హృదయరేఖ ఆరంభంలో రెండుగా చీలి, ఒక శాఖ తర్జని మధ్యమాంగుళి మధ్య సంధి స్థానానికి పోయిన, రెండవ శాఖ కేవలం గురుమండలాన్ని తాకినట్లున్న, చంద్రుడు నీచమైతే అతనికి సంసార సుఖం ఉండదు.

44. ఆరంభంలో రెండు శాఖలుగా ఉన్న హృదయరేఖలోని ఒక శాఖ గురు మండలానికి, రెండవశాఖ శనిక్షేత్రానికి వెళ్లిన, అతను స్త్రీ సుఖం ఆశించి అనేక నీచపు పనులు చేస్తాడు. మూర్ఖంగా ప్రవర్తిస్తాడు.

45. మస్తిష్కరేఖ చిన్నదిగా ఉండి, దానిపైన ఒక గుణక చిహ్నం ఉండి, హృదయరేఖ శని మండలం నుండి ప్రారంభమైతే అకాల మరణం సూచితం.



46. హృదయరేఖ ఆరంభంలో రెండుగా చీలి మస్తిష్కరేఖ అలాగే ఆరంభంలో రెండు పాయలుగా చీలి అందులో ఒక శాఖ జీవితరేఖ మూల స్థానాన్ని తాకినట్లున్న, రెండవశాఖ ద్వితీయ కుజమండలంలోకి వెళితే ఆరంభంలో ప్రేమమయ జీవితం గడుపుతాడు. కాని కుటుంబ కలహాలవల్ల, అపార్థాల వల్ల అతని పెళ్లికి అనేక ఆటంకాలు ఏర్పడతాయి.

47. మస్తిష్కరేఖ చక్కగా ఉండి, హృదయరేఖ ప్రారంభంలో రెండు శాఖలుగా చీలితే కుజమండలం ఉన్నతంగా ఉంటే, అతనికి ధైర్య సాహసాలు ఎక్కువ. ప్రశంసనీయంగా పనులు నిర్వహించగలడు.

48. హృదయరేఖ చివరలో బుధ మండలాన్ని వలయంగా చుడితే అతడు అతీంద్రియ విద్యలలో ప్రజ్ఞ సంపాదిస్తాడు. యోగం, పరిశోధన, ఆత్మలు, పరలోకం మొదలైన విషయాలలో ప్రావీణ్యం సంపాదిస్తాడు.

49. హృదయరేఖ చివరన రెండు శాఖలలో ఒకశాఖ బుధమండలానికి చేరిన,

భాగ్యరేఖపైన ద్వీపచిహ్నమున్న వ్యక్తి దాంపత్య జీవితం దుఃఖభూయిష్ట మవుతుంది. భార్యాభర్తల మధ్య ఎడబాటు తప్పదు. అతని పరస్త్రీ సాంగత్యం ఎడబాటుకు కారణం.




50. హృదయరేఖ ఆరంభంలో కుచ్చు వలె ఉంటే అతనికి అనేక మందితో లైంగిక సంబంధం ఉంటుంది. మంచి గృహస్తు అవుతాడని ఒక వాదన. చివర కుచ్చువలె లేకున్న అసలు సంతానం కలగదు.

51. హృదయరేఖ నుండి బయలు దేరి పైకి వెళ్లే రేఖలు ప్రయోజనకరం కావు. అవి భావ దారిద్రాన్ని సూచి స్తాయి. ఆ వ్యక్తి ప్రవర్తన, నైజం, స్వభావం నిస్తేజంగా ఉంటాయి.

52. హృదయ, మస్తిష్కరేఖల మధ్య అంతరం ఎక్కువై వెడల్పుగా ఉంటే, ముఖ్యంగా మధ్యభాగం విశాలంగా ఉంటే, రెండింటికి ఉపశాఖలు లేకున్న ఆ వ్యక్తిలో ప్రేమ, దయ, కరుణ ఉండవు. కఠినంగా ప్రవర్తిస్తాడు.




53. హృదయరేఖ నుండి క్రిందికి దిగే రేఖలు ఆత్మీయులవల్ల ఆశా భంగాన్ని సూచిస్తాయి. అందులో భాగ్య రేఖను ఖండించే రేఖ ఒక ఆత్మీయ వ్యక్తి మరణాన్ని సూచిస్తుంది.

54. రవిక్షేత్రం దిగువన హృదయ రేఖ నుండి బయలుదేరిన రేఖలు తిన్నగా మస్తిష్కరేఖ వైపు సాగితే అవి రవిరేఖల వలె ఫలిస్తాయి. ఆ వ్యక్తి ప్రజ్ఞకు, ప్రతిభకు, అధికారానికి అవి అద్దం పడతాయి. విపరీతంగా ధన

సంపాదన, ఐశ్వర్యం, సుఖాలు సూచిస్తాయి. అవి రవిక్షేత్రం దిగువన కాక, ఇతర క్షేత్రాలు, అంటే శని, బుధ క్షేత్రాల దిగువన ఉంటే మిత్రుల వలన కష్టాలు, నష్టాలు, బాధలు ఏర్పడతాయి.

55. హృదయరేఖ నుండి బయలుదేరిన ఒక రేఖ కనిష్టకాంగుళి తృతీయ పర్వాన్ని చేరి వెనక్కి తిరిగితే అతను ప్రమాదంలో అంగవైకల్యం చెందుతాడు.

56. హృదయరేఖ నుండి క్రిందికి వెళ్లే రేఖ వంకరగా చంద్రమండలాన్ని చేరితే, ఆ వ్యక్తిలో హత్య చేయాలన్న అభిలాష ఉంటుంది.

57. హృదయరేఖ బలహీనపడి, దానినుండి బయలుదేరిన రెండు రేఖలు చంద్ర మండలానికి చేరితే రక్తదోషం ఉంటుంది. రక్తపోటు ఎక్కువై మరణిస్తాడు.




58. హృదయరేఖ నుండి ఒక శాఖ తిన్నగా శనిక్షేత్రం చేరి వెనుతిరిగితే అతను అభిమానించి, ప్రేమించేవారే మోసం చేస్తారు. అది స్త్రీ చేయి అయితే అతి కష్టం మీద ఆమె పెళ్లి జరుగుతుంది.

59. హృదయరేఖ అనేక చోట్ల తెగినట్లున్న అతనికి స్త్రీలపట్ల స్త్రీ సుఖం పట్ల అసహ్యం కలుగుతుంది. బుద్ధి, ఆలోచన స్థిరంగా ఉండవు.

60. శనిక్షేత్రం దిగువగా హృదయ రేఖ తెగితే రక్తప్రసారంలో అవరోధం ఏర్పడుతుంది. కిడ్నీలు పనిచేయక మరణిస్తాడు.

ఒకచేతిలో మాత్రమే అలా ఉంటే భార్యదోషం వల్ల ఎడబాటు కలుగుతుంది. సంసారం విషాదంగా మారుతుంది. రెండు వేళ్లలో అలా తెగి ఉంటే అతనికే ప్రమాదం.

61. రవిక్షేత్రం దిగువన హృదయరేఖ తెగితే అతడు ఉదాసీనతవల్ల భార్యను తృప్తిపరచలేడు. గర్వం, స్వాభిమానం వల్ల స్త్రీ సుఖాన్ని వదులుకుంటాడు. ఆ వ్యక్తికి గుండె బలహీనత ఏర్పడుతుంది. రెండు చేతులలో అదే లక్షణం ఉంటే అతడు గుండె జబ్బుతో మరణిస్తాడు.

62. బుధక్షేత్రం దిగువగా హృదయరేఖ తెగితే అతనిలో అసూయాద్వేషాలు ఎక్కువై, సంసారసుఖం అనుభవించలేడు. భార్యకు దూరంగా బ్రతుకుతుంటాడు. అతనికి మనుషుల కన్న డబ్బే ప్రధానం. చివరకు గుండెపోటుతో మరణిస్తాడు.

63. పై లక్షణంతో పాటు, హృదయరేఖ తెగిన చోట ఒక శాఖ అంతమయ్యే లోపున వేరొకటి బయలుదేరితే భార్యా వియోగం తాత్కాలిక మవుతుంది.




64. జీవిత, మస్తిష్క, హృదయ రేఖలు ఒకే బిందువు నుండి బయలు దేరి, మస్తిష్కరేఖ పైన ఒక గుణక చిహ్నం ఉంటే అతను అకస్మాత్తుగా మరణిస్తాడు. జీవిత భాగ్యరేఖలపై ఆ ప్రమాదం జరిగే వయస్సును తెలుసుకొన వచ్చు.

65. జీవిత, మస్తిష్క, హృదయ రేఖలు ఒకే బిందువు నుండి ప్రారంభమై అక్కడ దానినొక అడ్డరేఖ ఖండించిన, అతని వివాహం దౌర్భాగ్య మవుతుంది. ప్రేమలో అపజయం పొందుతాడు. గురు మండలంలో ఒక గుణక చిహ్నం ఉండి, హృదయరేఖ నుండి వచ్చి ఒక శాఖ దానిని స్పృశిస్తే అతను ప్రేమించిన స్త్రీని వివాహం చేసుకుని సుఖపడతాడు. లేక సంప్రదాయ వివాహం అయినా, భార్యను మిక్కిలిగా ప్రేమిస్తాడు.




66. జీవిత, హృదయ, మస్తిష్క రేఖలు ఒకే బిందువు నుండి బయలుదేరిన, హృదయరేఖ లోతుగా, పొడవుగా ఉన్న, మస్తిష్కరేఖ చివరన రెండుగా చీలి, ఒక చీలిక చంద్రమండలం చేరిన, అతను స్త్రీల విషయంలో మూర్ఖంగా ప్రవర్తిస్తాడు. స్త్రీలు అతనిని ద్వేషిస్తుంటారు.

67. శనిక్షేత్రం దిగువన మస్తిష్కరేఖ నుండి హృదయరేఖ బయలుదేరితే ఆ వ్యక్తి అధిక భోగంతో పతనమవుతాడు. ఆ లక్షణం రెండు చేతులలో ఉంటే నీచస్త్రీ సంపర్కం వల్ల సుఖరోగాలతో మరణిస్తాడు.

68. శనిక్షేత్రం దిగువన మస్తిష్కరేఖ నుండి బయలుదేరిన హృదయరేఖను వేరొకరేఖ ఖండిస్తే అతని వైవాహిక జీవితం బాధాకరం అవుతుంది.

69. గురు మండలం నుండి బయలుదేరిన హృదయరేఖ బుధక్షేత్రం దిగువన మస్తిష్కరేఖను కలిస్తే, అతనికి ఆ వయస్సులో మరణం సంభవిస్తుంది.




70. గురు మండలం నుండి బయలుదేరిన హృదయరేఖతో చక్కగా ఉన్న అదృష్టరేఖ వచ్చి కలిస్తే అతడు ఆదర్శ ప్రేమికుడవుతాడు. ప్రేమించిన స్త్రీతో సర్వసుఖాలు అనుభవిస్తాడు.

71. భాగ్యరేఖ నుండి బయలుదేరిన శాఖలు హృదయరేఖను తాకకుండా ఆగిపోతే అతడు ఎంత మందిని ప్రేమించినా, ఎవరినీ పెళ్లా డడు. అన్నీ తాత్కాలిక అనుబంధాలే.

72. ఏ ఒక్క శాఖ హృదయరేఖను తాకినా, ఒకరి తోడి అనుబంధం శాశ్వతమవుతుంది.




73. అవి హృదయరేఖను ఖండిస్తే ఆయా ప్రేమ కలాపాలు బాధాకరంగా, దురదృష్టకరంగా మారే అవకాశం వుంది. అవి బయటపడి పరువు ప్రతిష్ట లకు భంగం కలిగిస్తాయి.

74. హృదయరేఖను, జీవితరేఖను చిన్న చిన్న రేఖలు కలిపితే విరహతాపం, భగ్నప్రేమ కారణంగా అతని ఆరోగ్యం చెడుతుంది, అది క్రమంగా గుండె జబ్బులకు దారితీస్తాయి.

75. హృదయరేఖను వేరొకరేఖ మస్తిష్కరేఖతో కలిపితే అతను అనేక

విధాల పతనం చెందుతాడు. బుధక్షేత్రం ఉన్నతంగా ఉంటే స్త్రీ కారణంగా పతనం సంభవం. అతను ఎవరినీ మన స్ఫూర్తిగా ప్రేమించడు.

76. హృదయరేఖ నుండి బయలుదేరిన రేఖలు వాలుగా వచ్చి మస్తిష్కరేఖను తాకితే, ఆ వ్యక్తికి అందరు స్త్రీలతో సంబంధం ఉంటుందని లేదా అనేక మంది స్త్రీల ప్రభావం అతని పైన ఉంటుందని లేదా స్త్రీల సహాయంతో అభివృద్ధి సాధిస్తాడని చెప్పవచ్చు.




77. హృదయరేఖను అనేక అడ్డు రేఖలు ఖండిస్తే స్త్రీల విషయంలో, ప్రేమ విషయంలో అనేక మార్లు భంగపడడం, నిరాశ చెందడం జరుగుతుంది.

78. హృదయరేఖపైన నల్లని మచ్చ ఉంటే ప్రేమ వైఫల్యం వల్ల మానసిక వేదన కలుగుతుంది.

79. అది తెల్లని మచ్చ అయితే ప్రేమ విజయం. అతను కోరిన స్త్రీ నిరాకరించడం జరగదు.

80. తెల్లని మచ్చ హృదయరేఖ ఆరంభంలో ఉంటే అతను ప్రేమించిన స్త్రీ గొప్ప సౌందర్యవతి, ధనికురాలు, విద్యావతి, ప్రేమపిపాసి అవుతుంది.

81. ఆ తెల్లని మచ్చ గురుమండలం పైన ఉంటే, అతని ప్రేయసి పెద్ద ఉద్యోగిని, సంపన్నురాలు అవుతుంది.

82. రవిమండలం దిగువన హృదయరేఖపైన పెద్ద మచ్చ ఉంటే ఒక ప్రముఖ వ్యక్తి వల్ల వారి ప్రేమకు ఆటంకం ఏర్పడుతుంది. అది కారణంగా అభివృద్ధి కుంటుపడుతుంది.

83. బుధమండలం దిగువన హృదయరేఖ పైన పెద్ద మచ్చ ఉన్న వ్యక్తి డాక్టర్, విజ్ఞానవేత్త అవుతాడు. పారిశ్రామిక రంగంలోనైనా రాణిస్తాడు. కాని స్త్రీల విషయంలో కొన్ని కష్టాలు అనుభవిస్తాడు.

84. హృదయరేఖపై ఎర్రని మచ్చ పొడవుగా ఉంటే అది గుండె జబ్బుల్ని సూచిస్తుంది.

85. హృదయరేఖపై నల్లని మచ్చ లేదా నీలిరంగు మచ్చ ఏర్పడితే, కొద్ది రోజుల్లో మలేరియా లేక రుమాటిజం వస్తాయని గుర్తించాలి.

86. బుధమండలంలో ఒక గుణకచిహ్నాం ఉండి, దాని కొస హృదయరేఖను ఖండిస్తే అతను వ్యాపారంలో రాణించడు. తరచు నష్టపోతూ, కష్టపడుతుంటాడు.




87. హృదయ, భాగ్యరేఖలు కలిసిన చోట ఒక గుణకచిహ్నాం ఉంటే ఆ వ్యక్తి ప్రేమలోపడి అనేక బాధలు, కష్టాలు అనుభవిస్తాడు.

88. హృదయరేఖనుండి చంద్ర మండ లానికి పోయే రేఖ చివరన ఒక నక్షత్రం ఉంటే అతనికి పిచ్చి పడుతుంది. అది వంశానుగతంగా ఒకే వయస్సులో సంక్రమిస్తుంది.

89. హృదయరేఖపైన వర్తులాకార చిహ్నాం హృదయ దౌర్బల్యాన్ని, పిరికి తనాన్ని సూచిస్తుంది.

90. అది రవిక్షేత్రం దిగువన ఉంటే కంటి జబ్బులు, దృష్టిదోషం తెలుస్తుంది.

91. హృదయరేఖపైన లేక దాని సమీపంలో ఒక చతుష్కోణ చిహ్నాం ఉంటే అతను తన శారీరక బాధలను, ప్రేమ విషయంలో అవరోధాలను దాటే విజయం సాధిస్తాడు.




92. హృదయరేఖమీద ద్వీపచిహ్నాలుంటే, ఒక్కొక్క ద్వీపం ఒక స్త్రీకి సంకేతం. అందరు స్త్రీలతో అతనికి సంబంధం ఏర్పడుతుంది. అయితే శుక్రమండలం బలహీనంగా ఉంటే అతను ఏ ఒక్క స్త్రీని అనుభవించలేడు.

93. ద్వీపచిహ్నాం హృదయరేఖపైన శని క్షేత్రానికి దిగువగా ఉంటే అతడు ఆరాధించి ప్రేమించిన స్త్రీ వల్ల అతని ఉజ్వల భవిష్యత్తు నాశనమవుతుంది.

94. భాగ్యరేఖ పైన, హృదయరేఖ పైన ద్వీపచిహ్నాలుంటే అతని ప్రేమ ఎన్ని ఆటంకాలను, అవమానాలనైనా భరిస్తుంది. అతను ప్రేయసి కోసం ఎన్ని నిందలైనా భరిస్తాడు.

95. ఆ ద్వీపచిహ్నం శనిక్షేత్రం దిగువన ఉంటే అతనికి కంటి జబ్బులు తరచుగా వస్తుంటాయి.

96. ఎవరి చేతిలోనైనా రెండు హృదయరేఖలుండి, అవి సమాంతరంగా సాగితే, ప్రేమ అద్భుతంగా ఉంటుంది. చారిత్రక ప్రసిద్ధి చెందుతాడు. మగవారి చేతిలో రెండు హృదయరేఖలు అతని అద్భుత ప్రతిభకు నిదర్శన. స్త్రీ హస్తంలో అలా ఉంటే ఆమె చేసుకున్న అతనిని వదలి ప్రియుడితో లేచిపోతుంది. అయితే ఇద్దరూ సమాజంలో ఉన్నతస్థితిలో ఉన్నవారై ఉంటారు. లోకం వారిని ఆదర్శ ప్రేమికులుగా చెప్పుకుంటుంది.

# 24. శుక్రవలయం

**శు**క్రవలయం శుక్రమండలంలోని లోపాలను పూరిస్తుందని చెప్పాం. దీనినే గర్డిల్ ఆఫ్ వీనస్ అంటారు. వీనస్ గ్రీకు వారి ప్రేమదేవత. శుక్రవలయం శుక్రక్షేత్ర ఫలాలను పూర్తిగా ఇస్తుంది. అంతకన్న ఎక్కువ ఫలితాలనిస్తుంది. ఇది శని, రవిక్షేత్రాలపై ఉన్నది కనుక శని, రవి క్షేత్రాలను చాపంగా చుడుతుంది కనుక రవి, శనుల మిశ్రమ ఫలితాలనిస్తుంది.

1. శుక్రవలయం సన్నగా ఉండి, భాగ్య, రవి రేఖల్ని శని, రవి క్షేత్రాలలో ఖండించిన, ఆ వ్యక్తి అద్భుతమైన ప్రతిభాపాటవాలు, విద్యాపాండిత్యాలు కలవాడవుతాడు. గొప్ప సాహితీవేత్త, కవి, రచయిత, రసికుడు అవుతాడు. ప్రేమతో ప్రపంచాన్ని జయించగలడు.



2. రెండు, మూడు శుక్ర వలయాలున్న వ్యక్తిలో అస్వాభావిక లక్షణాలు, దుర్గుణాలు మెండుగా ఉంటాయి.

3. శుక్రవలయం బుధక్షేత్రంపైన ఆగిపోతే అతను దీర్ఘరోగాలతో బాధపడతాడు. ఉద్యోగంలో, చేసే పనిలో పట్టుదల ఉండదు. ఇతర అవలక్షణాలుంటే అతను పచ్చి మోసగాడు, వ్యభిచారి అవుతాడు.

4. శుక్రవలయం ముక్కలుగా తెగిఉంటే అతనిలో భోగలాలస ఎక్కువగా

ఉంటుంది. అతనికి కామవాంఛ అధికం. అనేక దుష్కర్మలు చేస్తాడు. నీచ జీవితం అతనిది.




5. శుక్రవలయం వెడల్పుగా, మందంగా ఉండి, భాగ్యరేఖను, రవి, బుధ రేఖల్ని ఖండిస్తే, ఆ వ్యక్తి అతి భోగం వల్ల, స్త్రీ వ్యసనంవల్ల అదృష్టాన్ని నాశనం చేసుకుంటాడు.

6. బుధక్షేత్రంలోని వివాహరేఖ శుక్రవలయం అంచును ఖండిస్తే ఆ వ్యక్తి స్వసుఖానికై, స్వార్థంతో తన తల్లి దండ్రుల్ని, అయిన వారిని వదులు కుంటాడు. ప్రేమ పేరుతో అందరికీ దూరం అవుతాడు. తన సుఖం తన స్వార్థం తప్ప ఎవరి విషయం పట్టించుకోడు.

7. శుక్రవలయాన్ని చిన్న చిన్న రేఖలు ఖండిస్తే, చంద్ర శుక్ర మండలాలు అత్యున్నతమైతే ఆ వ్యక్తికి హిస్టీరియా వ్యాధి వస్తుంది.

8. శుక్రవలయం అస్పష్టంగా ఉండి, దానిని రవిక్షేత్రంలో ఒక అడ్డురేఖ ఖండిస్తే, ఒక స్త్రీ సాంగత్యం వల్ల లేదా స్త్రీ లోలత్వం కారణంగా వృత్తి, వ్యాపారాలు చెడగొట్టుకుంటాడు. లేదా చేస్తున్న ఉద్యోగం ఊడిపోతుంది.




9. శుక్రవలయం రెండు, మూడు రేఖలతో ఏర్పడి, అందులో ఒకదాని పైన నక్షత్రచిహ్నం ఉంటే అతను అతిభోగం వల్ల సుఖసంకటాలు సంపాదిస్తాడు. అతనికి వివాహం కాదు.

10. శుక్రవలయం అనేక చిన్న రేఖలతో ఏర్పడితే అతనికి మూర్ఛ వ్యాధి కలుగుతుంది.

11. మస్తిష్కరేఖ చంద్రమండలం లోకి వంగి దాని చివరన ఒక గుణక చిహ్నం గానీ, అడ్డురేఖలు గానీ ఉండి, శుక్రవలయం ఛిద్రమైతే ఆ వ్యక్తి పిచ్చివాడవుతాడు.

12. శనిమండలంలో ఒక గుణక చిహ్నం ఉండి, శుక్రవలయం ఛిద్రమైతే, మస్తిష్కరేఖపైన మచ్చలు గాని, ద్వీప చిహ్నం గాని ఉంటే వేళ్లు, కాళ్లు, చేతులు మెలికలు తిరిగిపోతాయి. తర్వాత పక్షవాతం వస్తుంది.




13. శుక్రవలయం చక్కగా స్పష్టంగా ఉండి, ఛిద్రమైన భాగ్యరేఖ దానిని ఖండిస్తే అతడెంత గొప్ప వాడైనా, ఉన్నత పదవిలో ఉన్నా, వ్యసనపరుడు, స్త్రీలోలు డవుతాడు. తన గౌరవ మర్యాదలు పోగొట్టుకుంటాడు.

14. శుక్రవలయాన్ని వివాహ రేఖలు ఖండిస్తూ హృదయరేఖనుండి చిన్న చిన్న రేఖలు క్రిందికి వాలిన, మస్తిష్కరేఖ చివరన ఒక నక్షత్రచిహ్నం ఉండి, భాగ్యరేఖ ఒక అడ్డురేఖతో ఆగిపోయిన, ఆ వ్యక్తి వివాహం వల్ల సుఖపడదు. వ్యసనాలకు బానిసై చెడు తిరుగుళ్లు మరిగి, ఆరోగ్యం చెడి, మతి తప్పి, పిచ్చివాడై మరణిస్తాడు.

# 25. జ్ఞానరేఖ

**చ**ంద్రమండలం నుండి ప్రారంభమై చాపంలా వంపు తిరిగి బుధక్షేత్రానికి వెళ్లే రేఖను జ్ఞానరేఖ (లైన్ ఆఫ్ ఇంట్యూషన్) అంటారు. దీనినే రక్షారేఖ అని, యోగరేఖ అనీ కొందరు వ్యవహరిస్తారు. బుధమండలంపైన అంతమయ్యే బుధరేఖ, ఇదీ – ఒకటి కాదు. బుధరేఖ జీవితరేఖ చివరన ప్రారంభమై తిన్నగా బుధమండలానికి చేరుతుంది.

జ్ఞానరేఖ స్పష్టంగా, చక్కగా ఉన్న వ్యక్తికి అధిక జ్ఞానం, పరేంగిత ప్రజ్ఞ, తాత్విక చింతన, భవిష్యత్ సంఘటనలు సిక్త్ సెన్స్‌తో తెలుసుకోగల జ్ఞానం ఉంటాయి. జరగబోయే సంఘటనలు, ఫలితాలు అతనికి ముందే తెలుస్తాయి. అదే ఇంట్యూషన్. అది చంద్ర మండలం నుండి ప్రారంభం కావడం వల్ల విద్య, వివేకం, బుధక్షేత్రం పైన అంతం కావడం వల్ల ప్రజ్ఞ, ప్రతిభ ఏర్పడతాయి. అంటే సూక్ష్మదృష్టి, అవగాహన, దివ్యదృష్టి, మనస్తత్వా లను అర్థం చేసుకునే తెలివి అలవడ తాయి. ఈరేఖ ఉన్నవారు యోగం, తపస్సు, సాధన చేస్తారు. మనస్తత్వం తెలుసుకుంటారు. జ్యోతిషం, సాము ద్రికం, సైకాలజీ, పారా సైకాలజీ, హిప్నాటిజం లాంటివి నేర్చుకుంటారు. ప్రయత్నం చేస్తే ఆత్మవిద్య వీరికి



అందుబాటులో ఉంటుంది. బ్రహ్మజ్ఞాన సంపన్నులు కావచ్చు. సాధన చేస్తే యోగులు, తాపసులు, దార్శనికులు కాగలరు. ఈ రేఖ వశీకరణ మంత్రం వలె పనిచేస్తుంది. జ్ఞానరేఖ గలవారు ఎవరినైనా నిమంత్రించగలరు, నియంత్రించ గలరు, వశపరచుకోగలరు. జ్ఞానరేఖ ఉన్నవారు తపస్సాధనతో పరావిద్యను సాధించగలరు. యోగశక్తి తోడైతే త్రికాలజ్ఞానం ప్రాప్తిస్తుంది. జ్ఞానరేఖ ఉన్న ప్రతి ఒక్కరు – మహాత్ములవుతారు.

1. చతుష్కోణ హస్తంలో జ్ఞానరేఖ ఉన్నవారు తమ జ్ఞాన సంపదను, ప్రతిభను దుర్వినియోగం చేస్తుంటారు. స్వల్ప ప్రయోజనాలకు, భౌతిక సుఖాలకు, భోగాలకు దైవప్రసాదితమైన శక్తిని, తపస్సును పాడు చేసుకుంటారు.




2. వేళ్లు పొడవుగా ఉండి, చంద్ర మండలం ఉన్నతమై, మస్తిష్కరేఖ చంద్ర మండంలోకి వాలి, వేళ్ల చివరలు కొనతేలిన ఆ వ్యక్తి భావనాశక్తి అనల్పం. మార్మిక విద్యలు నేర్చి ప్రసిద్ధుడవుతాడు. కానీ తన శక్తిపైన తనకు నమ్మకం ఉండదు. ఎప్పుడూ కలల్లో, ఊహల్లో జీవిస్తుంటాడు.

3. మస్తిష్కరేఖ ఛిద్రమైతే, ఉన్న జ్ఞానం నిరుపయోగమవుతుంది. అది ముక్కలుగా తెగితే అతని జ్ఞానం దుర్వినియోగమవుతుంది. తన జ్ఞానాన్ని భౌతిక సుఖాలకు, క్షుద్ర కార్యాలకు ఉపయోగిస్తాడు.

4. మస్తిష్కరేఖ చంద్రమండలంలోకి వాలి, జ్ఞానరేఖ దానిని ఖండిస్తే, ఆ వ్యక్తి మానసిక శక్తి వ్యర్థమవుతుంది.

5. జ్ఞానరేఖ నుండి ఒక శాఖ బయలుదేరి గురుక్షేత్రానికి పోతే, అతనిది చాలా ఉన్నతమైన స్వభావం అవుతుంది. ఆశయాలు, ప్రవర్తన అన్నీ ఉన్నత ప్రమాణంలో ఉంటాయి.

6. జ్ఞానరేఖ నుండి ఒక శాఖ రవి క్షేత్రానికి వెళితే అతను తన జ్ఞానంతో కీర్తి ప్రతిష్టలు ఆర్జిస్తాడు. గొప్ప వక్తగా, తాత్వికుడుగా, వేదాంతిగా ప్రచారం పొందుతాడు.




7. జ్ఞానరేఖ శాఖ ఒకటి భాగ్య రేఖను ఖండిస్తే అతను తన ప్రతిభను, చదువును జ్ఞానంతో ముడివేసి ఒక ప్రవక్త అవుతాడు. తనదైన కొత్త సిద్ధాంతాలను ప్రతిపాదించి ప్రచారం చేస్తాడు. గురువు కాదగిన లక్షణం ఇది.

8. జ్ఞానరేఖ చివరన ఒక నక్షత్రం ఉంటే అతను స్వతంత్రంగా సాధన చేసి స్వతంత్రంగా రాణిస్తాడు. సంప్రదాయం, ఒకరి గురుత్వం, ఒకరి అథారిటీ అంగీక రించడు. వాదనలో ఇతరుల్ని ఓడించి, తన సిద్ధాంతాల్ని ఆమోదింప చేస్తాడు.

9. బుధమండలం ఉన్నతమైన వ్యక్తి సన్యాసం స్వీకరించి, ధన సంపాదన చేసి, సన్యాసిగా సకల సుఖాలు, భోగాలు అనుభవిస్తాడు. బుధమండలం నీచమైతే, తంత్ర మంత్రవిద్యలు, క్షుద్రవిద్యలు నేర్చి తన శక్తిని దుర్వినియోగం చేసుకుంటాడు.

# 26. భోగరేఖ

**చం**ద్రమండలం లోపలి వైపున ప్రారంభమై, బుధరేఖకు సమాంతరంగా పోయే రేఖను భోగరేఖ అంటారు. ఇది చంద్రమండలం దిగువన ప్రారంభమై పైభాగంలో అంతమవుతుంది. శుక్రవలయం వలె, జ్ఞానరేఖ వలె, ఇదీ చిత్రమైన రేఖ. సాధారణంగా అందరి చేతుల్లో ఈ రేఖ ఉండదు. బుధరేఖ, భోగరేఖ కలిగిన వ్యక్తి తన గమ్యం చేరడానికి విపరీతంగా కష్టపడతాడు. ఇహలోక సుఖాలన్నీ అనుభవించాలని తాపత్రయ పడతాడు. భోగరేఖ గల వ్యక్తి కొన్ని సందర్భాలలో పరమనీచంగా ప్రవర్తిస్తుంటాడు. పాప కృత్యాలు చేయకపోయినా, అతని ఆలోచనలు పాప భూయిష్టంగా ఉంటాయి. అతనికి నీచ కార్యాలపైన ఆసక్తి ఎక్కువ. ఉద్రేకం ఎక్కువ. భోగాపేక్ష అధికం.




1. అరచేయి మృదువుగా ఉండి, శుక్రమండలం ఉన్నతమై, బలంగా ఆకర్షణీయంగా ఉండి, భోగరేఖ కలిగిన వ్యక్తి తన సర్వస్వం సుఖాలకు, భోగాలకు కైంకర్యం చేస్తాడు. తన తృప్తికి ఎంత డబ్బయినా ఖర్చు పెడతాడు. భోగరేఖ గల వ్యక్తి ఎక్కడ సుఖపడే అవకాశం, కోరిక తీరే అవకాశం ఉన్నా వదులుకోడు. మస్తిష్కరేఖ సరిగా లేకపోతే అతిభోగం వల్ల ఆరోగ్యం చెడుతుంది.

2. భోగరేఖకు తోడు భాగ్యరేఖపైన ఒక ద్వీపచిహ్నం ఉంటే, ఆ వ్యక్తి స్త్రీ సుఖాల కోసం తన సర్వస్వం త్యాగం చేస్తాడు.

3. రవిరేఖపైన గానీ, రవి క్షేత్రంలో గానీ అడ్డరేఖలు లేదా ఒక గుణకచిహ్నం ఉంటే అతడి భోగ వాంఛ కారణంగా గౌరవ ప్రతిష్టలకు భంగం కలుగుతుంది.




4. భోగరేఖ పైకివెళ్లి వివాహ రేఖను ఖండిస్తే అతను భార్యను అలక్ష్యం చేసి, పరస్త్రీలోలు డవు తాడు. కుటుంబ పరంగా అనేక బాధలు అనుభవిస్తాడు.

5. భోగరేఖ నుండి బయలుదేరిన ఒక శాఖ రవిరేఖను ఖండిస్తే ఆ వ్యక్తి పతనం చెందుతాడు.

6. భోగరేఖ శాఖ ఒకటి జీవిత రేఖను ఖండిస్తే అతిభోగం వలన అతని జీవితం నాశన మవుతుంది. ఆరోగ్యం పూర్తిగా చెడుతుంది. జీవితరేఖను, భోగరేఖ కలిసే చోట ఒక మచ్చ ఉంటే ఆ వయస్సులో ప్రమాదం.




7. భోగరేఖ శాఖ ఒకటి మస్తిష్కరేఖను ఖండిస్తే మానసిక క్లేశాలు ఏర్పడతాయి.

8. భోగరేఖ స్పష్టంగా ఉండి, బుధరేఖ ఉండి, శుక్రమండలం ఉన్నతంగా ఉన్న వ్యక్తి పచ్చి వ్యభిచారి అవుతాడు. బొటనవేలి ప్రథమపర్వం లావుగా, గట్టిగా ఉంటే, తాను కోరిన స్త్రీలను బలవంతంగా అనుభవిస్తాడు. ఎదురు తిరిగిన వారిని హత్య చేస్తాడు.

9. చేతిలో ఇతర దుర్లక్షణాలు లేకుండా బుధరేఖ చంద్రమండలానికి వెళితే భోగరేఖ స్పష్టంగా ఉంటే అతను మద్యపానానికి దాసుడై అనేక దురాగతాలు చేస్తాడు. బుధరేఖ వలన కలిగే అనారోగ్యాలను చక్కని భోగరేఖ స్వస్థ పరుస్తుందని సూత్రం.

# 27. ప్రయాణరేఖలు

**అ**రచేయి అంచు నుండి చంద్రమండలంలోకి పోయే రేఖల్ని ప్రధానంగా ప్రయాణరేఖలని చెప్పవచ్చు. జీవితరేఖ నుండి బయలుదేరి వాలుగా, చంద్ర మండలాన్ని చూచే రేఖల్నీ ప్రయాణ రేఖలంటారు. అవి విదేశీ ప్రయాణాలను సూచిస్తాయి. మొదటి కంకణరేఖ నుండి బయలుదేరి చంద్రమండలంలోకి వెళ్లే రేఖలూ ప్రయాణ రేఖలే. అవి దీర్ఘయాత్రలు, తీర్థయాత్రల్ని సూచిస్తాయి.

1. ప్రయాణరేఖ చివరన ఒక గుణకచిహ్నం ఉంటే, అది ప్రయాణంలో ఆశాభంగాన్ని, ధననష్టాన్ని సూచిస్తుంది.




2. ప్రయాణరేఖ చివరన ఒక చతుష్కోణచిహ్నం ఉంటే ప్రయాణంలో తప్పిపోవడం, కొంతకాలం అజ్ఞాతంగా ప్రవాస జీవితం గడపడం జరుగుతుంది.

3. ప్రయాణరేఖ చివరన ఒక ద్వీప చిహ్నం ప్రయాణంలో ధననష్టాన్ని సూచిస్తుంది.

4. ప్రయాణరేఖ అరచేతిని దాటుకుంటూ గురుక్షేత్రంలోకి పోతే ఆ వ్యక్తి విదేశాలలో ఉన్నత స్థితిని పొందుతాడు. విదేశాలలో రాణిస్తాడు. విపరీతంగా ధనార్జన చేస్తాడు.

5. ప్రయాణరేఖ శనిమండలం చేరితే, ఆ ప్రయాణం వలన పతనం జరుగుతుంది. డబ్బు, పరువు అన్నీ పోయి దరిద్రం, అవమానం అనుభవిస్తాడు.




6. ప్రయాణరేఖ రవిక్షేత్రంలోకి వెళితే ధనం, ఐశ్వర్యం సంపాదించి, గొప్పగా కీర్తి ప్రతిష్టలు ఆర్జించగలడు.

7. ప్రయాణరేఖ బుధమండలం లోకి వెళితే, అతనికి దూర ప్రదేశాలలో, విదేశాలలో అకస్మాత్తుగా ధనలాభం కలుగుతుంది. వ్యాపార, వాణిజ్యాలలో బాగా సంపాదిస్తాడు.

8. ప్రయాణరేఖ భాగ్యరేఖను కలిస్తే, ఆ వ్యక్తి ఇతర దేశాలకు పోయి సంపన్నుడవుతాడు.

9. ప్రయాణరేఖ భాగ్యరేఖను చేరి, ఇంకా పైకి పోతే విపరీత ధనయోగం పడుతుంది.




10. పైకి వెళ్లిన ప్రయాణరేఖ చివరలో వంపు తిరిగితే చాలా మంచి లాభాలు, ప్రయోజనాలు, ఆ ప్రయాణం వల్ల కలుగుతాయి.

11. ప్రయాణరేఖ మస్తిష్కరేఖతో కలిస్తే – అక్కడొక ద్వీపంగానీ, అడ్డురేఖ గానీ, మచ్చగానీ ఉంటే, ఆ ప్రయాణం ప్రమాదంతో అంతమవుతుంది.

12. రెండు ప్రయాణరేఖలు పరస్పరం ఖండించుకుంటే ఒకే ప్రదేశానికి, లేదా విదేశానికి మళ్లీ మళ్లీ వెళ్ల వలసి వస్తుంది. ఆ ప్రయాణం వల్ల దేశానికి కీర్తి ప్రతిష్టలు సమకూరుతాయి. తనకూ ధనలాభం కలుగుతుంది.

## వయస్సు గుణింతం



# మాస్టర్ యోగాశ్రమం ప్రచురణలు

## శ్రీ శార్వరి రచనలు

| | |
|---|---|
| **హస్తసాముద్రికా సర్వస్వం** | |
| (Revised and Enlarged Edition) | 100/- |

1. **ఆంధ్ర మహాసావిత్రి** **రూ. 300/–**
డీలక్స్ ఎడిషన్ : 670 పేజీలు

**కొత్త పుస్తకాలు**

| | | |
|---|---|---|
| 2. | సద్గురు సాయిబాబా | 100/– |
| 3. | మాస్టర్ సి.వి.వి. (Revised Edition) | 100/– |
| 4. | సద్గురు రమణ | 100/– |
| 5. | భగవాన్ బుద్ధ | 100/– |
| 6. | కొత్తకోణంలో కృష్ణమూర్తి | 100/– |
| 7. | అరవింద దర్శనం | 100/– |
| 8. | మహాత్మా జీసస్ | 100/– |
| 9. | భగవాన్ రజనీష్ | 100/– |

**శ్రీ శార్వరి యోగ జీవితం (3 భాగాలు)**

| | | |
|---|---|---|
| 10. | ఆత్మయోగి సత్యకథ (1) | 100/– |
| 11. | యోగాశ్రమ జీవితం (2) | 100/– |
| 12. | యోగా విజన్ (3) | 100/– |
| 13. | యోగ ప్రభ | 100/– |
| 14. | జీవన్ముక్తి | 100/– |
| 15. | మాస్టర్ యోగదర్శిని | 100/– |
| 16. | గీతా జ్ఞానయజ్ఞం | 100/– |
| 17. | ధ్యానం ఎలా చేయాలి? | 60/– |

| | | |
|---|---|---|
| 18. | ధ్యానం - యోగం | 60/– |
| 19. | దివ్యజ్ఞానం (మహాచైతన్యం) | 60/– |
| 20. | కుండలిని | 60/– |
| 21. | శక్తిపాతం | 60/– |
| 22. | నిర్వికల్ప సమాధి | 60/– |
| 23. | బ్రహ్మజిజ్ఞాస | 60/– |
| 24. | ఆత్మజ్ఞానం | 60/– |
| 25. | పరావిద్య | 60/– |
| 26. | భృక్తం - రహితం - తారకం | 60/– |
| 27. | మృత్యువు తర్వాతి జీవితం | 60/– |
| 28. | మాస్టర్ 'యోగచరిత్ర' | 60/– |
| 29. | యోగా ట్రీట్‌మెంట్ | 60/– |
| 30. | అసతోమా సద్గమయా | 60/– |
| 31. | తమసోమా జ్యోతిర్గమయా | 60/– |
| 32. | మృత్యోర్మా అమృతంగమయా | 60/– |
| 33. | యోగాశ్రమ లేఖలు | 60/– |
| 34. | సత్య సంహిత | 60/– |
| 35. | సత్యయోగ ప్రకాశిక | 60/– |
| 36. | శ్రీ గురుగీత | 60/– |
| 37. | గీతా పరమార్థం | 60/– |
| 38. | శ్రీకృష్ణావతారం | 60/– |
| 39. | యోగానుభవాలు | 60/– |

**ENGLISH BOOKS**

| | | |
|---|---|---|
| 40. | Master C.V.V. Prayers | 150/– |
| 41. | Masters and the Art of Meditation | 100/– |
| 42. | The Mystery of Kundalini | 60/– |
| 43. | The Life Beyond Death | 60/– |

---


**MASTER YOGAASHRAM**

Plot No. 89, Krishna Enclave, M.D. Farm Road, Tirumalagiri,
SECUNDERABAD - 500 015.
Ph : (040) 2779 0094 E-mail : drvaasili@yahoo.co.in
www. masteryogashram.com

# మాస్టర్ యోగాశ్రమం

- పరబ్రహ్మాంశ సంభవులైన మాస్టర్ సి.వి.వి.గారు ఆవిష్కరించిన నూతన యోగం "భృక్త రహిత తారక రాజయోగం". దీనిని సత్యయోగ మనీ, మాస్టర్‌యోగ మనీ సాధకులు, శ్రీవారి శిష్య ప్రశిష్యులు అభిమానంతో పిలుచుకుంటారు.
- మాస్టర్ యోగం నిత్యనూతనమై, ఎప్పటికప్పుడు సరికొత్త అనుభవాలను సాధకులకు కలిగిస్తుంది. వినూత్న యోగానుభూతులను కలుగజేస్తూ సత్యావిష్కారం చేస్తూంది. మాస్టర్ సి.వి.వి.గారి 'ప్రాణాట్రీట్-యోగా టీచ్' అనే యోగ సూత్రం ఆధారంగా, లక్ష్యంగా మాస్టర్ యోగాశ్రమం నెలకొల్పబడింది.
- శ్రీ శార్వరి నిర్దేశకత్వంలో మాస్టర్ యోగాశ్రమం వేలాదిమంది జిజ్ఞాసాపరుల్ని సత్య యోగమార్గంలో నడిపిస్తున్నది.
- మాస్టర్ యోగ హృదయావిష్కారం చేస్తూ శ్రీశార్వరి ఇప్పటికి 50పైగా గ్రంథాలు రచించి వెలువరించడం జరిగింది.
- శ్రీశార్వరి మాస్టర్ సి.వి.వి.గారి యోగవిభూతితో, యోగస్పర్శతో అనితరసాధ్యంగా యోగచికిత్సలు నిర్వహిస్తూ, వేలమంది శారీరక, మానసిక రుగ్మతలకు చికిత్సలు చేశారు. చేస్తున్నారు.
- మాస్టర్ యోగాశ్రమం ఆధ్వర్యంలో ప్రతి సంవత్సరం మే (29-31) డిసెంబరు (29-31) తేదీలలో ప్రత్యేక సమావేశాలు జరుగుతుంటాయి.
- సాధకులు, జిజ్ఞాసులు ప్రతిసాయంత్రం 6 గంటలకు సమావేశానికి హాజరై, ధ్యానం చేసుకోవచ్చు. ప్రతి ఆదివారం సాయంత్రం ప్రత్యేక సమావేశాలు ఉంటాయి. యోగచికిత్స కోరేవారు, కొత్తగా యోగంలో చేరదలచినవారు ముందుగా అపాయింట్‌మెంట్ తీసుకుని రావలసి ఉంటుంది.

**మాస్టర్ యోగాశ్రమం**, తిరుమలగిరి, సికింద్రాబాద్.

ఫోను : 040-27790094

www. masteryogashram.com